# శ్రీ మద్భాగవత ప్రకాశము

## తృతీయస్కంధము

### తృతీయ భాగము

కులపతి

ఎక్కిరాల కృష్ణమాచార్య

ది వరల్డ్ టీచర్ ట్రస్ట్ ప్రచురణ

ప్రథమ ముద్రణము నవంబరు 1979

ప్రాప్తిస్థానము
కరస్పాండెంటు
ది వరల్డు టీచర్ ట్రస్ట్
రాధామాధవమ్
14-38-2 మునిసిపల్ కొలనీ,
విశాఖపట్టణము – 530 002

వెల
సాధారణ ప్రతి రూ॥ 22/-

ఎక్వేరియన్ ప్రింటింగ్ స్కూల్
శ్రీనగర్, ప్రకాశం రోడ్డు
విశాఖపట్టణము-16

# విషయసూచిక

———

# ఉపోద్ఘాతము

ఆధ్యాత్మిక సాధనయందు ముఖ్యముగా రెండు విధములైన సంప్రదాయములు అనాది నుండియు అనుష్ఠింపబడుచున్నవి అందొక మార్గమున సాధకుడు జపతపాదులతోగాని, యోగ సాధనతోగాని తన కోశములను శుద్ధి చేసికొని జితేంద్రియత్వమను సాధించుకొని శక్తి సంపన్నుడగును అట్టివాడు నిరంతరము తన ప్రవర్తనమును చక్కబరచుకొనుచు ధర్మాధర్మనిర్ణయములను నిరూపణచేసి వివేకము, వితర్కము మున్నగు సాధనములతో పురోగతి సాధించును రెండవ సంప్రదాయము ననుసరించిన సాధకుడు భక్తి ప్రధానమైన సాధనము చేయును అతని సాధనమునకు సర్వసమర్పణ బుద్ధియే మూలసూత్రము తా నెరిగిన ధర్మాధర్మములను గూర్చిన నిర్ణయములు తనవి కావు ఇందు మొదటి సంప్రదాయము ననుసరించువారు తమ సామర్థ్యము నభివృద్ధి చేసికొని దైవానుగ్రహమునకు అర్హతను సమకూర్చుకొనువారు రెండవ మార్గ మనుసరించువారు అర్హతను గూర్చి పట్టించుకొనక దానిని తా ముపాసించు దైవమునకే వదలి వేయువారు ఇందు మొదటివారిని జ్ఞానులనియు, రెండవ వారిని ప్రపన్నులనియు చెప్పుదురు జ్ఞానులకు తమ అర్హతను గూర్చిన బాధ్యత తమకు సంబంధించినది ప్రపన్నుల విషయమున అది తమ దైవమునకు సంబంధించినది

ఈ రెండు మార్గములలో మొదటి మార్గము వారికి పొర పాటు లున్నచో పతనము తప్పదు ఎంత తెలిసిన వారైనను నిర్ణయము తమది అయినపుడు తమ పొరపాట్లకు తామే బాధ్యులు ఈ పొరపాట్లను సర్దుకొని దైవమునకు తమ యెడ అనుకూల్యము కలిగించుకొను యత్న ముండును ఇక రెండవ తరగతివారు పొర పాట్లు చేసినచో బాధ్యత తమది కాదు కనుక వారి మార్గముం పత నము లేదు ఈ ఇరు మార్గముల వారికిని క్రమశిక్షణ విషయమున, కర్తవ్య నిర్వహణము విషయమున సాధన ముఖ్యము! అది లేనిచో రెండు సంప్రదాయముల వారికిని తిరోగతియే గాని పురోగతి లేదు కర్తవ్యమును నిర్వహించి పరిపూర్ణత నార్జించుకొన జూచువారు మొదటి తరగతివారు కర్తవ్యము నిర్వహించుకొని దానిని భగవ దర్పితముగా విడచి పెట్టువారు రెండవ తరగతివారు ఈ రెండు తరగతులవారును వరుసగా జిజ్ఞాసువులు, ముముక్షువులు అన బడుదురు ప్రస్తుత గ్రంథ భాగమున నీ ఇరు తెగల వారి వైఖరు లను చిత్రించి యుపదేశపూర్వక మైన జ్ఞాన మిచ్చుట ప్రధాన సారాంశము అందు మొదటి తరగతి వారి కుదాహరణముగా సనక సనందనాదులు, రెండవ తెగవారి కుదాహరణముగా జయ విజయులు చిత్రింపబడిరి దైవానుగ్రహమునకు ఏ తెగ వారెట్లు పాత్రులో నిరూపణ చేయుటయే ఈ భాగమందలి జయవిజయుల కథలో ముఖ్యాంశము సనకాదులు వైకుంఠనగరము నారోహణ చేసి క్రమముగా విష్ణు స్థానమును చేరుకొనుట వారి జీవిత సాధనకు సంకేతము సనకాదులు తమ ఆరోహణ మార్గమున సర్వము విష్ణుమయముగా చూచునట్టి సాధన చేసిరి ఈ సాధనలో ఆరు కక్ష్యలు దాటి ఏడవ కక్ష్య యందు పొరబడిరి అనగా ద్వారపాలకుల రూపములందు విష్ణువునకన్న అన్య ము నంగీకరించిరి దాని తో వారికి విష్ణువు మొదట దర్శన మీయక

ద్వారపాలకు లద్దగించిరి జయవిజయు లట్లుగాక, కేవలము కర్తవ్య నిర్వహణమే తమ సర్వస్వముగా గలవారు దానితో వారు కేవలము విష్ణులోకమందలి భాగములుగా స్థిరత్వ మందిరి

మొదటి సాధనకు ఫలితముగా సనకాదులు ద్వారపాలకులను శపించుట జరిగినది రెండవ మార్గమునకు సంబంధించిన జయ విజయులు తమ్ము శపించిన ఋషులలో కూడ అన్యమును దర్శింపక మెలగిరి ఈ రెండు తరగతుల వారికిని భగవంతుడు డొసగిన శాశ్వత ధర్మరూపమైన పరిష్కార మార్గమే ద్వారపాలకుల శాపకథగా నిరూపింపబడినది సనకాదులు విష్ణువునకు కూడ గౌరవనీయు లైనవారు జయ విజయులు తన కొలువులోని వారు అందు సనకాదలు కొంత వేరుగా చూడబడు వారు, జయ విజయులు తన వారుగా చూడబడు వారు అని విష్ణువు చేసిన వివరణమునకు సారాంశము ఎవరిని గౌరవింప వలెనో వారు కొంచెము దూరస్థు లగుట సత్యము ఎవరిని వేరుగా గౌరవింప నక్కరలేదో వారియం దంతర్యామి భావన పరిపూర్ణము గనుక సామీప్య, సాయుజ్య, సారూప్యాదులు సిద్ధించిన వని నిరూపింప బడినది " మీ బోటి పెద్దలను గౌరవించుటలో భంగము కలిగినచో నా బాహువుల నైన ఖండింతును కనుక జయ విజయులకు మీ రిచ్చిన శాపము నంగీకరించితిని " అని నారాయణుడు పలుకుటలో సనకాదులు పరిపూర్ణతకు దూరస్థులనియు, జయ విజయులు నారాయణుని బాహువుల వలె పని చేయుచున్నారనియు వివరింప బడినది ఇది శాశ్వత ధర్మగోప్త అయిన నారాయణుని ధర్మ సూక్ష్మములలో నొకటిగా నిరూపింప బడినది

లోకమున జ్ఞానము చేత, తపస్సు చేత, శీలసంపద చేత, గౌరవింపబడు వారు కొందరు, వారిని గౌరవించు వారు కొందరు

గౌరవింపబడు వారు గౌరవించు వారిలో నారాయణు డున్నాడని మరచినచో బాధలు తప్పవు ఇది రెండవ ధర్మాంశము నేను మీ చరణ ధూళిని శిరస్సున ధరించి ఇట్లు నారాయణుడుగా నుండ గలిగితిని " అని విష్ణువు సనకాదులతో పలుకును నారాయణుడు ఋషుల చరణ ధూళిని శిరస్సున ధరించెననగా పెద్దల చరణ ధూళి నారాధించు దాసులలో నారాయణు డున్నాడని భావము దానిని మరచిన వారు ఎన్ని వేల సంవత్సరముల తపస్సు చేసి జితేంద్రి యత్వము సాధించినను శాపము లిచ్చుట మున్నగు పొరపాటుల చేత దెబ్బ తిందురు అట్టి సందర్భములో కష్ట నష్టము లెవరికి కలుగు చున్నవి? జయ విజయులు రాక్షస గుణములతో భూమిని పుట్టి సాధుజనులను బాధింతురని సనకాదులు శపించిరి సాధు జనులనగా తామేగదా! ఈ శాపము వలన వారి చేతిలో తమకు దెబ్బలు తప్పవు తమ శాపము సాధుజనులకు కష్ట నష్టములు కలి గించినది దాని రుచి ఎట్లుండునో తెలియుటకే వారిచ్చిన శాప మును విష్ణువు శిరసావహింతునని తెలిపెను దీనిని తుదకు గ్రహిం చిన సనకాదులు జయ విజయుల శాపమును తొలగింపుమని కూడ విష్ణువును వేడుకొనిరి విష్ణువు తొలగింపలేదు తొలగింప కుండు టలో మరియొక ధర్మసూక్ష్మ మున్నది తాను లోకశాసనము నకు కొందరిని నియమించినపుడు వారిలో పొరపాటు లున్నను వారి శాసనమును రద్దు చేయరాదు చేసినచో కర్మ పలముల అధికారమునకు ఒద్దమైన జగత్ ప్రభుత్వము కల్లోల మగును నరుల ప్రభుత్వము వలెనే తారుమారగును ఎవడికిచ్చిన అధి కారము వాని బ ధ్యతగా నడువ వలెను పొరపాటు లున్నచో పరిణామము లనుభవించి వారే సరిదిద్దు కొందురు ఇది నారా యణుని శాశ్వత ధర్మ సూత్రములలో మరియొకటి ఈ మూడు ధర్మ సూత్రములను విప్పి చెప్పుటయే జయ విజయుల కథలోని

సారాంశము ఈ ధర్మ సూత్రములపైననే సంఘ వ్యవస్థ ఆధార పడి యున్నది పెద్దలు, పిన్నలు మెలగ వలసిన ఈ లోకమున పెద్దలు గౌరవింపబడుట, పిన్నలు ఆదరింపబడుట సిద్ధించినచో ధర్మము పరిపూర్ణమగును పిన్నలు గౌరవింపనిచో శిక్షా పాత్రులు పెద్దలు ఆదరింపనిచో గౌరవము దక్కదు ఈ రెండింటి వ్యత్యాసముల నడుమనే సంఘ వ్యవస్థ ఎగుడు దిగుడు లగుచు శతాబ్దముల తరబడి మరల సర్దుకొను చుండును ఈ లీలనే వైకుంఠ సామ్రాజ్యముగా చిత్రించిన ఇందలి వైఖరి ఏ యితర గ్రంథము లందును ఇంతగా విప్పి చెప్పబడలే దనుట సత్యము

ఈ చెప్పబడిన ధర్మమును ఒక సంఘ వ్యవస్థగా నరజాతి యందు స్థిరపరచుకొను యత్నమే స్వాయంభువ మనువుగా చిత్రింప బడినది మనువు పుట్టిన వెంటనే తండ్రిని గౌరవించుట, అతని దైవ కార్య నిర్వహణమున కొంత భారము పంచు కొనుట, మొదలుగా తండ్రి కొడుకుల సంబంధములు ఉదాహరణ ప్రాయముగా అనుష్ఠింప బడినవి అట్లే మనువు, శతరూప బిడ్డలను పెంచుట, నీతి ప్రవర్తనము అలవడజేయుట, వారికి సరియైన సంబంధములు చూచి వివాహములు చేయుట, కుటుంబ మనబడు మొదటి విద్యాలయ మందు నరుడు నేర్చుకొన వలసిన పాఠములుగా మను వెట్లు ధర్మ శాస్త్రమును శాసించునో నిరూపింప బడినది

కర్దమ దేవహూతుల యుపాఖ్యానమున తొల్లి నరజాతి ప్రారంభమున గృహస్థాశ్రమ దీక్ష స్వీకరించిన వైఖరులు, దాంపత్యము మొదలు సంతాన ప్రాప్తివరకు గల గృహస్థుని బాధ్యతలు కామప్రధానముగా గాక దైవకార్య నిర్వహణములుగా నెట్లు నిరూపింపబడినవో చూడవచ్చును

నరజాతి చరిత్ర నర్థము చేసికొను వైఖరి రెండు విధములు అందొక వైఖరి ప్రకారము మొదట జంతువుల వంటి ఆదిమ నివాసులు పుట్టి శిలాయుగములలో జీవించి క్రమముగా నాగరికత నెట్లార్జించు కొనిరో పరిశీలించుట ఇది నవీన పరిశోధకుల మార్గము ఇదికాక నరజాతి యుత్పత్తికి మూలకారకులైన ప్రకృతి లోని ప్రజ్ఞలు జ్ఞాన సంపన్నులుగా దిగివచ్చి తొలిమానవులై ధర్మ వ్యవస్థ నేర్పరచుట, మానవజాతికి మూలపురుషులైన మానవులుగా వర్తించుట అను విషయములను పరిశీలించు మరియొక మార్గము ఈ రెండవ మార్గమే ఋషుల రచనలలో కనుపించును ఇదియే ఎక్కువ సమంజస మనిపించును కారణ మేమనగా మానవుడు మొదట ఎంతటి అనాగరికుడైనను వాడు మానవుడుగా సృష్టింప బడుటకు ప్రకృతి శక్తులే కారణమని అంగీకరింపక తప్పదు గదా ! ఈ శక్తులు ప్రజ్ఞామయ మూర్తులనుటకు సృష్టిలో నిమిడియున్న విజ్ఞానమే సూటియైన నిదర్శనము అహోరాత్రములు ఋతువులు, సృష్టి జీవుల పరివర్తనల వైఖరులు క్రమబద్ధములు కావని ఏ పరిశోధకుడును నిర్ణయింప లేడుకదా! అట్టి క్రమబద్ధములైన ప్రజ్ఞామయుమూర్తులే మొదటి నరజాతిగా దిగివచ్చి సామాజిక ధర్మము లేర్పరచిరని దర్శించుటలో విప్రతిపత్తి లేదు అప్పుడే పుట్టిన శిశువు కాలు చేతులు కదిలించుట, శ్వాసపీల్చుట, పాలు త్రాగుట ఎట్లు సహజమో అట్లే తొల్లింటి నరజాతి ధర్మము నేర్చుకొనుటయు సహజము దీని నిరూపణమే కర్దమ దేవహూతుల కథ లోకమునకు ధర్మతత్త్వము నేర్పగలవాడు నరజాతి నాగరికత పెరిగిన వెనుకనే యుద్భవింపవలె ననుట సహజముకాదు పెరిగి నాగరికత నేర్చిన అతి నవీన నరులలో అందరును ధర్మమూర్తు లనలేము కదా! కనుక పరిణామ క్రమమున నేర్చు విజ్ఞానమునకును, సామాజిక ధర్మదర్శనమునకును సంబంధము లేదను

టయే సృష్టి సహజము కపిలునివంటి ద్రష్ట లెపుడయినను పుట్ట వచ్చును అట్టివాడు నరజాతికి మొట్ట మొదటనే పుట్టెననుటలో విప్రతిపత్తి లేదు జీవుడు క్రమముగా పరిపూర్ణతలోనికి అవరోహణ చేయు జీవపరిణామ కథతోపాటు, ప్రకృతిలో లీనమై యున్న అంతర్యామి జీవుడుగా అవరోహణము చేయు కథకూడ జమిలిగా పెనవేసికొని యున్నది ఈ ఆరోహణ అవరోహణముల రెండు పేటల వింతగాధయే సృష్టి దానిని నిరూపణ చేయుటలో కర్దమ దేవహూతుల ఆదిమ దాంపత్య కథకు సాటియైనది మరి యొకటి లేదు ప్రపంచ వాఙ్మయమందు ఇంత పవిత్రమైన సృష్టి ధర్మ నిరూపణ గాథ ఇంకెక్కడను లేదనియే చెప్పవచ్చును కనుక తృతీయ స్కంధ మందలి ఈ భాగము జిజ్ఞాసువుల శ్రద్ధను కొంత ఎక్కువగా నపేక్షించిన దనుటలో సందేహము లేదు

ప్రసంగమున చేయుబడిన సంవత్సరచక్ర వర్ణనమునందు సమస్త జీవరాసుల చరిత్రయు చిత్రింపబడినది భిన్నత్వములోని ఏకత్వము నరుడు దర్శించి స్తుతించుట, తన ఏకత్వమునుండి భిన్నత్వమును నారాయణుడు సృష్టిగా ననుగ్రహించుట, ఈ రెండింటి నడుమ అనుసంధానముగా సంవత్సర చక్ర స్వరూపము కర్దముని స్తుతిలో రూపకల్పన చేయుబడినది ఆస్తిక జనులైన తత్త్వాన్వేషకులు భాగవతమందలి ఈ భాగమును మరింత శ్రద్ధతో చదువు కొందురు గాక!

విశాఖపట్టణము, ఇట్లు,
11-11-79 ఎక్కిరాల కృష్ణమాచార్య

# భాగవత రహస్య ప్రకాశము

( పోతన భాగవతము తృతీయ స్కంధము 502-వ పద్యము నుండి 864-వ పద్యము వరకు )

(వరాహావతారమునకు ముందు మహాతమస్సు ప్రళయ రూపమై ఈ మొత్తము సృష్టిని క్రమ్మినది అందున్న ప్రళయమే హిరణ్యాక్షునిగ భూమిని రసాతలమునకు గొనిపోయెను అనగా భౌతికమైన యస్తిత్వము నుండి అసత్ అనబడు ప్రళయ లోకమునకు గొనిపోయెను అట్లు గొనిపోవుటకు కారణముగ జయవిజయుల కథ చెప్పబడుచున్నది

ప్రతి సృష్టి యందును బ్రహ్మనుండి నాలుగు వెలుగులు పుట్టుచున్నవి అవి తపస్సు సత్యము, దానము, పవిత్రత యనబడునవి వాని వ్యక్తమూర్తులే సనక సనందనాది కుమారులు నలుగురును వారికిని, వైకుంఠమునకును భేదము లేదు వారి సృష్టి జరిగిన తరువాత మిగిలిన సృష్టి ప్రారంభమగును వారికన్న ముందు బ్రహ్మసృష్టి యున్నది అంతకన్న ముందు జయవిజయులనబడు ద్వారపాలకుల సృష్టి యున్నది ఇన్ని శక్తుల నుండి సేవాధర్మము సృష్టిలోనికి దిగివచ్చెను

కొంత కాలమునకు సృష్టి బాగుగా వర్ధిల్లిన వెనుక సనక సనందనాదులు కళ్యాణ గుణములుగ జీవులలోన యంశలై అంతర్యామిత్వము వహించుటచే జీవులకు దేహాదులు కలుగుట వలన ప్రకృతి గుణములు వేరుగా పుట్టెను అవియును కళ్యాణ గుణము

లతో మిళితము లగును. అట్టి స్థితిలో సనకాదులకు కోపము మున్నగు గుణములు సోకి మరల నారాయణుని దర్శనమునకు ఆరోహణము చేయవలసి వచ్చును. సృష్టియందలి సేవాధర్మముపై వారికి కోపతాపములు కలుగును. దానితో జయవిజయులను శపింతురు. తత్ఫలితముగా సేవాధర్మమునకు అహంకార మమకారాది రాక్షస ధర్మములు సోకును. దాని ఫలితముగ సృష్టి ప్రళయము పై పునకు మొగ్గును. ఇదియే దితి గర్భము. దీని నుండి చీకటి రూపమున హిరణ్యాక్షుడు భౌతికసృష్టిని రసాతలమునకు గొనిపోవును. దాని నుద్ధరించుటకే భగవంతుడు వరాహమూర్తిగా దిగివచ్చును. దానితో వరాహకల్పము ప్రారంభమగును.

శాశ్వతకథలోని ఈ భాగమే సనకసనందనాదులకును జయ విజయులకును నడుమ జరిగిన శాపకథగా చెప్పబడుచున్నది. ఇందు బ్రహ్మతేజస్సునకును సేవాధర్మమునకును నడుమ నేర్పడు ఘర్షణమునకు రూపకల్పన చేయబడినది. దానిని పరిష్కరించు శాశ్వతధర్మముగా సేవాధర్మమునకే మొగ్గు చూపబడెను. దీని వివరించు నారాయణుని సంభాషణమే ఈ కథలో ముఖ్యము. ఈ సంభాషణము భాగవతధర్మముయొక్క సారాంశముగా ప్రతిపాదింపబడను.

అంతర్లీనమైన ఈ క్రమవిరూపణము కొరకే ఇచ్చట జయ విజయుల కథ ప్రసక్తమైనది. లేనిచో దేవతలు చీకటిని చూచి భయపడి బ్రహ్మను శరణుపొందగా బ్రహ్మ ఈ కథ చెప్పుట అప్రస్తుతమై యుండెడిది. భయపడి శరణు పొందినవానికి నొక సుదీర్ఘమగు కథ చెప్పుట ఎట్లు పొసగును? జీవులు ప్రళయము లోనికి ప్రవేశించుటయే దేవతలకు భయకారణము. ఆ ప్రళయ మునకు కారణము సృష్టిలోని అపరిపూర్ణత యగు కోపశాపాదుల

లక్షణమని దేవతలకు నుపదేశము చేయుటయే ఇందలి సందర్భము దానితో నారాయణ కథాప్రసక్తి అందలి పరిపూర్ణత నుపదేశించుట వలన ప్రళయము నుండి వరాహావతారమున నుద్ధరణము అప్రయత్నముగా జరుగును )

502 దితిగర్భము నుండి ఉద్భవించిన చీకటికి భయపడి దేవతలందరు బ్రహ్మను సమీపించి రక్షించుమని ప్రార్థించిరి వారితో బ్రహ్మ ఇట్లనెను ఓ దేవతలారా! మీకన్న ముందు పుట్టినవారు నలుగురు కుమారులు నాకు గలరు వారు కడు పుణ్యాత్ములు నడచివచ్చుచున్న మోక్షము వంటివారు అద్దులేని ప్రజ్ఞాప్రకాశమే విశేషమైన వస్తువుగా పలుకదలచుచుందురు వారే సనకుడు, సనందనుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు అనబడు సనాతన మూర్తులు వారి ప్రజ్ఞ కందని దేదియు లేదు

503 వారికి దేనియందును కోరికలేదు వారడ్డులేక లోకములయందు చరించుచుందురు [సిద్ధపడిన జీవులలో సత్త్వగుణము భక్తియోగము పేర నంతర్యాములై చరించుచుందురు] వారు ఒకనాడు వైకుంఠమున లక్ష్మీనాథుని చరణారవిందములను సేవింపవలెనని బయలుదేరిరి

504 నిత్యము దివ్యశోభలతో, వైభవముతో శాశ్వతముగా వెలుగొందు వైకుంఠము వారికి గోచరమయ్యెను ఆ లోకమును స్తుతించువారు తక్షణమే నిశ్చలము, ప్రసన్నము అగు మనస్సుతో నుందురు దాని దర్శనమైన వారికి జన్మలలో పని లేదు మహనీయులైన నిత్యసూరులు చేయు నిరంతర స్తోత్రములు అల్లంత దూరమునుండి వినిపించుచుండెను ఆ వైకుంఠ భవనము భక్తిలోకములను పరిపాలించు వెలుగులతో నిర్మాణమై యుండెను

505 ఆ వైకుంఠమున నివసించువారు తమ నిష్కామ ఫలమునే సత్ఫలముగా స్వీకరింతురు కనుక మోక్షధర్మమే వారి జీవధర్మము లక్ష్మితో గూడిన నారాయణుని చరణములను ధ్యానించుటలో వారి రూపమె తమ రూపముగా ధరించి సుఖించు చుందురు కనుక శాశ్వత సుఖమే వారి సుఖము ( అనగా లోకము లెల్లప్పుడు సుఖముగా నుండవలెనని భావించుటయే వారనుభవించు సుఖము నారాయణుడు జీవుల రూపమున వ్యక్త మగును వాని యందుండు జీవులు పరస్పరము దర్శించు రూపము లను వాని రూపములుగనే తెలిసికొందురు కనుక తాము వాని రూపముచే ధరించియుందురు ఇదియే నారాయణమూర్తి యనబడు రహస్యము )

506 రజస్తమస్సులు అనబడు గుణములు లేక శుద్ధ సత్త్వముతో వెలుగొందు నారాయణు డచ్యుత అనంతుడై యుండును అతని శక్తిరూపమున లక్ష్మీదేవి యుండును వేదాంతము లనబడు నుపనిషద్వాక్యములచే తెలిసికొనబడు నిశ్చల ధర్మరూపము కలవాడైన శ్రీహరి పేరనే ఆ నగరమందలి ఉద్యాన వనము లన్నియు శోభిల్లుచున్నవి (శ్రీహరి పేరు ననగా ఉద్యాన వనములు మొదలగునవి యన్నియు అచ్యుత శ్రీహరియే యను యర్థము అతడు కాని దేదియు లేకుండ నలని యందే భాసించు సమస్తమును వైకుంఠమే ఇది ఒకచోటికి కెక్కిపోవు లోకము కాదు ఎదున్నను పరిసరసృష్టి అతని కన్న వేరుగా కనపింపని దృష్టి కలిగినపుడు అది వైకుంఠ మగును ఇట్టి లోకము మనకు కనిపించుచున్న సృష్టి సమస్తములోనే రహస్యముగ నిర్మింపబడి యున్నది ఇందలి అనన్యత కారణముగనే చెప్పుచున్న బ్రహ్మ కును, వినుచున్న దేవతలకును దితి గర్భము నందలి చీకటి యను

ప్రళయము సోకనేరదు ఇంటి సుదీర్ఘమైన వైకుంఠ వర్ణన మీ రక్షణ కొరకే )

507 అచ్చట కైవల్యము మూర్తీభవించి యున్నది అనగా కేవలము నారాయణుడె చూచువానిలోను, చూడబడు పరిసరములలోను నెలకొందుము అన్ని రూపములుగ తోచును (చూచువానిలో నున్న అంతర్లోకము చూడబడుచున్న బాహ్యలోకము నవ్వు ఈ రెంటిని కేరుచేయు ద్వారమున్నది అది దాటిన వారి నైవల్యమున నారాయణుని దర్శించగును ) ఈ లోకము శ్రేయ మని వాడ దందురు అనగా నింతకన్న శ్రేయస్సు మరియొకటి లేదని యర్థము

అచ్చట సకల ఋతువుల ధర్మములు కలిగి వర్తించు వృక్షము లున్నవి కోరికలు గలవారి మనస్సులలో మొలకలెత్తిన కోరికలు తుదముట్టనంతగా తీర్చునట్టి వీ వృక్షములు ( కైవల్యసిద్ధి యనుభవింపబడు సమయమునకు కోరికలుండవు అంతకుముందున్న కోరికలు నారాయణ లోకమున వృక్షముల ఫలములై సిద్ధించును ) అచ్చటి వృక్షములు మరియొక జాతి వృక్షముల నుండునీయవు ( అనగా నితరము అనబడు భావమునకు సంబంధించిన కోరిక లుండవు ) వీనినే సంతాన వృక్షము లందురు సంతాన వృక్షము లనగా ఆశ్రయించినవారిని విస్తృతిని చెందించు వృక్షము లని యర్థము

అ చ్చపుడును వసంత సమయమే ( ఇంతకుముందు సర్వ ఋతుధర్మము లున్నవని చెప్పబడినది కనుక నిచ్చట వసంత శబ్దమునకు భూమిపై జరుగు రెండుమాసముల అర్థాయమైన వసంతఋతువని యర్థము కాదు వసంతము అనగా వసించుచున్న కాలము లేక శాశ్వతమైన వర్తమానకాలమని యర్థము ఇచ్చట

నన్నవారు జరిగిపోయిన వానిని జ్ఞప్తి చేసికొనుటయు, జరుగ బోవువాని నూహించుటయు నుండకు జరిగిపోయినవి, జరుగ బోవునవి వర్తమాన కాలముగనే యుండును స్మృతులు గాని, కోరికలుగాని లేని యనుభవమగు (యుద్ధము) వసంత సమయ సౌభాగ్య సంపదలు శోభిల్లుచుండును వసంతికా పుష్పముల గుత్తులు పరిమళించుచుండును అవియంత మకరందబిందువులు వర్షించుచు ఉండు (వాసంతికా పుష్పము లనగా నొక విధమైన గురివిందపువ్వులు ఇచ్చట వర్తమాన కాలపు పుష్పములు లేక అనుభూతు లని యర్థము ఇందలి మకరంద బిందువులు పరవశత్వములోని మాదుర్యము దీనిచే భక్తియోగము వలన సిద్ధించిన సమాధిస్థితిగా ననుభవింపుడు) ఆ పుష్పముల వాసనలతోను, మకరందముతోను నిండిన హృదయములు గల జను లుందురు వారు గానము చేయుచు నారాయణుని చరిత్రమును తమకు తెలియక యే కీర్తించుచుందురు తెలిసికొని కీర్తింపదలచినపు డెల్ల వారి అఖండ జ్ఞానము ఖండ మగుచుండును అయినను వారు ఇంద్రియములకు గోచరించు సుఖములు అంతర్యామి భావనతో నిండియున్నవి గనుక వారికి విషయ సుఖములు గూడ నారాయణమయములు

ఇట్లు కలిగిన ప్రీతి యనుభవము ననుభవముగా గోచరించు నరికి నారాయణ స్మరణము తెగిపోవుచుండును గనుక వారా సుఖములను లెక్కచేయక నారాయణ స్మరణమునందే యుందురు అచ్చటి ఎల్లగాలులు ఆ పూల వాసనలను గొనివచ్చుచుండును గనుక ఆ వాసనలు తమ మనస్సులయొక్క నారాయణ సేవల కడ్డువచ్చుచున్నవని గ్రహింతురు, గ్రహించి ఆ గాలులను తిరస్కరించి నారాయణ ధ్యాన పరాయణులై యుందురు (ఉచ్ఛ్వాస నిశ్వాసములు జీవుని మనస్సులోని పూర్వవాసనల ననుభవింపజేయును కనుక శ్వాస నిలిపి దానియందు మనస్సు

లయము చేసి నారాయణుని ధ్యానించి, ఈ ధ్యానముననే సమస్తము చూచుచుని యర్థము ) ఈ విధముగా ధ్యానము చేయుచున్న దేవతలు భార్యలతోగూడి విమానములలో చరించుచుందురు (విమానములనగా విశేషమైన మానములు గల దేహములు మొదలగు నుపాధులతో గూడిన లోకముల వ్యూహములని యర్థము వీరి సృష్టలో దేహములకైను, లోకములకును వేరుగా నస్తిత్వము లేదు అవి కేవలము విహార కారణములే యని యర్థము దేవుని ధ్యానించుటకు మనస్సు కావలెను కీర్తించుటకు కంఠము, శ్వాస కావలెను వాని ప్రయోజన మంతవరకే )

అట్లు విమానములలో ప్రయాణము చేయుచున్నవారి మనస్సుల కుల్లాసము కలుగునట్లుగా పావురములు, హంసలు, కొగ్గురు పిట్టలు చిలుకలు కోకిలలు, చాతకములు, తిత్తిరి పిట్టలు, నెమళ్ళు, చక్రవాకములు మొదలగునవి సందడి జేయుచు విమానములలో నుండి కన్పించు చుండును వాని వివిధ కూజితములలోని కలకలారావములలో నారాయణుడే వినబడుచుండును అట్లు ఎగురుచున్న పిట్టలకు వగువగా పరివశించిన తుమ్మెదలు విహరించుచున్న పూలతీగలును పొదరిండ్లును గలవు ( సర్వ జీవుల భాషలోను నారాయణుని అంతర్యామిత్వమే మనోహార కూజితములుగా విని పించి ఆనందింపజేయుచుండును )

అచ్చట నొత్తుగా పెరిగిన తులసి వృక్షములయొక్క తులసీ దళములను చూచి నారాయణుని వక్షస్థలమున మాలికగా నలంకరించుటకు ఈ తులసి ఏ విధమైన తపస్సు చేసెనో ' అని తర్కించుకొనుచు, గుత్తులు గుత్తులుగా పుష్పించుచున్న మందారములు, మల్లెలు, పున్నాగములు, పొగడచెట్లు, అశోకములు, కురవకములు, పారిజాతములు తామరలు, నల్లకలువలు సందు లేకుండ పుష్కలముగా కనుపించుచుండును

ఆ పూలచెట్ల నడుమ గూడి వయస్సులో, చక్కని విలాసములతో విహరించు సుందరీమణులుందురు ఎత్తైన స్తనభరములు, అసి చూడుచున్న ... ములు కలిగి ములపూళ్ళ నలంకరించుకొని నీలనీలమున్న పట్టువస్త్రముల మొదలచుట్టు నలంకరింపబడి విహరించుచుందురు వారి నడకలు హంసలను నెమళ్ళను వంకలు దిద్దుచుండును మన్మథుని బాణములవంటి చురుకైన నయన కమలములు కలిగి భర్తలతో విహరించుచుందురు అట్టి దంపతులు మన్మథ క్రీడలయందు సంతుష్టి పొందవలెనని జ్ఞప్తి యుండక ముకుంద చరణారవిందసేవలో సొక్కి విరాగములలో వారించుచుందురు ( గృహస్థులకు భౌతికమైన దాంపత్య సుఖములు గుర్తు రాని విధమున యోగానందమున లసిమెలంగ విహరింతురని యర్థము )

లక్ష్మీదేవి సకల సౌందర్య కాంతులతో నొప్పారుచు మనోహర శబ్దములుగల అందెలు ధరించి నారాయణుని ఏకాంత మందిరమున తన చాంచల్య దోషమును కోల్పోయి మెలగుచున్నది తన చేతితో లీలగా పద్మము ధరించి భంగిమలు చూపుచున్నది అప్పటి తన మూర్తి ఆ ప్రక్కనున్న స్ఫటికమయములగు గోడలలో అనేక రూపములుగా ప్రతిబింబించును ( సృష్టిలోని సౌందర్యమూర్తులుగ తన ప్రతిబింబములను నిలుపును వైకుంఠనాథుని ఏకాంత గృహమును తుడుచునట్టి సేవయే తన పరమ ధర్మమని తెలుపుచున్నట్లు ఆమె పద్మము త్రిప్పుచుండగా, ఆమె ప్రతిబింబములు ఆ గోడలను తుడుచుచున్నట్లుండును )

మరియు తన నివాసమున లక్ష్మీదేవి ప్రత్యేకముగా పెంచిన పరిమళ తులసీదళములను మాలికలుగా గట్టి ఆత్మనాయకుడగు నారాయణుని చరణారవిందములకడ నుంచుచుండును

అట్లగ్పించు పంచశీలో వంగినవ్రు ను ంగా ను గ/ను ను శనూాా అగ్నా
అ ు కొనను నగుమారిమైన ను ప్రప్ర్న ు ను
అపురావమై మోము స గవర్గి అ సు ఒల గా
లలో ప్రతిబింబించుచున్నను తమ ఖ ప్ర గి ను తాచి
తన పనోనాయగ ను అ నిటిరో సాక్షాత్క చి తి ను గి ను
చుండెనని యామోము భ్రమపడి స్నిపకును ( ు ప్రి వించ
మును విష్ణువు ముఖముగా తు ంట ం క్ష్మి
అనగా స్త్రీలలో అసె ము ఖ ను
నారాయణు ముఖమక్రై ను కను రగుగాా
సీలమైన జంతువులలో ప్రతిబింబించుట వలన విష్ణుని ముఖమని
భ్రమ కలిగినది ) అట్టి నీల జ ముములతో ను
తీగలతో గట్టులందు అలంకరింపబడిన దొరువు లచ్చట గలవు
ఆ లోకము పుణ్యములకు రక్షణ స్థానము ధర్మములకు స్నిలమైన
చోటు సత్కర్మలకు వేళ్ళూనిగిన పాదు లచ్చట పెరుగును

508 విష్ణుని యందు పెడమొగము గలవారు, ఇతరిత
విషయములం దాసక్తి గలవారు పాప ప్రవర్తనము గలవారు,
నరక కారణమైన నిందాప్రవర్తనము గలవారు, ఇతరుల చెడ్డ
వృత్తాంతముల యందు ఆసక్తి కలిగి చెప్పకొనువారు, ఈ విష్ణు
స్థానమును పొందలేరు లక్ష్మీనారాయణుల చరణారవిందము
లను భజించువారు మాత్రమే పొందగలరు ( ఈ పొందలేకపోవు
టకు నిదర్శనమే సనక సనందనాదుల కోపశాపములు తత్ఫలిత
ముగా ద్వారపాలకుల రాక్షస లక్షణములచే జీవులకు కలుగు
వేదనలును )

509, 510 విష్ణుదేవుని భజించుటకు, ధర్మతత్త్వమును
బుద్ధియందు నిలిపి దానితో ఎండిన స్వభావము ధరించుటకు,

మానవు లభ్యాసము చేయుదురు అట్టివారు కూడ వాని మాయను మోహాతులై పడియుందురు అతని పాదములను కుతూహల ముతో గొలిచినపుడుగాని ఆ మాయ తొలగదు (ధర్మము యొక్క తత్త్వము నెరిగి దాని నాచరించుట నభ్యాసము చేసిన వారికి సాధన చిట్టచివరివరకును వచ్చును ధర్మతత్త్వమును గూర్చిన కోరు ఎంగిన స్వభావము మిగిలిపోవును అనగా మనది ధర్మతత్త్వ సాధనమార్గము " అని తమ్ము తాము మిగిలిన వారి నుండి వేరు చేసికొందురు ఈ విధముగా మాయా మోహితు లగుదురు అప్పుడు భక్తిఒట్టిన గాని మాయ పోదు భగవద్భక్తి యనగా సాధు సజ్జనులపై భక్తి వారి రూపమున నారాయణుని గొలిచిననే గాని వేరైన భావము పోదు ఇట్లు మాయ వలన మోహితులై సనకాదులు జయ విజయులలో నారాయణుని చూడ లేక భేదదృష్టి వహించిరి )

511 అవి సత్కర్మ మాత్ర లుంటాసి పుణ్యభాగులు అచ్చట కోరికలు జారిపోయిన వారు, అహంకారము దూరమైన వారు విహరించు చుండగా, నారాయణుని మంగళకరములైన దివ్య కథలను ఆలపించుటలో, వినుటలో కలిగిన యానందము పట్టరాక ఆనంద బాష్పములు చెక్కిళ్ళపై జారుచుండును దేహముల యందు పులకాంకురములు పుట్టుచుండును (కోరికలు జారిన వార నగా నారాయణుని స్వరూపమును మాత్రమే దర్శింపవలెనను కోరిక పోయి అందరియందతనినే దర్శించువారు అహంకారము దూరమైన వారనగా " నే నితని భక్తుడను ' అను ప్రజ్ఞకూడ తొలగినవారు ఇట్టివారి కెవరైన కోప తాపాదులను సంక్రమింప జేసినను అప్పుడు కూడ వారు హరి స్మరణ మానరు ఈ కోప తాపాదులు మాత్రము, సంక్రమింప జేసిన వారిని హింసించి వ్యయమైపోవును కనుకనే జయ విజయులు హిరణ్యాక్ష హిరణ్య

కళిపులై దిగివచ్చినను చెడిపోయినది లేదు హాని స్మరించుచుచే యుండిరి మిగిలినవారికి మాత్రము శాధలు కలిగినవి )

512, 513 ఆ వైకుంఠము పద్మమయము దివ్యములైన సువర్ణ శాలలతో గోపురములతో హర్మ్యములతో అంకితమైన పద్మము రూపమున నుండును అనగా పద్మాకృతిగా నిర్మింప బడినది దానిలో సుమ మందిర ముండును దాని పైన తామర దిమ్మవలె కేంద్ర ముండును దానిపైన నలుపు పసిగ పృన పాముండును దాని చుట్టయుండు పర్యంకము లుండును దానిపైన తుమ్మెదవలె మాధవు డుండును ( దివ్య సువర్ణశాలలనగా చక్కని రంగులతో కూడిన శాలలు అంతేకాదు సువర్ణములు అనగా మంచి అక్షరధ్వనులు వాని యుత్పత్తి స్థానములే భక్తుల హృదయమున శబ్దమయములైన అర్థ విశాలములైన శాలలుగా నుండును

శాలాంక గోపుర హార్మ్యావృతము " అనగా శాలల యందు గుర్తింపబడిన గోపురములు మొదలైనవి అంతేకాదు శాలలయం దంకములు అనగా అంకెలు ధర్మములై వర్తించు చుండురు ( ఇంకను పద్యముల వివరణము చూచునది )

514, 515 ఆ వైకుంఠము హరిచేత పరిపాలింప బడు చున్నది బంగారు విమానము లెక్కి తిరుగుచున్న సత్పురుషులతో సందడిగా నున్నది వైభవముతో నిండిన మహాప్రభావము వారి యందు గోచరించుచున్నది అట్టి వైకుంఠమును సమీపించుటకు సనక సనందనాది మునీశ్వరులు లోకకళ్యాణము కోరినవారై చేరగలిగిరి తమ యోగశక్తిచే సంతుష్టి చెందిన మనస్సులతో వారచ్చటికి సమీపించిరి (లోకహితమును కోరనిదే వైకుంఠ

సామ్రాజ్యము సమీపించుట సాధ్యము కాదు సనకాదులు జగద్ధిత మును కోరివచ్చిరి కనుక సమీపింప గలిగిరి కాని వారికి తమ యోగ శక్తిపైన గట్టి నమ్మక మున్నది అది విఘ్నకారణము వైకుంఠమున పూర్తిగా ప్రవేశింపవలెనన్నచో తమ తపశ్శక్తి నారాయణుని అనుగ్రహమని తెలియ వలెను అట్లుగాక సనకాదు లు తమ తపశ్శక్తిపై వేరుగా నమ్మకముండుటచేతనే చివరి కక్ష్య యందు ద్వారపాలకు లడ్డగించుట జరిగినది )

## సనక సనందనాదులు వైకుంఠమునకు వచ్చుట

516, 517 సనక సనందనాదులు వైకుంఠ ద్వారము సమీపించిరి మరకత మణులతో నలంకరింపబడిన గోడలు, తలుపులు సింహద్వారములు, గుమ్మములు గల ఆరు మహా ద్వారములు దాటిరి దాటుచున్న ప్పుడు కూడ విష్ణుదర్శన కుతూ హలమేగాని వారి కన్యదృష్టి లేదు ఏడవ ద్వారము సమీపించిరి అచ్చట నిద్దరు ద్వారపాలకు లుండిరి వారి వయస్సు మొదలగు విశేషము లన్నియు సమానముగా భేదము తెలియనట్టి రూపము లతో నిలబడి యుండిరి

(ఏడు లోకములకు నేడు ద్వారము లుండును అనగా భూలోకమునుండి భువర్లోకమునకు మొదటిది అందుండి సువర్లో కమునకు రెండవది, అందుండి మహర్లోకమునకు మూడవది, జనలోకమునకు నాల్గవది, తపోలోకమున కైదవది, సత్యలోకము నకు ఆరవది ఈ లోకము లన్నియు నొకదాని తరువాత నొకటి యుండవు ఒకదాని తరువాత నొకటి అను పేర్పు భూలోకము నకు మాత్రమే సంబంధించినది అనగా పంచభూతములను సంబం ధించినది అందును ఐదవది యగు నాకాశమున నొకదాని తరు వాత నొకటి యుండదు

మన శరీరమున గూడ పంచకోశములు శరీరాకారమున నొకదానియందొకటి పేర్చబడియుండును ఇందు క్రింది లోకములో పై లోకమిముడదుగాని, పై లోకములో క్రింది లోకమిముడును పృథివిలో జలత్వముండదు గాని జలము లయందు పృథివి కరిగిగాని తేలుచుగాని యుండవచ్చును ఒక్కొక్క స్థూలలోకము దాని పైనున్న సూక్ష్మలోకమున నుండుటయు, ఆ సూక్ష్మలోకము దాని క్రింది స్థూలలోకమున అంతర్యామిత్వము వహించుటయు నుండును ఇట్లు పేర్చబడిన పంచకోశములన్నియు కలిసి భూలోకము వానికి పైన మనస్సుండును. అది భువర్లోకము మన లోపల మనస్సున్నట్లే వెలుపల చోటులోకూడ మనస్సుండును దానినే అంతరిక్షము అందురు (దీని రూపాంతరమే అంతరిక్షము) అనగా తన లో తనకు చూపు గలది "భువర్లోక మనగా అంతరిక్షము" అని తైత్తిరీయోపనిషత్తు చెప్పుచున్నది ఇట్లు వరుసగా ఆరు లోకములు నొకే గోళాకారముగా నుండును అందారవ లోకమున మిగిలిన అయిదు లోకములును సృష్టింపబడి తేలు చుండును పైలోకము వారు విహరించుటకు క్రింది లోకము లడ్డురావు ఉదాహరణకు తపస్సత్య లోకములవారు మన దేహముల నుండి అటునిటు పయనించు చేయుచునే యుందురు భూలోకము నుండి మీదనున్న లోకములు ద్రవ్యమయములుగా గాక శక్తిమయములుగా, విజ్ఞానమయములుగా నుండును నాల్గ వదియగు మహర్లోకము నుండి తెలివియను వెలుగు మాత్రము మనను ఆడు తెలుపులుగా ఆ లోక వాసులు విహరించు చుందురు ఎనను తపోలోకము వరకు కర్మను కర్మఫలములు నుండును సత్యలోకమైన బ్రహ్మలోకమున బ్రహ్మ యుండును తానున్నాననని తెలిసినపుడు తానుండును తెలియనపుడు తానుండడు ఈ స్థితినే సత్యము అందురు అందు లోకము

లున్నవని తెలిసినపుడు దిగువ లోకము లుండును తెలియనపు డుండవు ఈ రెండు స్థితులయిందును కూడ నారాయణ లోకముండును

బ్రహ్మలోకము వరకు గల జీవులకు సనకు లోపల, వెలుపల యను భేదభావన యుండును భౌతిక శరీరములు లేకున్నను ఈ భావన యుండగను మనలో కు డ ఈ భావనమీద నాధారపడి యున్నవే మన దేహముల వ్యూహములు బ్రహ్మలోకము శాశ్వతమైనది దానికి కర్మబంధముండదు కర్మ యుండును అది నారాయణుని సంకల్పము బ్రహ్మలోకము నుండి నారాయణ లోకమునకు పోవుటకు గల ద్వారమే యేడవ ద్వారము అచ్చట లోపల, వెలుపల అను భావము దాటవలెను అటు పై న "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థిత" అని వేదము చెప్పుచున్నది ఈ ద్వారము దగ్గర వేచియున్న 'లోపల వెలుపల' అనబడు భావములే ద్వారపాలకులు

సనక సనందనాదులు అంతవరకు నడచి వచ్చినపుడు తాము దేశించిన నారాయణ లోకము లేక వైకుంఠము తమకొన్న చేరుగా కనుపించినది ఇట్లు కనపించినది ఒక యాకారమే గాని వస్తువు గాదు వస్తువు తమలో నున్నదే దానినే తా ముద్దేశించిన యుద్దేశమునందు దర్శింపవలెను ఆ స్థితినే సర్వకారణ కారణ ముగా వారు సంకీర్తనము చేయుచు వచ్చిరి మొదటి యారు కక్ష్యలను దాటునంత వరకు వారి కా కక్ష్యలు గాని, అందలి యలంకారములు గాని కనపించలేదు వారు సర్వమును విష్ణుమయ ముగా చు చుచు అన్యమును చూడకుండుటచే వాని దాట గలిగిరి ఏడవ కక్ష్య ముందు ద్వారపాలకుల ను చూచు వేళకు మనస్సు చెదరెను వారియందు విష్ణువును చూడక ద్వారపాలకులను అన్య

మూర్తులుగా చూచిరి కనుక నే విష్ణువు కనుపించక ద్వారపాల
కులు కనిపించిరి అన్య దృష్టి చెదరి విష్ణువును చూడక తమ్ము
చూచిరనియే ద్వారపాలకుల కన్నులు కోపముతో నెర్రబడెను )

518 అచ్చట నున్న ద్వారపాలకు లిద్దరు నవరత్నములు
తాపిన బంగారు కంకణములు, రవ్వల యుంగరములు, హారములు,
కేయూరములు, ఘల్లుమను కడియములు ధరించియుండిరి (భావ
మయములు, శబ్దమయములు అగు వెలుగులచే నలంకరింపబడి
యుండిరి వేద సంప్రదాయమందలి కవి సమయములలో రత్న
ములు తెలుపుల కాంతులకు ప్రతిపాదకములు అగ్నే హిరణ్యము
కూడ దీని ననుసరించియే అగ్నిని రత్నధాతముడు అనియు
బ్రహ్మాండమును హిరణ్యగర్భ మనియు చెప్పుట ) వారు వక్షమున
వనమాలికలు ధరించియుండిరి అందుండి వెలువడుచున్న పరిమళ
మునకు మదించిన తేనెటీగలు గానము చేయుచు విహరించు
చున్నవి (వన పుష్పములు దేహధారణమునకును, పరిమళము
చైతన్యమునకును, గానము ప్రాణమునకును సంకేతములు )
అట్టి వన మాలికలతో నలంకరింపబడిన వక్షస్థలములు గలవారై,
గదాధరులై , చతుర్బాహులై యుండిరి

వారిలో నొక యున్నతమైన బింకము గోచరించుచున్నది
కన్నులు రోషాగ్నిచే నెర్రబడియున్నవి కనుబొమలు ముడివడి
వంపులు తిరిగి ఫాలభాగము నలంకరించి యున్నవి (అంతర్దృష్టి
బహిర్దృష్టి వేరై యున్నప్పుడు జీవునిలో నొకరియందొకరికి గల
బింకము ఈ విధముగా వర్ణింప బడినది ) కరములలో బెత్తములు
ధరించి యుండిరి ఇట్లు కనుపించిన నారాయణుని అంతః పుర
ద్వారపాలకులను చూచుచునే సనక సనంద నాదులు నడచిపోవు
చుండిరి

519 ఆ మహామునులు బ్రహ్మసృష్టి ప్రారంభమున పుట్టిన వృద్ధులైనను ఐదు సంవత్సరముల కుమారులై గోచరించు చుండిరి వారికా ద్వారపాలకులు అడ్డుదురను సందేహమే కలుగ లేదు కనుక ఎ రింపరాని గమనమున ద్వారము లోనికి వచ్చిరి

520 లక్ష్మీనారాయణులను దర్శించు కుతూహలమున వచ్చిన జ్ఞాన మూర్తులను ద్వారపాలకులు నిల్పివైచిరి తమ కుటి లతి వలన దుశ్శీలురై వారి కడ్డు పలికిరి

521 వారట్లు వారించుచుండగా దేవత లందరును చూచు చునే యుండిరి ఆ మునులు నలుగురకును కోపముతో కన్ను లెర్రబడెను అందరు వినుచుండగా వారిట్లనిరి

522, 523 "ఈ నారాయణు డందరికి స్రష్టయు ఈశ్వరుడును రక్షకుడు, భక్తపరిపాలకుడు అందే అందరు మున్నాము. కనుక అత నిని దర్శింప గోరువారి నడ్డరాదు ఆనందానుభూతిలో వానిని సర్వాత్మకుడుగా కొలుచుటకు మీరడ్డు వచ్చిరి (లోపల, వెలు పల యను భావము లగ్గు వచ్చి తనకన్న వెలుపల నున్నది నారా యణుడను లోచనిక జగత్తు అనబడు మిధ్యాభావము గలిగించును ) వానిని సేవించుట కడ్డ వచ్చుటయే మీ పని మా కిట్లడ్డు పడిన దురాత్ములను నేడు సాధితిమి

524 కపట వృత్తిగల ఇతర జనులను దేవుని గృహము లోనికి ప్రవేశింపనీయక వారించుట మీ పని కావచ్చును కపట వృత్తి గలవారు ప్రవేశింతురేమో యని ద్వారము కడ నిలబడి కొందరిని పోనిచ్చుటయు, నితరులను వారించుటయు ద్వారపాల కుల పని (ఇతరు లనగా తనకన్న నితరమును భగవంతుని కన్న నితరముగా, అనగా సృష్టి సముదాయముగా చూచువారు )

మీ అభిప్రాయ మిది గావచ్చును కాని మీ మనస్సులలో నున్న స్వామి మా మనస్సులలో నున్నాడు అతని కెవ్వరి యందును విరోధము లేదు అతని గర్భమునందే గదా మీరును, మేమును, ఈ విశ్వ మంతయు నున్నది? అంతేకాక పొంద దగినవాడు పొంద గోరువాడు పొందుట అను భేదము వానియందు గలదా?

చోటు లోకుండ యున్నపుడు కుండలో చోటున్నట్లు మన మందరము ఎవరిలో వారున్నాము కాని కుండ కాధారమైన చోటుకన్న వేరుగా కుండలో చోటని యొకటి యున్నదా? తెలిసిన వారి కది యొక్కటిగనే దర్శనమిచ్చును ఆ యొక్కటియే ఈ నారాయణుడు అతని కాత్మల భేదము లేదు

లోకమున నపరాధము చేసిన సేవకులను రాజు శిక్షించును అట్లీతడు మిమ్ము దండించునని తలచి వారించుచున్నారా? మమ్ము డ్తుటలో నిదియే భావమైనచో చెప్పెదము వినుడు మేము శాపగ్రస్తా రూపులమై వచ్చితిమి (బ్రహ్మమయమైన మార్గమున నిష్కాములమై వచ్చితిమి ) అట్టి మాకును, మనలోని అంతర్యామికిని భేదము లేదు కనుక సందేహింప వలదు ఈ రెండు మార్గములలో కాక మూడవ మార్గమున మమ్ము వారించితిరో మీకు మోహము కలుగును అనగా సర్వము తెలిసియు కావలెనని వారించినచో మీరు మందబుద్ధులు అది కూడని పని అట్లు మమ్ము వారించుటకు కామమో, క్రోధమో, లోభమో కారణమై యుండవలెను ఈ గుణములు శత్రువులు అట్లు వారించినచో ఈ శత్రువులు మిమ్ము బాధింతురు అట్టి జన్మలలో మీరు పుట్టుదురు మా రీ శాపమున కర్హులు

(ద్వారపాలకులు తమ ధర్మము నిర్వర్తించుటకు వారించి

నచో తప్పలేదు లేదా యజమాని ఏమనకో యని వారించినను తప్పులేదు అట్టి శంకలకు తావులేని వారిని, తెలిసి కూడ వారించుట యనగా తమ ఇచ్ఛాద్వేషములు ప్రకారము వారించుట యగును అట్టియే కామక్రోధ లోభాదులు ఇవి యెవరికైన శత్రువులే ఈ దుర్గుణములతో నితరులపై శత్రుత్వము వహించుచుందుమని తలచువారు కూడ ఈ దుర్గుణములచే పీడింపబడుచుందురు ఎవరి మీదనైన కోపము వచ్చినచో కోపబాధ కోపించిన వానికే గాని యితరులకు గాదు ఇట్టి దుర్గుణములు శత్రువుల రూపమున స్థూల లోకములలో జీవులను పీడించుటకై తాను, ఇతరులు అను రెండు భావములు దిగివచ్చును ఈ భావములకు స్థూల లోకములలోనే కర్తవ్య నిర్వాహణము కలుగుచుండును కామ క్రోధాదుల బాధ తెలిసి ఆయా జీవులు వాని నుండి తప్పించుకొనుటకు భక్తియోగమార్గ మవలంబింతురు దానిని కలుగ జేయుటయే ఈ ద్వారపాలకుల కర్తవ్యము దాని కర్థవాదమే యీ కథ )

525 ద్వారపాలకు లా వాక్యములు విని ఉలికిపడిరి వాడియైన బాణ పరంపరలు వచ్చి తగిలినట్లు, మునుల వాక్కులు వారికి సూటిగా గుచ్చుకొనెను ఆ వాక్యములు వారింపరాని వని తెలిసి ద్వారపాలకులు తల్లడిల్లిపోయిరి

526 భరింపరాని తాపము పొంది వా రిరువురును సనకాది మునీంద్రుల పాదపద్మములకు మ్రొక్కి అంజలులు భ్రూమధ్యమున ఘటించి యిట్లనిరి

527, 528 ' ఓ మహా యోగీశ్వరులారా! మా మనస్సు నొచ్చుకొనునంతటి కఠిన వాక్యములు మీరు మాపై ప్రయోగించిరి మేము దుఃఖంపము కారణ మేమనగా మేము దుఃఖంప

వలసిన సందర్భ మేమియు లేదు సజ్జనులను పరాధవించిన వారు
వ్యర్థమైన జననము గలవారు మే మాచరించిన పాపమే మమ్మీ
స్థితికి తెచ్చినది గాని మీరు కాదు దీని వలన మేము శుభములు
పొందుటకే ఈ శాపము ను వినియోగించు కొందుము

( తన దోషము లేనచో పతనము కలుగదు కలిగిన పతనము
నకు దుఃఖించుట యనగా తాను దోషము చేసితి నని ఇకను
గ్రహింపకుండుట అట్లుకాక వెంటనే చేసిన దోషమును గ్రహిం
చినవాడు ఆ పతనావస్థను మరల ఆత్మోద్ధరణమునకై వినియో
గించుకొనును

ఇందు ద్వారపాలకులు చేసిన దోష మేమియును లేదు తమ
ప్రభువుయొక్క యాజ్ఞను పరిపాలించుట దోషము కాదు దాని
వలన సనకాదులకు కలిగిన యవమానము నిజము కాదు అవమాన
మున్నదని భావించుట వారి దోషమే తమ దోషము లేనపుడు దుస్థితి
సంభవించినచో నితరులలో దోషము గుర్తించుట లోక సహజము
అప్పుడు గూడ నితరులపై దోష మారోపింపకుండుట లోకాతీతుని
లక్షణము ద్వారముకడ నెవ్వరి నడ్డవలెనో, ఎవ్వరి నడ్డరాదో
ద్వారపాలకులకు తెలియకపోవుట నిజమైనచో అది యజమాని
దోషము ఇచ్చుట నారాయణుని యందు దోషమునకు తావు లేదు
గనుక ద్వారపాలకుల విశిష్టత కొరకై నారాయణుఁడీ సన్నివేశమును
కల్పించెను ఈ సందర్భమున సనక సనందనాదుల యందుగాని,
నారాయణుని యందుగాని వారికి దోషము కనిపించినచో వారు
వైకుంఠ ద్వారపాలకు లెట్లగుదురు ? ద్వారపాలకులు శుద్ధ సత్త్వ
సంపన్నులు గనుక దోష మారోపింపక తమకు గలిగిన పతనావస్థను
శుభముగా మార్చుకొన గలిగిరి దైవమందున్నవానికి శుభ
మనియు, పతన మనియు నుండవు శుభము, అశుభము మొదలగు

పదములగును, సన్నివేశములకును భ్రమపడువారే భగవద్భక్తు
లనబడుదురు వారికి భూలోకమునకే గాదు, నరకలోకమునకు పంపి
నను అదియు భగవన్మయమే కనుక వారికి నరక ముండదు భేదా
వ్యాలకు భ్రమపడువారు స్వయముగనే నరకమును సృష్టించు
కొందురు ఈ రహస్యమునే సమన్వయము చేయుచు నా
నివాసము స్వర్గమునన్నైన నేమి ? భూమియందైన నేమి ? నరకము
నందైననేమి ? నరకాంతకములగు నీ చరణముల స్మరణయే
మరపు రాకుండునట్లు చూడవలెనని మేము నిన్ను కోరు
చున్నాము అని కులశేఖరుఁను రాజు తన ముకుందమాలా
స్తోత్రమున దేవునితో చమత్కరించెను )

529, 530 మీరిచ్చిన శాపము మాకు శుభము నెట్లు
కలిగించునో తెలిపెదము మీకు దయపుట్టునట్లుగా మేము
ప్రార్థింప గలిగితిమేని, ఇప్పుడు మీకు మాపై జాలి కలిగెనేని,
మాకు అంతిమాత్రపు పరిచయము చాలును కామ క్రోధాదు
లతో మేము పుట్టినచోటగూడ మీ దయ యున్నచో నారాయణుని
నామము మరపురాదు మా జన్మలు శుభ ప్రతిపాదకము లగు
ననుటకు కావలసిన దది యొక్కటే గదా !

531, 532 వారట్లు సంభాషించుకొనుచుండగా అచ్చట
జరుగుచున్న కలకలము నారాయణునికి వినిపించెను అతడు
లక్ష్మితో సుఖ వినోదములలో చేయుచున్న సరస సంభాషణములు
నిలిపి, హరియై ద్వారముల దాటివచ్చెను తనయందు శరణాగతి
పొందినవారి ఆర్తిని పోగొట్టి నిత్యమై భవ మూర్తియై ఎప్పుడను
దిగివచ్చును

533, 534 అతడు దిగి వచ్చుచుండగా సందర్భమేమో
తెలియక తొట్రుపాటుతో లక్ష్మికూడ వెంట నడచెను పరమ

హంసలగు మునీశ్వరులు ఇరుపార్శ్వములయందును పాదపద్మముల నమస్కరించుచుండిరి అతడు వినుట కింపైన పాదనూపుర శబ్దములతో దిగివచ్చెను

535 అటు నిటు అప్సరసలు హంస రెక్కలవంటి చామరములు వీచుచుండిరి వారి గాజుల శబ్దములు వినిపించుచుండెను చామరముల గాలులకు మెల్లగా కదలుచున్న పెద్ద చంద్రమండలమువంటి గొడుగు పట్టి కొందరు వెనుక నడచిరి తన మెడలోని ముత్యముల హారములు వెన్నెలలోని మంచు బిందువులవలె తళుకించుచున్నవి

536, 537 అటు నిటు నిలబడి మునీంద్రులు స్తోత్రములు చేయుచుండగా నారాయణుడు మందస్మితము చేసెను దా నా మునీంద్రులు వర్ణించుచుండిరి ఒకరి నొకరు స్నేహముతో చూచుకొను వారిని అతడు దయతో చూచెను ఆ చూపు వారి తెలు హృదయ గుహలో నుండి చూచుచున్నట్లుండెను నిర్మలమైన వక్షస్సునందు వైజయంతి యను మాలికను ధరించియుండెను నమస్కరించుచున్న వారిపై దయను అమృత తరంగములుగా ప్రసరింపజేయుచున్నవి వాని కన్నులు ఇట్టి వైభవముతో నారాయణుడు వైకుంఠ ద్వారము వెలువడెను

538 పచ్చని పట్టుబట్టపై పేటలతో నడుమున కాంచి బిగింపబడియున్నది మెడలోని హారముల కాంతులతో కౌస్తుభ కాంతులు మైత్రి చేయుచున్నవి మెరుపుతీగలవంటి కర్ణకుండలముల కాంతులు కపోలములను మెరపించుచున్నవి కిరీట కాంతులు దిక్కులు నిండుచున్నవి అతడు నిలబడి గరుత్మంతుని వీపుపై నడమ చేతిని మోటించెను

539 అతని పాదపద్మములయందు కేసరముల గుత్తులవలె భాసించుచున్న తులసీదళముల కోసము, పుష్పముల గంధ మాఘ్రాణించుట కోసము వేచి నిలబడిన యోగీంద్రుల మనస్సులానందముగ నిమగ్నమైనవి అప్పుడును అతడే దర్శన మిచ్చెను కన్నులు తెరచి చూచినను కన్నులు మూసి ధ్యానించినను, ఒకే కాంతి, ఒకే మూర్తి ఒకె సౌందర్యము దర్శన మిచ్చెన (ఈ రెండను భూతుల నడుమనున్న ప్రజ్ఞల కథయే ఈ ద్వారపాలకుల కథ నారాయణుడు పాదచారియై దర్శన మిచ్చుట విశేషము సామాన్యముగా గరుడ వాహనారూఢుడై దర్శన మిచ్చును అనగా శ్వాసయందు ధ్యానమున దర్శింపబడును పాదచారిగా దర్శన మిచ్చుట యనగా జీవుల రూపమున నారాయణుడు వ్యాప్తుడై యుండుట ) ఈ విధముగా విశ్వగురుడైన నారాయణుడు పాదచారియై వచ్చెను ( 538 నుండి 539 వరకుగల పద్య గద్యములలో నెక్కువ భాగము సంస్కృత భాగవతమున లేదు ఇది పోతనకవి ఆంధ్ర లోకమునకు బహూకరించిన వైకుంఠ వర్ణనము ఇట్లే గజేంద్రమోక్షము నందును, ప్రహ్లాద చరిత్రము నందును గూడ చేసెను ఇది వర్ణనపై నాధారపడిన పెంపకమే గనుక మూలాతిక్రమణము గాదు మూలమును సర్దుట, దిద్దుట పోతన మెచ్చుటను చేయలేదు )

540 ఇట్లు దిగివచ్చిన నారాయణుని చిరునవ్వు, చిగురు టాకులలో మల్లెమొగ్గలు నిలిచినట్లు పెదవి విచ్చుకొనుటయు, పలు వరుసయు అచ్చట నున్నవారికి దర్శన మిచ్చినవి వారు చూచుచు నిలబడిరి ఎంత చూచినను తృప్తి లేదు

541 వారి చూపులు అతని ముఖముననే నిలబడినవి మెల్ల మెల్లగా వారి దృష్టి అతని పాదముల వైపునకు ప్రసరించెను

ఆ పాదములు ముక్తి నివాసమునకు ద్వారములు తెరచు చున్నట్లుండెను వాని నలంకరించిన నూపుర ధ్వనులు వేదములుగా దర్శన మిచ్చెను

542 పాద నఖములు పద్మరాగముల కిరణములను వెలార్చు చుండెను వానిని చూచుచునే నమస్కరించిన వారు కూడ మరల మరల నమస్కరించి పోవుచుండిరి ఎప్పటి నుండియో వారందరును ఈ కాంతులను యోగమార్గమున వెదకుచున్నారు

543, 544 ధ్యానముగానో, తత్త్వముగానో మాత్రమే దర్శన మిచ్చున గాని, ఇట్లు కన్నులకు దివ్యమంగళ రూపములో దర్శన మిచ్చుట దుర్లభము వెలుగే పురుషుడుగా దర్శన మిచ్చిన నారాయణుని చూచి సనకాది మును లిట్లు స్తుతించిరి

## సనకాదులు నారాయణుని స్తుతించుట

545 నీ కుమారుడైన బ్రహ్మదేవుడు మా తండ్రి అతడు మాకు నన్ను, నీ రహస్యములను ఉపదేశించెను అతడు ఉపదేశించిన దివ్యమంగళ విగ్రహమును నేడు చూచి కృతార్థుల మైతిమి

( బ్రహ్మ యుపదేశము అనగా బ్రహ్మవిద్య ఉపదేశము వలన నిశ్చల ధ్యానము కుదురును అంతర్యామిత్వము బోధపడును కాని, సృష్టిలోని రూపసంపద యంతయు నారాయణుడుగా దర్శన మిచ్చుటకు నారాయణుడే సాక్షాత్కరింప వలెను రహస్యము తెలియుట బ్రహ్మవిద్య దర్శన మగుట నారాయణానుగ్రహము, లేక భాగవతము )

546 నీవు చెడ్డవారి హృదయములలో గూడ నున్నావు

కాని వారికి గోచరింపవు నిన్నాశ్రయించిన వారిని సంతోషింప చేయుటకై దయతో నీ దివ్యమంగళ విగ్రహమును దర్శనమిత్తువు ( చెడ్డవాని మనస్సున చెడ్డ భావముండును కనుక దానియం దంతర్యామిగా దేవుడు దాగియుండును అట్టివానికి చెడ్డయే యితరు లలో కనుపించును ఇతరులలో మంచిని చూచువానికి ఆ మంచి తనము తోడి రూపము లన్నియు దేవుని యందలి రూపములుగా కనుపించును ) ఇదియే నీ కరుణామయత్వము నీ మార్గము వెంట నడచుటకు నీ సద్గుణముల ననుసరింపవలెను అట్టివారు భక్తి యోగమున స్థిరత్వము నందుదురు వారి హృదయమున గల కోరికలు నీవుగా ధ్యానింపబడును గనక మాయమగును ఆ హృదయములలో నీవే యుందువు ఇట్లెరిగిన వారిని ఆత్మవిదు లందురు

547 అట్టి మహనీయులకు నీవు కానట్టి యితర కర్మము లుండవు ఇతర మనునది వారి యాదరమును స్పృశి ఎదు ఇట్లు నీ యందు తమ ధ్యానమును యోగము చేయుటయే వారి యుక్తి

548 నిన్ను కీర్తించుట వలన మనస్సున నీ వుండి కల్మషము లుండవు ఇతరుల సత్ప్రవర్తనమును మనసార ప్రశం సించుటయే నీపాద పద్మములను సేవించుట దీని రుచి తెలిసిన వారు అన్య మున్నదని తలపరు వారికి ఈ దయాగుణము అలంకార ముగా నలవాటు చేయుదువు

549 మేము తపస్సులు చేసి చేసి పాపములను తొల గించుకొంటిమి ఇంత కాల మిట్లు బ్రతికి చివరకు నీ పాదము లాశ్ర యించిన వారిని శపించితిమి ఇంతకన్న మహాపాపము లేదు చెడుమార్గమే గెలిచినది మేమె ఓడిపోతిమి ధర్మము

మా యందు లోపించినది రకము మాత్రి ప్రాప్తమైనది తప్పు తెన్నక మమ్మిమ్మా నరకమునుండి రక్షింపుము

(తపస్సు చేసి పాపములు పోగొట్టుకొను మార్గ మెప్పుడును సంపూర్ణమైనది కాదు ఉన్న పాపములను భస్మము చేయుటకు తపస్సు లావశ్యకమే కాని, తపోదీక్షలవలన పాపము చేయకుండా నట్టి స్థితి రాదు అది కావలెనన్న యోగ భగవంతుని ధ్యానమే గాని, తపస్సాధన మొక్కటే చాలదు తపస్సు చేయుట కాంక్షగలవాని కొరకే అయినను తనయందును తపస్సంకల్పమును ఇతరుల యందును భగవంతుని దయాస్వరూపముగా ధ్యానము చేసి, ఆ దయను ఇతరులయందు చూపుట నేర్చిన కావలెను అప్పుడే దుష్కర్మము నాచరింపకుండుట సాధ్యము ఇంతకాలము తాము తపస్సు చేసినది సంసార పాప మంటకుండుటకే కనుక తామిట్టి తప్పు చేసితి మని మునులు విన్నవించుకొనుచున్నారు

ఇప్పుడు తాము చేసిన తప్పు నెన్నక రక్షింపుమని కోరుచున్నారు అనగా చేసిన తప్పు రద్దుచేయుమని కోరుట గాదు ఇటుపై నిట్లు చేయకుండ తమ్మనుగ్రహింపు మనుచున్నారు

ఇందొక కథాగతమైన వస్తుధ్వని యున్నది ద్వారపాలకులును మునులును కూడ తాము తప్పు చేసితిమని భావించుచున్నారు ఇట్లు భావింతురో లేదో చూచుటకై నారాయణుడు చేసిన కల్పనమే యిది ఇరుపక్షములలో నిట్లు భావింపని వారికి నారాయణ స్మరణ మరపునకు వచ్చును తప్పెవరిది అను ప్రశ్న పుట్టినవారు నిర్ణయమునకై వెదకుదురు వారి మనస్సున తమ నిర్ణయ ముందును గాని నారాయణు డుండడు తాము జేసిన తప్పునకు నారాయణ విస్మృతి యను పతన స్థితి విధింప కుండునట్లు ప్రార్థించుచున్నారు

ఈ కథలో నింకొక రహస్య మున్నది తప్పుచేయుట, చేయకుండుట సంకల్పము ననుసరించి యుండును ఆ సంకల్పము వలన నై విస్మరణమో దుస్థితియో కలుగునుగాని, చేసిన తప్పున కెప్పుడును కలుగదు ఎంత దురాచారములు చేసిన వాడైనను మహాపాపము లాచరించిన వాడైనను నన్ను స్మరించువాడు సాధు వని తెలిసికొనవలెను అట్టి వాని పర్యవసానము శుభము గనే యుండును ' అని భగవద్గీతలో చెప్పబడినది లౌకికముగా చూచినను, ఎదుటి వానిలో తప్పు కనిపించినపుడు తనలో లోప మున్న దేమో అనుకొనుట వలన క్షేమము కలుగును ఈ రహ స్యమునే " నిందింపకుడు నిందింప బడిన వారి గణమున జేరుటకు యత్నింపుడు నేను మీ వెనుక నుండెదను " అని ఏసుక్రీస్తు ఉపదేశించెను )

550 తుమ్మెదకు పూగుత్తిపై నెంతటి యనురాగము! అందలి తేనె కొరకు తుమ్మెద యాకర్షింపబడును అట్టి యాకర్షణములోనే వాడియైన ముళ్ళను తప్పించుకొని, అది పుష్పములను సమీపించుచున్నది అట్లే విఘ్నములను జయించు నీ పాదపద్మములచే నాకర్షింపబడి మేము వచ్చితిమి (భగవద్ధ్యా నమునకు విఘ్నములను తొలగించుకొన యత్నించు వాడు దౌర్భాగ్యుడు వాని ధ్యానమంతయు విఘ్నములతో పోరాడుచు సంసారము చేయుట తోనే పొద్దు గ్రుంకును ధ్యాన మారంభిం చినచో విఘ్నములు తొలగును తాను ధ్యానించు దేవుడు తన విఘ్నములను తొలగించునను నమ్మకము లేని వానికి ఇక ధ్యాన మేమి? సనకాదులు తపస్సు చేసి విఘ్నములను తొలగించుకొను మార్గము మాని నారాయణుని సమీపించిరి అట్టి వరికి మాత్రమే ద్వారపాలకు లడ్డగించుట యనబడు విఘ్నపరీక్ష నారాయణునిచే కల్పింపబడెను )

551 నీ పాదములయందు దర్పింపబడిన ఈ తులసి ఎల్ల పవిత్రమగు చున్నది? అట్లే నీ కథయందు ఉపయోగింప బడిన వాక్కులు వానిని వినుటయు గలవారికి తమయాచవలి సమస్త కర్మలును పవిత్ర మగుచున్నవి (తులసి పవిత్రము గనుక దానితో దేవుని పూజింపవలె ననుకొనువారు మూర్ఖులు. దేవుని కర్పింప బడినది గనుక తులసి పవిత్రమని తెలియవలెను అట్లే తా నాచరించు కర్మలలో శ్రేష్ఠములైన వానినే స్తోత్రములుగా భగవంతునకు సమర్పింపవలె ననుకొన్నచో మిగిలిన వానితో తాను కుళ్ళుచుండును తన నిత్యవిధి మొదలు సమస్తము భగవదర్పణముగా నాచరించినచో వాని కర్మలన్నియు పవిత్ర మగును )

552 నీది సహజ శరీరము తమ యింద్రియముల యందు కోరిక లున్నవారి కిది కనుపింపదు అట్టి నీ దివ్య శరీరము చూచుటచే మా కన్నులీనాడు సార్థకములైనవి

( ఇంద్రియములను బాహ్యవస్తువు లాకర్షించును ఆ వస్తువులపై మనస్సున కభిప్రాయము లేర్పడును ఆ యభిప్రాయములతో బాహ్య ప్రపంచమును చూచువారు సంసారబద్ధులు తల్లి తండ్రి, అన్నదమ్ములు, భార్య, బిడ్డలు, డబ్బు మొదలగు భావములతో వారు ఇంద్రియములనుంచి చూచుచుందురు గనుక బాహ్యలోక మట్లే కనిపించును భార్య యన్నది చూచు వాని మనస్సునకు భార్యయేగాని తనకు తాను పుట్టుకతో భార్యగా పుట్టలేదు గదా! పుట్టినచో అందరికిని భార్య కావలెను కనుక భార్యాత్వము, ఆరోపింప జేసిన దృష్టి గాని సహజముగా పుట్టిన వస్తువు కాదు ఈ ఆరోపణము తొలగించుకొనుటకు భార్యలోని సద్గుణములను దేవుని కథలుగా స్మరింపవలెను అప్పుడు సహజ

శరీరము దర్శనమిచ్చును ఇంద్రియ స్పృహ విడిచిన వారికి దేవుని సహజ శరీరము కనుపించును అప్పుడే కన్నులకు సార్థక్యము ఇట్టి నారాయణుని సహజ శరీరము అతసీకుసుమాభము అని కీర్తింపబడినది నల్లవిశ పువ్వువంటి రంగు గల దేహమని యర్థము ఈ పుష్పము నల్లగా నుండును విష్ణుని సహజ శరీరము నీలవర్ణమనియు మిగిలిన రంగులు కనుపించినంత త్వరగా గనునికను రాదనియు సూచన జీవుని ఆహారాదుల రూపమున సృష్టిలోని ప్రత్యేక లక్షణములు కలవాటుపడిన వారే గాని సహజత్వము గమనించుట కలవాటు పడినవారు కారు దీని నెరిగిన వారు ద్వారపాలకులను వేరుగా జూచుట భగవంతుని మాయ )

553 అని సనకాది మునులు వాని పాద పద్మములకు నమస్కరించి స్తుతించి నిలచిరి వారిని చూచి నారాయణు డిట్లనెను

554 ఈ యిరువురును జయ విజయులనబడు నా ద్వార పాలకులు వీరు మిమ్ము గౌరవింపక నా యాజ్ఞ నతిక్రమించిరి అది యపరాధము మీరు వారికి తగిన దండనను విధించిరి అది నా కంగీకారము అంతేకాదు సేవకులు చేయు నపరాధమునకు యజమాని బాధ్యుడు మీకు నేను గౌరవింపదగిన వాడను గనుక నేను చేసిన తప్పును క్షమించి నా యందు ప్రసన్ను లగుదురు గాక ! ( తనయందు వారికి నిజముగా గౌరవ మున్నచో తన్ను మన్నించుట, తనయందు ప్రసన్నులగుట యుండదు పూజించుట మాత్రమే యుండును ఇది యెత్తిపొడుపు )

555 దేహమందు పుట్టిన భయంకరమైన కుష్ఠువ్యాధి చేత రోగియొక్క చర్మము రంగుమారి పోవును అట్లే సేవకులు

తప్పు చేసినచో యజమానులు క్షమింతురో క్షమింపక దండించు కొందురు ( జయ విజయుల దోషము వారిని శిక్షించి ప్రతిష్ఠకు లోపమని సామాన్యార్థము సనకాదుల ప్రవర్తనమున లోపముచే సృష్టి కలిపితవగు చున్నదను పేరు ఉంతరార్థము )

556 మీ జోటి తపస్సంపన్నులు సద్గుణ సంపన్నులు అగు మహనీయులు స్తోత్రము చేయుట వలన నిండిన కీర్తి యే నా వైకుంఠలోకము మీ వలన నాకు కలిగిన ఈ పవిత్రమైన వైకుంఠనామము అపవిత్ర మనస్సు కలవారి చెవులలో పడినపుడు వారిని పవిత్రులను చేయుచున్నది అట్లే కుక్కలను వండుకొని కుక్క మాంసము తిను నీచులకు గూడ చెవులలో నా నామము సోకినంతనే వారు పవిత్రులగు చున్నారు

( నాకు పవిత్రత సాధించి పెట్టినది మీరు అట్టి పవిత్రతను ఈ పాపాత్ములందరు నపహరించు చున్నారని సామాన్యార్థము మీరు సద్గుణములు నభ్యసించి తపస్సులు చేసి సొంతముగా పవిత్రత చేకూర్చుకొని నా దగ్గరకు వచ్చుటకు యత్నించు చున్నారు కనుక కోప శాపాది పతనావస్థలు తప్పవు సూటిగా నా నామము స్మరించి సకల కర్మలు నాకు సమర్పణ చేయువారు అనతి కాలముననే పవిత్రులగు చున్నారు వారికింక పతన ముండ దని యంతరార్థము సమర్పణ బుద్ధి లేక సొంతముగా ధర్మా ధర్మ నిర్ణయము చేయు వాడెంత సాధన చేసినను పతనము తప్పదు. సర్వ ధర్మములను తనయందు పరిత్యాగము చేసినవాడే క్షేమము నొందును జయ విజయుల యెడల మీరే ధర్మా ధర్మ నిర్ణయము చేసి శాపానుగ్రహ శక్తులతో నధికారము వహించిరి మీరు ప్రసన్నులు కారని వ్యంగ్యముగా స్తుతినింద రూపమున హెచ్చ రించు చున్నాడు నాకు వైకుంఠ వాసియను కీర్తి మీ వలన

కలుగుచున్నది నా నామము పాపాత్ములను పవిత్రులను చేయు చున్నది యన్న మాటలో మరియొక గూఢార్థమున్నది సనకాదులు భగవన్నామము నుచ్చరించుట తాము పవిత్రులగుటకు, తమ పవిత్రతను నిలుపుకొనుటకు వారి దృష్టిలో పాపాత్ములకు భగవంతుని సాన్నిధ్యము లభింపరాదు కనుకనే అపరాధులుగా నిర్ణయించి జయ విజయులను భూలోకమునకు పొమ్మని శపించిరి భగవంతుని దృష్టిలో తప్పుచేసిన వారికి కూడ స్థానమున్నది పాపులు భగవన్నామము నుచ్చరించినచో పాపము తొలగి భగవత్సాన్నిధ్యము లభింపవలెను లేనిచో వారి పాపములను వారుగాని మరియొకరు గాని యెట్లు తొలగింపగలరు? సనక సనందనాదులు జయ విజయుల విషయమున తప్పు చేసితిమని గ్రహించితిరి వారి దోషమును హరింపజేసి మరల తన సాన్నిధ్యము ననుగ్రహించుటకు కూడ వారికి తన నామమే గతి యని సూచ్చరించు చున్నాడు

557 నా స్థితి ఈ విధముగా మీపై నాధారపడి యున్నది మీ బోటి సాధువులకు అపకారము చేసినచో నా చేతులైన నే నుపేక్షింపరాదు ఖండించు కొనవలెను ఇక నితరులను గూర్చి మీ ముందు సందేహ మేల?

(నారాయణుని నిర్ణయము నందరు శిరసావహింతురు ఐనను అతడు తప్పన్నచో వారు తప్పనరాదు జయ విజయులను అపరాధులని తాను నిందమోపి పలికినచో సనక సనందనాదు లేమందురో యని పరీక్షించు చున్నాడు అంగీకరించినచో భ్రష్టులగుదురు నారాయణుడు సర్వజగత్తున నుండును గనుక వారందరి ఎలన తన స్థితి యున్నదని చమత్కరించు చున్నాడు జగత్తులన్నియు నారాయణుని ధ్యానించినచో మన మొక్కొక్క

రమే నారాయణులము అనుకొనుట సంభవించును నారాయణుని యందు సర్వజగత్తులు అస్తిత్వము చెందుచున్నవని ధ్యానింప వలెను. అపుడు జ్ఞానము కలుగును

సేవకులు పెద్దలయో తప్పుచేసినచో వారిని శిక్షింప వలెననియు, బాహ్యులనైన నుపేక్ష చేయరాదనియు చెప్పెను 'మీరు నా యెడల పెద్దల స్థానమున నుండ దలచితిరా? ఈ జయ విజయుల వలె బాహ్యుల స్థానమున నుంచ దలచితిరా? మీరే నిర్ణయించుకొనుడు అని సనక సనందనాదులకు హెచ్చరిక యున్నది ఇతరుల యెడల తప్పుచేసినచో నా వారిని సహింపను" అనుటలో మీ రితరులుగా నుండదలచితిరా? నా వారుగా నుండ దలచితిరా? యను ప్రశ్న యిమిడి యున్నది

తప్పుచేసిన జయవిజయులను గూర్చి శాసన నిర్ణయించుట యందరి మంచి చెడ్డలు జయవిజయుల ముఖములలో కనుపించునో లేదో పరీక్షించుట మరియొక ప్రయోజనము శరణాగతునకు తప్పొప్పుల నిర్ణయము భగవంతుని యందుండును ఏది ధర్మము అను ప్రశ్న భగవంతుని పాదముల కడ సమర్పింప బడును సర్వధర్మములను పరిత్యజించుమని భగవద్గీతలో కృష్ణు డర్జునునకు చెప్పిన చరమశ్లోక మిది యే )

558 ఉత్తమ బ్రాహ్మణుల సేవ వలన సకల పాపములు నశింప చేయు పవిత్ర గంగా జలములు నా పాదములయందు పుట్టినవి

559 అట్టి నన్ను విరక్తుడుగా తలపక ఈ లక్ష్మీదేవి సకల శుభములను, తన కడగంటి చూపులను, తన సర్వసంపదలను గొని వచ్చి నా వక్షస్థలమున చేరినది

( ఈ రెండు పద్యములలోను కడు దుర్లభమైన, లోకా తీతమైన చమత్కృతి యున్నది

1) బ్రాహ్మణ సేవ వలన పాతకములను నశింపజేయు గంగ తనపాదములయందు పుట్టెనట ఇచ్చట పొరపడినచో బ్రాహ్మణులను నారాయణునకు సేవించుట యను అర్థమువచ్చును వినయమున్నచో బ్రాహ్మణులు నారాయణుని పాద పద్మములు సేవించుట యని యర్థము వచ్చును. అందు రెండవ యర్థమే గ్రహింపగల సనకాదులు రక్షింపబడిరి ఇందును మరియొక కీలికయున్నది బ్రాహ్మణులను సేవించుట వలన తన పాదములలో పుట్టిన గంగ కింత గొప్పదనము గలిగినదని యొక యర్థము సిద్ధించుచున్నది దీనిని నమ్మిన బ్రాహ్మణుడు పతనము చెందును కొంచెము నిదానించి చూచినచో కావలసిన యర్థము సులువుగనే లభించును నారాయణుని సేవించుటలో బ్రాహ్మణులు తమ శిరస్సులతో, హస్తములతో నారాయణుని పాదములను స్పృశించు చున్నారు గాని తద్వ్యతిరేక పద్ధతిలో కాదు గదా! ఈ యర్థము తెలియుట సనకాదుల కొరకు క్లేశముకాదు గనుక వారు రక్షింపబడిరి చివరకు మిగిలిన యర్థమేమనగా గంగోత్పత్తికిని, బ్రాహ్మణ పూజనమునకును లక్ష్యములు విష్ణు పాదములు గనుక లోకమున గంగయు, సద్బ్రాహ్మణత్వము పూజనీయము లైనవని యుండలి సత్యము

2) తన్ను విరక్తునిగా తలపక లక్ష్మీదేవి సకల సంపదలతో తన్నాశ్రయించెనట ఇంతకు తాను విరక్తుడో కాడో చెప్పలేదా విరక్తుడైనచో లక్ష్మిని, సంపదలను నెట్లంగీకరించును అన్నచో ఆమె వరించెనుగాని తాను స్వీకరింపలేదు కదా! నిజముగా విరక్తుడైనచో వారింప వచ్చునుగదా యన్నచో విరక్తునకు కోరదగినది లేనట్లే వారింప దగినదియు లేదు ఈ యాశయము ప్రథమస్కంధమున నారదుడు తన పూర్వజన్మ వృత్తాంతము నందే వివరించెను

ఇదలి ప్రస్తుతాంశ మేమనగా నొక ప్రక్క సనక సనందనాదులు, మరియొక ప్రక్క జయ విజయులు నిలబడి యుండిరి అందెవ్వరు తనవారు? ఎవరితరులు? విష్ణువు వైరాగ్య స్వరూపుడైనచో నీ స దర్భమున మాటాడి కూరకుండును వారును వ ఏను కొట్టుకొని చత్తురు ఇది వైరాగ్యమని కొందరి మతము ఈ మతము ననుసరించి ఎవ్వరి యందును తప్పు పట్టవలసిన పని లేదు విశ్వగురువుగారి వైభవము సుఖముగా జరిగిపోవు చుండును లోకమంతయు నొక మరమై జీవులందరు విశ్వగురువు గారి శిష్యులై, వారిలోని తప్పొప్పుల యెడల గురువుగారు వైరాగ్యము వహించి యుండగా, చిరకాలము సృష్టియను బొజ్జ పెరుగుచుండును అట్లనుకొనుటకు వీలు కాకుండుటకే ప్రక్క నిలబడియున్న లక్ష్మీదేవిని చూపించి, " నాకును పెండ్లాము, పిల్లలు కలరు అని బెదరించుచున్నాడు మరి లోకగురు డెట్లయ్యెను? తాను కోరలేదు, లక్ష్మీదేవి సమర్పణ మానలేదు ఆమె సంపద యంతయు అతనిదే కనుకనే సృష్టి కంతటికిని దక్కినది పరమార్థ మేమనగా నా కేమియు నక్కరలేనంత మాత్రమున నేను కల్పించు కొనవని భ్రమపడరాదు కల్పించుకొనక మానను కనుకనే మీ యిరువక్షముల నడుమ కల్పించుకొని తీర్పు చెప్పుచుంటిని ఇది మీకు తీర్పుగాని, నా యభిప్రాయము కాదు నా కభిప్రాయ ముండదు కనుకనే పరాగిని తీర్పుచేయక మానను కనుకనే దిగివచ్చుట

ఈ పరమార్థమును నారాయణుడు వ్యక్తము చేయుట యనగా తీర్పుకో న్యాయాన్యాయములు, రాగద్వేషములను బట్టి ఏర్పడును అవి లేనివారికి ఏ తీరైననను ధర్మమే ప్రస్తుతము

అకారణముగా అపరాధులని నిర్ణయింపబడుట వలన జయ విజయులకు పోయిన దేమియు లేదు ఆ నిర్ణయము బాగున్నదని భావించిన వారో సనక సనందనాదులకు కలుగనది లాభము కాదు. గర్వము ఈ యిరుపక్షముల వారును ఈ పరీక్షలో నుత్తీర్ణ లగుటయే ఈ కథలోని వైకుంఠ ధర్మ ప్రతిపాదకత్వము. )

560 సద్బ్రాహ్మణులు యజ్ఞముల యందు నేతితో హోమము చేయుచుందురు అందు నేతితో కలిపిన చరువును యజ్ఞమూర్తినై భక్షణము చేయుచుందును కాని కోరికలు లేక ధర్మమవలంబించు బ్రాహ్మణుని ముఖమునుండి వచ్చు పలుకులతో తృప్తి వహించినంతగా చరు భక్షణమున తృప్తి వహింపను నిష్కాముడగు బ్రాహ్మణుని పలుకులు నాకు భక్షించుటకు చిన్న చిన్న ముద్దలైనను వాని యందే ఎక్కువ తృప్తిని వహింతును

( చరువనగా పేలముల పిండి, పాలు, నేయి కలిపి యజ్ఞ హోమము కొరకు తయారుచేయు పవిత్ర ద్రవ్యము దానితో హోమము చేసినపుడు అగ్నిహోత్రుని స్వరూపమున నారాయణుడు స్వీకరించును కాని అతడు తృప్తుడయ్యెనా లేదా ? యను విషయము యజ్ఞము చేయువాని సంభాషణలను బట్టి యుండును నిష్కామముగా యజ్ఞార్థ కర్మ చేయుచు, యజ్ఞ శాలయగు తన యింటికి వచ్చిన వారిని ప్రేమతో సంభాషించి వ్యవహరించిన వారో వారు తృప్తులగుదురు అదియే నారాయణుడు తృప్తిపడె ననుటకు నిదర్శనము

యజ్ఞములలో ద్రవ్యయజ్ఞములు, తపోయజ్ఞములు, జ్ఞానయజ్ఞములు, స్వాధ్యాయయజ్ఞములు మున్నగు ననేక విధము లున్నవి అందు ద్రవ్య యజ్ఞములకన్న జ్ఞాన యజ్ఞము

శ్రేయస్కరమని గీతలో కృష్ణుడు చెప్పెను దాని స్వరూప
మెట్లనగా యజమానుని శ్రద్ధయే చేయి సన్నిగంటియే ధాన్య
మందలి గింజ సత్కర్మయే ఆ గింజను సంస్కరించి పేలములుగా
చేయుట నిష్కామముతో కూడిన ప్రేమమయ వాగ్బ్రహ్మమే
పిండి ఒంర మందలి స్వరం పేటికచే గ్రావాణములు లేక తిరుగటి
రాళ్ళు సమర్పణ బుద్ధియే హోమము చేయుట ఇతరులలోని
అంతర్యామియే యగ్నిహోత్రుడు వారి నాలుకలే యగ్ని
జిహ్వాలు ఈ విధముగా యజ్ఞము చేయుటను బ్రహ్మ
మయమైన యజ్ఞమందురు ద్రవ్యమయమైన యజ్ఞము కన్న
వాగ్బ్రహ్మమయమైన యజ్ఞమున కెక్కువగా తృప్తి పడుదునని
నారాయణుడు చెప్పుచున్నాడు అందు తన కర్పించునవి చిన్న
ముద్దలైనను చాలుననగా మితభాషిత్వమైనను చాలునని
యర్థము

జయ విజయులు మాటాడలేదు సనక సనందనాదులు
విస్తారముగా స్తుతి చేసిరి తాను రాకముందు జయ విజయులను
శపించిరి దోషారోపణము చేసిరి దానిని ఆ పెద్దలకు
నారాయణుడు చెప్పవలసిన తీరున వ్యంగ్యమర్యాదలో చెప్పు
చున్నాడు

ఇందు మరియొక కొంటెతన మున్నది అగ్నిలో వేల్చిన
చరువనగా కోపముతో గూడిన పరుష సంభాషణ మని చిన్న
పరిహాసము నిప్పులో పోసిన హవిస్సు కన్న నిస్పృహ ధర్మ
మార్గమగు వాక్కు తన కెక్కువ తృప్తి నిచ్చునట క్రతువులు
చేసి నేతులతో భగవంతున కని సమర్పణ చేయుచు నగ్ని
గుండములలో వేల్చిన హవిస్సు కన్న, నుత్తములగు
బ్రాహ్మణుల ముఖమున భూత తృప్తిగా చేయబడిన యన్న

దానము ఒక్క కబళ మైనను తినకు నిజమైన తృప్తిని కలిగించు
నని మరియొక ఎ్కేషము మీరు నా తృప్తికై యింత శ్రమపడి
సాధన చేయుచు మరి యొకరిని ధర్మ నిర్ణయము పేర శపించుట
కన్న, తప్పు లెన్నక భూతిదయ చూపినచో, నేను సులభముగా
తృప్తి చెంది యుండెడి వాడనని సిద్ధాంతము )

561 నేను లోకమున జీవులలో ప్రఖ్యాతి చెందుట
నా యోగమాయ యొక్క వైభవము చేతనే ఆ యోగ
మాయ అడ్డులేనిది అట్టి నేనే బ్రాహ్మణుల నిర్మలములైన
పాదముల రేణువులను భక్తితో నా రత్నమయమైన బంగారు
కిరీటమునందు ధరింతును అట్టి నా పాద పద్మముల యందు
పుట్టిన జలములను ధరించి చంద్రశేఖరుడు మొదలగు మహాను
భావులు ఎప్పటికప్పుడు పవిత్రు లగుచున్నారు బ్రాహ్మణులు
తన కపకారము చేసినను ఎవడు కోపించడో యతడు వారిని
నన్నుగా భావించువాడు ధర్మ పద్ధతిలో నతడు నాకు
ప్రియతముడు

( తిన్నగా పరిశీలింపనిచో మత విముఖ సామ్రాజ్యమున
పౌరులుగా జీవించుట కలవాటు పడిన వారికీ వాక్కు లు
బ్రాహ్మణ ప్రశంస వలె నుండును అందు వలననే పురాణములు
బ్రాహ్మణులు తమ గొప్ప చెప్పు కొనుటకై వ్రాసిరని భావించు
బుద్ధిమంతులును కలరు ఈ పద్యార్థమును సూక్ష్మముగా
పరిశీలింప వలెను

1) నారాయణుడు యోగమాయ ద్వారమున మాత్రమే
జీవులలో ప్రఖ్యాతి వహించును అనగా జీవులకు దేవుడున్నట్లు
తెలియవలె నన్నచో జీవుల రూపమున తిరుగుచున్న దేవుడే గతి

దాని కతీతమైన దేవుడు ఊహాలచే జీవులు సృష్టించుకొన్నవాడు జీవులను మాత్రము ఊహాలుగా జీవుడు సృష్టింపలేడు గదా! వారిని సృష్టించుచున్నది యోగమాయ. అందు బ్రాహ్మణులను పూజించువారుందురు. బ్రాహ్మణులనగా బ్రాహ్మణ ధర్మము మూర్తిభవించిన వారు. వారిని పూజించువారిలో నారాయణు డుండును. ఐనను అవమాన మనుకొనక అతడు బ్రాహ్మణుల పాదరేణువులను శిరస్సున ధరించు చున్నాడు. కనుకనే అతని పాదములు శివునకు కూడ పూజ్యములు. హీనజీవులు అనబడు వారి రూపములతో గూడ తాను జీవించుట హానత యని దేవుడు భావించుట లేదు. బ్రాహ్మణులు శపించినను, అపకారము చేసినను ఇతరులు కోపింపరాదు. అది ధర్మపద్ధతి. దాని వలన ధర్మ మాచరించు వారికి గౌరవము నిలబడుటయు, పదిమందికి ధర్మ మవలంబించు మార్గము తెలియుటయు జరుగును.

2) ఈ సంభాషణకు నిక్కడ సందర్భ మేమి? "ఓ సనకాదు లారా! మీరు బ్రాహ్మణులు. మీరు ద్వారపాలకులపై కోపించినను నేను మీపై కోపించలేను. కోపించినచో మా వలె బ్రాహ్మణుడ నగుదును గాని, నారాయణుడ నెట్లగుదును? మీరు నిష్కారణముగా కోపించిన వారైరి. ఇంత తపస్సు చేసినది ఇందుల కేనా?" అని పరిహాస గర్భితముగా చెప్పుట పూర్వము గనుకీస్తు తన శిష్యుల పాదములు కడిగి అది పాపము పోవుట కని చెప్పిన సందర్భ మిట్టిదే.

3) నారాయణుని పాదములు కడిగిన జలము చంద్ర శేఖరుడు శిరస్సున ధరించెననగా గంగ విష్ణు పాదమున పుట్టి శివుని జటాజూటము మీదుగా భూమికి దిగివచ్చెనని యర్థము. విష్ణువు శివుడు తన రెండు రూపములే యనియు, అట్లు శిరస్సున ధరించుట

తన కవమానము గాదనియు హెచ్చరిక పాద మనగా ధర్మము
వెంట నడచుట శిరస్సనగా ధర్మమునకు విధేయత చూపుట
కనుకనే ధర్మపద్ధతి నా ప్రియతముఁడు వాఁడు' అనుచున్నాడు
ఇచ్చట పద్ధతి యనగా పత్ + హతి లేక కాలితో త్రొక్కబడిన
దారి తన ప్రవర్తనము మిగిలిన వారి కాదర్శము కాగలిగి
నపుడే దైవత్వము సిద్ధించును రాముడు, కృష్ణుడు మున్నగు
నవతార మూర్తులు కూడ తల్లిదండ్రులకు, గురువులకు, పెద్దలకు
సాష్టాంగపడి నమస్కరించుట లోకము నేర్పుకొనుటకే

ఈ పద్యమందలి యర్థ సమన్వయ మెట్లున్నది
నారాయణుని ప్రఖ్యాతి యంతయు యోగమాయా వైభవమే
అనగా సృష్టిగా కనిపించుచు నారాయణుడుగా నుండుటయే ఈ
మాయ దాటనిచో జీవస్థితినుండి దైవస్థితి లభింపదు దాటవలె
నన్నచో తరతమ భేదములు గోచరింపరాదు తానే విష్ణువుగా
పాదముల యందు గంగను ధరించెను తానే శివుడుగా ఆ పాద
తీర్థమును శిరస్సున ధరించెను దీనిని జీవులకు నేర్పుటకే బ్రాహ్మ
ణుల పాదరజస్సు మిగిలిన వారు ధరించి పవిత్రులగుట ఆ మిగిలిన
వారిని నారాయణుని రూపములుగా గుర్తుంచు కొన్నచో
బ్రాహ్మణులకు విష్ణుని పాదములు శరణ్య మగును లేనిచో తిమ
పాదములు కడుగు చున్నవారు నారాయణుని కన్న నితరులుగ
చూడ బడినచో పాపాత్ములుగా కనుపింతురు దానితో
ఆ బ్రాహ్మణులు పతితు లగుదురు

పైకి మాత్రము మరియొక విధముగా నర్థము కనిపించును
నేను నిత్యము మాయతో లోకములలో మెలగువాడను ఆ
దోషము పోగొట్టు కొనుటకే బ్రాహ్మణుల పాదరజస్సును నా
కిరీటమున ధరించుచున్నాను దానితో నా కెంతటి యున్నత

స్థితి కలుగుచున్న దనగా శివుడు మున్నగు దేవతలు గూడ నా పాదజలములను శిరస్సున ధరించుచున్నారు నా యీ గొప్ప దనమునకు బ్రాహ్మణ పాదముచే కారణము అట్టి సద్బ్రాహ్మణు లైన మీరు నా వానిని తిట్టినను తప్పు లేదు వారు వచ్చినట్లు భరింపవలసినదే ఈ సంభాషణలోనే యోగమాయ యిమిడి యున్నది ఇన్ని చేసినను మీరు బ్రాహ్మణులైనది నన్నారాధించియే కదా? అంతేగాని తపస్సులు, యాగములు చేసి కాదు కనుక నా రూపులుగా జీవుల నారాధింపనిచో మీకు గతిలేదని పరమార్థము నారాయణుడు సర్వాంతర్యామి గనుక బ్రాహ్మణులను పూజించు సామాన్య జనులలో కూడ నతడుండును బ్రాహ్మణేతరులచే పూజలందుకొనుచున్నారనగా నారాయణుడే వారి రూపమున తమ్ము పూజించుచుండెననియు, తమ పాద రజస్సులను అతడు శిరస్సున ధరించుచుండెననియు నర్థము ఇట్లు చేయుటకు నారా యణునకు స్వాభిమానము గాని కించపడుట గాని లేవు దీనిని గుర్తించుకొని మాత్రమే బ్రాహ్మణులు పూజలందుకొనవలెను తమ్మితరులు పూజింపలేదని శపించుట యనగా నారాయణునిపై నహంకరించి శపించుటకు సిద్ధపడుట ఇట్లపచారము చేసిన బ్రాహ్మ ణులను గాని, బ్రాహ్మణుల కపచారము చేసిన యితరులను గాని నారాయణుడు శిక్షించునా? అతడు శపించుట యనగా వారికి గతులు లేకుండ చేయుటయే నిజమునకు నారాయణుడు శపింపడు సకల పురాణ కథలలో ఋషులు శపించుట కనిపించును గాని దేవుడు శపించుట కనిపించదు శివుడుగాని, విష్ణువుగాని శపించిన కథలు లేవు శాపము, పరస్పర నింద జీవుల భవరోగములు దానివలన దోషము తప్పక కలుగును అవతార మూర్తులు లోక కంటకులను చంపుదురుగాని, తప్పుచేసిన వారిని చంపరు తప్పుచేసిన వారికి భగవంతుని నుండి లభించునది క్షమాపణమట,

పరిశుద్ధి చెందుట భగవంతుని సంపదను తపస్సుచేసిన వారెట్ల నుభవింతురో తప్పుచేసిన వారును అంతే యనుభవింతురు అన్న పానీయాదు లందరికిని లభించుచున్నవే కదా! ఈ విషయమున తన సంపదలయందు భగవంతుడు విరక్తుడు ఈ విరక్తిని లక్ష్యము చేయకయే లక్ష్మి యతనిని వరించెను ఆమె సంపదలు సర్వ జీవులకును సంక్రమించు ను అది యామెకు సంతోషమే కనుకనే యామె జగన్మాత ఇచ్చట సనకాదులు చేసిన తప్పును నారాయణుడు క్షమించుట కొరకే లక్ష్మితో కూడి దర్శన మిచ్చుట )

562 గోవులను బ్రాహ్మణులను, దీనులను, నన్నును భేద భావముతో చూచువారు అధోగతి పొందుదురు వారి యెడల యమదూతలు మహాసర్పములవలె విజృంభింతురు భయంకరమైన గ్రద్దలు రాబందులవలె ముక్కులతో అవయవము లను చీల్చి తిందురు (గోవులను, బ్రాహ్మణులను దీనులను తనకన్న భేద భావముతో చూడరాదు గోవు పరోపకారము నకు చిహ్నము దాని క్షీరము దాని బిడ్డకన్న ముందు మానవులు ఉపయోగించుకొనుచున్నారు కనుక గోవు పూజనీయము గోవు కన్న మానవజాతి జీవ పరిణామమున ఉత్తమ మని భ్రమ పడినను "నీ బిడ్డ కిచ్చు క్షీరమున నాకు కొంత భాగ మిచ్చెదవా? అని మానవులు మానవుల నడిగినచో తన్నుదురే గాని, క్షీర మీయరు

బ్రాహ్మణులను, దీనులను నారాయణుని రూపములుగా చూడమని చెప్పుట బ్రాహ్మణులు గర్వింపవలసిన విషయము కాదు బ్రాహ్మణ ధర్మమునకై వారిని పూజింపవలెను అనగా విద్య నేర్చుకొను స్వలాభమునకై పూజింపవలెను ఇక దీనులను

పూజించుటలో జాలి తప్ప ప్రయోజనము ఉండదు గనుక నప్పాకమ కర్మయోగ మభ్యాస మగును

యమదూతలను కృతాంత భటులు అనుట వలన యమ ఉనగా యమ మనియు, కృతాంతు ఉనగా చేసికొనిన గానికి చివర కలుగు ఫలితము రూపమున నాశొత్కించు ననియు నర్థము యమము లేనివానికి ఆహార విహారాది విషయము లుండవు గనుక రోగములు సర్పములవలె, గ్రద్దల వలె వీక తినును ఇక నను ప్రవర్తనలో హద్దులు లేకుండుట వలన శతుశ్రబాధలు, పోరాటములు, హత్యలు మున్నగునవి కూడ నూహ్యములు గోవులను బ్రాహ్మణులను, నన్నును, దినులను, భేదబుద్ధితో చూచువాడదోగతిపా లగునని చెప్పుటలో మరియొక విశేష మున్నది 'ఆత్మవ త్సర్వభూతాని' అను వాక్యమున కిది వ్యాఖ్యానము నన్నును అన్నచోట తనతో భేదము లేకుండ చూచువాడే నారాయణ ధర్మ మవలంబించు వాడని అర్థము ఇందు మరి యొకనిని శపించు బుద్ధిగలవాని కిది సాధ్యపడదు ఎదటి వానిని తనవలె చూచుకొనువాడు శపింపడు ఇచ్చట సనకాదులు శపించిరి కనుక నారాయణ ధర్మమునుండి భ్రష్టులైరని సూచన శపింపబడిన జయ విజయులను నారాయణుడు గూడ రక్షింప లేదు కనుక వారు దీనులు "దీనులను నాతో సమానులుగా చూడవలెను అని చెప్పుటలో సనకాదు లెట్లు ప్రవర్తింతురో తెలియుటకై నారాయణుడు జయ విజయులను దీనులుగా నిలిపెను

ఈ పరీక్షలో ధర్మము తప్పినవారిని కృతాంత భటులు త్రాచుపాములవలె ఎగబట్టి, గ్రద్దలవలె ముక్కులతో పొడిచి తిందురని చెప్పబడినది శపింపబడిన జయ విజయులు భూలోకమున హిరణ్యాక్ష, హిరణ్య కశిపులుగా దిగివచ్చి దీని ఫల మనుభ

విూవ చేయగలరని హెచ్చరిక ఇందు నారాయణ ధర్మమున కెవరియందును పక్షపాతము లేదు ఎవరిని స్వయముగ రక్షింపడు వైకుంఠ రాజ్యమున రక్షణ పొందుటకు రెండే మార్గములు

A ) తాము చేసికొనిన సత్కర్మ, తమతో భేదము లేకుండ నితరులను చూచుట, తమకు రక్షణ నిచ్చును చేసికొనిన సత్కర్మ ఫలము ననుసరించి ఎప్పటి కప్పుడు తగుమాత్రము రక్షణ లభించుచుండును ఇది పుణ్యకర్మ ఫలరూపమైన రక్షణము

B ) శరణాగతి చెందుట, సర్వ కర్మలను భగవదర్ప ణముగా నాచరించుట వలన భగవంతుడు స్వయముగా రక్షించును ఇందలి రక్షణము తరుగనిది )

563 బ్రాహ్మణుల అనేక విధములుగా పరాభవించి నను చిరునవ్వుతో, సంతోషముతో, పూజ్యభావముతో, సరస ములైన వాక్యములతో పొగడుచు, తండ్రిని కుమారులు ఎలుచు నట్లు ప్రేమతో పలిచిన వారు నాతో సమానులు

( ' ఇది నా పద్ధతి నా ద్వారపాలకులు మిూపు కోపించి నపుడు మిూయం దిట్లే ప్రవర్తించిరి కదా ! కనుక వారిని ద్వార పాలకులుగా చూడరాదు నన్నుగా చూచుట నేర్చుకొనుడు'' అని సగౌరవముగా నిందించుట యిందలి ధ్వని తమరు బ్రాహ్మ ణోత్తములు తాము పరాభవించినను జయ విజయులు తమ్ము భక్తితో సేవించిరి కనుక వారికి నాతో సమానమైన స్థితి యబ్బి నది తాము బ్రాహ్మణోత్తము లైనను నితరులలో నన్ను చూచుట నభ్యసింపలేదు కనుక నాకన్న నితరులుగా నిలబడిరి )

564 పుణ్యాత్ము లగు నేను ప్రియతముడనై అమ్ముడు బోవు చుందును పూర్వ మొకమారు నన్ను భృగుమహర్షి

తన్నను దానికి నేను పొందిన సంతోష మింత యని చెప్ప లేను ( ఆ సంతోషము కారణముగనే భృగువునకు కాలిలోని కన్ను పోయినది ఆ భృగువు వంశము వాడగు శుక్రునకు కన్ను పోయినది అట్లు చెప్పక సంతోషించితినని చెప్పుచున్నాడు సందర్భమైనచో మీ యెడల కూడ అట్లే సంతోషింపగలనని పరాకు చెప్పుట

పుణ్యాత్ములకు నేను తప్పక నమ్ముడు పోదునని చెప్పుటలో నెవరు పుణ్యాత్ములో చెప్పలేదు భృగుమహర్షి యుదాహరణతో బ్రాహ్మణుల కమ్ముడు పోవుదునని గాని యభిప్రాయముగా పొరబడుటకు వీలున్నది ఈ సంభాషణము భ్రాంతిని కలిగించును ఇతరులు నిందించినను, కోపింపక గౌరవించు వారికి అమ్ముడు పోవుదునని నిజమైన యర్థము ప్రస్తుతము తాను జయ విజయుల కమ్ముడు పోతినని తెలుపుచున్నాడు ఇక సనకాదుల తపస్సునకు నారాయణుడు చేయు నుపకారమేమి ? అన్నది మిగిలియున్నది జయ విజయుల కమ్ముడు పోయినవాడు సనకాదుల కేమి యుపకారము చేయును ? భృగుమహర్షి కేమి చేసెనో అదియే చేయుదునని యర్థము )

565 నా మన పద్మములోని భావము గ్రహింపలేక చెలరేగి ప్రవర్తించి నా యాజ్ఞ మీరిన దోషఫలము ఈ నా జయ విజయులకు సంప్రాప్త మైనది ( నా ధర్మస్వరూపము తెలియక మీరు అదరిపాటున ప్రవర్తింపగా ఆ దోషఫలమును జయ విజయు లనుభవించుచున్నారు కనుక నాకు వచ్చినట్టి ప్రవర్తన మెట్లుండునో తెలిసికొనుడు " అని సూచన ) నా మనస్సునకు నీతిమార్గమనగా నిదియే వీరెట్లును భూమిపై పుట్టక తప్పదు కాని అచిరకాలముననే నా సమీపమునకు వచ్చునట్లు మీ

రనుమతింపవలెను ( అనుమతించినచో మీరు అచిరకాలమున నాకు సన్నిహితులగుదురు " అని చమత్కృతి నారాయణుడు ఏ నిర్ణయమునైన చేయగలడు నిగ్రహానుగ్రహ సమర్థుడు ఐనను ఈ శాపగ్రహణము భాగుపడవలె నన్నచో జయవిజయులు భాగుపడ వలెననే మనస్సున అనుమతింపవలెను ఈ జయ విజయులు అచిరకాలమున నా దగ్గరకు వచ్చునట్లు అనుమతింప వలయును అని విష్ణువు పలుకుటలో నొక విశేషమున్నది ఎంత త్వరగా వీరు నా దగ్గరకు రావలెనని మీరు కోరుదురో అంత త్వరగా మీకు శుభము కలుగునని యర్థము అందుల కనుమతిం పనిచో జయవిజయులు చిరకాలము రాక్షసులై భూలోకమున మీ బోటి సజ్జనులను తన్నుచుందురు కనుక మీరు కష్టము లనుభవించు శా పరిమితిని మీరే తగ్గించు కొనుడని హెచ్చరిక ఈ మొత్తము సంభాషణలో సారాంశము నీ దిగువ విధమున సంగ్రహపరుపవచ్చును

1 తపస్సు చేయువారు దైవానుగ్రహమును ప్రత్యేకముగ మిగిలిన వారికన్న నెక్కువ పొందుదు రనుకొనుట పొరపాటు

2 ఎవరు ఎంత నిష్ఠతో జపతపాదులు చేసినను దాని సత్ఫలితము వారికి ప్రత్యేకముగా నుపయోగపడక లోకహితము నకు మాత్రమే యుపయోగపడును

3 తప్పులు చేయనివారు మాత్రమే మోక్షమును, దైవానుగ్రహమును పొందుదు రనుకొనుట పొరపాటు శుచి త్వము కలిగినను అహంకరించినచో దైవానుగ్రహము కలుగదు తప్పులు చేసినను భగవంతునికి తమ్ము సమర్పించుకొను బుద్ధి యలవడినచో నెంతటి పాపాత్ములైనను పవిత్రులై దైవానుగ్ర హమునకు పాత్రులగుదురు ఇక తప్పులు చేయరు దైవము

నకు శరణాగతి చెందక నేను తప్పలు చేయను అనుకొనువారు అహంకారపడి దెబ్బతిందురు

4 పెద్దలను గౌరవించు వారిలో గూడ దైవముండును గౌరవింపబడు పెద్దలయందు మాత్రమే యుండు ననుకొనరాదు పూజ్యులైన బ్రాహ్మణుల యెడ నెట్లు దైవముండునో అట్లే పూజించు వారి యెడల గూడ నుండును పూజించు నట్టి శూద్రాదుల రూపమున దైవమే అంతర్యామిగా నుండి బ్రాహ్మణుల పాదరేణువులను శిరస్సున ధరించుచున్నాడు కనుకనే విష్ణుపాదములందు పుట్టిన గంగవలె ఆ పాదము నందే పుట్టిన వినయవంతులగు శూద్రులు గూడ పవిత్రులై పాపములను హరించు చున్నారు వారి కృషికర్మ వలననే సంపద రూపమున లక్ష్మి ఉద్భవించి అందరిలో నున్న విష్ణువును వరించు చున్నది

5 బ్రాహ్మణుల పాదములను ఇతరులు పూజించి జ్ఞానులగుట, ఆ పూజించు వారిలో విష్ణువును చూచి బ్రాహ్మణు లాదరించుట అను రెండు ధర్మములు నిర్వర్తింప బడినప్పుడే జగత్తునకు క్షేమము కలుగుచున్నది అనగా విష్ణువు సంతోషించుచున్నాడు అట్లుగాక తెలిసిన వాడగు బ్రాహ్మణు డితరులపై కోపించినచో నితరులయందు రాక్షసత్వము ప్రబలి భూలోకమున హిరణ్యాక్ష హిరణ్యకశిపుల వంటివారు తయారగుచున్నారు వారు సజ్జనులను అవమానించుచు హింసించు చున్నారు ఇట్టి దుష్కర్మల వలన విష్ణుని అనుగ్రహము తప్పును గనుక నరజాతి ఆపదల పాలగును విష్ణుధర్మము ఒక దేశమునకు, ఒక కాలమునకు సంబంధించినది కాదు ఏ కాలమున నెవరు పాటించిన వారికి సుఖ శాంతులు, మోక్షము కలుగును

ఈ వాక్కులు ఎవ్వరును కాదనుటకు వీలులేని శాశ్వత

ధర్మములు గనుకను, వీనిని అవలంబింపనినాడు నరజాతి కష్టనష్ట ముల పాలగుచున్నది గనుకను, ఇదియే శాశ్వత ధర్మము లేక వేద ధర్మము దీనిని భాగవత రహస్య సర్వస్వము గా నారాయణుడు సనకసనందనాదులకు నుపదేశించెను తప్పుచేసిన వారు మరల గ్రహించి సమర్థుణబుద్ధి చూపినచో అనుగ్రహము కలుగును కనుక నారాయణుడు సనకసనందనాదులను అనుగ్రహించినట్లు చెప్పబడినది నరులలో గూడ ఇతరుల తప్పులను గుర్తుంచుకొనక వారు బాగుపడుట చూచి సంతోషించు వారి యందు నారాయణుడు అనుగ్రహము చూపును ఈ సంభాషణ మును నారాయణుని నుండి యుపదేశమందిన బ్రహ్మ దేవతలకు చెప్పెను బ్రహ్మవలన నుపదేశ మందిన నారదుడు వ్యాసునకు చెప్పెను వ్యాసుడు భాగవతముగా రచించెను దీని వివరణము నుదాహరణ పూర్వకముగా చేయుటయే యిటుపైన గ్రంథము లోని కథ యంతయు దాని కొరకే హిరణ్యాక్ష, హిరణ్యకశిపులు, రావణ కుంభకర్ణులు, శిశుపాల దంతవక్త్రులు మున్నగు వారి కథలు భాగవతమున స్థానము గొన్నవి రాజుల కథలలో ధ్రువుడు పృథుచక్రవర్తి మున్నగు రాజర్షుల కథలును, పురంజనో పాఖ్యానము మున్నగు సర్థవాదములును, ప్రహ్లాదుడు, అంబరీషుడు మున్నగు ప్రపన్నుల కథలను విస్తరింపబడినవి అటుపైన ఈ ధర్మము పరిపూర్ణమైన వారి జీవితము లెట్లుండునో తెలుపుటకై గోకులము, బృందావనము నందలి గోపకుల కథలు చెప్పబడినవి అట్టివారితోపాటు నారాయణుడు నరదేహమున భూమికి దిగివచ్చి దుష్టుల బాధ నుండి ప్రపన్నులను కాపాడుట యెట్లో తెలియ జేయుటకై కృష్ణావతార కథ చెప్పబడి, ఈ కథతో భాగవతము పూర్తియగుచున్నది )

ఇట్లు పలికిన నారాయణుని సంభాషణలు విని సనకాదులు

ఆశ్చర్యపడిరి సంభాషణ మెంత మృదులముగా నున్నదని పరవశించిరి మరల మరల ఆ సంభాషణమును గ్రోలుచు లోలోపల రోషముతో కూడ కాటు వేయబడి బాధపడిరి (సంభాషణలోని నాగరికతకు ఆశ్చర్యపడిరి కాని అందలి అర్థస్ఫురణలకు భరింపరాని బాధ ననుభవించిరి )

566 విష్ణువు పలికిన పలుకులు పరిమితములే కాని అతి గంభీరములు లోతైన వివిధ విచిత్రార్థములతో దురవగాహాములుగా నున్నవి పైకిమాత్రము మాధుర్యమను సద్గుణముచే మాటు పెట్టబడి అమృత తుల్యములుగ నున్నవి అందు శబ్దములను వేరుచేసి చూచుకొన్నచో తమ దోషములే బయటపడుచున్నవి ఆ వాక్యములతో సనకాదుల మనస్సు లూరట చెందలేదు ఎంత సర్ది చెప్పుకొన్నను ఆ పలుకులు తమయందు గౌరవముతో పలికినట్లు తోచుటలేదు మరల నాలోచించినచో అందు పొగడ్త లున్నట్లు గూడ కనుపించుచున్నవి తమ మనస్సులను మాత్రము స్నేహధర్మముతో దువ్వినట్లున్నవి ఆ పలుకులు ప్రభు విప్పుడు ఈ పలుకులను మెచ్చుకొని పలికెనా? నిందించుచు పలికెనా? మనము చేసిన జయ విజయుల దండనకు సంకోచమందెనా? ఏ భావము వహించెనో బోధపడకున్నది గదా! అని చిక్కుపడిరి

567 చివరకు తమయెడ నారాయణునకు దయాభావము వహించెనని గ్రహించి పరమానందముతో పులకించి నమస్కరించిరి ( ఇంత తపస్సు చేసినవారు ఇట్లు ప్రవర్తించుట యనగా వీరికి విష్ణుధర్మ మలవడలేదని యతడు జాలి పడెనని గ్రహించిరి లేనిచో తాము చేసిన దోషమునకు ఫలితము ద్వారపాలకులు అనుభవించుట కంగీకరించుట యెట్లు? ద్వారపాలకులకు వాని

ప్రేమమార్గ దృష్టి అంతకు ముందే కలదు గనుక జరిగిన దానివలన దుఃఖముగాని, సనకాదులపై ఈర్ష్యగాని కలుగుట సంభవము కాదు ధర్మమును మలచుటలో త్యాగముతో కూడిన యిట్టి ప్రేమమార్గ మున్నదని తెలియక సనకాదు లింతవరకును కేవల తపస్సాధన చేయుచుండిరి )

568 నారాయణుని యోగమాయ యనగా దాని స్వరూప మిట్లుండును కాబోలు ఈ మార్గమున నెంత వైభవ మున్నది! ఎంత బల మున్నది! ఎంత గొప్పదన మున్నది! ఇన్నిటి కధిపతి యగు నితడు ఈ మాయ రూపముననే మనకు వ్యక్తమగు చున్నాడు ' అని ఆశ్చర్యపడి వినయముతో నిట్లనిరి

569 "ఓ నారాయణా! నీ సౌందర్య మంతయు నిత్య వైభవమును నడపించుట యందే యున్నది పాపమార్గములు నీ దరి జేరవు మేము చేసిన పని నీకు సమ్మత మని పలికితివి నీ నడవడి లోని మర్మములను గ్రహించు టెవరికి సాధ్యము? ( సనక సనందనాదులు ద్వారపాలకులను శపించిరి అట్లు శపించుట తనకు సమ్మతమే యని విష్ణువు పలికెను నిజముగా నతనికి సమ్మతమా? అది నిజమని నమ్మునంతటి మూర్ఖులు కారు సనక సనందనాదులు కారణ మేమనగా "బ్రాహ్మణోత్తములు అవమానించినను చిరునవ్వుగ పూజ్యభావము వహించి గౌరవించినవారు నాతో సమానమైనవారు అనికూడ విష్ణువు పలికెను దీనినిబట్టి సనక సనందనాదులు శపించినను, ద్వారపాలకులు వారిని పూజించిరి గనుక, ద్వారపాలకులు విష్ణునితో సమానత్వము సాధించుకొని రనియు, సనకాదులు విష్ణు ధర్మమునకు వ్యతిరేకముగా నిలబడి రనియు విష్ణుని యభిప్రాయము ఇది స్పష్టముగా తెలియుచునే యున్నది అందువలన విష్ణుడు తమయెడల చూపిన వినయము

సత్యమని వారెట్లు నమ్మెదరు ? ఎనచో విష్ణు కట్లైల వినయముగా పలుక వలెను ? వారు తప్పు చేసినప్పుడు అది తన కభిమతమని యేల మెచ్చుకొనవలెను ? లోకమున జ్ఞానగర్వము గలవారికి వినయము నేర్పుటకే విష్ణు విట్లు ప్రవర్తించెను దీనివలన వారు సిగ్గుపడవలసి యున్నదిగాని, విష్ణుడు సమ్మతించెనని నమ్మి గర్వ పడరాదు అట్లు నమ్మినచో పతనము సంభవించును. కనుకనే విష్ణుని ప్రవర్తనము యొక్క ప్రయోజనము తెలియుట సాధ్యము కాదనుచున్నారు )

570 బ్రాహ్మణు లనగా దేవగణములయందు పూజనీయులైన దేవతలై ప్రవర్తింప వలసిన వారు అట్టి సద్బ్రాహ్మణులకు నాయకుడవు నీవు అట్టి నీకు బ్రాహ్మణులు పూజనీయులైన దేవతలని యనుచున్నావు ఏమి చమత్కారముగా మాటాడు చుంటివి? నీవు బుద్ధిమంతులను మాత్రమే రక్షించునట్టి గడుసుతనము కలవాడవని తెలియుచున్నది ( నిన్ను పూజించు వారు నీకు పూజనీయు లనుచుంటివి దీని యర్థమేమి ? గౌరవము పొందదలచినచో ముందు గౌరవింప వలెను మర్యాద యిచ్చి పుచ్చుకొనుట నేర్చుకొనుడని మందలించుటయే కదా యిందలి భావము ! )

571 నీ విట్లు ప్రవర్తింతువు గనుకనే నీ నుండి బయలుదేరిన విష్ణుధర్మము నీ యవతారముల చేత రక్షింప బడుచున్నది నీవు నిర్వికార తత్త్వమూర్తివి నీవు ధర్మము యొక్క ఫలస్వరూపము అందు రక్షింపబడు ధర్మము గూడ నీ చేతనే రక్షింపబడు చున్నది ఈ సత్యమును పెద్దలు తెలిసి కొందురు ఇక మా వలె తెలియక మెలగువారి గతి యేమి కావలెను ?

ఐనను, నీవు దయామయుడవు గనుక మేము భయపడవలసిన
పని లేదు ( తెలిసిన వారు తెలిసి కొందురు వారి స్వరూపమున
ధర్మము రక్షింపబడును తెలియని వారు భగవంతుని జాలికి
పాత్రు లగుదురు వాని సృష్టిలో తెలియక తప్పులు చేసిన వారికి
కూడ స్థాన మున్నది అట్టి వారు తెలిసికొనునట్లు చేయుటయే
దేవుని గొప్పతనము ధర్మమూర్తియైన నారాయణునకు ధర్మ
రక్షణము కర్తవ్య మగుటయే గాక, అధర్మము నెడల నిర్వికారత
గూడ యున్నది దేవుడు ధర్మమును నిలబెట్టును గాని, అధర్మ
వర్తనులపై కోపింపడు ఇతరుల కపకారము చేయు వారిని
శిక్షించును గాని, తమ ధర్మము తప్పిన వారిని శిక్షింపడు వారి
అధర్మ ప్రవర్తనము వలన కలిగిన కర్మఫలము వారిని సక్రమ
మార్గమున పెట్టును )

572 అట్టి భగవంతుని సమగ్రమైన అనుగ్రహము
పొందుట చాల సూక్ష్మమైన మార్గము దాని కెంతయో
నిష్కామ కర్మయోగము కావలెను మమ్మడ్డగించిన వారిని
మేము కోపించితిమి ఇక మాకు నిస్పృహ యెక్కడిది ? నిస్పృహ
కలవారే మునీశ్వరులు వారికి మాత్రమే మృత్యు భయ
ముండదు దానికి గొప్ప వివేకము కావలెను అదియు నీ యను
గ్రహమే నీవు సద్గుణములను గౌరవింతువు నీ వితరుల
ననుగ్రహించు వాడవు నీవు మా యనుగ్రహమును కోరు
చుంటివని పలికితివి ఇది యెంత చమత్కారము ? దీని యంతు
మాకెట్లు తెలియును? ( జీవులకు బ్రహ్మణ ధర్మమైన వివేకము
కలిగించి అనుగ్రహింప వలసిన వాడు, వారి యనుగ్రహము
కోరుచున్నానని వేడుకొనుట చిత్రము కాదా ? అతడు వినయము
చూపించుట యనగా వినయము నేర్చుకొనుడని బోధించుటయే
కదా ! )

573 నీ పాద పద్మముల రేణువులు - కోరికలు కోరి వచ్చు వారికి శిరస్సున ధరింప దగినవి నీ పాదపద్మముల యందలి కేసరముల నుండి చిందుచున్న తేనె యందలి లోభముచే భ్రమరముల వలె నాకర్షింపబడి నిన్ను జేరి అర్చించు వారు ధన్యులు అట్టి వారు నీ మెడలో తులసి దండలు సమర్పింతురు వారిచే నర్చింపబడిన నీ పాదపద్మములు భక్తితో సేవించుటయే నీ కటాక్షములను పొందుటకు మార్గము అట్లు పొందిన వారి యందు నీ యనురాగము నిలుచును నీ మహిమ అంతు పట్టరానిది (ఒకరి నొకరు గౌరవించుకొను బుద్ధి కంతు పట్టును గాని, త మ్మితరులు గౌరవింపవలె నను బుద్ధి కంతు పట్టదు గౌరవింపని వారిని శపించు బుద్ధికి మొదలే అంతు పట్టదు )

574 బ్రాహ్మణుల పాదపద్మముల పవిత్ర ధూళియే నీ దేహమున కాభరణ మంటివి బ్రాహ్మణ ధర్మము యొక్క మహిమను చాటుటకే నీ విట్లు పలుకుట (మహనీయుల పాద రేణువులను శిరస్సున ధరించునట్టి సత్త్వవర్తనము రూపమున నీ వుందువు ఆ ప్రవర్తనము కలవారినే నీవారుగా ననుగ్ర హింతువు )

575, 576 నీవు ధర్మమూర్తివి, లోకములను కల్పించిన వాడవు నీవు రక్షింపదగిన వారిని రక్షింపనిచో వేద ధర్మము చెడిపోవును అట్లు చెడిపోకుండ జీవులలో సత్త్వగుణ ప్రవర్తనము రూపమున నీ వుండి జీవులను రక్షించుచుందువు ధర్మమునకు కీడు చేయువారిని నీవు దండింతువు వేద మార్గమునకు భంగము కలిగించు ప్రవర్తనము నీకు నచ్చదు నీవు బ్రాహ్మణులయందు సత్కర్మ కలిగి వినయ వాక్యములు పలికితివి అట్టి వినయము నీకే తగియున్నది (వినయము బ్రాహ్మణ ధర్మమునకు [illegible]

మునియు, అది కలవారు తనవారనియు ఎష్ణువు హెచ్చరించెను అది లేనివారు వానినుండి దూర మగుదురని చెప్పుటయే కదా!)

577, 578 ధర్మమును పరిపాలించునట్టి నీవు వినయముగా తలవంచి పలికినచో నీ యధికారము కు లోపము కలుగునని కూడ అనలేము నీవు వినయముగా పలికియు, అధికారమునే చూపితివి లోకములను సృష్టించి, రక్షించునట్టి నీవు లోకుల యెడ వినయము చూపినను, నీవు లోకువ యగుట లేదు వినయము నీ లోక లీలయేగాని, మరియొక విధము కాదు (దేవుడు వినయము చూపుట జీవులకు వినయము నేర్పుటకేగాని, అతనికి చిన్నతనము గలిగించదు )

579 నీవు సంతోషముతో సుమ్ములను గౌరవించితివి దీని వలన మంచి వారెట్లు క్షమింతురో తెలిసినదిగాని, ఇంకొకటి జరుగలేదు (శపించి తప్పు చేసిన వారిని క్షమించి గౌరవించె ననగా క్షమించుట నేర్చుకొనుడని మందలించుటయే యైనది ) ఈ జయ విజయులను గూర్చి మే మొక విషయము విన్నవించు కొందుము

580 మేము కోపించి వీరిని శపించితిమి నీవు ను మమ్ము కఠినముగా కోపింపదలచినచో మాకదియును సంతోషమే లేదా జయవిజయులు తప్పు చేయలేదు గనుక నీవు వారిని రక్షించి నను మాకు సంతోషమే

581 అట్లు రక్షించుటయే మా కెక్కువ ఇష్టము వారియందు దేయపరాధము లేదు వారి హృదయములు నిర్మలములు అట్టి వారిని మేము అధర్మ మార్గమున కోపించితిమి మమ్ము నీవెంత కఠినముగా ఆజ్ఞాపించినను సంతోషమే దానికి మేము

సిద్ధముగా నున్నాము అని సనక సనందనాదులు నమస్కరించి నిలబడిరి వారిని కరుణాయుత దృష్టితో చూచి, విష్ణు విట్లనెను

582 ఓ మునులారా! వీరు భూమికి పోయి భూలోక మున రాక్షసులై జన్మింతురు లోభ మోహాములతో కూడి జీవింతురు

583 దేవతల కపకారము చేయుచు, లోక భయంక రులై జీవింతురు నాయందు వైరము పెంచుకొందురు

584 యుద్ధమున న న్నెదిరించి పోరుదురు నా చక్ర ముచే నరుకబడి తిరిగి నా సన్నిధికి వత్తురు (అసురగుణములు కలిగియున్నను, నాతో వైరము పెట్టుకొన్నను, నన్ను స్మరించు చున్నచో నా దగ్గరకే తిరిగి రాగలరనియు, మరచినవా రేమరు పాటుచే దెబ్బతిందురనియు భావము వైరము పేర నన్ను స్మరించుచున్నను తప్పు లేదుగాని, తపస్సు పేర గర్వించి నన్ను మరచుట మంచిది గాదని భావము )

585, 586 వైరముతో నైనను నన్ను మనస్సున వీరు నిరంతరము స్మరించుచుందురు యుద్ధమున నా సాన్నిధ్యమున నా మొగము చూచుచు, దేహములను వదలుదురు కనుక వీరు నా స్థితియందే వర్తింతురు

587 ఇక భూమిపైన వీరికి పుట్టుక లేదు వీరిని గూర్చి మీరు దుఃఖపడ నక్కర లేదు

588 ఈ జయవిజయులను గూర్చి మీరు విచారింప కుడు అని విష్ణువు పలుకగా సనక సనందనాదులు వాని భావము గ్రహించిరి మనస్సు తేటపడి తెలివొందిరి విష్ణుని స్తుతించిరి

(జయవిజయులకు లోభమోహాదులు కలిగిన జన్మములు భూమిపై నుద్దేశింప బడినను, దాని వలన నష్ట మితరులకే గాని, వారికి కాదు దేవతలకు బ్రాహ్మణులకు వారివలన బాధలు కలుగును ఎట్లనగా జయవిజయులు భూలోకమున విష్ణువైరముతో బాధలు పెట్టునది సనక సనందనాదుల వంటి బ్రాహ్మణులనే గాని, విష్ణువును కాదు దానితో కేవలము తపస్సు, శపించుట మాత్రమే బ్రాహ్మణ ధర్మము కాదని లోకమునకు ప్రకటన మగును నిజమైన బ్రాహ్మణ ధర్మము మరల భూమిపై నుద్ధరింప బడును. పని పూర్తియైన పిమ్మట జయవిజయులు విష్ణువు చేతినే సంహరింపబడి తిరిగి వైకుంఠమునకు పోవుదురు ఇచ్చట విష్ణునితో వైరము, విష్ణుని చేతిలో భూలోక దేహములను కోల్పోవుట, జయవిజయులకు విష్ణుని క్రీడయే గాని, పతనము కాదు నాటకమున వేషములు మార్చినట్లు జగన్నాటకమున విష్ణునితో పాటు తాము పాల్గొనుటయే )

589 నారాయణుని సంకల్పములోని ధర్మ మంతయు కన్నులకు గట్టినట్లైనది సనకాదులకు పులకాంకురములును, ఆనంద బాష్పములును కలిగినవి వారిట్లనుకొనిరి "ఆహా! ఇతని మార్గములు లెక్కల కందని కనుకనే దేవతలు గూడ వీని మార్గము వెంట నడచుచున్నారు ఈ మొత్తము ధర్మ వ్యూహమే యితని దివ్యమంగళ శరీరము దీనినుండి యెవడును తప్పించుకొనలేడు ఇతని నుండి వెలువడుచున్న ధర్మముయొక్క వెలుగే ఇతని నివాసమైన వైకుంఠము ఎంతటి మునీశ్వరులైనను ఇతనికి శరణాగతి చెందనిచో గతిలేదు '

590 ఇంతకును తాము పలికిన సంభాషణములు గూడ తుదకు విష్ణుని సంభాషణములే యని సనకాదులు గ్రహించిరి

తా మింత ధర్మబద్ధముగా తుదకు నిర్ణయము చేయగల్గుట యనగా తమలో పనిచేసిన విష్ణుని వైభవమే కారణము ఈ వైభవము వాని నాశ్రయించుకొని యున్న లక్ష్మీదేవియే ఆమె దయవలననే తమకు సద్బుద్ధి కలుగుటయు, తనవారుగా విష్ణునిచే స్వీకరింపబడుటయు జరిగినది

( తాము చేసిన తప్పునకు నారాయణుడు తమ్ము శపించినను సంతోషమే లేక జయవిజయులను శాపమునుండి తప్పించి రక్షించినను సంతోషమే. జయవిజయులు తప్పుచేయలేదు వారు నిర్మల మూర్తులు అనిక గా సనకాదులు చివర కంగీకరించిరి మొదట శపించిన సనకాదులే తుద కిట్లంగీకరించి రనగా వారికి జ్ఞానోదయ మయ్యెనని యర్థము ఈ జ్ఞానము లక్ష్మీదేవి యనుగ్రహమున కలిగెను అనగా విష్ణుని సంకల్పము వలన కలిగెను )

591 సనకాదులు లక్ష్మీదేవిని గూడ కోరార స్తుతించి విష్ణుని దగ్గర సెలవు దీసికొని తమ నివాసములకు పోయిరి అప్పుడు నారాయణుడు చిరునవ్వుతో జయవిజయుల వంక జూచి ఇట్లు పలికెను

592 "మీరు రాక్షస గర్భములయందు పుట్టుట యెట్లను తప్పదు నా సంకల్పమున కడ్డులేదు నా బలము నెవ్వరును వారింపలేరు ఐనను, బ్రాహ్మణుల మాటలను నేను తిరస్కరింపలేను

593 కనుక మీరు రాక్షస గర్భములందు పుట్టుచు నాకు శత్రుపక్షమై మెలగుడు వైరము కారణముగా మీ రెప్పుడును నన్నే తలచుచుందురు కనుక నాచేతనే దేహములను కోల్పోయి నా దగ్గరకే వచ్చెదరు పోయిరండు,

(తాను సర్వశక్తి సంపన్నుఁడయ్యును, బ్రాహ్మణ వాక్యమును వారింప లేనని పలికెను అనగా వారించుటకు సామర్థ్యము లేదని గాదు లోకములను పరిపాలించుటకు తనొక ధర్మము నిలిపినపుడు దానిని తానే భంగము చేయరాదు వ్యక్తులు తప్పొనర్చినచో వారిని దండించటయో, సర్దుబాటు చేయుటయో మార్గముగాని వారి మూలమున లోక పరిపాలన విధానము భంగపరచుట మార్గము కాదు ఒకరిని న్యాయస్థానమున న్యాయాధికారిగా నిలిపినపుడు అతడు చేసిన తీర్పును రద్దుచేయరాదు చేసినచో చట్టము పాటించువారెవ్వరుండరు ఈ ధర్మమును పరిపాలించుటను బట్టియే రాజ్యాంగము ప్రజలను రక్షించుటయో, రచ్చచేయుటయో జరుగును ధర్మము దైవస్వరూపము అది ఎవరి బంధుత్వములను బట్టిగాని, రాగద్వేషములను బట్టిగాని మారదు మార్చదలచువారు పతనము చెందుదురు ఒక వ్యక్తియైనను, ఒక ప్రభుత్వమైనను, ఒక జాతియైనను, ఈ పతనము తప్పదు దైవము శాశ్వత ధర్మమును రక్షించుచుండును ఈ శాశ్వత ధర్మము మానవులకు బ్రాహ్మణ క్షత్రియ ధర్మముగా రాజ్యాంగ రూపమున వ్యక్తమగుచుండును బ్రాహ్మణులపై కోపము వచ్చినంతమాత్రమున నెవ్వరును దీనిని మార్చలేరు బ్రాహ్మణులు గూడ ధర్మము తప్పినంత మాత్రమున దీనిని మార్చలేరు వారును, వీరును భ్రష్టులగుట మాత్రము జరుగును కనుకనే నారాయణుడు సనకాదుల శాపమును వారింపగల సమర్థుడయ్యును, వారింపక గౌరవించెను దీనివలన ద్వారపాలకులకు వచ్చిన నష్టము లేదు సనకాదులకు కలిగిన లాభము లేదు భూలోకమున మాత్రము ధర్మఘర్షణము పుట్టును దానివలన అధర్మము పై కుబుకుటయు, జీవులకు బాధలు కలుగుటయు, ఆ

బాధల రూపమున నెవరి శిక్ష వా రనుభవించుటయు తుదకు ధర్మము నిలబడుటయు జ ుగను )

594 ఇట్లు ఆర్పు చెప్పి వారిని సాగనంపి లక్ష్మీదేవితో నారాయణుడు వెనుకకు మరలగా, ఇంద్రాది దేవతలతస ధర్మ స్వరూపమున కాశ్చర్యపడి, యతని పాద పద్మము లకు వరుసగా మ్రొక్కిరి వారి కిరీట కాంతులచే లక్ష్మీ నారాయణుల చరణ కమలములు వెలుగొందెను లక్ష్మీ నారాయణు ల మహా వైభవముతో తమ నిర్మల నివాసమును జేరిరి

595, 596 ఆ సమయమున జయవిజయులు తమ తేజస్సును గోల్పోవుచు భూమిపై పడిరి మూడు లోకములును గడ గడ లాడి పోయెను రాక్షసుల విజయ నములు గుంపులుగా తిరిగెను అంతంత హాహాకారవములు చెలరేగెను ( నారాయణుని ద్వార పాలకులు రాక్షసులై పుట్టుట యనగా రాక్షస లోకములకు చీకాకు కలుగుటయే ఇన్ని లోకము లను జీవుల దేహము లు, మనస్సు, ఇంద్రియములు మున్నగు వాని నుండియే వెలువడు చుండును రాగ ద్వేషములు, కామ క్రోధములు, క్రౌర్యము, అధర్మబుద్ధి, అవినీతి మున్నగు లక్షణముల సముదాయమే రాక్షస లోకము ఈ లక్షణము లన్నియు దైవ గుణములతో ఘర్షణము బొంది, మరల మరల దైవధర్మమునే స్థాపించుటకు తోడ్పడు చుండును దైవసృష్టిలో వినికిని స్థాన మున్నది అసురత్వము గూడ దేవతలతో కలబడి యొక్క ధర్మమును స్థాపించుటకు సహకరించు చున్నది అని వేద మంత్రములు చెప్పుచున్నవి

ప్రతి జీవికిని తన లోపల, తనకు వెలుపల యను లోకము లుండును ఈ రెండిటికిని నడుమ ద్వారమ వద్దనే దేవాసురులు

ఘర్షణ పడుచుందురు ఈ ద్వార పాలకులే జయవిజయులు ఈ ఘర్షణకు గలుగు పరిణామము వలననే జీవుడు ధర్మము నేర్చుకొనుట జరుగును )

597 అట్లు భూమిపై పడిన జయవిజయులే ప్రస్తుతము దితి గర్భముం పెరుగు చున్నారు వారి ప్రభావమే ఈ నల్లని తేజస్సుగా వ్యాపించి, మీ తేజస్సులను మరుగుపరచినది

598 ఇప్పటికిని మూలము లక్ష్మీనారాయణుల సంకల్పమే అది నారాయణునకు క్రీడ అతడాచరించు కార్యము లలో నిట్టివి జరుగుట మన కేమియు క్రొత్త కాదు అతనికి మొదలు, చివర యను భేదములు లేవు సృష్టి స్థితి లయములకు నాయకుడతడు ఎల్లెప్పుడు నతడు దయా స్వరూపుడు కనుక మీకు మేలు కలుగునట్లు సంకల్పించును మీ సంకల్పము నెరవేరును దుఃఖపడ వలదు పోయి రండు

599 ఈ విధముగా బ్రహ్మ తెలిపిన వృత్తాంతము విని దేవతలు అందరి ధర్మ స్వరూపమును గ్రహించి, స్వర్గమునకు మరలి పోయిరి ఇచ్చట కశ్యపుని భార్యయైన దితి తన భర్త పలికిన పలుకులను స్మరించు చుండెను తన గర్భమున లోక కంటకులు జన్మింతురని విని యున్నది గనుక సంతోష పడక బాధ పడుచుండెను

( పూర్వము దితికి గర్భము కలిగిన సమయమున కశ్యపు డిట్లు చెప్పి యుండెను " భద్రుడు, అనుభద్రుడు అను నిద్దరు రుద్రానుచరులు నీకు పుత్రులై పుట్టుదురు లోకములకు పీడ కలిగింతురు "

ఇప్పుడు బ్రహ్మ చెప్పిన వృత్తాంతము ప్రకారము విష్ణుని ద్వారపాలకులైన జయ విజయులు దితి గర్భమున పుట్టబోవు చున్నారు

ఈ రెండు వృత్తాంతములలో నేది సత్యము అను శంక కలుగ వచ్చును నారాయణ లోకమునుండి జయవిజయులును, రుద్రలోకమునుండి భద్రానుభద్రులును అంశలుగా దిగి వచ్చి, దితి గర్భమున పుత్రులై జన్మింప నున్నారు అందు జయ విజయులు సత్త్వగుణ సంపన్నులు భద్రానుభద్రులు రజోగుణ సంపన్నులైన ఉగ్రమూర్తులు వారి కలయిక లేనిచో జయ విజయులకు రాక్షసత్వము లేదు ఒక జీవి పుట్టునపుడు వానిలోని గుణములు వివిధ లోకములకు సంబంధించి యుండును మంచి గుణములు దైవ లోకము నుండియు, చెడ్డ గుణములు అసుర లోకముల నుండియు, దిగి వచ్చి సంక్రమించును ఇంను రుద్ర లోకము వలన నుగ్రగుణములు, వైకుంఠ లోకము వలన నిరంతర దైవస్మరణయు కలిసి యుండును అందు మొదటి దాని వలన అధర్మ పీడయు, రెండవ దాని వలన ధర్మసంస్థాపనము జరుగును)

600 తన సుతులు దేవతలను బాధింతురని దితి దుఃఖ పడుచుండగా నూరు సంవత్సరములు గడచెను ఆమె గర్భమున నిద్దరు సుతు లుద్భవించిరి

601, 602 వారు జన్మించు సమయమున భూకంపము కలిగినది కులపర్వతములు కంపించెను సముద్రములు పొంగెను చుక్కలు రాలెను ఆకాశము బీటలు పడినట్లు ఉరుములు, మెరపులు కలిగెను దిగ్గజములు మ్రొగ్గెను దిక్కుల యందు మబ్బుల నుండి మిణుగురుల వంటి నిప్పులు పుట్టెను

603 హోమము యందలి అగ్ని చల్లారి పొగ యణగి పోయెను వాయువులు ప్రతికూలములై అప్రదక్షిణముగ వీచెను పెనుగాలులు చెలరేగెను చెట్లు పెల్లగించు కొని యడ్డ దిడ్డము లుగా దారులలో కూలెను గ్రహములు, తారకలు కాంతి తగ్గి కనిపించెను మబ్బుల నుండి రక్తము వర్షించెను పూర్ణిమ గాని, అమావాస్య గాని లేకుండగనే రాహువు సూర్యుని గ్రహణము పట్టెను పగలు చీకట్లు కనిపించెను కుక్కలు మెడలెత్తి మొరిగెను నక్కలు గుంపులుగా కూత పెట్టెను దీనాలాపములు వినిపించెను దేవతా ప్రతిమలకు కన్నీరు కనిపించెను కొన్ని ప్రతిమలు పడిపోయెను

604 ఆవులకు పాలు పితుకు నప్పుడు చీము, నెత్తురు వచ్చెను ( పశువులకు ప్రాణాంతికములైన మారి మొదలగు రోగములు కలిగెనని యర్థము ) గాడిదలు కూయుచుండగా ఆ శబ్దము భయంకరముగా వినిపించెను ఏనుగుల మద మారి పోయెను గుర్రముల తోకలకు నిప్పంటుకొనెను

605 గుహల నుండి ఏవో మహాశబ్దములు వినిపించెను శుభగ్రహములు కూడ వక్రించి, పాప గ్రహములతో మైత్రి చేసెను

( బుధుడు, గురువు, శుక్రుడు శుభగ్రహములు కుజ, శనులు పాప గ్రహములు శుభ గ్రహములు వక్రించి, పాప గ్రహములతో సమాగమము ( CONJUNCTION ) చెంది యుండగా వారు జన్మించిరని యర్థము )

606 సమస్త జీవులును భయముచే కంపించి పోయెను అది ప్రళయకాల మని జీవులు భావించిరి అంతే కాని, కుంచి వారికి బాధ కలిగించువారు జన్మించు సమయ మని ఎవ్వరును

భావింపలేదు సనకాది మునులు మాత్రము వృత్తాంతమును గ్రహించి, భయపడక నిలబడి చూచిరి

607, 608 పుట్టిన బిడ్డలు కుల పర్వతముల వంటి కఠిన శరీరములు కలవారు రాక్షస ప్రభువులు కాబోవు లక్షణములు కనిపించెను వారు పాదములతో తన్నుచుండగా భూమి యదరుచుండెను వారి నుండి బంగారు కాంతులు వెలువడుచు కుండలములు, కేయూరములు, రతనములు యుంగిరములు, కిరీటములు, మంజీరములు ధరించినట్లు తళ తళ లాడు చుండిరి

609 కశ్యప మహర్షి వచ్చి మందిరమున గల తన సుతులను చూచెను నామకరణము చేయ నెంచెను

610 దితి గర్భమున తన తేజముతో పుట్టిన పుత్రులలో నొకనికి హిరణ్యాక్షు డనియు, మరి యొకనికి హిరణ్యకశిపు డనియు పేరుపెట్టి కశ్యపుడు మరల తన తపోవన పుణ్యభూమికి వెడలిపోయెను

611 ఆ రాక్షసు లిద్దరును పెరిగి పెద్దవారైరి హిరణ్యకశిపుడు తపస్సు చేసి, బ్రహ్మ వలన వరములను పొంది, గర్వించి మెలగెను శత్రువుల గర్వ మడచి, అడ్డులేని పరాక్రమముతో విజృంభించెను లోకపాలకు లందరిని జయించి, వశపరచుకొని సంతృప్తితో మెలగెను తన కెందును మృత్యువు లేదని నమ్మి నిర్భయుడై చరించెను వాని సోదరుడ హిరణ్యాక్షునకు భయంకరముగా పోరాడుటకు తొందర మెత్తిన ఏనుగు వలె గదా దండమును భుజముపై ధరించి వీర విహారము చేసెను తన్నెదిరించి గదాయుద్ధము చేయు వారికై వెదకి, భూలోక మంతయు తిరిగెను ఎవ్వరును లేరని గ్రహించి, స్వర్గముపై దండెత్తెను దేవతలు తనతో

యుద్ధము చేయుట కిష్ట పడక, ప్రక్కకు తప్పకొనిరి అతడు మెడలో వైజయంతిక యనబడు పుష్పహారము ధరించి స్వర్గ సింహాసనము సమీపించు చుండగా వాని కాలి యందెలు ఘల్లు మనుచుండగా, వాని దేహము నుండి కాంతులు వెలువడెను మిత్రులు సంతోషించి చెలరేగిరి శత్రువులు కలతపడి పారి పోయిరి గరుత్మంతుని జూచి పారిపోవు సర్పములవలె, దేవత లందరును తమ తమ నివాసములు ఎడిచి పారిపోయిరి దేవతల నివాసములు జన సంచారము లేక, అచ్చట జిల్లేళ్ళు, ఉమ్మెత్తలు మొలచి పెరిగినవి

612 హిరణ్యాక్షుడు మేరు పర్వతము వంటి రూప ముతో ధైర్యమున నిలబడి పరికించెను దేవత లందరు శౌర్యము విడిచి తమ ఆయుధములను గూడ విడిచి, పౌరుషము విడిచి పారి పోయిరి తమ తమ పనులు మాని మాయమైరి అది చూచి హిరణ్యాక్షుడు కోపముతో గర్జించి, మహాదర్పముతో సముద్రము పైకి దండెత్తి పోయెను ( ఇచట సముద్ర మనగా ప్రళయ జలముల సముద్రము దీనిని గూర్చి ఇంతకు ముందు వివరింప బడినది )

613, 614 అచ్చట వరుణదేవుని మహా సైన్యము లన్నియు వాని తేజస్సునకు తట్టుకొనజాలక మాయమైనవి

615 ఆ రాక్షసుని నిశ్వాసముల గాలినుండి పుట్టిన అలలను అతడు గదా దండముచే శమింపజేసి దృఢమైన శక్తితో నిలువెను

616 అతడు సముద్ర గర్భము ప్రవేశించి అనేక సంవ త్సరములు వీరవిహారము చేసెను కనిపించిన శత్రు సైన్యము

లను కనిపించినట్లు చీల్చి పురోగమించెను అచ్చట వరుణదేవునిచే పరిపాలింప బడుచున్న విభావరి యను పట్టణ మన్నది అందు ప్రవేశించి, దానియందు నిండి దాగియున్న వరుణుని చూచెను (అనగా కరగి నీటి రూపమున దాగియుండెను)

617, 618 అతనిని హేళన చేయుచు నిట్లు పలికెను 'మీ లోక పాలకులు లోకమున పేరు పడిన వారుకదా! వారందరిలో నీవు బలవంతుడవని, శూరుడవని చెప్పుకొనుచున్నారు నన్నెదిరించి పోరాడగలవా? పోరాడినచో నీ శౌర్యము సంగతి తేలిపోవును నీ వైభవమును, పేరు ప్రఖ్యాతులను మట్టుపెట్టెదను యుద్ధమునకు సిద్ధపడుము అని పలుకగా విని, వరుణుడు ఆలోచించి చూచెను శత్రువుయొక్క బలము, తన బలము నిర్ణయించి చూచుకొనెను

619 ఇది యుద్ధమునకు సమయము కాదని గ్రహించెను ఓర్పుతో మంచి మాటలు ప్రయోగించి, హిరణ్యాక్షుని కోపాగ్నిని చల్లార్పదలచి యిట్లనెను

620 నేను యుద్ధము మాని శాంతిని నమ్మియున్నవాడను నేనిపుడు యుద్ధము చేయుట కంగీకరింపను ఐనను నీ బాహు బలమున కెదురు లేదు నిన్నెదిరించి నిలబడగలిగిన వాడు విష్ణుమూర్తి యొక్కడే

621 నీవు వైకుంఠపురమునకు పోయినచో నతడు కనుపించును అతడనేక పర్యాయములు యుద్ధము చేసి, శత్రువులను జయించెను అతడింతవరకెన్నడు నెవ్వరి చేతిలో నోడిపోలేదు పోరుటలలో నతడు యుక్తిపరుడని లోకము లన్నియు స్తుతించును నీ వచ్చుటకు పొమ్ము అతడు నీ కోరిక తీరునట్లు సమస్తము సమకూర్చగలడు

633, 634 అతని కన్నులు పద్మము రేకలవలె నుండెను కోపలు దేరిన కన్నులతో రాక్షసుని వంక నొక ప్రక్కగా జూచెను చూచిన క్షణముననే వాని శరీరకాంతిని తన లోనికి హరించెను

(ఇందొక అర్థవాదమైన యితిహాస మిమిడియున్నది రాక్షసుడు నా కెదురు లేదు అనుకొనుచుండెను వరాహ మూర్తి నేనున్నాను" అను వెలుగు లోనికి రాక్షసుని వెలుగు నాకర్షించెను జీవుని యందను నేనను ప్రజ్ఞకలదు ఇక దేవు డనగా నేనను ప్రజ్ఞగా నందరిలో నిమిడి యున్నాడు జీవుని లోని యీ ప్రజ్ఞ నహంకార మందురు దేవునిలోని ఈ యంత ర్యామి ప్రజ్ఞను పరబ్రహ్మ మందురు దేవుని దర్శించు వరకే జీవుని యహంకారము పనిచేయును ఆటుపైన అది దేవునిలోని కాకర్షింపబడును ఈ రహస్యము హిరణ్యాక్షుని యీ కథా ఘట్టమున విన్యాసము చేయబడినది)

635, 636 రసాతలమున ఆదివరాహమూర్తి ఎదురు లేని వీరవిహారము చేయుచుండెను వానిని వారింప గలవారు లేకుండిరి తన మెడ కులపర్వతములకు రాచుకొని, దాటిపోవు నట్లుగా వరాహమూర్తి రాచుకొని పరువెత్తు చుండెను బ్రహ్మాండ భాండము పగిలి చిల్లులు పడునట్లు కోరలతో విసరు చుండెను ఏడు సముద్రములు బురద లగునట్లు గిట్టలతో మట్టించు చుండెను సూర్యచంద్రులు ఒక మూలకు పోవునట్లుగా కురుచైన వాలము త్రిప్పుచుండెను గునగున పరుగెత్తుచు కుప్పించుచుండెను లంఘించుచు గిట్టలకొన త్రివ్వుచుండెను రాక్షసుని జూచి మెల్లగా యుద్ధమునకు సిద్ధమగుచుండెను ఆ దృశ్యము చూచి, రాక్షసుని గుండెలు తల్లడిల్లెను

637, 638 ఆ వరాహమూర్తి కన్నులనుండి నిప్పులు రాలుచుండగా కోరల చివర భూదేవిని నిలిపి, హిరణ్యాక్షుని పై పునకు పరుగెత్తుచుండెను అడవిలో తిరుగు నీ పంది యిపుడు జలములలో తిరుగుట వింతగా నున్నది

639 అని ఆశ్చర్యపడుచు, భయము చెందిన హిరణ్యాక్షుడు వరాహమూర్తితో నిట్లనెను

640 ఓరీ మూర్ఖా! నీ వెవడవు? అడవిపంది రూపముతో తిరుగుచున్నావు బ్రహ్మవలన నేను వరములను పొందితిని ఆ వరముల ప్రకారము ఈ లోకము లన్నియు నా కధీనములై వర్తించును ఈ పాతాళము కూడ నా కధీనమే

641 నీ వీ భూమిని గొని యెచ్చటకు పోవుచున్నావు? ఈ భూమి నాది విడిచి పెట్టుము లేనిచో నీ ప్రాణములు గైకొందును నా మాట వినుము నాతో పట్టుదల యెందులకు?

642 నీ వెవరో మాయావివలె నున్నావు లేనిచో దొంగతనముగా భూమిని గొనిపోవుటకు యత్నింతువా? నా బాహు బలముతో నిన్నణచెదను గాని, భూమిని గొని పోనిత్తునా?

643 నీవు విష్ణుమూర్తివి కాబోలు యోగమాయపై నాధారపడిన నీ పౌరుష మెంత? నీ వెంత? నిన్నొక చోట స్థిరముగ పాతి నా మిత్రులకును భృత్యులకును సంతోషము కలిగింతును నా గదాదండము దెబ్బకు చితికిపోయిన నిన్ను జూచి, దేవత లందరు మొదలు నరకిన వృక్షములవలె నశింతురు '

ఈ మాటలు విని యజ్ఞవరాహమూర్తి తన కోరలపై భూదేవిని నిలిపి తేరిపార చూచెను ఈ రాక్షసుని వలన బ్రహ్మ మొదలగు దేవతల కెంత దురవస్థ కలిగినదో గమనించెను

644 హిరణ్యాక్షుని మాట లంకుశముల వలె తాకగా కోపించిన వరాహామూర్తి భూదేవితో నీటినుండి వెలువడెను భయపడిన ఆడ ఏనుగును వెంటబెట్టుకొని వచ్చుచున్న గజేంద్రుని వలె వరాహామూర్తి యొప్పారెను

645 వాడియైన కరుకైన తెల్లని కోరలతో సముద్రము నుండి వెలువడి యజ్ఞవరాహామూర్తి వచ్చుచుండగా హిరణ్యాక్షుడు వాని వెంట పడెను

646 ఏనుగు వెంట పడిన మొసలివలె వరాహామూర్తిని వెన్నాడుచు రాక్షసుడిట్లు నిందలు పలికెను

647 "నీకు తిట్టినను పౌరుషము లేదు సిగ్గు మొదలే లేదు నీవు వంచకుడవు యుద్ధము చేసి జయించెది నని తలచితివి ఇప్పుడు పిరికిపందవలె పారిపోవుచుంటవి నీకు శౌర్య మున్నదా? నీకు పట్టుదల యున్నదా?

648, 649 ఇట్లు హిరణ్యాక్షు డాక్షేపింపగా కోపించి, వరాహామూర్తి సునాయాసముగ భూదేవిని జలముపై నిలిపెను దాని కాధారముగా తన ఒలము నామెయందు నిలిపెను దేవత లందరును సంతోషించిరి

650 అతనపై పుష్పవృష్టి కురిపించిరి దేవ దుందుభులు మోగెను గంధర్వులు గానము చేసిరి అప్సరసలు నర్తనము చేసిరి

651 అప్పుడు వరాహారూపుడైన విష్ణుమూర్తి బంగారు కుండలములను, హారములను, కేయూరములను, కంకణములను, అంగుళీయకములను ధరించి యుద్ధ సన్నద్ధుడయ్యెను వాని ఆభరణముల కాంతులు గగనమున నిండెను

652 చేతిలో పెద్ద గద ధరించి, రతనములు తాపిన బంగారు కవచము దాల్చి నిలబడెను. రాక్షసుడు పలికిన నిందా వాక్యములు వాడియైన బాణములవలె గుచ్చుకొన్నవి. అతడు కోపించి, మహాశౌర్యమున విజృంభించి, రోషముతో భయంకరాకారము దాల్చెను.

653, 654 రాక్షసునితో నిట్లనెను "ఓరీ! అమంగళము లాచరించు మూర్ఖుడా! నీకు పొగరెక్కినది. నే నడవిలో తిరుగు నట్టి జంతువు నని భావించుచున్నావు. బలవంతుల మని యనుకొని పరుగెత్తి వచ్చు నీ బోటి కుక్కలను వధించుటకు నే నడవి జంతువు రూపమును ధరించిన చాలును. యుద్ధమున మాత్రము పారి పోకుండ నిలబడుము.

655 సామర్థ్య మున్నచో నెదిరించి యుద్ధమున నిల బడుము. నీ కోరికలను నేడు తీర్చెదను. అంతే గాని నిన్ను నీవు పొగడు కొన్నచో నేమి ప్రయోజనము?

656 యుద్ధవిద్యలో వివేకము గలవారు, ఆరితేరినవారు చాలామంది వచ్చిరి, పోయిరి. వారందరును నీవలనే మృత్యువు పాశములతో బంధింపబడిరి. వారిలో నెవ్వడును ఆత్మస్తుతి చేసికొని సంతోషింప లేదు. నిన్ను నీవు పొగడుకొన్నచో అది యుద్ధపౌరుష మగునా? (ఆత్మ సర్వాంతర్యామి. దానికి తన్ను తాను పొగడుకొనుట యుండదు. ఆత్మస్తుతి అహంకారమునకు సాధ్యమగును. అహంకారము మన సున్నంత వరకే యుండును. మనస్సు దేహ మున్నంత వరకె యుండును. అందును నిద్రలో కూడ నుండదు. కనుక అహంకార మను రాక్షసుడు మృత్యు పాశములచే బంధింపబడి యుండును.)

657 నీవీ పాతాళమున వెలుగుచున్న ధనపుపాతువలె

దాగియున్నావు నిన్ను నేను దర్పముతో స్వీకరించెదను నన్ను సిగ్గులేనివా డంటివి ఇచ్చట దాగియుండియే నీతో యుద్ధము చేసెదను నీ గదతో నన్ను చిదుకగొట్టెద నంటివి నన్నెది రించి చూడుము నీ కోరికలు తీర్చెదను

(ప్రతి జీవియందును నేనను నహంకార ప్రజ్ఞ యొక్క ధనపుపాతు వంటిది దానియందు భగవంతుడు దాగియే యుండును అతడు దానిని స్పృశించి, వశము చేసికొనును అనగా తనదిగా చేసికొనును

హిరణ్యాక్షుడు దేవుని సిగ్గులేనివ డనెను సిగ్గు, అభిమానము అహంకారమునకు సంక్రమించు లక్షణములు అవి దేవుని యాదు వర్తింపవు కనుక దేవుడు సిగ్గులేని వాడే దేవుడు దాగి యుండి యుద్ధము చేయుదు ననెను అనగా ప్రతి జీవి యందును అహంకారము వెనుక దాగియుండి, దానిని పోగొట్టుటకై అహంకారముతో యుద్ధము చేయుచుండును

నన్నెదుర్కొన్నచో నీ కోరికలను తీర్తును అన్నమాట కర్థమే మనగా నేనను పేరుతో అహంకార ముండి, ఈ దేహము మొత్తము నాది యనుకొనును ఆ యహంకారము లోపలనే నేనను పేరుతోనే దేవుడు దాగియుండును రెండును ఎదురుపడి నప్పుడే అహంకారము నశించును దేవుడు మిగులును ఇచ్చట "సోఽహమస్మి, బ్రహ్మాహమస్మి అను మహావాక్యములకు వివరణ కథగా మలచబడినది )

658 నీవు కాల్బలముల సైన్యము లన్నిటికిని నాయకుడవు కావచ్చును నీకు మిక్కిలి శౌర్య ముండవచ్చును నన్ను యుద్ధమున నెదిరించిన క్షణముననే నీ బలమును, ఆయువును నేను

స్వీకరింతును ఇటుపైన భూమిపై రాక్షసులు లేకుండ చేసెదను నా పరాక్రమము, విక్రమము లోకములకు తెలియగలదు

( 1 నీవు కాల్బలములకు నాయకుండవు అనగా, నడచు నట్టి జీవు లన్నియు నహంకారముచే నడుపబడు చున్నవని యర్థము

2 ఇటుపైన, భూమిపైన రాక్షసులు లేకుండ చేసెదనన్న మాట కర్త మేమనగా పృధ్విత త్త్వములో చేయబడిన శరీరము నందెచ్చటను భగవంతుని అంతర్యామిత్వమే యున్నదను జ్ఞానము స్థాపింప బడును ఇక నహంకారమునకు తావుండదు

3 విష్ణుని పరాక్రమము అనగా తన కన్న వేరుగా కనిపించదు సృష్టిని తానుగా నాక్రమించుట అహంకారము కల వానికి తాను తన కన్న వేరైన ప్రపంచము కనిపించును దానిని విష్ణు వాక్రమించిన వెనుక అన్నిటియందు తానే నిండి యుండును గాని, తన కన్న వేరైన దేదియు నుండదు ఇదియే పరాక్రమ మను మాటకు విష్ణుపరమైన మంతార్థము )

659 నన్నెదిరింప గలిగిన శౌర్యము, ధైర్యము, బలము గలిగినచో యుద్ధమున నిలబడుము నీ హితులైన వారికి కన్నీరు కలుగకుండ వలె నన్నచో వెనుదిరిగి పారిపొమ్ము ఊరక పేలెద వేలకి నీవు అధమ జాతి రాక్షసుడవు

( ఎదిరించినచో నీవుండవు లేదా నీ వారితో సంబంధ ములు త్రెంచుకొన నిష్టపడనిచో వెనుదిరిగి పొమ్మని యర్థము సర్వము నందును దైవమే దర్శన మిచ్చినపుడు చుట్టరికములు బంధములు తెగును అట్లు కాక, బంధువుల మిత్రుల కన్నీరే ముఖ్యమైనచో అహంకారమును బ్రతుక నిచ్చును అనగా జీవి

దైవ దర్శనము చేయుట కిష్ట పడడు అట్టి వాడు సంసారి యనబడు నధమ జాతికి చెందును ఈ జాతికి చెందినవారే యొకరి నొకరు పరుషముగా వ్యవహరించుట, మాటలు పేలుట చేయు చుందురు )

660 నన్నిచ్చట స్థాపించెద నంటివి నిజముగా నీవంత వాడవే నాతో యుద్ధము పెట్టుకొంటివి గనుక యిక తిరిగిపోవు నీ చుట్టములను చూడవలెనని యున్నచో ముందే పోయి చూచి రమ్ము ఇటు పైన చూడవు

( అహంకారము దేవుని కెదురు వచ్చినచో తిన స్థానమున దేవుని స్థాపించుకొనును జీవులలో దేవుని స్థాపించుకొన గల శక్తి అహంకార మొక్కటే కనుక నే విష్ణుని ద్వారపాలకులలో నొకడైన హిరణ్యాక్షుడు జీవులలో అహంకారముగ స్థాపించుకొని యున్నాడు అతడు దేవునితో వైరము పూనుట ఈ జీవుల హృదయములలో దేవుని అంతర్యామిత్వము స్థాపించుటకే కారణ మగును

యమపురి అనగా యమము అనబడు సద్గుణము దాని చేతిలో అహంకారము చనిపోవును చనిపోక ముందే చుట్టరికము లను, వాని ముచ్చటలను కనుక నే యుద్ధమునకు ముందే చుట్టములను చూచుకొనుమని వరాహమూర్తి హెచ్చరించు చున్నాడు )

661 ఇట్లనేక విధములుగా వరాహమూర్తి హిరణ్యాక్షు నితో మర్మములను, పరిహాసములను పలికెను దానితో రాక్షసు నకు రోషము, మదము పెరిగెను అతడు గుర్రుమని, తోక తొక్కిన నల్లత్రాచు వలె నెదురు తిరిగెను

662 కోపముతో నిట్టూర్చుచు దేహము కంపింపగ మనస్సు చికాకు పడగ గద ధరించి సాహసముతో విష్ణుని కెదురు నడచెను

663, 664 అతడు నిర్లక్ష్యముతో గద గిరగిర త్రిప్పి, వరాహమూర్తిపై విసరెను దానిని లెక్కచేయక చేతితో పట్టుకొని వరాహము తునాతునకలు చేసెను రాక్షసుడు కోపముతో వెర్రెత్తి మరియొక గద విసరెను

665 అదికూడ తన్ను తాకుచున్నట్లుగా విష్ణువు పట్టుకొని త్రుంచివైచెను ఈ వరాహమూర్తి గదా యుద్ధమున నెంతటి హస్తలాఘవము కలవాడు! అని రాక్షసుడు మెచ్చుకొనెను వరాహమూర్తి ఆ రాక్షసుని గుండెలపై గుద్దెను అతడు తెలివితప్పి పడిపోయెను మరల తెలివిచెంది రాక్షసుడు విష్ణువును గుద్దెను

666 ఇద్దరును తలపడిరి ఒకరినొకరు జయించు పట్టుదల పెరిగినది ఉత్తర దక్షిణములనుండి రెండు సముద్రములు ముందునకు వచ్చి యొకదాని నొకటి ముంచెత్తుటకు అలలు పెచ్చుపెరుగుచున్నట్లుండెను రెండుమదపు ఏనుగులు రోషముతో నొకదాని నొకటి తొండములతో బాదుచున్నట్లుండెను రెండు పెద్దపులులు భయంకరముగ తలపడినట్లుండెను మదించిన రెండు గిత్తలు రంకెలు వైచుచు కుమ్ముకొనుచున్నట్లుండెను

హిరణ్యాక్షుడు ఎడమ ప్రక్కగా గిరుక్కున తిరిగి వరాహమూర్తిని పట్టుకొనబోయెను వరాహము కుడిప్రక్కగ గిరుక్కున తిరిగి తప్పించుకొని పిడుగువంటి గదాదండముతో మోదెను రాక్షసుడు తెలివితప్పి పడిపోయి మరల తెలివంది తన గదతో

వరాహమూర్తి నుదుకు బ్రిద్దలు కొట్టెను దేహములు నెత్తురు కారుచుండగా నిద్దరును పూచిన అశోక వృక్షములవలె పోరుచుండిరి గాలికి అశోక వృక్షములు రెండు విడిపోవుచు కలసి కొనుచున్నట్లు వారిద్దరును దూరముగ పోయి మరల పరుగెత్తు కొని వచ్చి కలబడుచుండిరి ఒకరి రక్తమొకరు వాసన చూచుచు, తిరస్కార సంభాషణములతో, పరిహాసములతో మరల మరల పోరుచుండిరి ఆ మహాబలవంతుల యుద్ధము చూచుటకై మునీంద్రులతో, సిద్ధులతో, సాధ్యులతో, దేవగణములతో చతుర్ముఖుడు వచ్చి నిలబడెను భూదేవికి రక్షై రాక్షసునితో నింతటి యుద్ధము జరిగిన దని యాశ్చర్యపడెను

( భూదేవి నిమిత్తమై పోరువచ్చుట యనగా జన్మ కారణముగా శరీరమును అహంకార మాక్రమించును అంతర్యామిగా భగవంతు డాక్రమించును వానితో నహంకారము చేయు యుద్ధమే హిరణ్యాక్షుడు వరాహమూర్తితో చేయు యుద్ధము )

667 రాక్షసునితో పోరాడుచున్న వరాహమూర్తితో బ్రహ్మ యిట్లనెను నీవు దివ్యమూర్తివి పరమాత్మవు ఇతడు పాపాత్ముడు రాత్రులయందు చరించు రాక్షసుడు నేనిచ్చిన వరముల గర్వముచే మదించి లోకములను బాధించుచున్నాడు విపరీత ప్రవర్తనము గలవాడు వీనిని వెంటనే చంపక యీ విధముగ చెలగాటమాడుట నీకు తగదు వీనిని బలి చేసినచో భూదేవికి శుభము కలుగును

(నక్తంచరు డనగా అజ్ఞానమను రాత్రియందు చరించువాడు అతడే యహంకారము అతడు కూడ బ్రహ్మసృష్టిలోని వాడే కనుక అహంకారమునకు గల సామర్థ్యము లన్నియు బ్రహ్మచే దత్తములైన వరములే వానిని బలిచేసినచో భూదేవికి శుభమగు

ననగా అహంకారము తొలగినచో దేహము ధరించిన వానికి జన్మము శుభ మగునని యర్థము )

668 పిల్లవాడు చేతితో భయంకరమైన సర్పమును పట్టుకొని ఆడుకొనునట్లు నీ వి రాక్షసుని చంపక అభివృద్ధి చేయుట మంచిదికాదు

669, 670 ఇపుడు అభిజిత్ అనబడు మంచి ముహూర్తము జరుగుచున్నది రాక్షసుని చంపుట కిదియే అనుకూలమైన వేళ ఇటుపైన సంధ్యాకాలము సమీపించిన కొలదియు రాక్షసునకు బలమెక్కువ ఇతడు మాయా బలము కలవాడు సంధ్యాకాలము సమీపించు కొలదియు రాక్షసుని సంహరించుట కష్టమగును కనుక వెంటనే వీనిని జంపి, సజ్జనులకు హితము చేయుము ”

( బ్రహ్మసృష్టి యనబడు కాలము అహోరాత్రముగా భావింపగా వరాహమూర్తి భూమి నుద్ధరించిన కాలము మిట్ట మధ్యాహ్నము వంటిదని 6 వ సంపుటము చివర వివరింపబడినది సాయంసంధ్యలో దితిగర్భము ధరించి చీకటిని సంతతిగా బడసెను దీనినిబట్టి హిరణ్యాక్ష హిరణ్యకశిపుల కథ ప్రతి కల్పము నందును జరుగు చుండుననియు, బ్రహ్మకు రాత్రివంటి దనియు తెలియుచున్నది జీవులలో బ్రహ్మ ఆత్మ స్వరూపుడుగా ప్రకాశించు చుండును బ్రహ్మయందును, జీవులయందును, పరమాత్మ రూపుడుగ నారాయణు డుండును అతని కజ్ఞానమంటదు బ్రహ్మరూపుడైన ఆత్మకుగూడ నంటదుగాని వాని నుండి సృష్టింపబడు మనసు, ఇంద్రియములు, బుద్ధి అనువానికి అహంకార రూపముగ దితి సంతతి సోకును కాని ఈ యహంకారము లోపల వాసుదేవుని రూపమున నారాయణు డుండును

గనుక మరల అహంకారమును అంతము చేసి తన యస్తిత్వమును స్థాపించును ఇదియే వరాహావతార కథ ఇది జరుగుట జీవి ప్రజ్ఞకు మిట్టమధ్యాహ్నము వంటిది అనగా తన్ను తాను తెలిసి కొను దర్శనము కనుక నే దీనికి సంకేతమైన మధ్యాహ్న కాలమున మన దేహములకు క్రీనీడ యుండదు అటుపైన సాయంకాలము సమీపించు కొలదిని క్రీనీడ మనకన్న పెద్దదిగా పెరుగుచుండును ఆత్మ దర్శనము చేసినవానికి అహంకార ముండదు గనుక చీకటి పెరుగదు )

671 బ్రహ్మ యిట్లు పలుకు చుండగా నేమి జరుగునో యని దేవతలందరు గుంపులు గూడి చూచుచుండిరి బ్రహ్మ పలుకులు వినుచు, వరాహమూర్తి చిరునవ్వుతో రాక్షసునకు అభిముఖముగ నడచెను

672 పద్మముల వంటి వరాహమూర్తి కన్నులు రోషముతో యెర్ర కలువ రేకుల వలె మారినవి అతడు గద యెత్తి రాక్షసుని ముట్టెపై భయంకరముగ మోదెను రాక్షసుడు యుక్తిగా తప్పకొనెను

673 తప్పకొని భయంకరముగ గద త్రిప్పి, వరాహ మూర్తి చేతిపై కొట్టెను వరాహమూర్తి చేతిలో నున్న గద యెగిరి సముద్రమున బడెను

674, 675 విష్ణువు నిరాయుధు డయ్యెను దేవతలు హాహాకారము చేసిరి హిరణ్యాక్షుడు మాత్రము ధర్మమును పాటించి నిరాయుధునితో యుద్ధము చేయక నిలబడి చూచు చుండెను

676 అతని మహా శౌర్యమునకు, యుద్ధ ధర్మబుద్ధికి నారాయణుడు మిక్కిలి యాశ్చర్య పడి సంతోషించెను

677 ఆ వరాహమూర్తి వెంటనే రాక్షసుని సంహరించుటకై తన చక్రాయుధమును స్మరించెను అది సమస్త భూచక్రమును పరిపాలించుచు ప్రత్యక్ష మయ్యెను

678 భయంకరమైన సూర్య మండల జ్వాలలతో ప్రకాశించుచు చక్రము తన జ్వాలల వలన శత్రు బలముల గర్వాంధకారమును పారద్రోలెను దాని శబ్దమునకు సముద్ర ఘోషలు వెనుక బడినవి సకల దేవతలు నమస్కరించి స్తోత్రములు చేసిరి చక్ర కాంతులతో బ్రహ్మాండము లోపలి భాగ మంతయు నిండెను అట్లు ప్రత్యక్షమైన చక్రము వరాహమూర్తి కుడిచేతి వ్రేలి నలంకరించెను అతడు చక్రధారియై నడచుచుండగ గగనమున దేవగణములు జయ జయ శబ్దములు చేసిరి

679 చక్రము ధరించి తన కెదురు నడచుచున్న విష్ణుని చూచి, హిరణ్యాక్షుడు శౌర్యము వికువక ధైర్యముతో భయంకరమైన గద ధరించి, ఎదురు నడచి కొట్టెను

680, 681 ఆ గదను కాలితో తన్ని చిరునవ్వుతో పురోగమించుచు, వరాహమూర్తి రాక్షసునితో నిట్లనెను

682 "పెద్ద గద ధరించి బాహు బలముతో నన్ను యుద్ధమున నెదిరింప వచ్చితివా! రమ్ము నీ కర్మ లేదనుకొంటివా! అనుచుండగనే మరల రాక్షసుడు మరియొక గద విసరెను గరుడుడు సర్పమును పట్టుకొనునట్లు వరాహమూర్తి ఆ గద పట్టు కొనెను

683 తన బలము వరాహామూర్తి బలము ముందు చాలదని తెలిసి కూడ హిరణ్యాక్షుడు పట్టుదలతో పెనగు లాడెను

684, 685 మృత్యుదేవత నోటి నుండి వెలువడుచున్న నిప్పుల వలె మంటలు గ్రక్కుచున్న శూలమును వరాహ మూర్తిపై విసరెను సద్బ్రాహ్మణునకు చేతబడి చేసినచో నెట్లు వ్యర్థ మగునో అట్లా శూలము వరాహామూర్తిని తాకక వ్యర్థమై పోయెను విష్ణుని చక్రముచే శూలము తునిగి పోయెను ఇంద్రుని వజ్రాయుధము దెబ్బకు గరుత్మంతుని రెక్క తునిగి నట్లు చక్రము దెబ్బకు శూలము తునిగినదని దేవతలు సంతోషించిరి

( వజ్రాయుధము దెబ్బకు గరుత్మంతుని రెక్క తునగ లేదు ఒక ఈక మాత్రము ముాడినది ఇచ్చట చక్రాయుధముచే మిక్కిలి కష్టముతో రాక్షసుని శూలము కొంత మాత్రమే విరిగినదని యర్థము ఇది రాక్షసుని సామర్థ్యము తెలుపుటకు చెప్ప బడినది )

686, 687 తన శూలము చక్రముచే భంగపడుట గమనించి, రాక్షసుడు మహా రోషముతో విష్ణువును పిడికిటితో గుండెపై పొడిచెను పుష్పమాలతో కొట్టబడిన మదపు టేనుగ వలె విష్ణువు దర్పించి చిరునవ్వు నవ్వెను

688 రాక్షసుడు అనేకములైన మాయా స్వరూపము లను పుట్టించెను దుమ్ము రేగి, భూచక్రము కనుపింపకుండ మాటుపడెను మేఘములు క్రమ్మి మహాక్షోభము కలిగించుచు భయంకరముగ రాతి బండలను వర్షించెను మలమూత్రములను వర్షించెను కుళ్ళిన నెత్తురు, మాంసము, ఎముక ముక్కలు వర్షించెను నారాయణుడు ఊరక చూచుచుండెను

689, 690 రాక్షసుని మాయవలన ఆకాశము నుండి భూతములు, పిశాచములు, ఢాకినులు గుంపులు గుంపులుగా వచ్చి నిలబడెను ఒక్కొక్కరే జుట్టు విరియబోసికొని, వస్త్రములు ధరింపక నిలబడిరి భయంకరమైన కోరలు, వికృతముగా తెరచిన నోళ్ళు, మెరయుకన్నులు గలిగియుండిరి అట్టివా రాయుధములను ధరించి చతురంగబల సమేతులై మీదిమీదికి వచ్చిరి

691, 692 యజ్ఞ స్వరూపుడగు వరాహామూర్తి చూచి చూచి మాయా సంహారక మగు సుదర్శనమును ప్రయోగించెను

693 ఆ చక్రమునుండి పుట్టిన కిరణములు భూచక్రము నందు నిండి, మాయా చక్రమును మాయము చేసెను దాని నంతటిని చూచి రాక్షసుడు నిశ్చేష్టుడై నిలబడెను

(భూచక్ర మనగా భూగోళము కాదు భూగోళము ఘనీభ వించుటకు కొన్ని వేల సంవత్సరములు ముందుగ ఆకాశమున నేర్పడు నొక సుడిగుండము అందు మొదట వాయువులు ఘనీభ వించి, అగ్ని వెలువడి చక్రముగా నేర్పడును అందుండి మరికొన్ని వేల సంవత్సరములకు కరగిన లోహబిందువు వలె ద్రవపదార్థ మేర్పడును అది ఘనీభవించి భూగోళ మేర్పడుటయే వరాహ మూర్తి భూమి నుద్ధరించిన కథ భూగోళ మేర్పడిన తరువాత కూడ దానిచుట్టును భూచక్రముండును దాని వలననే భూమికి కేంద్ర మేర్పడి పనిచేయుట దాని ఆకర్షణ శక్తి తిరుగుచు పని చేయుచుండుట, భూగోళమందలి రేణువులు విడిపోకుండ నిలబడి యుండుట జరుగును జీవులలో వేరువేరుగా అహంకారశక్తి పనిచేయు చుండుట వలన దీనికి భంగము కలుగును అదియే భూచక్రము మాటుపడుట, ధూళి రేగుట మున్నగు రాక్షస

మాయలు అహంకార దృష్టితో చూచినచో దేహములన్నియు ఎముకల పోగులగా, మాంసపు ముద్దలుగా, నెత్తుటి గూళ్ళుగా, మలమూత్రాదుల నివాసములుగ కనుపించును ఈ లోకము నందలి యితరుల యాకారములు వేరువేరుగ కనిపించును వారు పరస్పరము పొందుసట్టి రాగద్వేషములు, పోరాటములు, పశ్చాత్తాపములుగ, వరి యాయుధములుగ గోచరించును జీవులలోని యహంకారమను రాక్షసుడు సంహరింప బడినపుడు మాయ తొలగును అందరియందు నారాయణు డొక్కడే కనుపించును అప్పుడు మాటుపడిన భూచక్రము మరల గోచరించును )

694, 695 ఇచ్చట యుద్ధము జరుగుచుండగా దితిదేవి గమనించుచుండెను తన భర్త పలికిన పలుకులు సత్యమయ్యె నని గ్రహించుచుండెను యుద్ధమున జయాపజయము లెట్లుండునో యని ఆమె తలచుచుండగా ఆమె స్తనముల నుండి రక్తబిందువులు వెలువడెను ఇక హిరణ్యాక్షుడు చనిపోవునని ఆమె నిశ్చయించుకొనెను

696 విశ్వాసము లేని వాని కెన్ని యుపకారములు చేసిననేమి? వ్యర్థమై పోవును అట్లే తాను ప్రయోగించిన రాక్షసమాయలు విష్ణుని యందు వ్యర్థమై పోయెనని రాక్షసుడు గ్రహించెను అతడు వరాహమూర్తిని సమీపించి, రెండు చేతుల చాచి, పొడిచి విష్ణుని వక్షస్థలమును పీడించెను నారాయణుడు తప్పించుకొని నిలబడగ రాక్షసుడు పిడికిలితో కఠినముగ పొడిచెను లెక్కచేయక వరాహమూర్తి రోషముతో వానిని పట్టుకొనెను వాని నడుముపై గుద్దెను ఆ దెబ్బ పూర్వము వృత్రాసురుని ఇంద్రుడు వజ్రముతో కొట్టి చూపనంతటి దెబ్బ ఆ దెబ్బకు హిరణ్యాక్షుడు గిరగిర తిరిగిపోయెను కొంతసేపు కన్నులు

కనుపించలేదు మరల నెట్లో తట్టుకొని యెదుట నిలబడెను. కాని, ఏమియు చేయలేక లొంగి నిలబడెను

697 లొంగిన దైత్యునకు వరాహమూర్తి భయంకరుడై కనుపించెను అతని గోరులలో నెందరు శత్రు రాక్షసులు చిక్కి చనిపోయిరో యనిపించెను బ్రహ్మాండము లన్నియు వాని నడుము చుట్టు నిమిడిపోయి యున్నవా యనిపించెను

698, 699 అప్పుడు వరాహమూర్తి వజ్రకఠోరమైన తన హస్తముతో రాక్షసుని చెవుల వెనుక భాగమున మొత్తెను రాక్షసుని కన్నులలో నెత్తురు చిమ్మెను పెనుగాలికి కూకటి వేళ్ళతో పెల్లగించుకొని విరిగి పడు మహా వృక్షము వలె రాక్షసుడు నేల కూలెను ఇంద్రాదులు సంతోషించిరి

700 నేలపై బడి బుస బుస నెత్తురు గ్రక్కుచు, గ్రుడ్లు మీదికి రాగా పండ్లు బిగించి, రాక్షసుడు కట్టె వలె నీలిగి చచ్చెను

701 అతని వికృత రూపము చూచి బ్రహ్మాది దేవతలు నిశ్చేష్టులైరి ఇత డిట్టి దురవస్థ పొందుట యెందులకో యని బాధపడిరి

702 వా రిట్లనుకొనిరి మహా యోగీంద్రులు యోగ మార్గములలో నారాయణుని తమ మనస్సులలో నిలుపుటకై సాధన చేయుదురు ఈ సాధనకై తమ లింగ శరీరము తొలగించుకొనునంత వరకు శ్రమ పడుదురు అట్టి నారాయణుడే స్వయముగా వీనిని చేతితో కొట్టెను ఇతడు నారాయణుని ముఖమును దర్శించుచు ప్రాణము విడిచెను ఇంత దుర్మార్గుడు కూడ

దుర్లభమైన స్థితి పొంది దైవ సాన్నిధ్యము చేరెను ఇతని పుణ్య మెంతటిది?

( నారాయణుని తమ హృదయములలో నిలుపుటకై సన్మార్గమున సాధన చేయు యోగీంద్రులు తమ్ము గూర్చి తమకు తెలిసిన విషయములను పూర్తిగా విడిచి పెట్టవలెను అప్పుడు కాని వారి లింగ శరీరము బద్దలై నారాయణుని సాన్నిధ్య మేర్పడదు ఈ సాధన మెంత కష్టము! ఎట్టి సాధన లేకుండ దుర్మార్గుడై లోక కంటకుడై ప్రవర్తించిన రాక్షసుని చూచుటకు నారాయణుడే స్వయముగా దిగివచ్చెను తన చేతితోనే కొట్టి దేహమును విడిపించి, తన సాన్నిధ్యమును తానే కల్పించెను అనుగ్రహ మనగా నట్టిదే దీనికి చేసిన సాధనతో సంబంధము లేదు దేవతలు ఇంత మాత్రమే భావించిరి గాని, హిరణ్యాక్షుడు జయవిజయులలో నొకడని మరచి పోయిరి వెంటనే ఆ విషయము స్మరణకు వచ్చి నంతనే మరల సమాధానపడిరి )

708 వీడు నిజముగా రాక్షసుడు కాడు విష్ణుధర్మము లోని సమానత్వమును సాధించుకొని, మునీంద్రుల శాపమునకు కూడ బాధపడక నీచ జన్మము ధరించి యున్న జయవిజయు లలో నొకడు ఇతనిని చంపుటకు నారాయణుడు స్వయముగ రాకుండుట యెట్లు? వీడెచ్చట ఏ స్థితిలో నున్నను, నారాయణ స్మరణకు దూరము కాలేడు ఈ ద్వారపాలకు లిద్దరకును జనన మరణములు లేవు ''

( జీవులలో తమకు లోపల, వెలుపల యనబడు ప్రజ్ఞలుగా వీరు పని చేయుచుందురు అట్టి వారే దేహములలో నున్నను జనన మరణములు లేవు అట్లే హిరణ్యాక్ష హిరణ్యకశిపుల యందును )

704 ఇట్లాశ్చర్యపడి దేవతలు హిరణ్యాక్షుని సంహరించిన వరాహమూర్తిని జూచి యిట్లనిరి

705, 706 నారాయణా! ఈ లోకములలోని జీవుల మర్మములు నీ కొక్కనికే తెలియును నీయం దీర్ష్యతో పగబట్టిన హిరణ్యాక్షుని చంపి, లోకమునకు శుభములు చేకూర్చితివి అని స్తుతించి నమస్కరించి వారందరను విధేయత చూపిరి ( జీవులు పుట్టుట, చచ్చుట మాత్రమే యితర జీవులకు కనుపించును అంజలి కార్యకారణ సంబంధము, దాని మర్మములు తెలియవు వానిని తెలిసినవాడు జీవులలోని అంతర్యామి యగు నారాయణు డొక్కడే కనుక, శిక్షించుట, అనుగ్రహించుట యను విషయము లను గూర్చి తాము జోక్యము కలిగించుకొనరాదని తెలిసి దేవతలు వినయపడిరి ఇతరుల యహంకారము యొక్క దుష్టత్వమును భరించుట కష్టమే కాని, దానిని చూచి భరించునది చూచువాని లోని అహంకారమే గాని చూచువాడు కాడు. అహంకారమును తొలగించుటయే నారాయణుని య ను గ్ర హ ము అదియే హిరణ్యాక్ష వధగా దేవతలకు ప్రదర్శింపబడినది దా ని ని గ్రహించుట వలన దేవతలు వినయము చూపిరి )

707, 708 యజ్ఞ వరాహమూర్తి యిట్లు దేవతలకు శత్రువైన యహంకారమును సంహరించిన విధానము చూచి దేవత లందరు చేసిన స్తోత్రమునకు నా రా య ణు డా త్మ లో సంతోషించి అందరను ప్రసన్నమైన దృష్టితో చూ చెను

709 వారియందు తన యనుగ్రహము చూపి, అతడు వైకుంఠమున కేగెను అది జీవులకు మహోత్సవ సమయమని తెలియుటకై దేవ దుందుభులు మ్రోగెను భూదేవిపై పుష్ప వృష్టి కురిసెను యజ్ఞకుండములలో నగ్నిహోత్రములు వెల

గొందెను సూర్యచంద్రులు తమ సహజ కాంతులను పారల గైకొనిరి.

[ సమస్త దేవతలు తమతమ సృష్టి కర్తవ్యములను తాము నిర్వర్తించుచుంటి మని భావించినప్పుడు అహంకారము క్రమ్మెను అదియే చీకటి ఈ చీకటి దితి గర్భము కు నెలలు నిండసరికి సర్వలోకము లందును వ్యాపించిన దనియు, వారు భయపడి చతుర్ముఖ బ్రహ్మను శరణు జొచ్చిరనియు నింతకు ముందు చెప్ప బడినది (చూ III - 497 నుండి 501 వరకు )

ఆ చీకటి యిప్పుడు హిరణ్యాక్షుని వధతో తొలగి పోయినది దేవతలు తమ యహంకారము తొలగించుకొని వరాహమూర్తిని మరల సృష్ట్యాదిగ దర్శింపగలిగిరి కనుకనే సూర్యచంద్రులు గూడ నిజద్యుతితో వెలుగొంది రనియు, యజ్ఞ ముల యాదలి కుండములలో నగ్నిహోత్రములు తేజరిల్లె ననియు వర్ణింపబడినది అగ్ని, సూర్యుడు, చంద్రుడు ధరించిన తేజస్సు నారాయణుని యంతర్యామిత్వమే గాని తమది కాదని దేవతలు గుర్తించిరి సూర్యుడు, చంద్రుడు, తారలు, వివిధ దీపములు, సృష్టియజ్ఞ మందలి అగ్నికుండము లని యింపలి వస్తుధ్వని

సృష్టిలో దేవతలకు పైన, దేవతలకన్న శాశ్వతరూపులై సనకాది ఋషు లున్నారు వారికి గూడ అప్పుడప్పుడు తమ తపస్సుపై నమ్మకము కలుగుచుండను ఆ తపస్సు నారాయణుని అనుగ్రహరూప మగు సంకల్పమని మరచిపోవుదురు వారి కట్టి స్థితి కలిగినపుడెల్ల బ్రహ్మసృష్టిలోని దేవలకు దితి గర్భము నుండి చీకటి వ్యాపించి కన్ను కప్పును సనకాదులు జయవిజయులను శపించుటలో ఈ దేవతల చీకటి యహంకారమై క్రమ్మును దానిలో లోకము లన్నియు తమ సృష్టినుండి మాటుపడును ఈ

యహంకారి మే హిరణ్యాక్షుడు వాడు జన్మించుటకు కారణము సనకాదులు జయవిజయులను శపించుటయే హిరణ్యాక్షుడు చని పోవుటకై నారాయణుడు వరాహ రూపము ధరించి దిగివచ్చుటకు కారణము నైకుంఠమున పుట్టినది అది యెట్లనగా సనకాదులు జయవిజయులను శపించుటలో తప్పు చేసితి మని గ్రహించి, జయ విజయులు తప్పు చేయలేదని గ్రహించి, అయినను నారాయణుడు తమ్ము క్షమించి దయ చూపెనని గ్రహించి, తాము జయ విజయులపై దయ గలిగి మరల జయవిజయులు త్వరలో వైకుంఠమునకు రావలెనని సంకల్పించుటయే ఈ సంకల్పము నారాయణుడు చేయుటకు సనకాదులు చేసినచో తాను వరాహ మూర్తిగా దిగివచ్చును కానిచో సనకాదులు బాగుపడుట కవ కాశము లేదు ఈ రహస్యము లన్నియు నారాయణుడు వైకుంఠ మున సనకాదులతో చేసిన సంభాషణమున నున్నవి కనుకనే దేవతలు దితిగర్భము చీకటికి భయపడి శరణు జొచ్చినపుడు బ్రహ్మదేవుడు వారికి జయవిజయుల శాపకథను వినిపించెను ప్రతి జీవియందును శరీర ప్రాణ మనోనిర్మాణములలో సమస్త దేవతలు సన్నిధి చేసి యుందురు కనుక వ్యక్తిగత జీవులకు కలుగు నహంకార మమకార గర్వాదులు వానియందున్న దేవతలలో వర్తించుచుండును అట్టి యహంకార పూరితులై అంధకారమున మునిగియున్న వ్యక్తులు ఈ కథను చదువుకొన్నచో వారిలో నున్న దేవతలలో నీ కథ జరుగును మరల వ్యక్తిగతమైన పిండాండమున దేవతల నడుమ వరాహమూర్తి యావిర్భవించును దానితో జీవితము యజ్ఞ స్వరూపమగును కనుకనే యీ కథలకు ఫలశ్రుతి ప్రత్యేకముగ చెప్పబడినది ఈ ఫలశ్రుతి వ్యాసుడు చెప్పియుండక పోవచ్చును సకల కథా రహస్యము లెరిగిన సూతుడు శౌనకాదులకు గాని, మైత్రేయుడు విదురునకు గాని,

శుకుడు పరీక్షిత్తునకు గాని వివరణము రూపముగ చెప్పియుండ వచ్చును ]

710 అని యీ కథ దేవతలకు బ్రహ్మ వివరించి చెప్పెను ఆ వృత్తాంతమును మైత్రేయుడు విదురునకు విప్పి చెప్పెను

711 ఈ పుణ్యచరిత్రమును శుకయోగి పరీక్షిత్తునకు తెలిపెనని సూతుడు శౌనకాదులకు చెప్పెను

712, 713 ఈ వృత్తాంతము చెప్పచున్న మైత్రేయుడు విదురునితో నిట్లనెను ఈ కథ సకల పాపహరము దీనిని భక్తితో విన్నను, చదివినను విష్ణుభక్తి స్థిరపడును చక్కని పేరుప్రతిష్ఠలు కలుగును ఇహ పరసౌఖ్యములు సమకూరును ”

714 మైత్రేయు డిట్లు చెప్పెనని తెలిపి సూతుడు శౌనకాదులతో మరల నిట్లనెను ఈ వృత్తాంతము తెలిపిన శుక యోగీంద్రుని జూచి పరీక్షిత్తు మరల నిట్లని ప్రశ్నించెను మునీంద్రా! స్వాయంభువ మనువు కోరికవలన గదా వరాహ మూర్తి భూదేవి నుద్ధరించెను! అట్లు భూదేవి సరియైన స్థితిలో స్థిర పడిన వెనుక స్వాయంభువ మనువు సృష్టిని భూమిపై నిలిపెనా? బ్రహ్మదేవుడు తిర్యక్కు లనబడు జంతువుల సృష్టి చేయుటలో మరియు నింకెన్ని మార్గములను సృష్టించెను?

“ విదురుడు మహా భాగవతోత్తముడు కనుకనే కృష్ణుని కపకారము తలపెట్టిన కౌరవులను విడచి వనముల కేగెను తన తండ్రియైన కృష్ణ ద్వైపాయనుని యంతవాడయ్యెను తన మనస్సు, వాక్కు, శరీర కర్మలను కృష్ణుని యందే సమర్పించెను భాగవత జనుల నుపాసించుచు పుణ్యతీర్థములను సేవించి, మంచి పేరు

బహిసెను ఆ పేరుతోనే కల్మషములను తొలగించు కొనెను అట్టి విదురుడు మైత్రేయు నింకను నేమని ప్రశ్నించెను? ఈ వృత్తాంతము సవిస్తరముగ తెలుపుము ” ఇట్లడిగిన పరీక్షిత్తునకు శుకయోగి యిట్లనెను

715 నిర్మలులైన విదురుడు మైత్రేయ మునీందు్రి నిట్లని పేర్మితో ప్రశ్నించెను మహాత్మా! సృష్టికర్తయైన చతుర్ముఖుడు ప్రజాపతులను పుట్టించెనని చెప్పితివి ఇంకను తన మనస్సున నేమి సృష్టింపదలచెను? అంతకు ముందే సృష్టింప బడిన మరీచి మొదలగు మునులు చతుర్ముఖుని ఆజ్ఞను పాలించి సృష్టించిరా? సృష్టించినచో దాని విధానమేమి? వారందరును భార్యాసమేతులై ఏమి సృష్టించిరి? భార్యలను విడిచి యేమి సృష్టించిరి ?

716 అందరు నైకమత్యముగ నుండిరా? ఉండి యందరును కలిసి యేమి సృష్టించిరి?

(ప్రజాపతులు, ఋషులు కాక మిగిలిన దిగువ లోకముల సృష్టి యెట్లు జరిగెనని యిటుపైన ప్రశ్నింప బడుచున్నది ఈ దిగువ లోకముల సృష్టిలో జంతువులు, నరులు మున్నగు వారున్నారు గదా! వారి దేహాదులను సృష్టించుటకై దేవతలు వారి దేహాదులలో నంతర్యాములుగ దూరవలెను అప్పుడు జంతు లక్షణములగు ఆహార నిద్రా భయ మైథునాదులును, నర లక్షణములగు ఈర్ష్యాసూయమద మాత్సర్యాదులు కూడ నీ దేవతలకు సంక్రమించెనా? లేక వారంద రైకమత్యముతో సృష్టిలో పనిచెసిరా? ఊర్ధ్వలోకము ల సృష్టిలో శాశ్వత మూర్తులై చరించుచున్నప్పుడు కూడ దేవతలకు, సనకాదులకు నహంకారము తప్పలేదు ఇక దిగువ లోకముల లోనికి వచ్చి

నపుడు జంతు లక్షణములతో, నర లక్షణములతో చేష్టలు చూపిరా? లేక నీ దేవతలు నారాయణుని యంతర్యామిత్వము నందు వసించుచు నైకమత్యముతో సృష్టించిరా? అని మైత్రేయు నడుగుచున్నాడు. ఈ ప్రశ్నకు సమాధానము లైన యర్థవాదములు కూ. రాబోవు కథలలో వివరింపబడును

సారాంశ మేమనగా భూలోకమున గూడ భూగోళముపై భౌతిక నరదేహమున గూడ నారాయణుడు దిగివచ్చు ననియును దేవతలతో పాటు తి గర్భలక్షణములు అహంకార మమకారాదులై మఱియొక ప్రక్కన దిగి వచ్చు ననియును, అప్పుడప్పుడు దేవతలు గూడ యిట్టి రాజస చైతన్యములచే బద్ధులై నారాయణుడు దిగి వచ్చి దయ చూపుటచే మరల కనువిప్పు నొందుచున్నారనియును, రాబోవు కథలలో నిరూపింపబడును పరశురాముడు, రాముడు, కృష్ణుడుగా నారాయణుడు దిగివచ్చినపుడు కార్తవీర్యుడు, తాటక, మారీచ, సుబాహు, రావణ, కుంభకర్ణాదులు, శిశుపాల, జరాసంధ, ధృతరాష్ట్ర కౌరవాదులు కూడ దిగివచ్చుట మొదలగు కథలుగ నివి వివరింపబడును మరియు సంపూర్ణ మానవావతారమైన రామావతారమున నింద్రాది దేవతలు శరభంగుని యాశ్రమము మొదలగు తావులకు దిగి వచ్చి, యవతారమూర్తుల దివ్యాద్భుత ప్రజ్ఞాళికలకు తోడ్పడుటయు దీని వివరములే మరియు పరిపూర్ణ లీలావతార మగు కృష్ణావతారమున చచ్చుటకు దిగి వచ్చిన పూతన, శకటాసురాది దైత్య శక్తులతో పాటు, అహంకార పూరితులై ఇంద్రుడు, చతుర్ముఖ బ్రహ్మ కూడ దిగివచ్చి యహంకారమును తొలగించుకొని, గోపాలురై క్రీడించుటయు మొదలుగా గల భగవానుని లోకాద్భుత లీల లన్నియు నీ ప్రశ్నకు సమాధానములే ఈ యేకసూత్రత గోచరింపనిచో భాగవత మహాకావ్య మనబడు

వేద గ్రంథమున గల వ్రాక్యము గోచరింపదు ఇది గోచరింపక పోవుట వలననే పురాణములలో కావ్య లక్షణము ఎక్కువగా నున్నదని పండితులు, విమర్శక లోకము స్వప్న ప్రలాపములు చేయుచుందురు నేటి సాంధ్ర వాఙ్మయ సారాలోకము చేయు వారిలో నొక వర్గము కట్టి యనారోగ్య వృష్టి గలవారు. వారికి పామరులపై గౌరవము గాని, యధికారము గాని యుండుటవలన పామరులు వారి బారినుండి రక్షింపబడిరి )

717, 718 అని ప్రశ్నింపగ మైత్రేయు డిట్లనెను మొదట జీవుల కంటెనెట్టని పరమ పురుషుడుండెను అతడు మాయతో కూడిన వాడై కాల స్వరూపుడుగ వ్యక్తమయ్యెను ఈ సృష్టి యందలి మార్పులతని రూపవు ఈ సృష్టియే తన నివాసముగ నతడు జీవులకు వ్యక్తమగును అతడు మొదట కవలిక రూపమున సంకల్పించి మూడు గుణములను సృష్టించెను ఆ గుణములందు మహత్తత్త్వము పుట్టెను ఇట్లు పుట్టుటకు రజో గుణము కారణము ఆ మహత్తత్త్వమున అహంకారము పుట్టెను అది మూడు గుణములలో మూడు విధములుగ వ్యక్తమయ్యెను దాని వలన పంచ తన్మాత్రలు, పంచభూతములు పుట్టెను అవియే సృష్టికి కారణములు కాని లోకములు నిర్మించు సామర్థ్యము వానికి లేదు కనుక వాని కలయికచే భగవంతుడు హిరణ్మయమైన గుడ్డును సృష్టించెను అది జలములలోపల వృద్ధి పొందెను

719 అదే సమయమున నారాయణుడు వేయి దివ్య సంవత్సరములు యోగ నిద్రలో నుండెను అతని నాభి నుండి పద్మ ముదయించెను అది కొన్ని వేల సూర్యుల కాంతిని తనలో ధరించి యుండెను సకల జీవులను సృష్టికి ముందు దానిలో నిమిడి

యుండిరి అందుండి చతుర్ముఖ బ్రహ్మ పుట్టెను అతడు స్వయం ప్రకాశము గలవాడు అతనికి పేరు, రూపములు, గుణములు మొదలగు సంకేతములు పుట్టెను వానితో నతడు లోకములను సృష్టించెను

720 వాని ఛాయ నుండి అవిద్య పుట్టెను దాని యందు తామిస్రము, అంధతామిస్రము, తమస్సు, మోహము, మహా మోహము అను నైదు స్థితు లున్నవి వీని వలన సృష్టిలో లేని దున్నట్లు కనుపించును ఇట్టి తన సృష్టిని అది యజ్ఞానమయ మని గ్రహించి చతుర్ముఖుడు ఆ సృష్టి రూపమైన దేహమును విడిచి యావలకు వచ్చెను అట్లు బ్రహ్మచే విడువ బడిన దేహమునుండి, రాత్రి పుట్టెను అందే ఆకలి దప్పులు పుట్టెను అందుండి యక్షులు రాక్షసులు పుట్టి, ఆకలి దప్పులతో బాధ పడిరి అందు కొందరు చతుర్ముఖుని భక్షింతుమనిరి ( వీరి నుండియే రోగ కారణములైన సూక్ష్మజీవులు పుట్టి, జీవుల శరీరములను భక్షించుచున్నవి ) అందు కొందరు చతుర్ముఖుని రక్షింతు మనిరి ( వారి నుండి మన దేహములను రక్షించు ఆరోగ్యాది శక్తులు పుట్టినవి )

721 బ్రహ్మను భక్షింప దలచిన వారు సమీపించి వెంటపడిరి అతడు భయపడి, నేను మీ తండ్రిని మీరు నా బిడ్డలు నన్ను మీరు హింసింపరాదు అని హెచ్చరించెను యక్షణ మనగా హింస కనుక హింసింప దలచిన వారు యక్షులన బడిరి రక్షింపదలచిన వారు రక్షస్సు లనబడిరి

అటుపైన చతుర్ముఖుడు వెలుగుతో కూడిన మరియొక దేహము ధరించి సత్త్వగుణ ప్రధానులైన దేవతలను ప్రముఖు లుగా సృష్టించెను అటుపైన నతడు ఆ శరీరమును గూడ విడచెను అది పగలయ్యెను దేవతలకు నివాసమయ్యెను అటు

పైన బ్రహ్మ తన రహస్యావయవముల నుండి కొందరిని సృష్టించెను వారి పేరు అసురులు వారు అతి కామముతో వెకిలితనము గలిగి చతుర్ముఖునితో సంభోగము కోరిరి బ్రహ్మ భయపడి, పారిపోయి నా రా య ణు ని శరణు జొచ్చి , నమస్కరించి యిట్లనెను

722 "నీవు లోకములకు స్థితి కల్పింప జేసి, నన్ను సృష్టించుమని యాజ్ఞాపించితివి నేను సృష్టి నారంభించితిని

723 అందు పాపాత్ములైన అసురులు పుట్టి సంభోగము నకై నా వెంట పడుచున్నారు నా మనస్సు కలత పడి నీ సాన్నిధ్యము వేడి శరణు జొచ్చితిని నన్ను రక్షింపుము

724 జీవులకు కష్టము కలిగించుటకు గాని, కలిగిన కష్టములను పోగొట్టుటకు గాని నా కధికారము లేదు దాని కధికారివి నీవే " అన విని నారాయణుడు అధ్యాత్మ దర్శనమును విడదీసి చూపి, ఆ కామశరీరమును విడువుమని బ్రహ్మను ఆజ్ఞాపించెను ( బ్రహ్మ అట్లే ఆ దేహమును విడిచెను )

725 అట్లు విడువబడిన దేహమునుండి సంధ్య యనబడు స్త్రీ యుదయించెను ఆమె బంగారు టందెలతో నలంకరింపబడిన పాద పద్మములు కలిగి చక్కని మొల నూలుతో, పట్టు వస్త్రములతో నలంకరింపబడిన అందమైన పిరుదులు గలిగి యుండెను కఠినమైన కుచభారముతో నిలబడెను మద్యపానము వలన కను లెర్రబడి యుండెను కృష్ణ పక్షమునందలి అష్టమినాటి చంద్రునివలె చక్కని నుదురు గలిగి యుండెను తుమ్మెదల గుంపువంటి ముంగురులతో, సంపెంగ పువ్వువంటి ముక్కుతో చిరునవ్వు లొలికించుచు, విలాసములైన చూపులు గలిగి యుండెను హ స్తమున పద్మము ధరించి నిలబడి యుండెను

726 సంధ్యారూపమైన ఆ సుందరిని చూచి దానవు లందరు మీద పడి, కౌగలించుకొనుచు నిట్లనిరి

727 "ఏమి సౌకుమార్యము! ఏమి వయస్సు! ఏమి సౌందర్యము! ఏమి ధైర్యము! ఏమి సౌభాగ్యము! ఈ లక్షణము లెచ్చటను కనుపింపవు ఈ రూపము చాల చిత్రముగ నున్నది

728 ఈమెను చూచి మనము మనస్సులలో నింత కామము ననుభవించుచుండగ నీమె మనస్సున మనపై మక్కువ పుట్టదేమి? పలుకరించినను పలుక దేమి?" అని యాశ్చర్య పడుచు సంధ్యా దేవితో నిట్లనిరి

729 అరటి చెట్లవంటి తొడలు గలదానా! నీవెచ్చటి దానవు? ఎవరి కూతురవు? ఏ కులము? ఒంటరిగ నిచ్చట నుండుట కేమి కారణము?

730 నీ అందమైన రూపము సమస్త సంపదలకు, పుణ్యములకు నివాసము మేము నీ యందు మోహము చెంది దుర్బలుల మైతిమి మాకు మన్మథ బాధ భరింపరాకున్నది నీ వేల మాతో క్రీడింపవు?"

731, 732 అని యామె సౌందర్యము వర్ణించి నలవి గాక బాధ పడుచు నిట్లనిరి 'నీ యందమైన స్తనభరము నడుము, చిగురుటాకుల వంటి యరచేతులు చూడగా మాకు వింతయగు చున్నది వంగిన నీ నడుము మాకాకాశము వలె నున్నది నీవు చేతిలో ధరించిన పూలచెండు అస్తమించుచున్న సూర్యునివలె నున్నది నల్లని కురులతో కూడిన నీ వేణీ బంధము రాత్రి కాలపు చీకటి వలె నున్నది నీ చూపులు రాత్రి యాకాశమున మిణుకు్క

మను తారకలవలె నున్నవి నీవు దేహమున ధరించిన గంధపుపూత సాంధ్యరాగము వలె నున్నది అని వారందరు మోహముతో నామె చుట్టను జేరి మరియు నిట్లనిరి

783 "లోకమున ఎద్దని మొకచోటనే పుట్టి పెరుగును నీ పాద పద్మములు మాత్రము తిరుగుచు, అనేక గమనములు చూపుచున్నవి"

784 ఇట్లు పలుకుచు అనురాగముతో వారందరును సంధ్యాదేవిని పట్టకొనిరి వారినుండి తప్పించుకొని బ్రహ్మ సంతోషించెను

(దేవతలను, ఋషులను సృష్టించుటకు ముందు బ్రహ్మనుండి మహామోహ పంచక ముద్భవ మయ్యెను దీనికి కారణమేమి? నారాయణుని యాజ్ఞచేత కదా, చతుర్ముఖుడు సృష్టి నారంభించినది! మరల మోహ మారంభ మగుట యెట్లు? అని సందేహము కలుగవచ్చును

సృష్టించుటకు ముందు బ్రహ్మ నారాయణునితో నిట్లనెను నీ నియోగమున నేను సృష్టించుట కంగీకరించి నప్పుడు నేను సృష్టికర్త నని మనసున భావింపక తప్పదు. అదియే యహంకారము దాని వలన నేను నీ స్మరణకన్న వేరుగా సృష్టిని స్మరింపవలసి వచ్చును ఇది యెట్లును తప్పదు అయినను నేను దానిలో చిక్కుకొని పోకుండ నీ స్మరణగా నీ యనుగ్రహ ముండునట్లు వరమిమ్ము ఇట్లు బ్రహ్మ కోరగా నారాయణు డనుగ్రహించెనని ద్వితీయ స్కంధమున చెప్పబడినది ఈ వరమే బ్రహ్మ మొదటి సృష్టి కనుక నిందహంకారము కూడ కూడి యున్నది దీనితోనే సృష్టి యారంభమగుట వలన మొదట

మహామోహ పంచకము పుట్టెను నారాయణుని యనుగ్రహము వలన చతుర్ముఖుడు దీనిని మొదటి దేహముగ వినిచిపెట్టెను కాని దీనియందు చిక్కుకొనలేదు మరియు నిట్లు మహామోహముతో సృష్టి యారంభమగుట దేవతల దురదృష్టము అది వారి పూర్వ కర్మఫలితము ఒక చతుర్ముఖ సృష్టి ప్రారంభమగుటకు ముందు ప్రళయమున దేవతలు చావరు వారు అవ్యక్తములోనికి పోయి మరల బ్రహ్మ మార్గమున వ్యక్తము లోనికి సృష్టింప బడుదురు "ఈ సమస్తము ప్రళయమున తనలోని వారికి చీకటియై వారు న్నట్లు తెలియని స్థితిలో నిద్రగా నుండును" అని మనువు చెప్పెను ఈ ప్రళయమను చీకటి ఈ దేవతలకు కలిగిన కారణమే దితిగర్భము లేక హిరణ్యాక్షుడు దానికి కారణము వైకుంఠమున సనకసనందనుల యహంకారము వారి శాపముననే జయ విజయులు దితిగర్భమున రాక్షసులై దిగివచ్చిరి దితిగర్భము నెలలు నిండుచుండగా, చీకటి దేవతల నాక్రమించెనని పూర్వము చెప్పబడినది అదియే కల్పాంత ప్రళయము లేక బ్రహ్మ ప్రళయము అప్పుడు దేవతలు చావక, బ్రహ్మను శరణుజొచ్చిరి అనగా బ్రహ్మలో లీనమైరి బ్రహ్మ నారాయణుని నాభి కమల మున లీనమయ్యెను పద్మము ముకుళించెను మరల విచ్చుకొను టలో మొదట బ్రహ్మయు, తరువాత యహంకారము నుండి పరిశుద్ధులై జయవిజయులును, క్షమించిన సనకాదులును, తరువాత సకల దేవతలును వెలువడిరి వీరందరు నహంకారపడి, అనగా నారాయణుని యస్తిత్వము నుండి వేరై చీకటిలోనికి లీనమైరి కనుక మరల సృష్టి చీకటి నుండియే ప్రారంభమైనది ఆ మొదటి చీకటియే మహామోహ పంచకముగా దేవతల పూర్వ కర్మకు ఫలితమై బ్రహ్మ సృష్టికి మొదటి దేహమై పడిపోయినది ఇంతకును సృష్టియు, లయము నహోరాత్రములుగ జరుగుచుండుట

శాశ్వత సత్యము కనుకనే మనకు జీవిత మహోరాత్ర మయమై జరుగుచున్నది

అందు రాత్రి యనునది విశ్వరూపుని యొక్క దేహము పగలు తన యాత్మ ఈ రెంటి సంయోగము యొక్క వ్యక్త రూపమే దేహాత్మ సమన్వయ స్వరూపమగు సృష్టి అందు దేహము జడము అనగా అంతర్యామి యొక్క నిద్రావస్థ ఆత్మ స్వయంప్రకాశమైన చైతన్యము అనగా అంతర్యామి నిద్రనుండి మేల్కొనిన శోభ ఈ రెంటి నడుమ సృష్టిగా ఋషులు, దేవతలు, గంధర్వాదులు, జాతిక దేహధారులైన నర జంతు క్రిమి కీటకాదులు వర్తించుచుండును అన్నియు అహోరాత్రముల రూపమైన కాలమనబడు భగవతుని అంతర్యామిత్వమున ప్రభావితులై నిద్రించుచు మేల్కాంచుచుందురు

జడమునకును చేతనమునకును నడుమ నున్నది వెలుగువ వచ్చుచున్న స్థితి అదియే సంధ్య అందు దేవాసుర శక్తులు సమ్మిళితములై ఎర్రగా వ్యాపించును కనుకనే సంధ్యలు జీవుల కెర్రగా కనుపించును మరియు దేవతలు పితృదేవతలు చేయుచున్న బ్రహ్మాండ పిండాండ సృష్టిలో చైతన్యము ప్రాణముగా ప్రసరించి కాలువలు కట్టుటకు సంధ్యారాగము సృష్టింపబడును కనుకనే గర్భము నందలి పిండములలో రక్తము, రక్తనాళములు సృష్టింపబడును మన దేహముల రక్తమొక్కటే ప్రాణమునకు నుపాధియైన నివాసస్థానము రక్తము లేని జీవులైన క్రిమి కీటకాదులలో చైతన్యము కొంచెమే మేల్కొనును ఖనిజములలో నింకను తక్కువ మేల్కొనును వృక్షములలో రక్తము సృష్టింపబడక రసము మాత్రము సృష్టింప బడుటచే లోపలి దేవతలు కాక, వెలుపలి దేవగణములు సూర్యరశ్మి రూపమునను

జలము రూపముననను, ఖనిజములలోని రసాయనికములైన ధర్మ ముల రూపముననను మేల్కొని యుందురు రసమున కధిపతి సోముడు అతడు చంద్రకిరణముల మార్గమున పనిచేయును రక్తమున కధిపతి అర్యముడు వానినే పురాణములు అరుణుడు లేక అనూరుడు అని చెప్పును వాడు సంధ్యల మార్గమున, అంగారకుడను గ్రహమునుండి ప్రసరించును కిరణముల మార్గము నను పనిచేయును

దైత్యు లందరును సంధ్యాదేవి వెంట పడినట్లు చెప్పబడినది రక్తము నుండి శక్తి వ్యక్తమై ప్రాణముగ వ్యాపించుటయు, దాని వెంట కామక్రోధాదులు పుట్టుటయు దీని యర్థము దానిని ప్రాణమయ కోశముగా, అంతకు ముందటి మహామోహ పంచక మును అన్నమయ కోశముగా రెండు దేహములు ధరించి విడిచి పెట్టి చతుర్ముఖుడీ కోశములను జీవుల కిచ్చి, అటుపైన మనో మయాది కోశములు కూడ ధరించి విడచును దిని యర్థవాదమే యిచ్చట చెప్పబడిన వృత్తాంతము )

786 మరల చతుర్ముఖుడు తన చేయి పరిమళము చూచు కొనెను అందుండి గంధర్వులు, అప్సరసలును పుట్టిరి ఆ దేహమును కూడ చతుర్ముఖుడు విడిచి యీవలకు వచ్చెను

( ఇచ్చట గంధమను శబ్దమునకు గంధర్వులు అను శబ్దము నకు గల సామ్యమున చమత్కరింపబడి యొక యంతర్లీనమైన సత్యము సూచింపబడినది పంచేంద్రియములలో వాసన చూచుట ముఖ్యముగా పృథివీ రేణువులకును, చైతన్యమునకును గల సంబంధమును తెలుపును కనుకనే పృథివి గంధవతి యని చెప్ప బడినది అదృశ్యములైన సూక్ష్మ రేణువులు తమ ధర్మములను పరీక్షకు తెలియ చేయుటయే వాసన చూచుట వాసన రెండు

విధములు సుగంధము దుర్గంధము అగును సుగంధము పుష్పపు రేణువుల సామ్యమైన సంబంధమును తెలియ జేయును రేణువులు సరియైన క్రమమున కదలు చున్నచో సుగంధమును, ఎగుడు దిగుడుగా కదలుచున్నచో దుర్గంధమును వ్యక్తము చేయును అందు సమవిభాగమునకు సంబంధించిన దేవతలే గంధర్వులు కనుకనే వీరు కాల విభాగమునకును, నాద విభాగమునకును కూడ నధిపతులై సంగీతమున కధిదేవత లగుచున్నారు వీరి వలననే తాళలయాత్మకమైన గాంధర్వ విద్య వ్యక్తమైనది

అప్సరస లనగా నీటి బిందువులు పుట్టుట కధిదేవతలు అగ్ని సహాయమున వాయువు జల మగుట విద్యుత్తు వలన మేఘ రూపమున జరుగుచున్నది మేఘములు పుట్టుట యిట్లే జరుగుచున్నది కనుకనే క్రొత్త మేఘములతో విద్యుత్తు మెరపులుగా, నురుములుగా వ్యక్త మగుచుండును

సంగీతమున అప్సరసలు స్వరముల భేదములుగా వ్యక్తమగుదురు వీరు ఏడుగురు అప్ప చెల్లెండ్రుగ చైతన్య మను సూర్యుని రథమును నడుపుచున్నట్లు ఋగ్వేదము చెప్పుచున్నది స్వరములు స్త్రీలుగా, ఛందస్సు లనబడు తాళములు పురుషులుగా శాస్త్రపురాణాదులలో దర్శింపబడెను రూపకల్పనలో పరమేశ్వరుడు శబ్ద బ్రహ్మమై దిగివచ్చుచున్నప్పుడు నటరాజ స్వామిగా డమరుకము మ్రోగించుచు నాట్యము ప్రారంభింపగా, నొక ప్రక్క ప్రమథు లేడుగురు, మరియొక ప్రక్క అప్సరస లేడుగురు మేళను చేయుట, ప్రమథులు మద్దెలలు మ్రోగించుట, అప్సరసలు భంగిమలు చూపుట చెప్పబడినది స్వరములుగ అప్సరసలును, తాళములుగ ప్రమథులును, శబ్దబ్రహ్మరూపముగ డమరుకమున వ్యాకరణమును దిగివచ్చినట్లు రూపకల్పన మున్నది )

736 ఆ దేహము వెన్నెల యైనది దానిని విశ్వావసువు మొదలగు గంధర్వులు, అప్సరసలు తమ నివాసముగ స్వీకరించిరి అటుపైన బ్రహ్మ మరియొక దేహము దాల్చెను అది మత్తుతోను, ఉన్మాదముతోను, ఆవులింత తోను, నిద్రతోను చేయబడిన దేహము దాని నుండి పిశాచములు, గుహ్యకులు, సిద్ధులు, భూతములు పుట్టిరి వారు జుట్టు విరియబోసికొని, దిగంబరులై చరించిరి వెంటనే చతుర్ముఖుడు కన్నులు మూసికొని ఆ దేహమును విడిచెను దానిని వారు గైకొని పోయిరి

చతుర్ముఖుడు తన్ను అన్నము యొక్క స్వరూపముగా ధ్యానము చేసి, అదృశ్య దేహము ధరించెను అందుండి పితృదేవతలు, సాధ్యులు పుట్టిరి తమ్ము పుట్టించిన అదృశ్య శరీరమునకు ఫలితమైన దేవభాగమును స్వీకరించిరి ఆ కారణమున పితరులను, సాధ్యులను ఉద్దేశించి హవ్యము, కవ్యము అనబడు ఆహార ప్రదానము చేయబడుచున్నది

( జీవుల దేహముల యందు ఆహారము నుండి బలమును స్వీకరించు నట్టి శక్తులే పితృ దేవతలు వీరి వలన విత్తనములు మొలకెత్తుటయు, వృక్షములు ఆహారముగ స్వీకరింపబడుటయు, ఆహారము నుండి దేహాపోషణము జరుగుటయు సంభవించుచున్నది )

737 అపుడు బ్రహ్మ తన తిరోధాన శక్తి వలన నరులను, సిద్ధులను, విబుధులనబడు దేవతలను, కిన్నరులను పుట్టించెను వారి యందు తానుండును గాని వారికి గోచరింపక లీనమై యుండును అట్టి లీనమైన దేహమునే వారికి దేహములుగ నిచ్చెను ఇంకను తనకు ప్రతిబింబములుగా కిన్నరులను కింపురుషులను సృష్టించెను వారు జంటలు జంటలుగా కూడి, బ్రహ్మను గూర్చిన

గీతములు పాడుచుండిరి ( దేహముల యందు షష్ఠ యొకమ భాగములను జంటలుగా సృష్టించెనని యర్థము )

738 ఇంకను తన సృష్టి వృద్ధి యగుచుండలే దని దిగులుతో పండుకొని చతుర్ముఖుడు కాళ్ళు చేతులు కదలించెను. అప్పుడు రాలిన రోమములే భయంకరమైన సర్పములై పాకి పోయెను

739, 740 ఇక తన సృష్టికర్మ నెరవేరిన దని బ్రహ్మ సంతోషపడెను ఆ సంతోషమునుండి మహా మును లుద్భవించిరి వారు మూడు లోకములను పవిత్రము చేయువారు. వారికి శివ రూపమైన తన దేహము నిచ్చెను వారు దానిని స్వీకరించి, అంతకుముందు పుట్టినవారితోగూడి యిట్లనిరి "దేవా! అఖిల లోక ములను నీవే సృష్టించితివి ఈ నీ సృష్టి మిక్కిలి యాశ్చర్యము ఇందు యజ్ఞములు మొదలగు సత్కర్మలు ప్రకాశింపబడగి యున్నవి అందు సమర్పింపబడిన హవిస్సుల భాగములు మాకు లభించినవి మేము రుచులతో తినగలిగితిమి మాకు సంతోషమైనది అని వారు బ్రహ్మను స్తుతించిరి

( యజ్ఞ స్వరూపమైన సృష్టిలో కొంత భాగ మాహారముగ, కొంత భాగము జీర్ణించుకొను నగ్నిగా నేర్పడినది దీనివలన సృష్టి యజ్ఞముకోని భాగములు హవిస్సులై జీవుల కాహారమైనవి దేహములు ధరించి నాలుకలతో రుచు లెరిగి జీవులందరు ఆహార మును స్వీకరింప గలిగిరి అంతటితో సృష్టి పూర్తియైనది )

741 శ్రేష్ఠమైన తపస్సు, యోగవిద్య సమాధి ధరించి ఋషి వేషము ధరించి, హృదయమున కాత్మ స్వరూపుడై చతుర్ముఖుడు ఋషి గణములను సృష్టించెను ఆ ఆత్మనే శరీర

భాగములుగ వారికి పంచి పెట్టెను. అందు తపస్సు, యోగవిద్య ఈశ్వరత్వము, వైరాగ్యము, ఋషులకు సంక్రమింపచెను ఇట్లు, మైత్రేయుడు చెప్పగా విని విదురుడు పరమానందము పొంది విష్ణువును మనస్సున దలచి మరల మైత్రేయునితో నిట్లనెను

742 మహాత్మా! స్వాయంభువ మనువు పుట్టెనని చెప్పితివి కదా! అతని వంశము పరమ పుణ్యమయము దానిని స్మరింపక తప్పదు అతని వంశమున దంపతులుగ జన్మించి జీవులు సంతతిని వృద్ధి చేసిరని చెప్పితివి, ఇంకను స్వాయంభువ మనువునకు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడను కొడుకులు కలిగిరని చెప్పితివి ఏడు ద్వీపములతో కూడిన యీ భూమి నంతటిని ధర్మ మార్గము తప్పకుండ మను పుత్రులు పరిపాలించిన విధానమును తెల్పుము వారెట్లు ప్రవర్తించిరో వివరింపుము

743 మనువు పుత్రిక దేవహూతి ఆమె యోగ లక్షణములతో కూడినది అట్టి కన్యను మనువు కర్దమ ప్రజాపతి కిచ్చి పెండ్లి చేసె నంటివి ఆ విధమును తెల్పుము కర్దముడు మహాయోగి కదా! అతడు దేవహూతి యందు సంతతిని పొందిన విధము వివరింపుము కర్దముకు తన పుత్రికయగు రుచియను నామెను దక్ష ప్రజాపతి కిచ్చి పెండ్లి చేసెనని చెప్పితివి దక్షుని సంతతి వివరము లేమి? ఇన్నిటిని నాకు వినిపింపు మని అడిగిన విదురునకు మైత్రేయు డిట్లనెను

744 మొట్ట మొదట కృతయుగమున బ్రహ్మదేవుడు కర్దమ ప్రజాపతిని పిలిచి ప్రజలను సృష్టి చేయుమని యాజ్ఞాపించెను

745 కర్దముడు సంతోషించి సరస్వతీ నదీతీరము చేరి పదివేల దివ్య సంవత్సరములు వరుసగా తపస్సు చేసెను

( కర్దము డనగా బురద తనరూపమైన వానిని యర్థము అంతకుముందు ప్రజాపతులను ఋషులను స్వాయంభువ మనువును చతుర్ముఖుడు సృష్టించెను స్వాయంభువుడు ప్రజా సంతతిని వృద్ధి చేయుటకై తన భార్యయైన శతరూపతో గూడి బ్రహ్మ నారాధించెను జీవులకు భౌతిక శరీరములను సృష్టి చేయుటకు పృథివీ తత్త్వము కావలెనని ప్రార్థించెను వరాహమూర్తి రూపమున నారాయణుడు దిగివచ్చి పృథివి నుద్ధరించెను అందు భూగోళము మొదట జలములతో గలసి యుండగా నేర్పడెను అందలి కణములపై సూర్యరశ్మి ప్రసరించి భౌతిక దేహముల సృష్టి యారంభ మయ్యెను అదియే కర్దమ ప్రజాపతి సృష్టికి సంబంధించిన కథ )

746 కర్దము డొకనాడు ఏకాగ్రచిత్తుడై భక్తితో లక్ష్మీపతి యైన విష్ణుమూర్తిని ప్రార్థించి ప్రసన్నుని చేసికొనెను

747, 748 అంతరిక్షమున విష్ణువు ప్రత్యక్ష మయ్యెను సూర్యుడు, చంద్రుడు తన కన్నులు కాగా, విష్ణుమూర్తి చూపులకు వాని మెడలోని వనమాల యందలి పద్మములును కలువ పూలును విచ్చుకొని యున్నవి కంకణములు, నూపురములు, హారములు, కుండలములు, వేళ్ళ కుంగరములు, శిరస్సున కిరీటము, మెరయు చుండెను సముద్రుని పుత్రికయగు లక్ష్మియు, కౌస్తుభ మణియు, వక్షస్థలము నలంకరించి యుండిరి చిరునవ్వు వెన్నెలలు చెక్కిళ్ళ యందు ప్రతిబింబించుచున్నవి శంఖ చక్ర గదా పద్మములను ధరించి తుమ్మెదల గుంపువంటి ముంగురులతో నలంకరింపబడిన లలాటము కలవాడై, పీతాంబరము ధరించి, కరుణా కటాక్షములతో విష్ణుడు ప్రత్యక్షమయ్యెను

( ఇందు కర్దముని తపస్సు సూర్యుని కిరణములను భూమి

కావాహ్వానించుటగ వర్ణింప బడినది కనుకనే సూర్యచంద్రులు కన్నులుగా, పీతాంబరము సూర్యరశ్మిగా దిగి రాగా, భూమిపై కలువలు, పద్మములు వాని మాలికలుగ విచ్చుకొనినవి అపుడు భూమిపై పడిన సూర్య చంద్రాత్మకమైన కిరణమే విష్ణుని కృపా తరంగిత కటాక్షముగ చెప్పబడినది దీని నావాహ్వానించిన అధి దేవతయే భూదేవి నావేశించి యున్న కర్దమ ప్రజాపతి )

749 శబ్ద బ్రహ్మమే అతని శరీరముగా భాసించెను ఈ జగతు యొక్క అస్తిత్వమే అతని యస్తిత్వముగా పొడ గట్టిన జ్ఞాన స్వరూపుడై జ్ఞానమునకు మాత్రమే తెలియ దగిన వాడుగా నుండెను గరుత్మంతుని మూపులపై పాద పద్మములను నిలకొను అట్టి గోవిందుని దర్శించి కర్దముడు, ఆనందపు టలలలో మునిగి తేలుచు పూర్ణమనోరథుడై సాష్టాంగపడి దండ ప్రణా మాచరించెను

( శబ్ద బ్రహ్మ శరీరము కలవాడనగా ఆకాశమే తన శరీరముగా కలిగి, అందుండి కర్దముని స్తుతి రూపమున మనస్సునకు సాక్షాత్కరించిన వాడని యర్థము అంతర్యామియే మొట్ట మొద టగా భౌతిక శరీరముగ కర్దము డను పేరుతో తన్ను తానుచ్చ రించుకొని, వానియందు ధ్యానింపబడు వాడుగా స్థానము వహించె నని యర్థము మొదట కర్దముని జ్ఞానముగా పుట్టి, ఆ జ్ఞానముచే తెలియదగిన వాడుగా పొడసూపెను ముక్కు నుండి ఉచ్ఛ్వాస నిశ్వాసముల రూపమున దిగి వచ్చుటయే గరుత్మంతునిపై దిగి వచ్చుట కనుకనే గరుత్మంతునకు ముక్కు పెద్దదిగా నున్నట్లు సంకేతము )

750 కర్దముడు నమస్కరించి సద్భక్తి పరవశుడై ఆ పుండరీకాక్షుని కనుగొని యిట్లని స్తుతించెను

751 "ఓ పుండరీకాక్షా! సర్వ జీవరాసులలో అంతరాత్మగా నీవు దర్శన మిచ్చితివి. సత్కర్మాచరణము యొక్క ఫలితముల రూపముగ నిన్ను ధ్యానించు సాధన చేయుటయే యోగుల మార్గము. వారు జీవుల జన్మముల ననుసరించి జీవుల రూపములనే నీ రూపములుగా ధ్యానము చేయుట నభ్యసింతురు. ఈ ధ్యానము స్థిరత్వము చెందుట వలన, ఈ దర్శనము ఆత్మదర్శన మని తెలియును. అట్టి సర్వాంతర్యామి వైన నీ పాదారవిందములు, మా కన్నులకు పొడగట్టినవి. మాకు కన్నుల సార్థక్యము చేకూరినది.

(సర్వ జీవుల రూపమున నారాయణుని దర్శించుటయే కర్దముడు జీవుల రూపములను కల్పించుట. కన్నులున్న సార్థక్యము కలుగుట యనగా సూర్య చంద్రుల కిరణములు భూమిపై పడినపుడు మొట్ట మొదటగా జీవులకు కన్నులు గలుగుట.)

752 నీ పాద పద్మములు సంసార సాగరమును తరింప జేయును. వానిని సేవించుటకు బదులు అల్పములైన కోరికలు కోరి కొందరు పూజింతురు. వారు మాయచే మోహితులైనను వారి కోరికలకు తగినట్లు నీవు ఫలితములను ప్రసాదింతువు. అందు కొందరి కోరికలు నరకమును ఫలితముగ కలిగించును. వారి కోర్కెను బట్టి అట్టి ఫలితములనే ప్రసాదింతువు. (సృష్టిని నారాయణుడుగా చూచు వారు సంసార సాగరమును దాటుదురు. నారాయణుని సృష్టిగా చూచు వారు అందు చిక్కుబడి కోరికలను గలిగి యుందురు. ఈ రెండు విధములైన జీవరాసులును నీ దయకు పాత్రులే అయ్యును ఎవరికి తగిన ఫలితములను వారు పొందుచున్నారు.)

అట్లు కోరికలు కలవారిని నేను తెలియక నిందించితిని. మరల నాకు భార్య కావలెనని, వివాహము కావలెనని కోరి, నీ

పాదము లాశ్రయించితిని ఈ కోరిక గల నాకు నీ పాదములే కల్ప వృక్షములు గృహస్థాశ్రమమునకు ధేనువు వంటిది, ధర్మార్థ కామము లకు కారణ మైనది భార్య అట్టి అనుకూలవతియైన భార్యను కోరుకొంటిని ( బ్రహ్మ నన్ను సృష్టి యభివృద్ధి కొరకు నియోగించెను కనుక నేను దీనిని కోరకతప్పదు ఐనను దైవ కార్య మైన సృష్టిని వ ర్ధి చేయుటకు కోరితిని గాని నా కామము నకు కోర లేదు కనుక తప్పు లేదు ధర్మార్థకామములు కూడి సృష్టి కార్యమున కై చక్క-బెట్టుకొనుటలో తప్పు లేదు, తన కొఱ మైన వో బంధించును )

నీవే సర్వాంతర్యామియైన పరబ్రహ్మ స్వరూపము ఈ సృష్టిలోని దేహము లు కూడ నీ స్వరూపమే నీ స్వరూపులైన జీవులు కామము కలిగి సృష్టి యందు ప్రవర్తించుటయు, మోహము చెందుటయు గూడ నీ యాజ్ఞ వలననే నేనును ఈ జీవుల ననుస రించియే యుండును నివు కాల స్వరూపుడవు అందు మార్పు లనేకము లుండును వాని ననుసరించి నీ యాజ్ఞ నిర్వర్తించుట కే నే నిట్లు కోరుచుంటిని గాని నా కామము కొరకు కాదు

నీ మాయచే నీ సృష్టి యంత్రము నిర్మింపబడినది అది కాల స్వరూపమై కాలములోని విభాగములను వెలిబుచ్చుచుం డును నీ కాల స్వరూపము నాశము లేనిది అందుండి వెలువడు కాల విభాగములు మున్నగునవి ఎప్పటి క ప్పు డు నశించు చుండును

నీ కాల స్వరూపమున వేగము పుట్టుచున్నది అందు కేంద్ర మేర్పడి దాని చుట్టును పరిధులు తిరుగుచున్నవి ఆ పరి ధుల యందు పదమూడు విభాగములు గోచరించుచున్నవి అదియే సంవత్సరాత్మక మైన చక్రము

(సంవత్సరమునకు పండ్రెండే మాసములు కాని, 360 అరలు గల చక్రమున 365¼ అహోరాత్రము లుండుట వలను బట్టి పండ్రెండు మాసముల పరిధులు ఒక సంవత్సరముగా తిరుగును సంవత్సరమునకు పది తిథుల చొప్పున నెక్కువ మిగిలిపోగా మూడు సంవత్సరములకు ముప్పది తిథులు మిగిలి అధిమాస మేర్పడును దానితో కలసి పదమూడు విభాగము లేర్పడు చున్నవి సూర్యుని చుట్టును భూమి తిరిగివచ్చుటకు కావలసిన కాలమును సౌర సంవత్సరమందురు ఇది 365¼ అహోరాత్రములు ఇది కాక 360 అహోరాత్రములతో సంవత్సరము కొలత మరి యొకటి యున్నది దీనిని సావన సంవత్సర మందురు ఇది కాక పండ్రెండు పూర్ణిమలు, పండ్రెండు అమావాస్యలతో మరియొక సంవత్సరమాన మున్నది దీనిని చాంద్రసంవత్సర మందురు దీనిని సౌర సంవత్సరముతో సరిపెట్టుటకు మూడు సంవత్సరముల కొకమారు అధిమాసమును కలుపవలెను)

అదే యంత్రమున సూర్యుడను కేంద్రము చుట్టును 360 సూర్యోదయములు, 360 సూర్యాస్తమయములతో సావన సంవత్సరము తిరుగుచున్నది అదే యంత్రమున ఆరు ఋతువుల చక్రము కూడ తిరుగుచున్నది (రెండు మాసము లొక ఋతువు) అదే యంత్రమున చాతుర్మాస్యలు అనబడు విభాగములు మూడు తిరుగుచున్నవి (చాతుర్మాస్య లనగా నాలుగు మాసముల విభాగములు ఇవే ఎండకాలము, వానకాలము, చలికాలము అని విభజింపబడును) ఈ యంత్రము నాభినుండి క్షణములు లవములు అనబడు సూక్ష్మకాల విభాగములు బండి యాకులవలె తిరుగు చున్నవి ఇట్లు కాలస్వరూపమైన మహావేగముతో కేంద్రము నుండి పరిధికి తిరుగుచున్న చక్రమునందే సకల జీవరాసుల జననము కలిగి ఆయుర్దాయములు పరిమాణము పొంది తరిగిపోవుచుండును

అంటే జీవులకు కోరికలు పుట్టుచుండును వానికై యత్నము చేయుచుండుటలో ఆయుర్దాయములు తిరిగిపోవుచుండును అట్లు గాక నీ గుణ కీర్తనము చేయుచు నీ పాదపద్మములను ఆశ్రయించి నీ అస్తిత్వము రుచి తెలిసి నిలబడు భక్తులకు నీ కాలచక్రము దేహ ధర్మములుగా వర్తించును గాని, వారియందు వర్తింపదు నిన్ను స్మరించుచున్న స్మరణలో నీవే యుందువు గనుక నీనుండి పుట్టిన కాలచక్రము వారిపై పనిచేయదు

753 ఓ పుణ్యస్వరూపా! నీ వొక్కడవే యైయుండియు, నీ మాయచేత సత్త్వ రజస్తమస్సులు అనబడు గుణరూపములైన మూడు శక్తులుగా ప్రవర్తించుచుందువు అందు రజోగుణముతో బ్రహ్మవై లోకములను పుట్టింతువు సత్త్వగుణముతో విష్ణుడవై కాపాడుదువు తమోగుణముతో రుద్రుడవై లయ మొనరింతువు నీ విట్లు ప్రవర్తించుటకు హేతువు లేకున్నను నీవు సృష్టి స్థితి లయములకు హేతువులుగా నీ ప్రభావము చూపుచున్నావు ఈ హేతువుల నెక్కడనుండి పుట్టించుచున్నావు? సాలెపురుగు తనలో నుండియే దారములను తీసి తనకన్న వేరుగా తన నివాసము నేర్పరచుకొనుచున్నది అదే విధముగా నీ విన్ని రూపములను నీనుండియే నీకన్న వేరుగా కల్పించుచున్నావు నిన్నుగాక మరి యీ లోకము లెవ్వరిని స్తుతించును? సాలెపురుగుచే అల్లబడిన సాలెగూడు సాలెపురుగుపై గాక దేనిపై నాధారపడి యుండును? అట్లే ఈ లోకములు నీపై నాధారపడి యున్నవి ఇట్లు మహామ చూపుట నీ లీలయే దానిని దాటగల వారెవ్వరు?

754 దేవా! నీ మాయ నుండి ఇంద్రియములు, పంచ భూతములు పుట్టుచున్నవి ఆ యింద్రియములకు లక్ష్యములైన శబ్దము, స్పర్శము, రూపము, రుచి, వాసన యనునవి కల్పింప

బడుచున్నవి ఇది యంతయు నీ రూపము యొక్క విస్తృతియె గాని మరొక్కటి వేరుగా లేదు ఇట్లు విస్తృతి చేయుట మమ్మను గ్రహించుటకే గాని నీ కొరకుగాదు నీ మాయ యిన్ని విధము లుగా పరివర్తనము చెందుచున్నది ఆ పరివర్తనము నుండి పరస్పర త్వము వలన మరల వివిధ పరివర్ధనములు పుట్టుచున్నవి వాని తోనే ఈ లోకము లన్నియు అల్లిక చేయబడుచున్నవి నే నొక కోరికతో తపస్సు చేయుచున్నాన ఈ కోరిక ఎక్కడిది ? ఇట్లు చేయుమని యెవ్వరు చెప్పిరి ? కోరిక రూపమున వ్యక్తిమై అది తీరుట యొక అమృత వర్షముగా ప్రసన్నుడవైన నీకు నమస్క రించెదను ”

755 కర్దము డిట్లు స్తుతింపగా నారాయణుడు ప్రస న్నుడై గరుడ వాహనారూఢుడై స్థిరముగా నిలిచి దర్శనమిచ్చి కర్దమునిపై వెన్నెలవంటి అనురాగ దృష్టులను ప్రసరింపజేయుచు, కరుణామయుడై యిట్లు పలికెను

756 ఓ ముని శ్రేష్ఠుడా! నీ మనస్సున నే కోరిక కలిగి నన్ను పూజించితివో అది సఫల మగును ( కర్దముడు వివాహమును, సంతతిని కోరెను కాని అది సంసార జీవులు కోరినట్లు కాక బ్రహ్మసృష్టిని వృద్ధి చేయు నిమిత్తమై కోరెను కనుక దానికి బద్ధుడు కాడు )

757 ప్రజాపతియైన బ్రహ్మకు స్వాయంభువ మనువు పుట్టెను అతడు చక్రవర్తియై బ్రహ్మావర్త దేశమును పరిపాలించు చున్నాడు అతడు తన భార్యయైన శతరూపతో రే పిక్కడకు వచ్చును అతని పుత్రిక దేవహూతి యను కన్యక భర్త కావలె నని అభిలషించుచున్నది ఆమె గూడ తండ్రితో నిచ్చటకు వచ్చును ఆమె వయస్సునందు, శీలమునందు, సంకల్పమునందు,

గుణములయందు నీకు సరితూగుచున్నది తండ్రి ఆమెను నీ కిచ్చి వివాహము చేయును నీ కోరికయు తీరును ఆ మనువు పుత్రిక గూడ నన్నే నిత్యము మనస్సున స్మరించుచుండును ఆమె నిన్ను వరించి వివాహము చేసికొనును ఆమెకు నీ వలన తొమ్మిది మంది సౌందర్యవతులైన కన్యలు జన్మింతురు వారిని తొమ్మిదిమంది మునీంద్రులు వివాహమై వారి యందు పుత్రసంతానము పొందుదురు

నీవు నా శాసనమును మనస్సున ధరించి, సమస్త కర్మలను నా కర్పణము చేసి ఏకాంతివై ఏకాంత మనస్సుతో జీవింతువు మిగిలిన జీవుల కభయము నొసగుదువు వారియందు దయ చూపుదువు జ్ఞానముతో మెలగుదువు వారిని నీవు సేవించునపుడు ఒక రహస్యమును నిత్యము స్మరించుచుండుము నాయందు లోకము లున్నవి నీయందు నే నున్నాను దీనినే స్మరించుచు వారిని సేవింపుము చివరకు నా సాయుజ్యమును పొందగలవు మరియు నేను నీ భార్య గర్భమున ప్రవేశించి నీకు పుత్రుడనై జన్మింతును అప్పుడు నీకు సమస్త తత్త్వమును సంహిత రూపమున వివరించి చెప్పెదను అని నారాయణుడు కర్దమునితో చెప్పి, మాయ మయ్యెను

(మనువు బ్రహ్మావర్త దేశమునకు సమ్రాట్టుగా నున్నాడని చెప్పెను పురాణ ప్రమాణముల ననుసరించి బ్రహ్మావర్త దేశ మనగా సరస్వతి, దృషద్వతి యను రెండు నదుల నడుమ గల ప్రదేశము అచ్చట రురువు అనబడు పేరుతో నల్ల జింకలు సంచరించు చుండును అవి సంచరించు ప్రదేశ మంతయు యజ్ఞ యాగాది క్రతువులతో శ్రేష్ఠమై బ్రహ్మ జ్ఞానమును, మోక్షమును ప్రసాదించును ఈ ప్రదేశ మిప్పుడు స్థూలముగా ఉత్తర భారత దేశమున అనగా హిమాలయములకు దిగువను, వింధ్య

పర్వతములకు పైనను కలదు మొట్ట మొదటగా మానవజాతి ఈ భూగోళముపై నవతరించిన ప్రదేశ మిదియే వరాహామూర్తి యుద్ధరించిన భూగోళముపై మనువు విస్తరింప జేసిన జీవుల సంతతినే మనుపుత్రులు లేక మానవులు అందురు మానవులను పదమునకు మనువు సంతతి అని యర్థము

దీని కొక రహస్యార్థ మున్నది బ్రహ్మావర్తదేశ మనగా బ్రహ్మచే నావరింప బడిన దేశము మనలో ధ్యానమునకు, సమాధి స్థితికి, దైవ సాయుజ్యమైన మోక్షమునకు నివాసమైన స్థానము ఇది శిరస్సు నుండి హృదయము దిగువ వరకు గల ప్రదేశము. ఇందలి ఉచ్ఛ్వాస నిశ్వాసములను ప్రాణాయామముచే సాధించి మనస్సును శ్వాస యందు లయము చేసి హృదయమున చిత్తవృత్తులను నిరోధించుట సాధకుడు చేయు పని ఇది మనస్సు నుపయోగించి సంకల్పము నాధారముగా గొని, ప్రారంభింప బడును గనుక, మనువు వలన నేర్పడిన రాజ్యము, లేక బ్రహ్మవర్తము అందురు మనస్సును సంకల్పమున ప్రవర్తింపజేసి, బ్రహ్మమునందు వర్తించు ప్రదేశ మని అర్థము ఈ విధముగా భూలోకమున బ్రహ్మావర్తమను నొక ప్రదేశమును, ప్రతి మానవుని దేహమున నొక ప్రదేశమునుకూడ బ్రహ్మావర్త మనియే వ్యవహరింతురు. మరియు భూమిపై గల బ్రహ్మావర్త దేశమునకును, నరుని దేహమున గల బ్రహ్మావర్త దేశమునకును చక్కని కార్య కారణ సంబంధ మున్నది కనుక నే భూగోళముపై నే జాతి యందు, నే దేశము నందు నరుడు జన్మించినను, మోక్ష స్థితికి కావలసిన సాధన కొరకై బ్రహ్మావర్త దేశమున పుట్టి తీరవలెను ఇట్లు పుట్టించుటకై మనువు అనేక ప్రయత్నములు చేయుచుండును జాతులను సమీకరణము చేయుచుండును శతాబ్దముల తరబడి యొక దేశము నుండి మరియొక దేశమునకు జాతులను మార్పిడి

చేయుచుండును. రెండు భిన్న జాతుల నడుమ వివాహాది సంబంధములను కల్పించుచు, మరియొక జాతిని పుట్టించుచుండును అందుకు ముందున్న జాతులను మెల్లగా లయమొనర్చుచుండును జాతుల స్వభావములను వర్గీకరణము చేయగా ఏడు జతుల నరులు భూగోళముపై వివిధ స్వభావములతో ప్రవర్తించుచుందురు వీనిని సాధించుటకు మనువు గూడ నొక్కొక్కమారు ఒక్కొక్కజాతిలో దేహము ధరించి, దిగి వచ్చి పరిపాలకుడుగా, లేక జాతి నాయకుడుగా నడిపించుచుండును నవీన యుగమున దీని వివరములను కొన్నిటిని దివ్యజ్ఞాన శాఖ మూలమున మనువు శిష్యులు, మైత్రేయుని శిష్యులు అగు కొందరు ఋషులు లోకమున కందించియున్నారు దేవహూతి అన్ని విషయముల యందును కర్దమున వంటి దని చెప్పబడినది దీనిని బట్టి ఆమె భర్త కావలెనని కోరుట కూడ బ్రహ్మ సృష్టిని వృద్ధి చేయుటకే గాని తన కామమునకు కాదు

ఏకాంత స్వాంతము అనగా నొంటరితనమున కభిలాషపడు మనస్సని అర్థము ఇచ్చట నొంటరితన మనగా అందరిలో నొక్కనినే చూడ గలుగుట లేనిచో నితరుల కన్న దూరముగనుండ గోరిన వాడు సృష్టిని వృద్ధి చేయుటయు, దాని కొరకై వివాహమాడ కోరుటయు నెట్లు సంభవించును? )

758 ఆ విష్ణుమూర్తి గరుత్మంతుని మూపుపై కూర్చుండి పైకెగిరెను గరుత్మంతుని రెక్కల శబ్దము వనోహరమై వినిపించుచు సరస్వతీ నది యొడ్డున మామిడి తోటల మీదుగా దూసికొని పోయెను పోయి పోయి పెద్ద తరంగములు గల బిందుసరమును దాటి మాయ మయ్యెను

( బిందుసర మనగా నది యొక సరస్సు, దాని పేరు బిందువు అది ఈశాన్య దిక్కున నున్నట్లు పురాణములు వర్ణించును అందు బ్రహ్మ పూర్వము యజ్ఞము చేసిన యజ్ఞశాలల సామగ్రియైన స్తంభములు, ద్వారములు మున్నగునవి నీటిలో దాచబడియున్నవి వానిని వెలుపలకు తీసి, వానితో చక్కని వింతలతో గూడిన యొక సభాభవనమును నిర్మించి మయుడను రాక్షసుడు ఆ సభను రాక్షస గణములచే మోయించుకొని రప్పించి ధర్మజునకు బహూకరించెనని భారతము చెప్పుచున్నది పూర్వమిచ్చటనే భగీరథుడు తపస్సు చేసి గంగను భూమికి దింపెనని గూడ భారతము చెప్పుచున్నది

దీని కొక సంకేత మున్నది భ్రూమధ్య ప్రదేశమును తూర్పు దిక్కనియు, నడినెత్తి కేంద్రము నుత్తర దిక్కనియు చెప్పుదురు రెండును కలిసిన తావు ఈశాన్యదిక్కు భ్రూమధ్యము నుండి లోపల దిక్కున శిరస్సునకు సూటిగా దిగువను ఈశానుడు నివసించు స్థలమున్నది దీనినే విశ్వేశ్వర జ్యోతిర్లింగ మనియు, కాశీపట్టణ మనియు పురాణములు వర్ణించును ముఖ్యముగా కాశీఖండము వివరించును దీనినే ఈశానుని స్థానమనియు, ఈశాన్యని దిక్కనియు సంకేతింతురు దీనినే కుబేరుని బాహ్యోద్యానము అని కూడ నందురు కాళిదాసు మేఘ సందేశమున కుబేరుని నగరమైన ఉత్తర దిక్కున కెదుట ఈశాన స్థానమును వర్ణించుచు బాహ్యోద్యాన స్థిత హర శిర శ్చంద్రికా ధౌత హర్మ్యా అని రూపకల్పన చేసెను అచ్చట బాహ్యోద్యానమున కుబేరుని సఖుడగు హరుడు డుండును వాని శిరస్సున బాల చంద్రుడుండును వాని వెన్నెలతో తెల్లగా సృష్టింపబడిన నివాసభవనము లుండును ఈ విధమైన వివిధ వర్ణనలును శిరస్సునగల చైతన్య బిందుస్థానమును గూర్చి చేయబడినవి ఆ

ప్రదేశము మీదుగా నారాయణుడు గరుడవాహనారూఢుడై మాయ మయ్యెనని యిచ్చట వర్ణింప ఎడినది మరియు కర్దముడు తపన్సు చేసినది సరస్వతీ నదీతీర మని వర్ణింపబడి యున్నది మన శిరస్సున వాక్కున కుత్పత్తి స్థానమైన చైతన్యకేంద్రమే సరస్వతీ నది ఈ చైతన్యము వెన్నెముక లోపలినుండి ఉచ్చారణకు ముందు ప్రసరించుచుండును గనుక సరస్వతీనది పైకి కనుపింపక భూమి లోపల ప్రవహించుచునని వర్ణింపబడి యున్నది )

759 ఈ విధముగా నారాయణుడు వైకుంఠమున కేగెను కర్దముని కోరిక అంతకు ముందు స్పష్టముగా రూపు కట్టెను ఆ కోరిక అనేకమైన కోరికలుగా గుంపు కట్టెను వానితో నతడు విశేషమైన మోహము చెందెను కాని, వెంటనే బిందు సరమునకు పోయి నారాయణుని ధ్యానించి భక్తియోగము నాశ్రయించి, విమోహి యయ్యెను అనగా మోహమును తొలగించుకొనెను (సృష్టిని విస్తరింపజేయు సంకల్పమున మోహము పుట్టుటయు, ఆ సృష్టిలో దైవమును ధ్యానించుట వలన మోహము తొలగుటయు తప్పదు )

760 స్వాయంభువ మనువు పుత్రిక దేవహూతికి భర్త కావలె నను కుతూహలము మెండయ్యెను మనువు తనభార్యతో పుత్రికతో కాంచన రథముపై బయలుదేరి, తన పుత్రికకు తగిన వరుని వెదకుచు లోక మంతయు తిరిగెను

761 వచ్చి వచ్చి, ఆ విష్ణుని అంశలో పుట్టిన మనువు కర్దముని ఆశ్రమమునకు చేరెను కర్దముని జూచి, ఆనంద బాష్పములు బిందువులై రాల్పగా ఆ బిందువు లాక కోనేరై అందుండి సరస్వతీనది ప్రవాహమైనది బిందువులతో నేర్పడిన కోనేరు గనుక ఆ ప్రదేశమునకు బిందుసరమను నామము సార్థకమైనది

(అంతకు ముందే బిందుసరము, సరస్వతీ నదియు నున్నవి ఇప్పుడు సార్థకము లైనవి అనగా శిరస్సున గల బిందుసర మందలి చైతన్యము సరస్వతీ నదిగా వెన్నెముకనుండి దిగువకు ప్రవహించెను దానితో వాక్కునకు వైఖరీ యను స్వరూప మేర్పడినది చైతన్యము బ్రహ్మావర్త మనబడు బ్రహ్మచర్యాశ్రమము నుండి దిగివచ్చి, వెన్నెముకకు దిగువగా శుక్రరూపము ధరించి గృహస్థాశ్రమ దీక్ష కున్ముఖమై ప్రజాసృష్టికి విస్తృతి యేర్పడిన దని అర్థము

నరజాతి భూమిపై పుట్టినపుడు మొదట తేజోమయ సూక్ష్మశరీరములే గాని స్థూల శరీరములు లేవు అప్పుడు శిరస్సునుండి వక్షస్సు దిగువ భాగము వరకే తేజోరూపములైన వెన్నెముక లేర్పడినవి తర్వాత కర్దమముతో కూడిన సప్తధాతువులతో భౌతిక శరీరము లెర్పడి, స్త్రీ పురుష భేద మేర్పడుటలో వెన్నెముకలో దిగువభాగము సృష్టింపబడినది భూగోళమున గూడ అంతకు ముందు భూమధ్యరేఖ నుండి ఉత్తర ధ్రువము వరకును గల పై డిప్ప మాత్రమే యుండెడిది ఆ కాలమున వరాహమూర్తిచే నుద్ధరింప బడిన భూమి ఈ డిప్ప మాత్రమే అప్పుడు మన యుత్తర ధ్రువము సూర్యునివైపు తిరిగి యుండెడిది భూమి యొక పాత్రవలె దొరలు చున్నట్లు సూర్యుని చుట్టును తిరుగు చుండెడిది మనువు సృష్టిలో కర్దముని కాలమునుండి దక్షిణ ధ్రువ మేర్పడి గోళము పూర్తి యగుటయు నరులకు భౌతిక శరీరములు కల్పింపబడి దిగువభాగము లేర్పడి, స్త్రీ పురుష భేదము కల్పింపబడుటయు, గర్భధారణము సంభవించుటయు నొకేమారు జరిగెను )

762 బిందుసర మనబడు పుణ్యతీర్థము సమీపమున

నొత్తుగా పెరిగిన కానుగు చెట్ల నడుమ నొక దారి కనుపించెను అటుపైన దారి కిరుపక్కల మద్ది చెట్లున్నవి అటుపైన వరుసగా పొగడ, తెల్లమద్ది, వేపచెట్లు నీడ నిచ్చుచున్నవి ఇంకను ముందు నకు సాగిపోగా వేపచెట్లు, కడిమి చెట్లు, పాదిరిచెట్లు గలవు వానిని దాటి సాగిపోగా మంచి గంధపు చెట్లు, నొక్క కొబ్బరి తోటయు కనుపించెను తోట లోపలి భాగమున కర్పూర వృక్ష ములు, దిరిసెన చెట్లు గలవు ఆ గుబురు లోపలి భాగమున లవంగపు తీగెలు, లుంగిములు కలవు ఆ లోపల తియ్యమామిడి చెట్లు, రక్తచందనపు వృక్షములు, పోకచెట్లు సువర్ణ సంపెంగలు, మారేడు చెట్లు, వెలగచెట్లు గలవు ఆ లోపల ఇప్పచెట్ల గుబురులు కనుపించెను ఆ లోపల దారివెంట మల్లెలు, బొడ్డుమల్లెలు గలవు

763 స్వాయంభువ మను వింకను ముందునకు సాగెను చక్కగా పండిన పండ్ల గుత్తులతో వంగిన కొమ్మలు గల చెట్లు, ఆ కొమ్మల నడుమ నివసించుచున్న పక్షుల కూజితములతో ప్రతి ధ్వనించుచున్న దిక్కులు గల ఒక రమ్య ప్రదేశము ను చేరెను

764 చిలుకలు ఎక్కిలి వాడియైన ముక్కులతో తీయని పండ్లను చీల్చి రుచి చూచుచున్నవి ఆ పండ్లనుండి వెలు వడిన తీయని రసములను గ్రోలి ఆ చిలుకలు గుంపులుగా పలుకు చుండగా, ఆ పలుకులందు వేదఘోషము, వేదార్థముల ప్రసంగములు చెవుల కింపుగా వినిపించుచుండెను

765 చక్కని గుబురులుగా పెరిగిన తియ్యమామిడి చెట్ల చిగుళ్ళు కొరికి తినుచున్న వగరు రుచులతో శుద్ధమైన కోకిల కంఠముల నుండి వెలువడిన పంచమ స్వరములు రమ్యములై విని పించెను

766 కానుగ చెట్ల గుబురులను చూచి మేఘములుగా భావించుకొని నుటకంగీకరించి వానిముందు గుంపులుగా చేరి నర్తించుటకు పింఛములు విప్పుచున్న కుర్ర నెమళ్ళ గుంపులు కనిపించెను

767 బెగ్గురు పిట్టలు నీటి కోళ్ళు, బాతులు, కొంగలు, జక్కవలు, హంసలు చేరి కూయుచున్న కోనేళ్లు కనుపించెను అందు పద్మములు, తెల్ల కలువలు, నల్లకలువలు పరిమళము వెదజల్లుచుండగా నందు తుమ్మెదలు ఝంకారము చేయుచుండెను

768 ఆ నడుమ నేనుగులు, పెద్దపులులు, తోడేళ్లు, అడవిదున్నలు విహరించు నరణ్యభాగ ముండెను అందొక ప్రక్కకుం దేళ్ల జింకలు, చామర మృగములు తిరుగుచుండెను మరియొక ప్రక్క తోడేళ్లు, చెట్లపై కోతులు విహరించుచుండెను మరియొక కోనలో అడవి పందులు, ఖడ్గమృగములు, దుప్పులు, శరభ మృగములు మొదలగు భయంకర జంతువులు విహరించుచుండెను

769, 770 అట్టి ప్రదేశము నడుమ కర్దమ ప్రజాపతి ఆశ్రమమును కాంచెను వచ్చినవారి నందరిని కొంతదూరమున నిల్పి పరిమిత పరివారముతో స్వాయంభువ మనువు ముందునకు సాగి ఆశ్రమ ప్రదేశమును సమీపించెను అందు బ్రహ్మచర్య వ్రతమునకు తగిన తపస్సున కనుకూలమైన ఆహార విహారాది ప్రవర్తనచే పలుచబారిన సన్నని శరీరము గల కర్దముడు కనుపించెను అతడు విష్ణుమూర్తిని గూర్చిన గుణగణములను వర్ణించు పలుకుల గాని మాధుర్యామృతమును చెవులతో గ్రోలుచుండుటచే శరీరము సన్నమైనను కృశింపక ప్రకాశించుచుండెను లేడి చర్మము వస్త్రములను, జడల చుట్టలను ధరించి యుండెను కన్నులు పద్మపత్రముల వలె విశాలములై యుండెను జుట్టు,

గడ్డము సంస్కారము లేకున్నను తపస్సుతో, వర్చస్సుతో ప్రకాశించుచున్న కర్దమ ముని గనిలోనుండి తీసిన సానబట్టిన అమూల్య రత్నమువలె నుండెను అతనిని చూచి భక్తి భావమున స్వాయంభువు డతని పద పద్మములకు నమస్కరించెను (మనువు కన్న ప్రజాపతులు ముందు పుట్టిన వారు కనుక కర్దముడు మనువుచే నమస్కరింప దగిన వాడు )

771 తన యింటికి చుట్టమై వచ్చిన మనువు నాదరించి కర్దముడు అర్ఘ్యపాద్యాది విధులతో సంతుష్టుని గావించెను అంతకు పూర్వమే విష్ణువు తన్నాదేశించిన విధమును స్మరించి మనువుతో నిట్లనెను

772 సద్గుణ మూర్తీ ! నీవు భగవద్భక్తుడవు నీ విట్లు పర్యటనము చేయుట యెల్ల సజ్జనులను స్వీకరించి దుష్టులను శిక్షించుట కొరకే నీవు పుణ్య పురుషుడవు నీ యందు సూర్యుడు, అగ్ని, వాయువు, యముడు, వరుణుడు, నింద్రుడు అంశలుగా వర్తించుచున్నారు కనుక నిన్ను విష్ణుని స్వరూపముగా దర్శించి భక్తి గౌరవములతో నమస్కరించుచున్నాను సమస్త లోకములను జయించుట కనుకూలమై గుణులు తాపిన బంగారు రథమెక్కి, ధనుస్సు ధరించి, సైన్యముల అడుగులచే భూమి దద్దరిల్లు నట్లుగా చరించుచున్నావు

( దేవతల యంశలతో విష్ణు స్వరూపుడై రథమెక్కి చరించుట యనగా పంచ భూతములతో, వాని అధి దేవతలతో, మనస్సున కధిపతియైన ఇంద్రునితో కూడియున్న శరీరము ధరించి తిరుగుట ఇచ్చట శరీరమే రథముగా వర్ణింపబడెను ధనుస్సు అనగా లక్ష్యశుద్ధికై గురిపెట్టిన మనస్సు దిగ్విజయము అనగా

ఇంద్రియాదులను జయించు భక్తియోగము చైతన్యము లనగా నిట్టి దేహములు ధరించి భూమిపై తిరుగుచున్న మనువు సంతతి )

773 నీ విట్లు సూర్యుని వలె చరించుటయే లేనిచో బ్రహ్మచే కల్పింపబడిన వర్ణాశ్రమ ధర్మము లెందో నిద్రితోయి యుండెడివి వర్ణ ధర్మములు, ఆశ్రమ ధర్మములు మహాసముద్రము వలె అపారములు వానికి సేతువు నిర్మించి, ఆచరణ నిలిపి తరింపచేయుట నీ పని అట్టి ధర్మాచరణము లేనిచో మానవులు సంకరులై దొంగతనము మొదలగు లక్షణములు కలిగి నశించి యుండెడి వారు

( ఇన్ని కోట్ల మానవులు వేరు వేరు స్వభావము కలవారై యుందురు అందరికిని ధర్మముపై నాదరము కలుగవలెనను నిర్ణయము లేదు అందుచే శక్తిని బట్టి యొకరి నొకరు దోచు కొందురు అది సంభవము. కాకుండ క్రమబద్ధమైన జీవనోపాధు లేర్పడుటకు నాలుగు వర్ణములు నాలు గాశ్రమములు, వాని ధర్మములు నిర్ణయింపబడవలెను వాని నాచరింప జేయుటకు భయ భక్తులను పుట్టింపవలెను దానికి ప్రభుశక్తి కావలెను ఇన్నియు మనువు నుండి సిద్ధించుచున్నవి )

774 తమరి రాకకు కారణ మేమి ? అని కర్దముడు ప్రశ్నింపగా తన దినచర్య యందలి సత్కర్మలను నిర్వర్తించుట పూర్తి జేసి స్వాయంభువు డిట్లు ప్రసంగించెను

775 చతుర్ముఖ బ్రహ్మ తననుండి వెలువడిన వేదము లను ప్రవర్తింప జేయుటకై మిమ్ము తన ముఖమునుండి సృష్టించెను ( చతుర్ముఖుడు బ్రాహ్మణ ధర్మమును, వేద

పరివ్యాప్తికై కర్దముని రూపమున సృష్టించెననియు, దానిని రక్షించుటకై క్షత్రియ ధర్మమును తన రూపముగా సృష్టించె ననియు భావము )

776 పాప స్వరూపమగు దోపిడి యొక్క పీడవలన బ్రాహ్మణ ధర్మము దెబ్బతినకుండుటకై భూమిని పరిపాలించుట ఆవశ్యకము దాని కొరకై చతుర్ముఖుడు తన భుజములనుండి మమ్ము సృష్టించెను

777 ఇట్టి చతుర్ముఖునకు మనస్సుగా బ్రాహ్మణ ధర్మము, శరీరముగా క్షత్రియ ధర్మము సృష్టింపబడినవి ఈ రెంటియందును అంతర్యామిత్వము కలిగి విష్ణు ధర్మమును ఒరస్పర రక్షకముగా నేర్పరచెను

778 నీవు విష్ణుని స్వరూపముగా దిగివచ్చి దుర్జనులకు అంతుపట్టని దర్శనము గలవాడవై యున్నావు అట్టి నిన్ను దర్శించుట నా యదృష్టము నీ పాద పద్మముల రేణువులచే వెలుగొందునట్టి నా శిరస్సు సార్థకమైనది నీ వలుకుల యందలి అర్థమను అమృతముచే నిండిన నా చెవులు శుభమునకు నెలవు లైనవి నేను ధన్యుడనైతిని పుత్రికపై నా కెంతయో ఆపేక్ష కలదు ఆమెకు తగిన వరుడు లభింపలేదని మనస్సున బాధ పడుచు, సకల ప్రదేశములను తిరిగి శ్రమించుచున్నాను నా మావి వినుము

779 దేవహూతి యను నీమె నా కూతురు మిక్కిలి లావణ్యవంతులను సద్గుణమూర్తులను పలువురను గూర్చి విని యున్నది కాని, వారి నెవ్వరిని తన మనస్సున నంగీకరించుట లేదు నారదు డీమెకు మిమ్ములను గూర్చి చెప్పగా మిమ్ము వరింతునని

బయలుదేరి వచ్చినది ఈ పడుచు పిల్లను నానుండి భిక్షగా స్వీకరింపుము శుభమైన పని చేసిన వాడ వగుదువు (బ్రహ్మచారి గృహస్థుల చేతి నుండి భిక్ష స్వీకరించి అనుభవింపవలెను దేవహూతిని భిక్షగా స్వీకరించి గృహస్థాశ్రమము నంగీకరించి, ప్రజాసర్గమునకు తోడ్పడుమని స్వాయంభువుని యభిప్రాయము )

780 గృహస్థ ధర్మము పవిత్రమైనది అందు సత్కర్మాచరణ మావశ్యకము దానికి కావలసిన గుణములు, శీలము గలిగిన ఈమెను స్వీకరించి వరింపుము

781 విరక్తుడు గూడ అప్రయత్నముగా లభించిన సౌఖ్యమును స్వీకరింపవచ్చును ఇక వివాహ మాడవలెనను కోరిక గల వారికి సౌఖ్యములు త్రోసిపుచ్చదగినవి కావు

782 ఒక ఫలితమునకై ప్రయత్నించువాడు ఇతరుల నర్థింపక తప్పదు అల్పుల నర్థించినచో కీర్తి మర్యాద చెడిపోవును మహానుభావుడవైన నీకు వివాహమునం దిచ్ఛ కలిగినదని విని యిచటికి వచ్చితిని

783 నా ప్రార్థనము నంగీకరించి, నా పుత్రికను వరింపుము అని స్వాయంభువుడు పలుకగా కర్దము డిట్లనెను

( బ్రహ్మ సృష్టిలో బ్రాహ్మణ క్షత్రియు లనగా బ్రాహ్మణ, క్షత్రియ ధర్మములతో పుట్టిన వారని యర్థము కనుక నే బ్రాహ్మణునకు క్షత్రియుడు కన్యాదానము చేయుచున్నాడు కలియుగమున బ్రాహ్మణుని కొడుకు బ్రాహ్మణు డనియు, క్షత్రియుని సంతతి క్షత్రియు లనియు మాత్రమే తెలియును. అదియే పరమ సత్యమైనచో మనువు కర్దమునకు కన్యాదానము చేయుట పురాణములలో వర్ణింపబడి యుండెడిది కాదు )

784 నీ నుండి ఈ కన్య సాటిలేని దాన స్వరూపముగా సంకల్పించుచున్నది ఈమె రూపరేఖలు, విలాసములు పవిత్రమైనవి ఈమె లక్ష్మీదేవితో సాటియైన పవిత్రత గలది పూర్వమొకనాటి రాత్రి యందు వెన్నెల కాయుచుండగా నీమె నీ సౌధము నందు పై భాగమున బంగారు కాలి యందెలతో చెలికత్తెలతో గూడి చరించుచుండెను బంతియాట నాడుచున్న ఈమెను విశ్వావసువను గంధర్వుడు విమానము నుండి చూచెను మోహము చెందెను తత్ఫలితముగా భూమి మీద పడెను

785 విష్ణుమూర్తి తత్త్వమెరుగని నరపశువు లీమె వంక తేరిపార చూడలేరు అట్టి కన్య తనంతట తాను వరించి వచ్చిన యదృష్టము కలుగగా కాదను వాడుండునా ?

( విశ్వావసువను గంధర్వుడు వివాహమునకు అధిదేవతగా శాస్త్రముల యందు వర్ణింపబడెను ఏ కన్య నైనను అతడు మొదట వరించి భూమిపై పడిన పిమ్మట భర్త కాబోవు వాడు వరించునని వేద మంత్రములు చెప్పుచున్నవి విశ్వావసు వనగా సర్వపురుషుల సంపద యగు యౌవన మధుర భావము అతడు వరింపని దే కన్య నెవ్వరును వరింపలేరు

786 ఈ కన్యా రత్నమునకును, నాకును గుణము నందు, రూపమునందు, ప్రవర్తనమందు సామ్యము కనుపించినది కనుక నే నీమెను నిర్మల మనస్సుతో వరింతును

787 కాని దినకొక నియమము నేర్పరచుకొంటిని ఈమెకు సంతానము కలుగు వరకు మాత్రమే నేను గృహస్థ ధర్మమున నుందును

788 అటు మీద శమదమాది గుణములతో యోగాభ్యాసము చేసి సన్యసించెదను ఇది నారాయణుని యాజ్ఞ

( ఇచ్చట బ్రహ్మచర్యము, గృహస్థము, సన్యాస మను మూడు స్థితులు మాత్రమే చెప్పబడినవి తరువాత వచ్చిన సంసార బద్ధులైన నరుల కైనచో గృహస్థాశ్రమము తరువాత వాన ప్రస్థము కూడ ఋషులచే తగిలింపబడినది దీని కొక చక్కని కారణ మున్నది కర్దముడు, మనువు సంకల్పించిన బ్రహ్మ క్రతా త్మకమైన మొదటి జాతికి, నర శరీరమందు ముఖము, గాహావులు గల దేహస్థానమే ముఖ్యము అనగా గర్భధారణకొరకేర్పడిన భాగములు దేవకార్యమగు ప్రజాసర్గము కొరకే గాని, వ్యక్తుల కోరికల కొరకు గాదు అట్టి మానవ జాతికి వైరాగ్యము సహజము వారికి వైరాగ్యము పేనుకొనుటకై వానప్రస్థ మక్కర లేదు మరియు నీ తొలి మానవ జాతికి దేవత్వము, నరత్వము కూడ కలదు అందుచే దేహ ధారణము, దేహము విడచుట సంకల్ప మాత్రములు అవి పెద్ద సంఘటనలు కావు కనుక బ్రహ్మ చర్యాశ్రమమున దేహ మక్కరలేదు అట్లే సన్యసించి వెను కను దేహ మక్కర లేదు గృహస్థాశ్రమము స్వీకరించుటకో భౌతిక దేహము ధరింపబడును సన్యసించుటతో నది విడువ బడును కర్దముడు సంతతి కలిగిన వెనుక సన్యసింతునని తెలుపుట యనగా తన దేవకార్యము నిర్వర్తించిన పిమ్మట వెంటనే భౌతిక శరీరమును విడిచెదనని చెప్పుట ఇచ్చట మమకారమునకు తావు లేకుండుటకై ముందు చెప్పుచున్నాడు

తరువాత కాలమున మానవులు కర్దముని మార్గ మనుస రింపక, బురదలో దిగబడిరి అనగా భౌతిక దేహముపై వ్యామో హము పెంచుకొని ముసలి తనమున గూడ శిథిల శరీరములతో వ్యామోహులై మలశకటముల వలె చరించుట కిష్టపడిరి అప్పటి నుండియే భూమిపై జన సంఖ్య పెరుగుటయు, అది యొక సమస్య యగుటయు ప్రారంభమైనది దీనిని గూర్చిన వివరములు

జ్వాల్ కూల్ మహర్షి ప్రవచనము చేసిన ESOTERIC HEALING అను గ్రంథమున The Art Of Dying అను శీర్షికలో చూడవచ్చును )

789 సృష్టి స్థితి లయములకు నారాయణుడే కారణము బహ్మాదుల పుట్టుక కతడే కారణము

790 కనుక వాని యాజ్ఞ నుల్లంఘింపరాదు కర్దము డిట్లు పలుకగా మనువు తన భార్యతోను, పుత్రికతోను సంప్రతించి, వారి యభిప్రాయము తెలిసికొని ముని పెట్టిన నియమము లంగీకరించి, స తోషములో శాస్త్రోక్తముగా కర్దమునకును, దేవహూతికిని వివాహము చేయించెను అప్పుడు శతరూపాదేవి కూతునకు, అల్లునకు వివాహ జీవితమునకు కావలసిన విలువ గల సామగ్రిని బహూకరించి ఆ బహుమానమునకు పారిబర్హము అని పేరు పెట్టెను ( పారిబర్హము అనగా కట్నము ) ఇట్లు తన వంశాచారము ననుసరించి, పుత్రిక వివాహము నిర్వర్తించి, స్వాయంభువుడు మనస్సున దిగులు విడనాడెను కాని, ఇంతలో పుత్రిక యెడబాటు కలుగునని యూహించి చెదరిన మనస్సు గలవాడై పుత్రికను కౌగలించుకొని గడ్డము పట్టుకొని ముద్దు గొని శిరస్సు నిమిరి, కన్నీరు కార్చెను ఎట్టకేలకు వారి దగ్గర సెలవు తీసికొని రథమెక్కి శతరూపతో వెడలి పోయెను

( సంతానము కలిగిన వెనుక కర్దముడు సన్యసించుచునని చెప్పుట వలన మానవులకు వివాహము ముఖ్యముగా సంతతి కొరకే గాని కామము కొరకు కాదని స్థాపించెను బ్రహ్మ సృష్టిలో జరిగిన మొట్టమొదటి ఎవాహ మిదియే అంతకు ముందు వారందరు బ్రహ్మ దేహము నుండి పుట్టిరి సంతతికి గర్భధారణము ప్రారంభమైన కథ యిది గృహోపకరణములను కట్నమిచ్చుట,

కూతురు పెండ్లి చేసి దిగులు విడచుట, పుత్రికను భర్త రప్ప జెప్పు నపుడు దుఃఖపడుట మొదలగు సంప్రదాయము లన్నియు మనువుచే మొట్టమొదటగా స్థాపింపబడినవి )

791 మనువు శతరూపతో రథ మెక్కి సరస్వతీ నదీ తీరమున నివసించు సన్న్యాసీశ్వరుల యాశ్రమములను దర్శించు వేడుకతో బయలు దేరెను

792, 793 అట్లు మహనీయులను దర్శించి తన పట్టణము నకు బయలు దేరెను బ్రహ్మావర్త ప్రదేశము ప్రవేశించి తన నగరము చేరుకొనెను

మొదట లక్ష్మీపతి యజ్ఞవరాహమూర్తి రూపము ధరించి శరీరమును గట్టిగా జాడించెను అప్పు డతని రోమములు రాలి దర్భలై పుట్టినవి కొన్ని రోమములు రెల్లు పొదలైనవి వానితో నిండిన ప్రదేశము యజ్ఞముల కనుకూలమై ఋషులచే నాశ్రయింపబడినది వారందరును దర్భలతో క్రతువులు చేసిరి క్రతువులకు విఘ్నములు కలుగజేయు నసురులను దర్భలతోనే ఖండించి చంపిరి స్వాయంభువ మనువు కూడ ఆ దర్భలతోనే విష్ణుపరముగా యజ్ఞము చేసి దుష్టులను ఖండించెను

( బర్హిస్సులను పదమునకు కిరణము లనియు, దర్భ లనియు నర్థము సూర్య కిరణములే ఆత్మలుగా దిగి వచ్చి, పాంచ భౌతిక శరీరములను ధరించి మనువు రాజ్యమున మానవు లగుటయే యిందలి యజ్ఞము అట్టి సూర్య కిరణాంశమైన ఆత్మయే దేహ ధారుల మనస్సులను, ఇంద్రియములను ఆశ్రయించిన అసుర గుణములను పోగొట్టును

ఇట్టి పవిత్ర లక్షణము దర్భల యందును, రెల్లు పొదల యందును అవి పెరిగిన ప్రదేశము నందును వ్యక్తమగును కనుక

దర్భలను పవిత్రమైన శత్రునాశక సాధనములుగ మనువు కల్పించి మానవుల కొసగెను వేద మంత్రములతో దర్భలను చల్లిన ప్రదేశములును, పదార్థములును మానవులలోని అసుర గుణములను పోగొట్టి సంకల్ప శక్తిని వృద్ధి చేయును 18వ శతాబ్దమున గూడ పిలకల వారు పచ్చని బియ్యము గాలిలో చల్లి పిడుగులు పుట్టించి రని, గడ్డిపరకల నుపయోగించి రని ఆంగ్ల సైనికులు వ్రాసిరి )

794 ఇట్లు మనువు తన పట్టణము చేరగా పురజనులు పూజించి కానుక లర్పించి యనేక విధముల స్తోత్రములు చేయుచు స్వాగత వాక్యములు పలికిరి పట్టణ మంతయు మంగళ వాద్యము లతో ప్రతిధ్వనించెను

795 ఇట్లు తన నగరమున ప్రవేశించి స్వాయంభువ మనువు ప్రజలలో భగవద్భక్తి వృద్ధి చేయుచు పరిపాలించెను భక్తివలన ఆధిభౌతికము, ఆధ్యాత్మికము, ఆధిదైవికము అనబడు తాపత్రయము శమించునని శాసించెను అతడు భార్యతో పుత్రులతో, మిత్రులతో, చుట్టములతో, స్నేహితులతో మానవ జాతిని వృద్ధి చేసి పరిపాలించెను

7‘6 ప్రతి దినము అపారమైన భక్తితో విష్ణుని గూర్చి వ్యాసంగములు చేయుచుండెను అతడు సంగీత విద్యా విశారదుడు తన సంగీతమును విష్ణున కంకితము చేసి, వీణ మీటుచు ప్రబంధ గీతములు గానము చేయుచు ఆనందించుచుండెను తన కధీనములైన మహా వైభవము లనేకము లున్నను వానియం దనురక్తి పొందలేదు ఏ వేళ చూచినను విష్ణుసేవా పరాయణుడై మహా వైభవముతో వెలుగొందెను

797 అతడు నిత్యము హరి పాదద్వయమును పూజించి

తత్పాదార్పితమైన తులసీ దళముల సుగంధము నాఘ్రాణించు చుండును విష్ణుని చరితములనే మనస్సున చింతనము చేయు చుండును నోరార స్తోత్రము చేయును ఆ వృత్తాంతములను గూర్చి పలువిధముల చర్చించుచు భాగవతులు చర్చించుచుండగా వినును విష్ణుసేవకు పనికిరాని సంసార బంధములకు గురియైన ధర్మార్థ కామములను అనాదరించి ఎల్లప్పుడును మోక్షమునకు దారిచూపు ధర్మార్థ కామముల సమన్వయము కలిగిన సత్కర్మలనే యాచరించును

( ధర్మము, అర్థము, కామము త్రివర్గము లనబడును సంసార జీవులు కూడ వాని నాచరించుచుందురు కాని వారి దృష్టిలో త్రివర్గము లాచరించుట తమ కోసముగా కనుపించును ఉదాహరణమునకు జీవనోపాధికై వృత్తి ధర్మము నిర్వర్తించుట, దాని వలన అర్థము నార్జించుట, అర్థముల వలన వివిధ వస్తులాభ ములను, సంబంధ బాంధవ్యములను పెంపొందించు కొనుట కొందరు చేయుదురు మోక్షము కోరిన వారు మరియొక దృష్టితో త్రివర్గ ముల ననుసంధింతురు మోక్షము కొరకు స్వధర్మము నాచరించుట, దాని కొరకు అర్థ మార్జించుట, సత్కర్మాచరణము కొరకు దేహము ను అన్న పానీయాదులతో పోషించుట వారి మార్గము స్వాయంభువ మను వీ మార్గమునే అవలంబించెను )

798 నారాయణుడు వేదార్థమునకు మాత్రమే గోచ రించును అట్టి శ్రీహరి ప్రవర్తనల ప్రసంగములందు మనస్సు నిలిపి కాలము గడుపుచుండగా మనువునకు దినచర్యలో జాములు గడచుచున్నను గడిచినట్లే యనిపించ లేదు

( అట్టి జాములతో కూడిన దినములు గడచుచున్నను గడచుచున్నట్లని పించ లేదు అట్లే దినచర్యయు, వానితో నిండిన మొత్తము జీవితము గడిచినను గడచిన ట్లనిపించ లేదు దేహాదులకు,

అతనిని గమనించుచున్న ప్రజలకు, వాని వయో ధర్మములు, ఆహార విహారాది ప్రవృత్తులు నున్నట్లుండును గాని అతనికి లేవు అతని కున్నది నారాయణుడే ఇదియే జననమరణాతీత స్థితి అందువలననే యతని యాయుర్దాయము జీవుల కొక మన్వంతర మయ్యెను )

799 ఆ మహానుభావుడు విష్ణుని మంగళకరములైన కథలను వినుట, ధ్యానించుట, ఇతరులతో కలిసి గానము చేయుట, నిరంతర ప్రవృత్తిగా నుండెను ఆ ప్రవృత్తిలో నిద్ర, మెలకువ, కలగాంచుట యను భేదములు తొలగిపోయెను ( కేవలము తురీయ స్థితి నిలబడెను ) తాను చక్రధారికి దాసుడ నని నమ్మి కొనెను ఆ ధ్యానమున శరీర బాధలు, మనోబాధలు సోకకుండ జీవించెను దివ్యములు, మానసములు, భౌతికములు అను బాధలు స్పృశింపకుండ జీవించెను సన్మునీంద్రుల సమూహములను సేవించు వారికి వర్ణాశ్రమ ధర్మముల గతులు తప్పకుండ నడిపించి పరిపాలించెను సర్వ జీవులకును హితము కలుగునట్లుగా ప్రవర్తించుచు డెబ్బది యొక్క మహా యుగముల కాలము పరిపాలించెను

( డెబ్బది యొక్క మహాయుగము లొక మన్వంతరము అనగా మనువు జీవిత కాలము అందు సకల జీవరాసుల యందును బుద్ధి స్వరూపుడై మనువు వర్తించును ఆ బుద్ధి యందు నుపాధులుగా జనన మరణములు పొందుచున్న జీవుల దేహములే అతని జన్మ వృత్తాంతములు అతడు వానిలో చిక్కడు గనుక జీవులకు మాత్రము జనన మరణము లుండును అతని కుండవు

శారీర బాధ లనగా జననము, వ్యాధి, ముసలితనము, మృత్యువు మానస బాధ లనగా ఈర్ష్యా సూయలు, ఋణాది బాధలు, వివిధ చింతలు దివ్యవ్యథ లనగా పూర్వ కర్మను బట్టి

విఘ్నములు మొదలగునవి కలుగుట మానుష వ్యధలనగా నితర నరుల వలన బాధలు భౌతిక వ్యధలనగా పంచభూతముల వలన బాధలు, భూకంపము, తుఫాను, అతివృష్టి, అనావృష్టి, అగ్ని పర్వతములు పేలుట, వరదలు, సముద్రము పొంగుట మొదలగునవి )

800 అని యీ విధముగా విదురునకు మైత్రేయుడు పవిత్రమైన స్వాయంభువ మను చరిత్రమును వినిపించెను అటు పైన కర్దమ ప్రజాపతి కథ వినిపింతునని సంతోషముతో నిట్లనెను

801 ఇట్లు స్వాయంభువ మనువు దేవహూతిని కర్దమునికిచ్చి వివాహము చేసి వెడలి పోయిన తరువాత దేవహూతి నిర్మల పతిభక్తితో వెలుగొందుచుండెను భర్తయే తనకు దిక్కుగా నమ్మి పార్వతీదేవి పరమేశ్వరు నర్చించి నట్లు కర్దము నర్చించెను అతని మనస్సు నెరిగి వర్తించుచు నానాటికి శ్రద్ధ, భక్తి, ప్రేమ రెట్టింపు కాగా శుశ్రూష చేయుచుండెను శీల సంపదతో కూడిన మహా తేజస్సు కలిగి కామము, క్రోధము, దంభము, లోభము మొదలగు గుణములు లేని జీవితము గడపెను అట్లని తన శరీర సౌందర్యమును గూర్చి యశ్రద్ధ వహింపలేదు భర్త కది కూడ సంతోషదాయకమే గదా! భర్త సేవలో మునిగి మలిన స్వరూపముతో జీవించిన ప్రయోజనమేమి ? భర్త సంతోషము కొసము శరీరము పరిశుద్ధముగా నిలిపి మెలగెను చతురత, ప్రేమ, చనవు గలిగి భర్తతో గూడి ప్రవర్తించుచు భర్తనే దైవముగా ధ్యానించుచుండెను అతినితో మృదువుగను, మధురముగను, మాట్లాడు పద్ధతియం దేమరుపాటు లేక వర్తించెను దైవయోగము నైనను తప్పింప గల సమర్థుడైన కర్దముడు

తన సేవలో శ్రమపడుచు చిక్కిన దేహము గల దేవహూతిని చూచి జాలి పడెను ఆమెను కరుణార్ద్ర దృష్టితో చూచి యొక నాడు మధుర భాషణములతో నిట్లనెను

( దైవయోగ మనగా దేవుడు కల్పించు యోగ మని యర్థము కాదు పూర్వ కర్మఫల పరిపాకమును దైవ మందురు దానిని గూడ తప్పింప గల సమర్థుడు కర్దముడు

కర్దముని పూర్వకర్మ కేవలము సృష్టి కర్మయే అతడే భౌతిక సృష్టిలో ప్రథమ మానవుడు దేవహూతియే భౌతిక శరీరము ధరించిన మొదటి స్త్రీ కనుక వీరి పూర్వకర్మ సృష్టి కర్మయే గాని, వ్యక్తిగత కర్మ బంధము వీరి కుండదు మరియు దేవహూతి మనువు కూతురు మనువు బుద్ధిమయ శరీరము కలవాడే గాని భౌతిక శరీరము కలవాడు కాదు అతడు మొత్తము మన్వంతరము, అనగా డెబ్బది యొక్క మహా యుగములు నరజాతికి బుద్ధిగా నంతర్యామిత్వము వహించును. దేహధారులైన భౌతిక మానవు లే విధముగా ప్రవర్తించినచో పాంచభౌతిక ద్రవ్యము యొక్క ప్రకృతి యందు చిక్కుకొనకుందురో, దానిని దర్శించి సాధించి యుపదేశించెను అందు గృహస్థ ధర్మములు గూడ చెప్పబడినవి వాని ననుసరించి దేవహూతి కర్దము నారాధించెను కర్దముడు గూడ దాని ననుసరించి భార్యను సుఖపెట్టవలెను కాని దాంపత్య ధర్మ మిరువురకును క్రొత్తయే కాని కర్దముడు దైవయోగము మొత్తమును దర్శింప గలిగెను అందు చిన్న వ్యత్యాసములు కలిగినను సరిదిద్ద గల దర్శన జ్ఞానము కలవాడు

యోగాభ్యాసము, యోగజీవితము, దైవయోగము అని యోగవిద్య మూడు విభాగములు అందు మొదటిది వ్యక్తిచే

నభ్యసింప దగినది మాత్రమే ఇందు కర్మయోగము జ్ఞాన యోగము, భౌతికదేహ శిక్షణము, ప్రాణగతులకు సక్రమము చేయుట, క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగము మున్నగు సాధన మార్గము లిమిడి యున్నవి ఇక రెండవది యగు యోగజీవితము దీనికి పరమావధి ఇతరులతో నెట్టి సంబంధము కలిగి యుండవలెనో అది యిచ్చట సాధింపబడును ఇందు సాంఖ్యయోగము జ్ఞాన విజ్ఞాన యోగము, అక్షర పరబ్రహ్మయోగము ముఖ్యముగా నభ్యసింపబడును దానితో విశ్వరూప సందర్శన యోగము సిద్ధించును విశ్వ మనబడు దేవుని స్వరూపము దర్శింపబడును అటుపైన దర్శింప దగినది దైవయోగము ఇది వ్యక్తిగత సాధనకు సంబంధించినది కాదు సకలమును సమర్పణ బుద్ధితో ఆహుతి చేసి విరజము అనబడు సన్న్యాస యోగమున నిలిచి కేవలము సాక్షిగా దర్శింపవలసిన స్థితి లోకమున మంచి చెడ్డలతో సంబంధ ముండదు వానిని తన సత్కర్మలు సరిచేయుచుండును అవి తన యస్తిత్వమునకు సంబంధించినవి కాకయే నడచిపోవుచుండును ఉదాహరణమునకు ముఖ్యమైన విషయములు మాటాడుకొనుచు దురద పెట్టినపుడు గోకుండుము అప్పుడు స్పర్శేంద్రియమునకు, చేతికి, మనస్సునకు సంబంధించిన కర్మలు అప్రయత్నముగా జరుగుచుండును మనకు ఆ కర్మలతో ప్రసక్తి లేకయే యస్తిత్వము వహించును పనులు జరుగుచుండును గాని మనము చేయుచుండము అట్టి స్థితిలో జీవుడు దైవముతో యోగము చెంది యుండును అప్పుడు సిద్ధించునవి భక్తి యోగము, పురుషోత్తమ ప్రాప్తి యోగము ఇందు వ్యక్తి సాధించున దేమియు లేదు వ్యక్తి వ్యాపించునదియు, దర్శించునదియు, దర్శింపబడిన వస్తువుగా మారునదియు నుండును అట్టి స్థితిలో దేహము, మనస్సు అడ్డు రాకుండవలెను అట్టి సమగ్ర

యోగమును దర్శించి అటుపైన భౌతిక దేహములోనికి దిగినవాడు గనుక కర్దమ ప్రజాపతి దైవయోగమునకు గల విఘ్నములు కూడ తొలగింపగల సమర్థుడు )

802 ధర్మమార్గము నవలంబించుట వలన మహిమ కలుగును దానివలన చక్కని తపస్సమాధి స్థితి పరిస్ఫుట మగును దానివలన విద్యా స్థిరత్వము నందును ( విద్య యనగా తన్ను తాను తెలిసికొనుట లేక యాత్మజ్ఞానము ) దానితో ఆత్మయోగము సిద్ధించును ( అనగా తనయందు మనస్సు, బుద్ధి, ఇంద్రియములు, దేహము లగ్నమై యిమిడియుండుట ) అట్టి యోగము తో విష్ణుమూర్తి కటాక్షమును సాధించుకొనవలెను దానివలన శోభతో కూడిన దివ్యానుభవము కలుగును దానివలన సకల శుభములు జీవితమునకు పందిరిగా నిలుచును నా సేవయందు నిశ్చలత్వము చెందిన దానవు నీవు కనుక నీకే సమస్త శుభస్థితులను కలిగింతును ఇంకను వారింపరాని దివ్యదృష్టిని ప్రసాదింతును

803 ఆ దివ్య దృష్టివలన నీకు సర్వము గోచరించును చూడుము ఇక తుచ్ఛములైన భోగములు లభించునని చెప్పనేల? అవి యితరములు (భగవంతునికన్న వేరుగా చూడబడిన భోగములు తుచ్ఛములు ) ఇట్టి సామాన్య సంపద లెన్నియైనను ఆ విష్ణుని కనుబొమ్మ కదలికయందు పుట్టి నశించును

804 సాటిలేని రాజ్యము లభించుట వలన దర్పము చెందువారు పాప ప్రవర్తనులు వారికి కన్ను పొరగ్రమ్మి జ్ఞానము చీకటి యగును అట్టి పాపులైన రాజులు ధైర్యముతో సంపద లనుభవింపలేరు వారికి అందరాని దివ్యభోగములు నీ పాతివ్రత్య

నిష్ఠవలన నీకు లభించినగాని సుబుద్ధి గలిగి ఆ సుఖములను నిశ్చింతగా ననుభవింపుము నీకు కార్యసిద్ధి గూడ కలుగును (బ్రహ్మాభివృద్ధి నభివృద్ధి పరచునట్టి సంతతి కలుగునని యర్థము) ఇట్లు పలికిన యోగమాయా విచక్షణుడు, ఈశత్వము పొందినవాడు నగు కర్దముని చూచి దేవహూతి దిగులు లేని మనస్సుతో శిరస్సు వంచి లజ్జయు, వినయము, ప్రేమ నిండుట వలన తొట్రుపడుచున్న పలుకులతో నిట్లనెను

(శ్రోత్రియుడైనను, బ్రాహ్మణుడైనను భోగములు సమానములే కాని వానిని కోరని మనస్సుకలవానికి ఈ భోగములే దివ్యములుగా పరిణమించును అవి కోరినవాని భోగములకన్న నూరురెట్లానందమును గూర్చునని వేదము చెప్పుచున్నది ఈ భోగములయందు కామముచే దెబ్బతిననివాడే బ్రాహ్మణుడని గూడ వేదము చెప్పుచున్నది అట్టి స్థితి దేవహూతికి సిద్ధించునని కర్దముడు వరప్రదానము చేయుచున్నాడు )

805 అడ్డులేని యోగమాయకు నీవు స్వామిత్వము వహించుచున్న సమర్థుడవు నీయందు సాటిలేని దివ్యభోగములు నాకు కలుగుట సత్యమని యెరుగుదును నీతో నాకు సాంగత్యము కలిగిన మాత్రముననే యివన్నియు సిద్ధించినవి అయినను నీవొక కట్టుబాటు చేసితివి నాకు సంతానము కలుగు వరకే శరీరముతో సంబంధమని చెప్పితివి ఆ మాటను స్మరించి నాకు నీ శరీరసంగమును దయచేసి మన్నింపుము (ఈ సుఖములతో నాకేల ? నీ శరీర సంగము వలన సంతతి పొందుటయే నాకు నారాయణుని యాజ్ఞ ) నీతో సంయోగము చెందునట్టి కోరిక కలిగియున్న నా శరీరము నీ సేవలో చిక్కినది కదా! అట్టి కోరికయే ప్రధానముగా గల ఈ నా దేహమునకు స్నాన భోజన, పానీయముల ప్రత్యేక

సుఖములు ముఖ్యములు కావు వానితో నాకు పరితుష్టి లేదు నా కోరిక తీర్పదలచినచో రతి రహస్యమును వెలువరింప జేయు కామశాస్త్ర విధానమ ను నా కుపదేశింపుము ( వీ రిద్దరి దాంపత్యమే సృష్టిలో మొట్ట మొదటి భౌతిక దాంపత్యము అంతకు ముందు కామశాస్త్రము వెలువడ లేదు దానిని కర్దముడు నారాయణుని యాజ్ఞపై తన తపశ్శక్తితో రూపొందింప వలెనని భావము ) దాని నుపదేశించిన వెనుక దానికి తగిన వివిధ చిత్రి వస్త్రములు, ఆభరణములు, పూల మాలలు, సుగంధ ముల మైపూతలు, సుఖించు భవనములు, విహరించు తోటలు సార్థక మగును. వానిని నీ సామర్థ్యముచే కల్పించి నన్ను దయ చూడుము అని దేవహూతి పలుకగా కర్దముడు తన యోగ మాయచే అన్నియు కల్పించెను

( తొలి జాతి మానవునకు దాంపత్యము తా నాచరింప వలసిన ధర్మముగా నుండెడి గాని తిన్నా కర్షించునట్టిదిగా నుండెడిది కాదు దేహాకణములతో జీవునకు పాతుకొని పోయిన సంబంధము లేనపుడు కామమునకు బలము తక్కువ కామమున సుఖించుట లేక పోలేదు కాని ఆరోగ్యవంతునికి ఆకలి వలె, రుచివలె అవి అప్రిధానములై సేవింపబడుచుండెడివి ఆహారమునకు ప్రియోజనము దేహాపోషణము దాని పరిమితిని తెలియజేయునది ఆకలి ఆహారకర్మను సుగమము చేయునది రుచి ఆదిమ మానవుడు ఈ విధముగనే ఆహారము సేవించెను. ఇప్పటికిని జంతువు లీ విధముగనే ఆహారము సేవించుచున్నవి జంతువు లట్లు బద్ధు లగుటకు కారణము ప్రిజాపతి యనబడు అంతర్యామి దేవత మానవులు బద్ధు లగుటకు కారణము మనువు అతడు ధర్మము రూపమున మానవునకు దర్శనమిచ్చి సేవింపబడునే గాని

ప్రజాపతి వలె అస్వతంత్ర స్థితిలో నుంచదు దాంపత్య విషయ మున గూడ నిట్లే యూహింపవలెను సుఖము లన్నిటి ననుభవింప వలెను కాని ఆకలివలెనే రుచివలెనే యనుభవింప వలెను అన్ని దేవతలకన్న ముఖ్యమైన యంతర్యామి దేవత తృప్త యనబడు స్థితి నిచ్చునది ఆ యధిదేవతనే యింద్రుడందురు ఇంద్రుడు దేవ సభకు రాజని చెప్పబడినది కనుక తృప్తిని నిందించిన వారు, లెక్కచేయనివారు ఇంద్ర కోపమునకు గురియగుదురు అట్టి వారే వ్యవహారములలో నిమగ్నులై సుఖపడలేని వారు తపస్సు మున్నగు వాని విషయమున గూడ గీనిని పాటింపనిచో నింద్రుడు కోపించి తపోభంగము చేసెనని చెప్పిన కథ లన్నియు ఈ వేదార్థమున కర్థవాదములు గౌతము డిట్లు చేయుట వలననే అహల్య యింద్రునితో జారత్వము చేసెనని వాల్మీకి యర్థవాదము చేసెను అందు స్త్రీని తప్పు పట్టుటకు వీలు లేదనియు పురుషుడు గృహస్థాశ్రమము నంగీకరించిన వెనుక గృహస్థ ధర్మముగా భార్య తృప్తిని పాటింపవలెననియు చెప్పుటకే రామపాద స్పర్శ అహల్యకు విమోచనముగా చెప్పబడినది ఈ యుపాఖ్యానములు నరజాతి కథలే గాని వ్యక్తి కథలు గావు కర్దముడు సంసారమున తన తేజము కోల్పోకుండ భార్య కోరికలను తీర్చుచున్నట్లు ప్రస్తుత కథ తెలుపుచున్నది )

806 దివ్యమణులతో స్తంభము లుద్భవించెను పచ్చలు తాపిన భవన భూమి కల్పింపబడెను. వజ్రముల గోడల నడుమ తలుపులతో పగడముల ద్వారబంధములు నిర్మింపబడెను. బంగారు కుంభ గోపురములపై ఇంద్రనీలపు నగ్గి ముక్కలు తళుక్కు మనెను. పద్మరాగపు వసారాల యందు వైడూర్యములు తాపిన ముంజూరు లర్పడెను భవనముపై తళతళ మని పట్టు

వస్త్రపు పతాకము గాలికి తూలుచుండెను మనోహర ఝుంకార ములు చేయుచున్న తేనెటీగ లాశ్రయించిన పుష్పములతో కూడిన యుపవనములు, ఆ పుష్పముల మాలికలు సంసిద్ధపరుపబడెను

807 నాజూకైన సన్నని జిలుగు వస్త్రములు, పట్టు చీరెలు సిద్ధము చేయబడిన గదులతో కూడిన మందిరములు కలిగి సౌభాగ్యవంతమై శిల్పమయములైన తిన్నెలతో కూడి యా భవన మొప్పారెను

808 దాని చుట్టును సుందరోద్యానము లున్నవి వాని నడుమ చిన్న చిన్న కోనేళ్ళలో హంస లీదుచున్నవి తుమ్మెదలు గానము చేయుచున్నవి చెట్ల గుబురులలో దాగి కోకిలలు, పావురములు, చిలుకలు జక్కవలు నెమళ్ళు గుంపులుగా వివిధ వ్యూహములుగా విహరించుచున్నవి లందే రత్నములు తాపబడిన రంగులతో శిల్పమయములైన పక్షులు గూడ నిల్చియున్నవి వానిని చూచి నిజముగా ఎట్ట లనుకొని అందు విహరించుచున్న పక్షులు పలుకరించుచు చెలగాట లాడుచున్నవి ప్రతి వృక్షము కొమ్మపై నెక్కిన పక్షులు గల గల మని శబ్దము చేయుచున్నవి

809, 810 మేడల పై యంత్రముల తో చక్కని శయ్యలు, ఆసనములు నమర్చబడి యున్నవి విహార గృహము లన్నియు చంద్రకాంత శిలలతో చేయబడి యున్నవి అందు పండ్లతో, పూల తో నిండిన కృత్రిమ వృక్షములు శిల్పము చేయబడియున్నవి ఒక్కొక్క మందిరమే కృత్రిమముగా సృష్టింపబడిన వేరొక జగత్తు వలె నున్నది ( చంద్రకాంత శిల లనగా చలువరాతి పలుకలు )

811 ఆ భవనము సకల ఋతువుల శోభలతో నిండి యున్నది సమస్తశుభములు కలిగించు సంపదలు కొల్లలు కాగా

సకల విధములైన భోగములకు తగియున్నది అచ్చట కోరిన దెల్ల చేతి కందునట్లు చక్కగా సమర్పబడి యున్నది

812 అట్టి దివ్యభవనము కల్పించి, ఆదలి, శోభల సపూర్వముగా సమర్చి నిర్మించిన కర్దముడే మరల దానిని పరికింపగా దాని వ్యూహము తనకే అంతుపట్టలేదు. అట్టి భవనమును దేవహూతికి చూపెను ఆమె సంతోషింపలేదు దానిని గ్రహించి సర్వజీవుల హృదయ భావముల నెరిగిన వాడైన కర్దముడు సంతుష్ట హృదయుడై యిట్లనెను

( తాను తపశ్శక్తిచే కల్పించిన భవనమును చూచి దేవహూతి సంతోషింపనపుడు కర్దముడు సంతుష్టాంతరంగుడగుట యెట్లు ? ఈ సృష్టిని జూచి దేవహూతి సంతోషించి యున్నచో వానికి నిజముగా ఆశాభంగము కలిగియుండెడిది భార్య భర్త నాదరించుట అతని సంపదల కొరకా ? లేక అతని కొరకా ? యను విషయమే యిచ్చట తేల్చబడినది నారాయణుని యాజ్ఞను పరిపాలించుటకై కర్దముని శరీర సంబంధము, దానివలన కలుగు సత్సంతతి మాత్రమే దేవహూతికి ముఖ్యము అంతేకాని విహార భవనములు కాదు విహారసౌఖ్యములు కాదు, దివ్యదృష్టి గాదు, తపశ్శక్తి యొక్క సామర్థ్యములు గాదు ఆమె మనస్సును గ్రహించెను గనుకనే కర్దముడు సంతుష్టాంతరంగుడయ్యెను ఈ సృష్టి యంతయు కర్దముడు చేసి చూపినది నారాయణుని యాజ్ఞ యెడల దేవహూతికి గల శ్రద్ధను పరీక్షించుటకే గాని భార్యను సుఖపెట్టి మెప్పు పొందుటకు గాదు )

813 ఈ కోనేరు భగవంతుడైన విష్ణువుచే నిర్మింపబడినది సకల శుభములకు నివాసము ఇందు స్నానము చేసిన జీవులకు కోరికలు నెరవేరును

814 ఈ నీటిలో భక్తితో స్నానము చేసి నీ పీ విమానము నెక్కు మని అతడామెను బుజ్జగించెను (అందలి సృష్టియ తయు కర్దముని యోగమాయా కల్పితము అందొక్క కోనేరు కూతురము విష్ణుదేవుని యోగమాయచే నిర్మింపబడినది అదియే దాంపత్య మనబడు గృహస్థ ధర్మము మిగిలినవి జీవులు కల్పించుకొనిన ముచ్చటలు )

815 అప్పటికి దేవహూతి భర్తకు సేవ చేయుచు ధరించిన మలిన వస్త్రముతో నుండెను జుట్టు జడకట్టుకొని వ్రేలాడుచుండెను దేహము ధూళి సోకి కృశించి యుండెను స్తనబాధము నైన ధరింపక ఆమె బయలుదేరి వచ్చెను ! ఆమె మారు పలుకక భర్త మాట ప్రకారము ఆ కోనేటి యందు ప్రవేశించెను అది సరస్వతీనదియొక్క జలములతో నింపబడిన కోనేరు అదియే బిందుసరము అందు పెక్కుజీవులు జలచరములై ఆశ్రయించుకొనియుండెను

( వెన్నముక లోపలి భాగమునుండి దిగువకు దిగివచ్చునట్టి బ్రహ్మయొక్క వాక్ప్రవాహమే సరస్వతీనది యని చెప్పబడినది అది శిరస్సున బ్రహ్మలోక ప్రజ్ఞగా, కన్నులనుండి సూర్యాది లోకము వెలుగైన దృష్టిగా కంఠమునుండి శబ్దమయమైన వేద ప్రపంచముగా వెలువడును హృదయమునుండి ప్రేమసంకల్పమైన లక్ష్మీనారాయణ స్థానముగా వ్యక్తమగును నాభినుండి చరాచర సృష్టి ర్మాణసమర్థమైన చతుర్ముఖుని జన్మస్థానముగా వెలువడును వెన్నముక చివరి భాగమునందు గృహస్థాశ్రమమునకు నిలయమైన దాంపత్య స్థానముగా వ్యక్తమగును అందు స్త్రీ పురుష దేహములు వేరు వేరుగా నర్పడుటవలన శుక్రశోణిత బిందువులుగ సంయోగము చెందను ఈ సంయోగమే బిందుసర

మనబడు కోనేరు సరస్వతీ దీజలములు సుషుమ్న యనబడు వెన్నెముకలోని ద్వారమున దిగివచ్చి యిందు బిందురూపముగా నుండును. దానిలో పలువిధములైన జీవులు జలచరములై తిరుగు చుండును అనగా గర్భధారణమున కనుకూలమైన శుక్ర శోణిత బిందువులలో నివసించి, దేహోత్పత్తికై వేచియుండును దీనికొరకేర్పడిన పాంచభౌతిక దేహనిర్మాణమే కర్మముని యోగమాయచే నిర్మింపబడిన దివ్య విమానము ఇది యంతయు మొట్ట మొదటి భౌతిక శరీర సృష్టికిని, స్త్రీ పురుష శరీర నిర్మాణమునకును గర్భధారణమునకును, బ్రహ్మ ప్రజాభివృద్ధికిని సంబంధించి యర్థవాదమైన యుపాసనము దీని పవిత్రతను నిలుపుటకే వివాహము, గృహస్థాశ్రమము, పాతివ్రత్యము, ఏకపత్నీవ్రతము మొదలగు ధర్మములు వేదఋషులచే శాసింపబడెను )

దేవహూతి ఆ కోనేటిలో ప్రవేశించి స్నానము చేయు చున్న సమయమున నొక వేయిమంది కన్యకలు ఆమెకు దర్శనమిచ్చిరి వారందరును వెలుగులతో చేయబడిన సన్నని పొరలు వస్త్రములుగా ధరించి యుండిరి కుర్రవయసున మిసమిస లాడు చుండిరి కలువపువ్వుల సుగంధముతో గూడి యుండిరి (వారందరును గర్భధారణమునకు సహకరించు సూక్ష్మదేవతలు వారే సంభోగేచ్ఛ దానికి వలయు నుత్సాహము, అలంకరణాది శృంగార వాంఛయు కలిగింతురు

వీరిలో కొంత మంది అప్సరసలుగా వేదములందును, పురాణములందును వర్ణింపబడిరి పురుషులు గంధర్వులుగా వర్ణింపబడిరి కొందరు దంపతులుగా నేర్పడి ఋషులుగా, వారి భార్యలుగా వర్ణింపబడిరి కాముడు దక్షిణాగ్ని యనబడు నగ్ని హోతృడుగా వర్ణింపబడెను ఈ యగ్నిహోతృడు సప్తర్షుల భార్యలను చూచి మోహపడి వారి భర్తల రూపము ధరించి వారి

ననుభవించెనని చెప్పబడినది అరుంధతి మాత్రము మోసపోలేదు వాని నిజస్వరూపము గుర్తించెను అనగా యమము కామమునకు లొంగదని యర్థము ) వారు దేవహూతితో నిట్లనిరి

816 "మేము సంచితమైన మా ధర్మము నాచరింతుము నీకు నిర్మల భక్తితో పరిచర్య చేయు చెలులుగా మెలగెదము "

817 అని పలికి వా రామెను సమీపించి నలుగులు పెట్టి తలంటి పోసిరి మంచి గంధము కర్పూరము పొడి కలిపిన సువాసన నీటిని కలశములతో తెచ్చి జలక మాడించిరి తెల్లని వస్త్రములతో తడి యొత్తిరి శరీర మంతయు సుగంధ ధూపితము చేసిరి కస్తూరి దేహమునకు పూసిరి చక్కని నాదములు చేయుచున్న మంజీరములు, చిరుగంటల మేఖలలు శృంగారింపజేసిరి రవ్వల దుద్దులు, ఉంగరములు, గాజులు మొదలగు వెలలేని భూషణములను సారె పెట్టిరి షడ్రసోపేతమైన వివిధాన్న భోజనమును పెట్టి సంతృప్తపరచిరి

818 బంగారు పాత్రతో కర్పూర హారతు లిచ్చి చక్కని ఆసనమున కూర్చుండబెట్టి అద్దము చేతి కిచ్చిరి అందు ప్రతిబింబించిన తన దేహమును చూచుకొని దేవహూతి తన మనస్సున కర్దముని స్మరించెను

( ఇందు వర్ణింపబడినవి గర్భధారణమునకు పూర్వ రంగముగా శృంగారాధిదేవతలు మనస్సునకు కల్పించు ముచ్చటలు అద్దమనగా భౌతిక దేహముగా పంచ భూతాదులు ప్రతిబింబించుట దేవహూతి యనగా దేవతల నాహ్వానించు కేక తన శరీరమును ప్రతిబింబమున చూచుకొని భర్తను స్మరించుట యనగా భర్త

నుండి పుత్రుడను పేర గర్భధారణము జరుగుటకు అనుకూలపడుట తానే పుత్రుడను పేర పుట్టను" అనియు, "తన నీడ జలములలో చూచు కొన్నట్లు తండ్రి పుత్రుని చూచును" అనియు వేదములు చెప్పుచున్నవి )

వెంటనే స్మరణ మాత్రమున కర్దమ ప్రజాపతి తన సన్నిధి యందు ప్రత్యక్షమయ్యెను ఆ వేయి మంది కన్యలను, కర్దముడను తన సాన్నిధ్యమున నుండుట చూచి యామె తన భర్త యొక్క యోగమాయా ప్రభావమున కాశ్చర్యపడెను

అప్పుడు కర్దముడు స్నానము చేసి శుచియై వచ్చిన తన భార్యను కనుగొని వివాహా సమయమునకు మున్నెట్లుండెనో అట్టి శోభతో కనిపించుట చూచి ఆనందభరితుడయ్యెను ఆ వేయి మంది కన్యకలు కొలుచుచుండగా భార్యతో కూడి ఆ విమానము నలంకరించెను అప్పు డతడు తారాగణములతో పరివేష్టింపబడిన రోహిణితో కూడి యున్న చంద్రునివలె శోభిల్లెను

819 అటుపై నతడు భార్యతో గూడి మేరుపర్వతము గుహాలోని కరిగెను అచ్చట సమస్త దిక్పతులును విహారము చేయుచుందురు వాయుదేవుడు సుగంధముల నన్నిటిని మోచి కొని మెల్ల మెల్లగా కదలి వచ్చుచుండును ఇరుపార్శ్వముల యందు రంగుల పర్వత ధాతువులపై నుండి సెలయేళ్ళు లోయ లోనికి పడుచుండును అందుండి నీటి తుంపురులు పొగ మంచు వలె లేచి వాతావరణమును చల్లగా నుంచును అచ్చట కర్దముడు దేవతా స్త్రీలతో కూడిన కుబేరుని వలె కనుపించెను

820, 821 దేవతల యుద్యాన ప్రదేశముల యందును, నూతనారామము లందును వికసించిన కలువలతో, పద్మములతో

నలంకరింపబడిన మానస సరస్సుల గట్టులందును, రమ్యములైన పొదరిండ్ల యందును విహరించుచు కామగమనమైన తన విమాన మున సంచరించుచు కర్దమయోగి ఇంద్రుని యుద్యాన విహార మును తలపునకు తెచ్చెను

822 సమస్త భూభాగమును వాయువేగమున చరించి సకల దేవతల కన్న నతిశయముతో సర్వలోకములందును విహ రించెను నారాయణుని స్తుతించుచు జీవించు పుణ్యాత్ముల కంద రాని పదార్థము లుండవు

కర్దము డిట్లు దేవహూతికి సమస్త భూచక్రమును చూపి నిజ నివాసమునకు తిరిగివచ్చెను కామకేళి యందు కుతూహలము గల భార్య నుద్దేశించి రతి రహస్యములను సప్రయోగముగా నుపదేశించెను బహువిధములైన యిష్టభోగములతో బహు సంవత్సరము లొక ముహూర్తముగా గడపెను ఒకరి నొకరు సరసముగా చూచుకొనుట, తగినట్లు కౌగిలించుకొనుట, సంభా షించుకొనుట యను స్థితులలో కాలమే తెలియలేదు ఇట్లు నూరు సంవత్సరములు గడచెను

823 ఆ కర్దము డొకనాడు తన దేహమును తొమ్మిది దేహములుగా విభజించి తన శుక్రమును తొమ్మిది విధములుగా తన భార్య గర్భమందు నిహితము జేసెను

(భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము, పరాప్రకృతి అనబడునవి దేహము ధరించు టకు కావలసిన తొమ్మిది ప్రకృతులు ఇన్నిటితో దేహ మేర్పడును కనుక శుక్రమున తొమ్మిది విధములైన గర్భోత్పా దన శక్తులు నిమిడియుండును ఇవికాక పదియవ వాడు జీవుడు దేహమున నితడొక్కడే పురుషుడు మిగిలిన వారు తొమ్మండ్రును

స్త్రీలు కనక నే కర్దమునకు తొమ్మిది మంది పుత్రికలు, నొక పుత్రుడును పుట్టుదురు)

824 అది కారణముగా దేవహూతి తొమ్మిదిమంది పుత్రికలను కని మనస్సున సంతోషించెను

825 అటుపైన కర్దముడు సన్యసింపగోరెను దేవహూతి మనస్సున బాధపడి దుఃఖించెను అతని సమీపమున నిలబడి తన చెక్కిలిపై చేయి జేర్చి తలవంచి పాదములతో నేల వ్రాయుచు మెల్లగా నిట్లు పలికెను

826 "ఓ మహానుభావా! సంతానము కలుగు వరకు నాతో కూడి యుండుదునని పలికితివి మంచిదే కాని నాకు కూతుండ్రను మాత్రమిచ్చితివి దానికి గూడ నేను బాధపడను ఒక్క విషయ మాలోచింపుము వీరికి నేను పెండ్లిండ్లు చేసినచో భర్తలు, తామును సుఖపడుదురా యను భయము కలదు కనుక వీరికి తగిన వరులను సంపాదించి పెండ్లిండ్లు చేయుము అటుపైన నేనును వైరాగ్య మార్గమున నీ యడుగుజాడలలో వర్తింతును భర్త భార్యకు సంతతి కలిగించుట యొక్కటే కర్తవ్యము కాదు సంసార బంధమును తొలగించు మార్గము కూడ చూపవలసి యున్నది దానికి గల విఘ్నములను తొలగించి నాకు తత్త్వ సంహిత నుపదేశించి తెలివి కలిగించు సామర్థ్యము నీ కున్నది నీతో సాంగత్యము చేసితినే గాని నీ సామర్థ్యము వినియోగించు కొను నవకాశము లేక యింత కాలము మోహమున వయస్సు గడచిపోయినది లేదా నాకు పరతత్త్వము నుపదేశింపగల పుత్రుని ప్రసాదించి రక్షింపుము

(తనకు కావలసిన తత్త్వసంహితను పుత్రికలలో నొకతె

య పదేశింప లేదా? పుత్రుడే యేల కావలెను? ఇందు పుత్రికలుగా వర్ణింపబడిన తొమ్మిది మంది యు ప్రకృతులే కాని జీవులు కారు జీవుడుగా భర్తయే దిగివచ్చుట, వానిని పుత్రుడుగా గాంచుట, సామాన్య దాంపత్యధర్మము ఇది కాక విశేష ధర్మ మున్నది పరమపురుషుడే భర్త గా దేహము ధరించి పుత్రుడుగా మరల దిగివచ్చుట ఆత్మధర్మము లేక మోక్ష ధర్మము అదియే తత్త్వ సంహిత దాని నుపదేశించు పుత్రుని ప్రసాదింపుమని కోరినది కనుకనే నారాయణుడు పుత్రుడుగా దిగి వచ్చును

మరియొక వేదధర్మమిం దిమిడి యున్నది తొమ్మిది ప్రకృతులతో కూడిన దేహము క్షేత్ర మనియు పదియవవాడగు పురుషుడు క్షేత్రజ్ఞు డనియు చెప్పబడను దీని ననుసరించి స్త్రీ దేహము క్షేత్రముగను, పురుష దేహము బీజముగను ప్రజా సర్గమునకై నిర్మింపబడును పురుషుని వంశము పురుష దేహము వలన నిలబడును స్త్రీ దేహములు పురుషులకు క్షేత్రములుగా మాత్రమే పనిచేయును కాబట్టి వంశము నిలబడుటకై స్త్రీ సంతతి చాలదు మగబిడ్డ పుట్టి తీరవలయును )

827 పూర్వ మింతకాలము కామ భోగములను కోరి చపలతతో ప్రవర్తించితిని ఇహ సుఖముల యనుభవములం దిప్పటకే విరక్తి కలిగినది స్వచ్ఛమగు నీ గొప్పదనము తెలిసి కొనలేకయే నేను పూర్వము నిన్ను వరించితిని ఐనను నీ దయ నాయందు ఫలించెను నీ యందు నిశ్చల భక్తి కలిగినచో నాకు మోక్షము కలుగదా! నిన్ను తెలిసికొనుటకన్న నాకు తెలియ వలసిన దేమి ?

828, 829 మరియు సమదృష్టిగల సత్పురుషుంతో చేసిన సహవాసము సద్గతికి కారణ మగును నీచబుద్ధి, చాంచల్యము

గల పురుషుని తో చేసిన స్నేహము సద్గతి కలిగించును ఈ కారణముచేత నేను నిన్ను మనస్సున నిలిపి పూజించుకొందును. ఎట్టి వారికైన నితరజీవులతో కలిగిన సాంగత్యము పాపపుణ్యములకు కారణమగును ''

880 దేవహూతి యిట్లు బాధ బరువుతో ముచ్చటింపగా, కర్దముడు మనువు పుత్రికను చూచి విష్ణుని యాజ్ఞను మనస్సున స్మరించి యామెతో నిట్లనెను

881 '' నీవు మహానుభావుడైన మనువు పుత్రికవు మనస్సున దుఃఖపడరాదు అచిరకాలముననే నారాయణుడు శాశ్వత స్వరూపుడై నీ గర్భమున నవతారమూర్తిగా జనించును

882 883 నియమ బద్ధమైన జీవితము నడుపుము వ్రతాచరణమునందు నిష్ఠ కలిగియుండుము మనస్సు నారాయణునిపై నిలిపి జీవితము తపస్సుగా వర్తింపుము. ధనాదులను శ్రద్ధా భక్తులతో దానములు చేయుము శ్రీహరి పాద పద్మములు సర్వముఖంబు నర్పింపుము అతడు నీ పూజలకు సంతుష్టుడై నీ గర్భస్థుడగును అతడే దయతో ని మనస్సున కలిగిన సందేహములను ముడులు విప్పును. ''

884 అని కర్దముడు పలుకగా దేవహూతి హృదయ మానందము పొందెను అతని యుపదేశము ప్రకారము నారాయణు నారాధించు చుండగా కొన్ని సంవత్సరములు గడచెను

885 రాక్షస సంహారకుడైన హరి కర్దముని తేజస్సును ధరించెను జమ్మిచెట్టు తొర్రలో నిప్పురవ్వ పుట్టినట్లు, ఆ తేజము దేవహూతి గర్భమున నిలిచి యొక్క కుమారుడు పుట్టెను

( జమ్మిచెట్టు, రావిచెట్టు నెల్లిచెట్టు అనువానిలో నొకదాని కలప నుపయోగించి అరణి యను యజ్ఞసాధనమును నిర్మాణము చేయుదురు యజ్ఞమున అరణిని మథించి నిప్పు పుట్టించి అగ్ని హోత్రమును విహరించెదరు )

836 కుమారుడు జన్మించిన సమయమున ఆకాశమున దేవతల తూర్యముల ధ్వనులు వినిపించెను దేవతా సమూహములు సంతోషించి కల్పవృక్షముల పుష్పవృష్టి కల్పించిరి గంధర్వుల, కిన్నరుల గానము వినిపించెను అప్సరసలు నాట్యము చేసిరి దిక్కులయందు మంచు పొగవిచ్చుకొని నీరెండ ప్రసరించెను సముద్రములు కలత మాని ప్రశాంతము లైనవి సాధుజనుల మనస్సులు సంతుష్టి ననుభవించినవి హోమాగ్నులు చక్కని కాంతులతో ప్రజ్వరిల్లినవి చెట్లకు పుష్పసంపద, పంటలు వృద్ధియయ్యెను అన్ని జాతుల ధాన్యములు కొల్లగా పండెను

837 ఇట్లు వైభవముగా దేవహూతి గర్భమున నుద యించిన వాడు పరబ్రహ్మ స్వరూపుడైన నారాయణు డనియు, నతడు దేవహూతికి తత్త్వప్రబోధము కలిగించు ననియు నెరిగి మరీచి మొదలగు మునిగణములతో చతుర్ముఖుడు బయలుదేరి వచ్చి ఆ బాలుని దర్శించెను అతడు కర్దముని, దేవహూతిని జూచి యిట్లనెను

838 మీరు కీర్తింపదగిన జీవితచరిత్రము గలవారు మీ జన్మ సఫలము మీరు కపటము లేని జీవితము నడపుచు కేవల భక్తితో విష్ణుమూర్తి నర్చించిరి దాని ఫలితము చేకూరినది

839 ఆశ్రయించిన వారి భయమును పోగొట్టుట, ముని జనులచే నుతింపబడుట విష్ణుమూర్తికి సహజ గుణములు అతడు మీ కోరిక దీర్చుట యనగా మీ జన్మ సార్థక మగుటయే

840 మీరు కోరికతో కాచిన భక్తితో విష్ణు నారాధించి కూడ మోక్షమునకు స్ఫూర్తి సంపాదించ కోరని మీ పుత్రు మేమని వేగపడవచ్చునా? నీతిలోని రహస్యమును మీరు గ్రహించిరి

( కోరికలు మోక్షమునకు విఘ్నము. అనియు సంసార కారణము అనియు పెద్దలు చెప్పుదురు కోరికలు లేనివారో దాంపత్యము లేదు కాని కోరికలకు ఫలము భగవంతుడైనపుడు కోరినను మోక్షము కలుగును భగవంతుని ఆజ్ఞను తమ కోరికగా గాని జీవించినను మోక్షము కలుగును ఈ రెండును వీరియందు సత్యములైనవి ధర్మమునకు విరుద్ధము కాని కామము నా స్వరూపము అని కృష్ణుడు గీతలో చెప్పియున్నాడు ఎట్లు కోరవలెనో నేర్చుకొనుటయే నీతి నిపుణత )

841 నీ పుత్రికలను తొమ్మిది మందిని చక్కని శీలము వ్రతము, సదాచారము గల మునుల కిచ్చి వివాహము చేయుము, వారివలన ప్రజాసృష్టి బహువిధములుగా వృద్ధి పొందును

842 మీ కుమారుడు సమస్త జీవుల హృదయము లందలి కోరికలను తీర్చువాడు అతడు శాశ్వత స్వరూపుడు, ఆదిపురుషుడు మార్పు లుటనివాడు నగు నారాయణునిగా గ్రహింపుము

843 మీ తనయుడు బంగారు రంగు కలవాడు. విచ్చిన పద్మముల వంటి కన్నులతో అందమైనవాడు అతని పాదముల యందు పద్మరేఖ, వజ్రరేఖ, హలరేఖ, అంకుశరేఖ కనుపించుచున్నవి అతడు సత్త్వగుణమూర్తియై జ్ఞాన విజ్ఞాన యోగ మార్గములలో తన సామర్థ్యమున కర్మబద్ధులైన జీవుల నుద్ధరించుటకు భూమికి దిగివచ్చువాడు. ఇతడు తత్త్వ శాస్త్రమును బోధించి తల్లి హృదయమున గల సంశయము నెల్ల పోగొట్టును

844, 845 ఇతడు కడు ప్రసిద్ధుడై సిద్ధగణములచేత సేవింపబడు వాడై కపిలుడను పేర కీర్తి వహించి మూడు లోకముల యందును చరించును మహనీయుడు మైన సాంఖ్య యోగము వలన వెలుగొందు తత్త్వస్థితి యొక్క నిశ్చల స్వరూపుడై స్థిరపడును ."

846 అని పలికి చతుర్ముఖుడు మరీచి మహర్షిని పిలిచి కర్దముని పుత్రికల వివాహ నిర్వహణముకొరకచ్చట నిలిపి తన పుత్రులైన నారద, సనకసనందనాదులతో బ్రహ్మలోకము చేరుకొనెను

847 అపుడు కర్దముడు బ్రహ్మవాక్కులచేత ప్రేరేపింపబడిన వాడై తన పుత్రికలకు తగిన రీతిని వివాహము చేయ సంకల్పించెను కళ యను పుత్రికను మరీచికిని, అనసూయను అత్రికిని, శ్రద్ధయను కన్యను అంగిరసునకు, హవిర్భువు అను కన్యను పులస్త్యునకును, గతియను కన్యను క్రతువునకును, ఖ్యాతి యను కన్యను భృగువునకును, అరుంధతిని వశిష్ఠునకును, శాంతిని అధర్వునకును కన్యాదానము చేసి తన వంశాచారము ప్రకారము వివాహము నిర్వర్తించెను ఆ మునులు కన్యలను గ్రహించి కర్దమునిచే గౌరవింపబడి కట్న కానుకలు స్వీకరించి యతని యనుజ్ఞ పొంది తమ తమ పత్నులతో నాశ్రమములకు పోయిరి

( ఈ తొమ్మిది మంది పుత్రికలును మానవజాతిని వరింప వలసిన తొమ్మిది సద్గుణములు వారి భర్తలైన తొమ్మిది మంది మునులును ఆ కాశమున గల అసంఖ్యాకములైన సూర్య మూర్తులలో తొమ్మిది మంది సూర్యులు వారి కిరణముల తేజస్సులుగా వారి భార్యలు ప్రకాశించుచుందురు ఒక్కొక్క సూర్య మండలమునం దొక్కొక్క సద్గుణము ప్రధాన లక్షణమై

ప్రకాశించి, తన చుట్టును తిరుగు గ్రహముల పైని జీవులకు ప్రసన్నమైన మన్వంతర గుణముగా వర్తించును. ఆ సూర్యులు మన సూర్యుని కన్న ఆధ్యాత్మిక పరిణామమున చాల పురోగ మించిన వారు. కనుక వారి గ్రహ కుటుంబముల యందలి జీవులు కూడ మన కన్న చాల పురోగమించిన వారు. మరియు మన సూర్యుడును, మరి కొందరు సూర్యులును ఈ మరీచి మున్నగు వారికి శిష్యులై కిరణ రూపమున బ్రహ్మవిద్య నుపాసించుచు, మన భూమిపై జన్మించు మానవులకు తగినంతగా బ్రహ్మవిద్య నందించుచున్నారు. అంతే కాక మరీచి మొదలగు సూర్యుల నుండి అంశలై కిరణములు దిగి వచ్చి మన సూర్యుని ద్వారమున మన భూమిపై నివసించి దేహములు ధరించుచు, ఆయా కాలము లలో ఆయా ఋషులుగా పుట్టి పెరిగి బ్రహ్మవిద్య నుపదేశించు చున్నారు. అట్లే సనత్కుమారుడు అనబడు నొక పవిత్ర సూర్య మూర్తి నుండి యొక యంశ దిగివచ్చి మన శుక్రగ్రహము మీదుగా మన భూమిని చేరుకొని, యిప్పటికిని సనత్కుమారుడను పేర బ్రహ్మ మై వర్తించుచు మనువు యొక్క సృష్టి వ్యూహమును ప్రవర్తింప జేయుచున్నాడు. ఇంకను నిందలి వివరములు తెలియవలె నన్నచో జ్వాలాకూలుడను మహర్షి యుపదేశమున యాలిస్ ఏ బెయిలీ రచించిన గుప్త జ్యోతిర్విద్య [ Esoteric Astrology ] అను గ్రంథమున చూడవచ్చును )

అటుపైన మూడు యుగములు గడచెను. విష్ణుమూర్తి తన యింట కపిలుడుగా నవతరించి యున్నాడని యెఱిగిన కర్దము డొకనాడు కపిలు నొంటరిగా గొనిపోయి అతనికి సాష్టాంగ పడి మ్రొక్కెను

848 'నీవు నారాయణుడు, వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు ననబడు నాలుగు వ్యూహములతో కూడిన

యాత్మ గలవాడవు నీ సృష్టిలోని యీ జీవులలో సంసారబద్ధుల
నిన్ను చూడలేరు వారనేకములైన అశుభ కర్మల నాచరించుచు
వాని ఫలితము లను దావాగ్నులచే దహింపబడుచుందురు వార
సృష్టి పారము చేరలేరు కొంత కాల మిట్లు జరిగిన వెనుక ఆ
జీవుల జననమునకు కారకులైన దేవతలు వారి యెడల ప్రసన్ను
లగుదురు దానితో అనేక జన్మలలో యోగవిద్య నార్జించుకొ
కూడబెట్టుకొందురు దాని వలన చిరకాలమునకు తపస్సమా
నిష్ఠ కుదురును అప్పుడు వారు ఒంటరితనము ననుభవించుచ
యోగిజనులై తమ్ము తాము ధారణ చేసి కొందురు అట్టి
మహానుభావులు దర్శించు పురుషమూర్తివైన నీవు నా యింట
బుట్టితివి

(నారాయణుని నాలుగు వ్యూహములును జీవులలో మనస్సు
బుద్ధి, చిత్తము, అహంకారము అనబడు నంతఃకరణ చతుష్టయ
ముగా పని చేయుచుండుగ వాని యందు ఇంద్రియములు మొదలగ
శక్తులుగా దేవతలు పనిచేయుచుందురు చిరకాలము కర్మఫలమ
లలో చిక్కుకొని తపించుచున్న జీవులకీ దేవతలు తోడ్పడ
సమయము వచ్చినపుడెల్ల తమ్ము గూర్చి తమకు జ్ఞప్తి చేయ
చుందురు దానితో సృష్టి పరిణామ క్రమమున వివేకము
వితర్కము, విచారము, జిజ్ఞాస, సహనము, మోక్షేచ్ఛ మున్నగ
గుణములు వికసించును వాని వలన యోగదృష్టి చెదర
మసకమసకగా నలవడుచుండును అనేక జన్మలలో కూడబెట్టుకొని
యోగదృష్టి వలన యోగాభ్యాసము నందు నిష్ఠ కుదురును
తపస్సు అభ్యాస మగును సమాధి నిలబడును అందరిలో నొక్కని
చూచి సంతోషకరమైన యొంటరితన మనుభవింతురు వారి
దర్శింపబడు నొక్కడే ఆ విద్య నుపదేశించుటకు కపిలుడై
జన్మించెను అతడు సాంఖ్య యోగముల నుపదేశించును సాంఖ్య

యోగి యనగా కలిగిన జ్ఞానములో సదాచరణమును కలుపుట ఇచ్చట సాంఖ్యము, యోగము అనునవి రెండంశములు గాని, సాంఖ్యయోగ మన్నది ఒకే యంశము కాదు జనుల కెల్ల శుభము సాంఖ్యయోగము ” అని ద్వితీయ స్కంధమున నుపదేశింపబడినది సాంఖ్యము గా వ్యక్తి కతీతమైన సంపూర్ణ జ్ఞానము యోగ మనగా నా జ్ఞానము నాచరించు కర్మలో సమన్వయించి సాధనము చేయుట కొనుక సాంఖ్య యోగ మన్నది యొకే యంశమును తెలుపునని వ్యాఖ్యానించిరి ఇది సరిగాదు ద్వితీయ స్కంధము మూల శ్లోకమున “ ఏతావాన్ సాంఖ్యయోగాభ్యాం స్వధర్మ పరినిష్ఠయా । జన్మలాభః పరః పుంసా మంతే నారాయణ స్మృతిః ॥ అని చెప్పబడినది ఇచ్చట “ సాంఖ్యయోగాభ్యాం ” అని ద్వివచనమున విడదీసి చెప్ప బడుటచే సాంఖ్యము, యోగము సాధనని యిందలి రెండు లక్ష్యములే గాని యొకటి కాదని నిశ్చిత మగుచున్నది

మరికొందరు సాంఖ్యమార్గము, యోగమార్గము వేరువేరు సాధనలని భావింతురు ఇదియు సత్యమార్గము కాదు సాంఖ్య యోగములను వేర్వేరుగా చెప్పువారు పిల్లకాయలు పండితులుకారు చెప్పరు సాంఖ్యము సాధన చేసిన ఫలితము యోగమే, యోగము సాధన చేసిన ఫలితము సాంఖ్యమే యని భగవద్గీతలో కృష్ణుడు చెప్పెను )

849 మేము సంసార చక్రమున పరిభ్రమించు చున్నాము. పామరులము అట్టి మా ప్రవర్తనములలో లోపము లను లెక్కచేయక నీవు నా యింట పుట్టితివి పూర్వము నాకు దయచేసిన వాగ్దానము తప్పకుండ నీ విట్లనుగ్రహించితివి

( ఇచ్చట భగవంతుడు తనకు చేసిన వాగ్దానము తన యింట ప్రతిశ్రుతము చేయబడినదని కర్దముడు చెప్పెను ప్రతిశ్రుత మనగా ప్రతిజ్ఞ యని శాస్త్రార్థము ప్రతిజ్ఞ యనగా తెలియజేయగల వాక్కని తర్కవ్యాకరణాది శాస్త్రములందు తెలియును లోకమున ప్రతిజ్ఞ యనగా శపథముచేయుట ఇది సరియైన యర్థము కాదు ఈ రెండును గాక ప్రతిశ్రుత మను మాటకు ప్రత్యేకమైన యర్థమున్నది ప్రతిధ్వనించి వినబడుట ప్రతిశ్రుతము నారాయణుడు కర్దమునకు ప్రత్యక్షుడై దిగివత్తునని పూర్వము వరమిచ్చెను ఆ వరము తన హృదయము నుండియే ప్రతిధ్వనిగా వినిపించెనని యర్థము కనుకనే తన యింట ప్రతిశ్రుతము లైనవని చెప్పుచున్నాడు )

850 ఈ నీ యవతారమే మా కింత దురవగాహముగా నుండగా నిక ప్రకృతి కలితమైన బలమును ప్రదర్శించుటకై చతుర్భుజాములతో దిగివచ్చిన నీ అవతార వ్యూహము ఎ మరెంత గొప్పవో మే మెట్లు గ్రహింపగలము ? నీ అవతారములు నీ సామర్థ్యమున కనురూపములు

( ఎంతటి అవతారమైనను మానవ శరీరమున దిగి వచ్చినపుడు చూచువారికి ప్రాకృత గుణములే గోచరించునుగాని, అప్రాకృతములైన శౌర్య ధైర్య స్థైర్య ఔదార్య ఆశ్రిత వత్సలత్వాది గుణగణ సమూహముల మహార్ణవ మంతు పట్టదు అవతారమూర్తిని చూచి సమకాలికులు రాగా నితడు కొంచె మెక్కువ తెలివి గలవాడు అని మాత్రము గ్రహింపగలరు ఇక చతుర్భుజాదులు సంకర్షణాదివ్యూహములలో నాలుగును వ్యూహములుగా లోపల నిమిడియుండి పనిచేయునే గాని అందరకును గోచరింపవు ఒక్కొక్కప్పుడు యుద్ధాదులందును, ఆశ్రిత రక్షణము

నందును చతుర్భుజములు గాత్మ్న శరీరమున ఎనిచేసినను, స్థూల శరీరమున కనుపింపవు భీముడు అశ్వత్థామను చంపబోవుచుండగా ద్రౌపది అడ్డుపడినపుడు శ్రీకృష్ణుడు రెండు చేతుల భీముని వారించి, కడమ రెంటను గ్రుపడవు రెకను తొలగించెనని చెప్పబడియున్నది అప్పుడు గూడ భీమాదులకు చతుర్భుజములు గోచరింపలేదు అవి యప్రాకృత గుణములు )

851 852 నీవు నిత్యుడు నీ యాశ్రిత జనులను రక్షించుట కొరకు సమ్మతించి, ధరించిన రూపములు నీ పుణ్య ప్రవర్తనముల కనురూపములు

853 సృష్టి కర్తల నున్న యథార్థ జ్ఞానము దర్శించుటకు పాండిత్యము చాలదు విద్వాంసులు సాష్టాంగపడి నమస్కరించు పాద పీఠముగల నన్ను స్తోత్రము చేయుట మా తరమా ?

854 ఆరు సద్గుణములతో కూడిన ఈశ్వర లక్షణములకు కారణమైన పరమేశ్వరుడవు నీవు ఈ ప్రకృతి, పురుషుడు, మహత్తు, అహంకారము, తన్మాత్రలు నీ రూపములే వానిని క్షోభింపజేయు కాలస్వరూపుడవు నీవే కాలమూర్తిగా నిన్ను నీవే ధరించుకొని సర్వమును ధరించుచుంటివి కాని నిన్ను ధరించు నాధారము లేదు ఈ సృష్టి కాత్మ స్వరూపుడవు చేతన శక్తిగా నిలబడి నీ గర్భమున నిలిచిన సమస్త ప్రపంచమునను జ్ఞాన మూర్తివిగా నిండియున్నావు నీ ఇచ్ఛ వచ్చినట్లు శక్తి నడచు కొనును సర్వమునకు సాక్షిగా నిలబడి గూడ కపిలు డను పేర ప్రత్యక్షమైన నీకు నమస్కరించెదను నీవు పుత్రుడవై పుట్టుట వలన నా ఋణత్రయమును పోగొట్టితివి

( ఇందలి అంశము లన్నియు పూర్వము వివరింపబడినవి ఋణత్రయ మనగా మూడు ఋణములు మానవుడు దేవఋణము,

పితృఋణము, ఋషి ఋణము అను మూడు ఋణములతో పుట్టును
1 తన దేహేంద్రియాదులు నిర్మించి పెట్టిన దేవతలకు ఋణపడి
పుట్టును 2 గర్భధారణము, ఉత్పత్తి కల్పించిన పితృదేవత
లకు ఋణపడ పుట్టును 3 వివిధ సుఖజీవన మార్గములకు
శాస్త్రములను దర్శించి ఇచ్చిన ఋషులకు ఋణపడి పుట్టును

తాను నివసించు భూమి, నీరు, గాలి పవిత్రముగా నుంచి
ఇతరులకు జీవికను సదుపాయము చేయుట వలన దేవ ఋణము
తీర్చుకొనును వివాహమాడి సన్తంతతి పొందుట వలన పితృ
ఋణము తీర్చుకొనును జ్ఞాన మార్జించి, శాస్త్రాధ్యయనము చేసి
ఇతరులకు బోధించుట వలన ఋషి ఋణము తీర్చుకొనును )

855 పెద్దలచే నాదరింపబడు వ్రతము ననుష్ఠించి యోగ
సమాధి నియమ మవలంబించి, నీ పాదపద్మములను హృదయమున
జేర్చి దు ఖ మంటని స్థితియందు నిలబడుటకై తగిన పుణ్యస్థలము
లందు సంచరించెదను ( గృహస్థాశ్రమము చాలించి పవిత్ర
ప్రదేశముల యందు సంచరింతునని యర్థము ఈ ఘట్టమున
తండ్రి యగు కర్దముడు పుత్రుడగు కపిలునకు సాష్టాంగ నమస్కా
రము చేసెనని చెప్పబడినది ఇది సామాన్య ధర్మమున కప
వాదము రాముడు, పరశురాముడు మున్నగు నవతరములలో
కూడ పుత్రులు తండ్రికి నమస్కరించుటయే గాని యిట్లు జరుగ
లేదు కృష్ణునకు మాత్రము జననకాలమున వసుదేవుడు నమస్క
రించి స్తుతించెను ఈ రెండు ఘట్టములును అప్రకృతములని
గ్రహింపవలెను కృష్ణుడు గూడ తరువాతి కాలమున వసుదేవు
నకే నమస్కరించెను )

856 అని కర్దమ ప్రజాపతి విన్నవింపగా భగవంతు
డగు కపిలు డిట్లనెను

757 నేను నీకు వాగ్దానము చేసిన మాట తప్పకుండ నీ యింట పుట్టితిని కారణము నేని ప్రవర్తనము, అపారమైన దయాగుణము నా మార్గము నా సకల జీవుల కోరికలను తీర్చుటయే పని నే నిట్లు ముని వేషము ధరించి దిగి వచ్చుట నా కొరకు కాదు మహాత్ములైన మునులకు పరమాత్మను గూర్చిన వివేకము కలిగించుటకు, పరమాత్మ గురువు రూపమున వచ్చి తత్త్వమును బోధించునని తెలియబరచుటకు మాత్రమే నే నిట్లు ప్రత్యేకముగా నొక శరీరము ధరించి చరించుట ఇట్లు వచ్చిననే గాని నా పదధ్యానము నందు, భక్తియోగము నందు కావలసిన బుద్ధి నిశ్చలత సజ్జనుల కేర్పడదు ( పరమాత్మ అవ్యక్త స్వరూపుడని నమ్మిన వారికి కూడ సశరీరమైన గురువు రూపము గోచరించి మార్గము తీర్చిదిద్దబడనిచో తృప్తియు సంపూర్ణ విశ్వాసము కలుగవు కలుగనిచో యోగమార్గ మభ్యసింప బడినను సమాధి నిశ్చలత్వము చేకూరదు ఎన్ని చెప్పినను విశ్వాసము వలన మార్గ మేర్పడును గాని విజ్ఞానము వలన నేర్పడదు దీనిని లోకమునకు తెలియబరచుటకే భగవానుడు కపిలుని యవతార మెత్తెను ఒక్కొక్క యవతారమున నొక్కొక్క కర్తవ్యము నిర్వర్తించబడును ఆ యవతారమున మిగిలిన కర్తవ్యములకు ప్రాధాన్యము కలుగ నక్కర లేదు కనుక నే కపిలావతారమున దుష్ట శిక్షణాదులు ప్రసక్తములు కాలేదు

కపిలుని యవతార ప్రయోజనము కేవలము జగద్గురుత్వము కనుకనే తండ్రి గూడ శిష్యుడై నమస్కరించుట ఈ సంప్రదాయము ననుసరించియే సన్యసించిన కొడుకు తండ్రికి నమస్కరింపకుండుట, సన్యసించిన పుత్రునకు సంసారులైన తల్లి దండ్రులు నమస్కరించుట నేటికిని మనము

చూచుచున్నాము ఆదిశంకరులు, వారి యనుయాయుల సంప్ర దాయమున కూడ దీనినే చూచుచున్నాము బుద్ధ దేవుడు గూడ కపిలవస్తు నగరమునకు వచ్చినపుడిదే సంప్రదాయము పాటింప బడినట్లు వినుచున్నాము ఇక కృష్ణావతార మొక్కటే సన్న్యాసాశ్రమముతో సంబంధము లేక తల్లిదండ్రుల నమస్కారములను స్వీకరించినది ఇది జగదాచార్యత్వమున కపిలుని స్థితికన్న పరిపూర్ణమైన స్థితి అట్టి కృష్ణుడు ధర్మ సంస్థాపనము నుద్దేశించి యావజ్జీవితము దేవకీ వసుదేవులకు, నంద యశోదలకు, వ్యాస సాందీపన్యాది గురువులకు, బ్రహ్మవాదులగు ఋషులకు నమస్కరించుట మాన లేదు ఈ యవతారమున ఆచార్యత్వము, పుత్రత్వము, శిష్యత్వము, గురుత్వము లీలలు మాత్రమే అనగా కృష్ణునకు నమస్కారము పుచ్చుకొనుట, చేయుట పిల్లల యాటలవంటివి )

858 చక్కని నిష్ఠతో యోగాభ్యాసము చేయుము సకల కర్మములను సన్యసింపుము మోహము తొలగి పోవును మనో వికారములు తొలగవలె నన్నుచో నన్ను భక్తితో భజింపుము ఆ స్థితియే మోక్షము ( సకల కర్మలను సన్యసించుట యనగా వాని నాచరించుటకు తా నారంభించు కారణములను పరిత్యాగము చేయుట అప్పుడు తనచే నాచరింపబడు సత్కర్మ లుండును గాని, తానాచరించు కర్మ లేవియు నుండవు సర్వారంభ పరిత్యాగియే సన్యాసి యని భగవద్గీతలో చెప్పబడినది కొందరు కర్మాచరణమే దోషము కలిగించును కనుక కర్మ లాచరించుటయే మానవలె ననుకొందురు ఈ విషయమున నా నిశ్చయమును వినుము యజ్ఞము దానము, తపస్సుగా చేయబడు కర్మను చేసియే తీరవలెను, విడువనేరాదు యజ్ఞము, దానము, తపస్సు బుద్ధిజీవులను పవిత్రము చేయుచుండును " అనియు భగవద్గీత చెప్పుచున్నది లేనిచో కర్తయుడు కర్మాచరణమే సన్యసించినచో

తపోవనమున కేగుట యోగాభ్యాసము చేయుట కూడ నక్కర లేదు కదా !)

859 నన్ను పరమేశ్వరునిగా నున్నతమైన జ్యోతిగా ఆది యంతములు లేని వానినిగా ధ్యానము చేయుటయే కాక, సకల జీవరాసుల యందును గుహలో దాగియున్న వానినిగా కూడ ధ్యానము చేయవలెను దానితో నేను పాప రహితుడని తెలియును (ఇచ్చట మనస్సు, బుద్ధి చిత్తము అహంకారము అనబడు నవ్యక్తి సృష్టియైన అంతరంగము గుహగా పోల్చబడినది కనుపించు దేహము, సౌందర్యము, పేరు, సంబంధము కాక కనుపించని అంతరంగము లోపల నంతర్యామిగా భగవంతుని దర్శింప వలెను ఈ దర్శనమునే గుహలో దాగియున్న సత్యము లేక గుహ్యము అందురు )

860 నీ యంతఃకరణమును పద్మముగా ధ్యానించి దాని కర్ణిక యందు నన్ను స్థిరముగా స్థాపించుకొన్నచో నింద్రియములు లొంగును అప్పుడు మనస్సను కన్నుతో నన్ను సంపూర్ణముగా దర్శింపగలవు

861, 862 అట్లు సాధన చేసినచో మోక్షము పొందెద వని కపిలుడు పలికెను కర్దము డుపదేశమును స్వీకరించి బాలునకు ప్రదక్షిణము చేసి భక్తితో నమస్కరించెను

863 కర్దముడు సెలవు తీసికొని ముని గణములచే సేవింపబడుచున్న వనమున కేగి అందు మౌనము వహించి, నిస్సంగుడై అగ్ని హోత్రము లేక, ఇల్లు లేక, తనకు తానే శరణ మని నమ్మి చరించెను ( మోక్ష పరాయణుడు మౌనము వహించు వనియు, అనికేతనుడు, స్థిరమతియు నని భగవద్గీతలో

చెప్పబడినది ఇందలి మౌనము హృదయ ధర్మము గాని, కంఠ గతము కాదు అగ్నిహోత్రము లేనివాడనగా నిత్యాగ్నిహోత్రము, హోమము మాని నిరంతర ధ్యానమున చరించు వాడని యర్థము అగ్నులు రెండు విధములు వైతానాగ్నులు, బహిర్యాగ్నులు అందు మొదటివి సమిధలను వెలిగించి, రగుల్కొల్పు బాహ్యాగ్నులు మిగిలినవి దేహము లోపల నుండు ఆకలి దప్పులు, సంకల్పము, తెలివి, శాస్త్ర వివేకము మొదలగునవి ఈ రెండింటి యందును అగ్ని యొక్క అస్తిత్వ మొక్కటే నేతితో తడిపిన సమిధ మండుచున్నప్పు డేమి జరుగునో, మనస్సున కామములు రగుల్కొను నపుడు కూడ అదే జరుగును ధ్యానము చేయునపుడు కూడ నదేజరుగును వేడి, వెలుగు పుట్టుట, భౌతిక ద్రవ్యము దగ్ధమగుట, స్థూల తత్త్వములు సూక్ష్మ తత్త్వములుగా మారుట యే అగ్ని యందైనను సమానమే కాని సృష్టి వ్యవహారమున ఇండ్లు తగులబడుటకును, వంట చేయుబడుటకును భేదమున్నది ఇట్టి భేదము ననుసరించియే మనము చేయు పనులు దుష్కర్మ లనియు, సత్కర్మ లనియు విభాగము కలిగి యున్నవి దుష్కర్మలను విడిచి సత్కర్మలను ఆచరించుటకు అభ్యాసమనబడు సాధన కావలెను అది మొదట బహిర్యాగముతో సాధింపబడును వయస్సును బట్టియు, సాధనను బట్టియు సంకల్పములు చెలరేగు లక్షణము తగ్గును అప్పుడు సంకల్పములకు ఫలములతో సంబంధము సడలును ఇది జరిగిన వారు బాహ్యమైన అగ్నిహోత్రమును విడిచి లోపలి యగ్నుల నుపాసింతురు ఇదియే సన్న్యాసమున జరుగు మార్పు కొందరు శబ్దము, స్పర్శము మొదలగు నింద్రియార్థములను, ఇంద్రియము లనబడు అగ్నుల యందు హోమము చేయుచున్నారు కొందరు ఇంద్రియములను సంయమ మను నగ్ని యందు హోమము చేయుచున్నారు ఈ

విధముగా బ్రహ్మ ముఖమున స్మృతిలో బహువిధములైన యజ్ఞములు విస్తరించి యున్నవి' అని భగవద్గీత చెప్పుచున్నది పరమావధిలో నిదిధ్యాసముతో నైష్కర్మ్యముతో నేకర్మ నాచరించినను బ్రహ్మార్పణముగా బ్రహ్మమయ మగు వాసిస్తులో బ్రహ్మయను నగ్నియందు, బ్రహ్మముచే హోమము చేయబడు చున్న దనియు, బ్రహ్మమే దానికి ఫల మనియు ధ్యానించుచు నేమరుపాటు లేక చేసినచో తన కర్మయని లేక బ్రహ్మ కర్మ జరుగును. సమాధి స్థితి నిలబడును దీని సారమునే కపిలు డుపదేశించెను దానితో కర్దముడు గార్హస్థ్యమును విడిచి, ఇల్లు విడిచి మునుల నడుమ చరించెను ఉత్సవములలో అహోరాత్రములు దైవ కార్యమునకై పనిచేయు చున్నవాడు వేళకు స్నానము, సంధ్య, భోజనము చేయలేకపోవుట యెట్టిదో సన్న్యాసము కూడ నట్టిదే పెద్ద పని పెట్టుకొన్నప్పుడు తన యవశిష్టములు తీర్చుకొని యథావిధిగా తీరుబడిగా స్నానము, సంధ్య షోడశోపచార పూజ, భోజనముచేసి తీర్చుచుండు నంతలో కాలము మించిపోవును అట్లని ఏ పనియు లేనివాడు దీక్షావతుని చూచి స్నానాదులు మాని సన్న్యాసి నన్నచో పులినిచూచి నక్క వాతపెట్టుకొన్నట్లే దీనుల సేవకై తిరుగుచు దినముల తరబడి తన యింటికి పోవుట మానిన వాడును, వ్యభిచారాది వృత్తులలో నిమగ్నుడై మానిన వాడును నొక్కటే యనవచ్చునా ? )

864 పరబ్రహ్మమున మనస్సు నిలుపుటచే అహంకారము ( నేనను దేహ నామ రూపాది ప్రజ్ఞ ) మాయ మయ్యెను దానితో మమకారము ( నాది యని వస్తువులపై, వ్యక్తులపై ప్రసరించు ప్రజ్ఞ ) తొలగిపోయెను దయాగుణము వికసించి సర్వజీవుల యందును సమత్వము కలిగెను ( దేవుని యంతర్యామిత్వమే సమత్వము ) శాంత మనబడు ప్రజ్ఞ సిందెను

తరంగములు లేని సముద్రమువలె తన్ను తాను ధరించు
యేర్పడెను సకల ప్రపంచము వాసుదేవమయ మని భాసించెను
ఇట్లు భక్తి యోగమున కర్దముడు భాగవతుల మార్గమ
పొందెను

భక్తి యోగమున భాగవతిగతి పొందుట యనగా అపా
కృతమైన దివ్య శరీరము ధరించుట అటుపైన భౌతిక శరీరమ
ప్రసక్తి యుండదు కర్దముని భౌతిక శరీరము అప్రయత్నముగ
జారి పోయెనని యర్థము ప్రథమ స్కంధమున నారదుడు త
పూర్వజన్మ వృత్తాంతము చెప్పుచు తానును కర్మానురూపమై
దేహము పోయిన వెనుక హరి కృపావశమున శుద్ధసత్త్వమయ
మైన భాగవత దేహమును పొందితినని చెప్పెను )

# తృతీయ స్కంధము

## (మూలము)

- సనక సనందనాదులు వైకుంఠమున కరుగుట -

క. గీర్వాణులార! యుష్మ
త్పూర్వజు లాత్మీయసుతులు పుణ్యులు విచర
న్నిర్వాణులు సనకాదులు
సర్వంకష శేముషీ విచక్షణు లెందున్ 502

క. వారలు నిస్స్పృహు లగుచు న
వారణ భువనంబు లెల్ల వడిఁ గ్రుమ్మరుచున్
ధీరు లొకనాఁడు భక్తి
శ్రీ రమణీశ్వర పదాబ్జ సేవానిరతిన్ 503

చ. చని చని కాంచి రంత బుధ సత్తము లంచిత నిత్యదివ్య శో
భన విభవాభిరామముఁ బ్రపన్నజన స్తవనీయ నామమున్
జనన విరామమున్ సుజన సన్నుత భూమము భక్తలోక పా
లన గుణధామముం బరలలామముఁ జారు వికుంఠధామమున్ 504

ఉ. ఆ మహనీయ పట్టణమునందు వసించెడు వార లాత్మ ని
ష్కామ ఫలంబె సత్ఫలముగాఁ దలపోసి ముముక్షుధర్ములై
శ్రీమహిళాధిపాంఘ్రి సరసీరుహపూజ లొనర్చుచుఁ మహో
ద్దామ తదీయ రూపములఁ దాల్చి సుఖించుచు నుందు
రెప్పుడున్ 505

చ విగత రజస్తమోగుణుఁడు విశ్రుత చారుయశుండు శుద్ధ స
త్త్వగుణుఁ డజుం డనాది భగవంతుఁ డనంతుఁ డనంత శక్తియుఙ్
నిగమచయాంత వేద్యుఁడు వినిశ్చల నిర్మల ధర్మమూర్తి యు
న్నగు హరి పేరఁ బెంపెసఁగు నన్నగరోపవనమ్ము లిమ్ములన్
506

వ మఱియుఁ గైవల్యంబు మూర్తీభవించిన తెఱంగునం బొలు
పారుచు నైశ్శ్రేయస నామంబున నభిరామంబై సతతంబును
సకలర్తుధర్మంబులు గలిగి, యర్థిజనంబుల మనంబుల ఘనంబులుగ
నీరిక లెత్తిన కోరికలు సారికలు గొన నొసంగుచు, నితర తరు
రహితంబులును గామదోహన సహితంబులును బుష్పఫలభరితం
బులును నైన తనర్చు సంతానవన సంతానంబులు, సముచిత
వసంతసమయ సౌభాగ్య సంపదభిశోభిత వాసంతికా కుసుమనికర
పరిమళ మిళిత గళిత మకరంద లలితామోద ముదిత హృద
యులై, యఖండ తేజోనిధి యగు పుండరీకాక్షు చరిత్రంబు లుగ్గ
డింపలేక ఖండితజ్ఞాను లయ్యును నిరంతరాయ విషయసుఖానుభవ
కారణం బగుట, నిందిరా సుందరీరమణ చరణసేవా విరమణ
కారిణియై యున్నదని తలంచి తద్గంధప్రాపక గంధవహునిం దిరస్క-
రించి నారాయణ భజనపరాయణులై చరియించు సుందరీయుక్తు
లైన వైమానికులును, వైమానిక మానసోత్సేకంబుగం
బారావత హంస సారస శుక పిక చాతక తిత్తిరి మయూర
రథాంగముఖ్య విహంగ కోలాహల విరామంబుగా, నరవింద
నయన కథాగానంబు లమానంబులుగా మొరయ, మదవ
దిందిందిర సంశోభాకలిత పుష్పవల్లీమతల్లికలును, నకుంఠిత
చరితుండైన వికుంఠనిలయుని కంఠంబున దేజరిల్లు విలసిత
తులసీదామంబుం గనుంగొని, యీ తులసీ దామంబు
హరిమంగళ గళ విలగ్నంబై యుండు సౌభాగ్యంబు వశయుట

బును, ధర్మంబునకు నిర్మలస్థానంబును, సుకృతమూలంబు
నకు నాలవాలంబును నయి పొలుపొందుచుండు 507

చ హరివిముఖాత్ము లన్యవిషయాదృత చిత్తులుఁ బాపవర్త్ములు
న్నిరయనిపాత హేతువును నింద్యచరిత్రము నైన దుష్కథా
నిరతిఁ జరించువారలును నేరరు పొందఁగ నిందిరామనో
హర చరణారవింద భజనాత్మకు లుండెడు గొంది నారయన్
508

వ వెండియు 509

చ హరిఁ బరమేశుఁ గేశవు ననంతు భజింపఁగ ధర్మతత్త్వధీ
పరిణతిసాధనం బగు స్వభావముఁ దాల్చినయట్టి మర్త్యు లా
సరసిజనేత్రు మాయను భృశంబుగ మోహితులై తదంఘ్రి పం
కరుహము లర్థిమైఁ గొలువఁ గానమిఁ బొందరు తత్పదంబునన్
510

చ మఱియు సరోరుహోదరుని మంగళ దివ్యకథానులాప ని
ర్భరపరితోష బాష్పకణబంధుర చారుకపోల గద్గద
స్వర పులకీకృతాంగు లగువారలు నిస్స్పృహచిత్తు లత్యహం
కరణ విదూరు లుందురు సుకర్ముల యుండెడి పుణ్యభూములన్
511

వ అందు 512

మ వరవైకుంఠము సారసాకరము దివ్యస్వర్ణ శాలాంక గో
పురహర్మ్యావృత మైన తద్భవన మంభోజంబు, దన్మందిరాం
తర విభ్రాజితభోగి గర్ణిక, తదుద్యద్భోగ పర్యంక మం
దిరవొందగ వసియించు మాధవుఁడు దా నేపారు భృంగాకృతిన్
513

వ అంత 514

మ హరిచేఁ జాలితమైన కాంచనవిమానారూఢులైనట్టి స
త్పురుషానీకముచేఁ దనర్చి, విభవాపూర్ణ ప్రభావోన్నతిం
గర మొప్పారు తదీయధామము జగత్కల్యాణమూర్తుల్ మునీ
శ్వరు లర్థిన్ నిజయోగశక్తిఁ బరితుష్టస్వాంతులై చొచ్చిరన్
515

వ డాయం జని, 516

చ మరకత రత్నతోరణ సమంచిత కుడ్య కవాట గేహళీ
విరచిత పట్టు కక్ష్య లరవిందదళాక్షు విలోకనోత్సవా
దరమతి నన్యమం గనక దాఁటి, యనంతర కక్ష్యయందు ని
ద్దఱను దదీయపాలుర నుదార సమాన వయో విశేషులన్ 517

సీ కాంచన నవరత్న కటకాంగుళీయక
హార కేయూర మంజీరధరుల,
గమనీయ సౌరభాగత మత్తమధుకర
కలిత సద్వనమాలికా విరాజి
తోరస్థలుల, గదాయుతులను, ఘనచతు
ర్బాహుల, నున్నతోత్సాహ మతుల,
నారూఢ రోషానలారుణితాక్షుల,
భ్రూలతాకౌటిల్య ఫాలతలుల,

తే వేత్రదండాభిరాముల, వెలయు నమ్ము
కుంద శుద్ధాంతమంది రాళింద భూమి
నున్న యిద్దఱ సనకాదియోగివరులు
చూచుచును, వృద్ధు లయ్యు నా సుభగమతులు 518

క ధీరతఁ బంచాబ్దముల కు
మారకులై కానఁబడుచు మనమున శంకిం
గూరక చతురాత్మకు లని
వారిత గమనమున డాయ వచ్చిన, నెదురన్ 519

క (శ్రీ)లలనేశ్వర దర్శన
లాలసులై యేఁగు బుధలలాముల నతి దు
శ్శీలతఁ దద్వచన ప్రీతి
కూలమతిం బోవకుండఁ గుటిలాత్మకులై 520

క వారించిన, వారలు బ్రౌఁ
దారకు లీక్షించుచుండ దారుణపటు రో
షారుణితాంబకులై రోద
వారించుచు వారు నచటివారును వినఁగన్ 521

వ ఇట్లనిరి 522

చ "పరము ననంతు భక్తపరిపాలు సుహృత్తము నిష్టు నీశ్వరే
శ్వరు భజియింపఁ గోరి యనివారణ నిం దరుదేర, నిచ్చలుఁగా
భరితము దాత్ములై కొలువఁ బాయక తద్భజనాంతరాయ త
త్పరమతి మా కు నిప్పు డరిపడ్డ దురాత్ముల నేఁడు గంటిరే? 523

వ అని మఱియు సనక సనందనాదు లిట్లనిరి మీ మనంబుల, స్వామిహితార్థంబై నిష్కపటవర్తనుల మైన మాబోఁటులఁ, గుహాకవృత్తి గల యితర జనంబులు భగవత్సదనంబుఁ బ్రవే శింతురో యను శంకం జేసి కొందఱం బ్రవేశింపం జేయుటయుఁ గొందఱ వారించుటయు దౌవారికస్వభావం బని వారింపం దలంచితిరేని, (ప్ర)శాంత దివ్యమంగళ విగ్రహుండును, గతని(గ

మ " వరయోగీశ్వరులార! మమ్ము మది నొవ్వన్ మీర లిట్లన్న ని
ష్ఠురవాక్యంబుల కింక మా మనములన్ శోకింపఁగా రాదు, న
త్పురుషశ్రేణిఁ బరాభవించిన వృథాభూతాత్ములన్ మమ్ము మా
దురితం బింతకుఁ దెచ్చె, మీఁద శుభముం దూకొందు మే
మారయన్ 528

వ అది యెట్లంటిరేని, 529

ఉ మీ కరుణావలోకన సమేతులఁగా మముఁ జేయఁ జిత్తముల్
దూకొననేని, మా చనవుఁ దోఁయక యీఁ దగు,
లోభమోహముల్
గైకొని పుట్టుచోట నవకంజదళాక్షుని నామవిస్మృతిం
బైకొనకుండ, దానన శుభం బగు మీఁది మదీయ
జన్మముల్ " 530

వ అను సమయంబున, 531

మ హరి సర్వేశుఁ డనంతుఁ డా కలకలం బాలించి, పద్మాలయా
సరసాలాప వినోదసౌఖ్యరచనల్ సాలించి, శుద్ధాంతమం
దిర మాణిక్యసుదేహళుల్ గడచి యేతెంచెం, బ్రసన్నార్తి సం
హారుఁడై, నిత్యవిభూతి శోభనకరుండై, మానితాకారుఁడై
532

వ మఱియును 533

చ శరనిధికన్యకామణియు సంభ్రమ మొప్పఁగఁ దోడ రా, మనో
హర నిజలీలమైఁ బరమహంస మునీశ్వరవంద్య పాదపం
కరుహములన్ వినూత్న మణికాంచన నూపుర మంజు
ఘోషముల్
వరుసఁ జెలంగ, నార్యజనవంద్యుఁడు యోగిజనైక సేవ్యుఁడై,
534

చ. కరమణి హేమకంకణ నికాయ ఝణంకృతు లుల్లసిల్ల న
చ్చర లిడు వాంసపతు సితచామర గంధవహోచ్చల త్సుధా
కర రుచిరాతపత్రి సుభగ ప్రవిలంబిత హారవల్లరీ
సరసగళ త్తుషారకణజాల విరాజిత మంగళాంగుఁడై 585

వ. మఱియును, 586

సీ. నిఖిలమునీంద్రవర్ణిత సస్మిత ప్రస
న్నాననాంబుజముచే నలరువాఁడు,
విశ్రుత స్నేహార్ద్ర వీక్షణ నిజభ క్త
జన గుహాశయుఁ డనఁ గనరువాఁడు,
మానిత శ్యామాయమాన వక్షమున నం
చిత వైజయంతి రాజిల్లువాఁడు,
నతజనావన కృపామృత తరంగితములై
భాసిల్లు లోచనాబ్జములవాఁడు,

తే. సకల యోగీంద్రజన సేవ్యుఁ డైనవాఁడు,
సాధుజనముల రక్షింపఁ జాలువాఁడు,
భువనచూడావిభూష మై భూరి మహిమ
మించు వైకుంఠపురము భూషించువాఁడు, 587

సీ. కటివిరాజిత పీతకౌశేయ శాటితో
వితత కాంచీగుణద్యుతి నటింప,
నాలంబి కంఠహారావళి ప్రభలతోఁ
గౌస్తుభరోచులుఁ గ్రిందుకొనఁగ,
నిజకాంతిజిత తటిద్ద్విజ కర్ణకుండల
రుచులు గండద్యుతుల్ వ్రోదిసేయ,
మహనీయ నవరత్నమయ కిరీటప్రభా
నిచయంబు దిక్కుల నిండఁ బర్వ,

తే. వైనతేయాంస విన్యస్త వామహస్త
కలిత కేయూర వలయ కంకణము లొప్ప,
నన్యకరతల భ్రమణీకృతానుమోద
సుందరాకార లీలారవింద మమర, 538

వ. మఱియుఁ జరణ రవింద మంజు కింజల్క పుంజ పరిభారంజిత తులసమరంద బంధుర గంధానుబంధ సుగంధి గంధవహాస్వాద కలితి సేవాతత్పరులై చనుదెంచు యోగీంద్రులకు మానసానందకారియు, బహ్యా కరణాంత కరణ పరితోష ప్రకీర్ణ రోమాంచ రుచిదాయకంబును, బ్రిభాపూరి యుక్తంబును నగు మూర్తితోడ నిజసౌందర్య వరకళావినిర్జిత శ్రీరమణీ సౌందర్య భాసమానుం డగుచుఁ, బాదచారియై యఖిల విశ్వ గురుం డైన సర్వేశ్వరుండు వేంచేసె, నప్పుడు, 539

చ. స్థిరశుభలీల నట్లరుగుదెంచిన యవ్విభు విద్రుమారుణా
ధర నవపల్లవస్ఫుర దుదంచితి కుందరుచి స్మితైక సుం
దర వదనారవిందము ముదంబునఁ దప్పక చూచి, య మ్మునీ
శ్వరులు నిజాత్మలం దనివి నాలక వెండియుఁ జూచి రిమ్ములన్ 540

చ. సునిశిత భక్తిఁ దన్ముఖముఁ జూచిన చూడ్కులు ద్రిప్ప లేకయుం
గనుఁగొని రెట్టకేలకు నకల్మష భక్తవిధూత ఖేదముల్,
మునిజన చిత్తమోహనములు, ముక్తి నివాస కవాటభేదముల్,
వినుతవినూత్న నూపురిత వేదము లమ్మహనీయ పాదముల్ 541

చ. కని నఖపద్మరాగ మణికాంతివి భాసిత పాదపద్మము
ల్లనములయందుఁ గీల్కొలిపి, లబ్ధమనోరథయుక్తులై పునః
పున రభివందనంబులు విభూతి దలిర్ప నొనర్చి యోగమా
ర్గ నిరతచిత్తులుఁ వెదకి కానఁగ లేని మహానుభావునిన్ 542

క యుక్తిం దలఁప భవద్వ్యతి
రిక్తము లైనట్టి యితర దృఢకర్మంబుల్
ముక్తిదము లయిన, నీ పద
భక్తులు దత్కర్మములను బాటింప రిలన్ 547

ఉ కావునఁ గీర్తనీయ గతకల్మష మంగళతీర్థ కీర్తిసు
శ్రీవిభవ ప్రశస్త సుచరిత్రుఁడ వైన భవత్పదాబ్జ సే
వా విమలాంతరంగ బుధవర్గ మసర్గళభంగి నన్యచుఁ
భావమునం దలంచునే కృపాగుణభూషణ! పాపశోషణా! 548

చ పరమతపోవిధూత భవపాపులు నై చరియించు మౌను నేఁ
డరయ భవత్పదాశ్రితుల కల్గి శపించిన భూరి దుష్కృత
స్ఫురణ నసత్ప్రథైక పరిభూతుల మై నిజధర్మ హానిగా
నిరయము నొందఁగా వలసె నేరము వెట్టక మమ్ముఁ గావవే! 549

చ కర మనురక్తి షట్పదము గమ్రసుగంధ మరందవాంఛ చేఁ
దరమిడి శాతకంటకవ్రత స్ఫుట నవ్యతర ప్రసూన మం
జరులను డాయు పోల్కిని, భృశం బగు విఘ్నములన్ జయించి నీ
చరణసరోజముల్ గొలువ సమ్మతి వచ్చితి మయ్య కేశవా! 550

చ అలరు భవత్పదాంబుజ యుగార్పిత మై పొలుపొందునట్టి యా
తులసి పవిత్ర మైన గతిఁ, దోయజనాభ! భవత్కథాసుధా
కలితము లైన వాక్కుల నకల్మషయుక్తిని విన్నఁ గర్ణముల్
విలసితలీల మై భువిఁ బవిత్రములై విలసిల్లు మాధవా! 551

చ మహిత యశోవిలాస గుణమండన! సర్వశరణ్య! యింద్రియ
స్పృహాలకుఁ గానరాక, యతసీకుసుమద్యుతి నొప్పుచున్న నీ
సహజశరీర మిప్పుడు భృశంబుగఁ జూచి మదీయ దృక్కులిం,
దహహా! కృతార్థతం బొరసె నచ్యుత! ఘోరక్షుధ,
మాదరింపవే! 552

క అని సనకాదులు విష్ణుపద
వనజములకు మ్రొక్కి, భక్తివశమానసులై
వినిపించిన, గోవిందుడు
మునివరులం జూచి పలికె ముదితాత్ముండై 553

వ "ఈ యిరువురు జయవిజయాభిధానంబులు గల మదీయ ద్వారపాలకులు, వీరు మిమ్ముం గైకొనక మదీయాజ్ఞాతిక్రమణులయి చేసిన యపరాధంబునకుఁ దగిన దండంబు గావించితిరి, యది నాకు నభిమతం బయ్యె, నదియునుం గాక, భృత్యవర్గంబు సేయు నపరాధంబు స్వామిదియు, కాన యీ తప్పునకు మాననీయుండ నైన నన్ను మన్నించి ప్రసన్నులగుదురుగాక! యని వెండియు నిట్లనియె 554

చ తనువునఁ బుట్టినట్టి బెడిదం బగు కష్ఠమహాగదంబుచే
వనరి, తదీయచర్మము వివర్ణత నొందిన రీతి భృత్యులో
ప్పని పని సేసినన్ విభులు బంధుర చారుయశంబుఁ బేరుఁ బెం
పును జెడిపోయి దుర్యశముఁ బొందుచు నుందురు విష్టపంబులన్ 555

చ అలవడ నాకు మావలన నబ్బిన తీర్థ సుకీర్తనీయ స
ల్లలిత వినిర్మలామృత విలాస యశోవిభవాభిరాము నై
వెలయు వికుంఠనామ మపవిత్ర మనశ్శ్వపచాధమాది లో
కుల చెవిసోఁకఁ దత్క్షణమ కోరి పవిత్రులఁ జేయు వారలన్ 556

తే అట్టి నేను దలంప మీ యట్టి నాథు
జనుల కపకార మర్థిఁ జేసిన మదీయ
బాహుసము లైనఁ ద్రుంతు నుత్సాహలీల,
నన్ను నితరుల మీఁ ద్రోహ మెన్న నేల? 557

క. ధరణీసురోత్తమ సేవా
పరిలబ్ధం బయినయట్టి పాతకనాశం
కర నిఖిల భువనవృత్తి
స్ఫురితాంఘ్రి సరోజతోయములు గల నన్నున్ 558

క. అలఘుమతి విరక్తునిఁగాఁ
దలఁపక నిజశుభకటాక్ష దామక కలితా
ఖిల సంపద్విభవ శ్రీ
లలనారత్నం బుపేక్షలంబును జెందెన్ 559

చ. క్రతువులు సేయుచో శిఖిముఖంబున వేలుచునట్టి తద్ఘృత
ప్లుత చరుభక్షణాన ముదముఁ బొందదు నిస్పృహ ధర్మమార్గ సం
గతుఁ డగు భూసురోత్తము ముఖంబున నేడ్క భుజించునట్టి వి
స్తృత కబళంబునన్ మనము తృప్తి వహించిన రీతి నిచ్చలున్
560

సీ. సతతంబు నప్రతిహత యోగమాయా వి
భూతిచేఁ బ్రఖ్యాతిఁ బొందు నేను,
నే మహీసురుల సమిద్ధ నిర్మలపాద
నలిన రజోవితానములు భక్తి
హాటక నవరత్న కోటీరమునఁ దాలు
నట్టి నా చరణాంబు జాంబువులను
దవిలి ధరించి సద్యఃపవిత్రాత్ముఁ లై
రర్థిఁ జంద్రావతంసాది దేవ

తే. చయము, లెవ్వాఁడు బ్రాహ్మణ జనులు దమకు
నపకృతుల్ సేసిరేని మా ఱలుగఁ డతఁడు
విప్రులను నన్నుఁ గాఁగ భావించు నతఁడు,
ధర్మ పద్ధతి నా ప్రియతముఁడు వాఁడు 561

సీ. మునివరుల్ దమ చిత్తములఁ దృప్తిఁ బొందక,
పంకజాక్షుఁడు పలికినట్టి
పరిమిత గంభీర బహుళార్థ దురవగా
హములును, విస్ఫుర దమృతతుల్య
మాధుర్య సుగుణ సమన్వితమ్ములు, విని
ర్గత శబ్దదోష నికాయములును
నైన వాక్యములకు నాత్మలఁ బరితోష
మంది యిట్లనిరి '' నెయ్యమున మనల

తే. నోడయఁ డిప్పుడు సందించిరో, తలంప
నర్థి నిందించిరో, మత్కృతైక దండ
మునకు సంకోచ మందిరో," యనుచు సంశ
యాత్ము లగుచు వివేకించి, యంతలోన 566

క. నలినాక్షుఁడు దమ దెసఁ గృప
గలిగిన భావంబుఁ దెలిసి కౌతుక మొలయం
బులకీకృతాంగులై యు,
త్కలికన్ హర్షించి, నిటలఘటితాంజలులై, 567

క. భరిత నిజయోగమాయా
స్ఫురణం దనరారు నతి విభూతియు బలముం
బర మోత్కర్షముఁ గల యీ
శ్వరునకు ని ట్లనిరి మునులు సద్వినయమునన్ 568

తే. 'పొలుపు దీపింప నిత్యవిభూతి నాయ
కుఁడవు, భగవంతుఁడవు, నఘుఁడవు, నీవు
మత్కృతం బిప్డు నీ కభిమత మటంటి,
పీశ ! భవదీయ చారిత్ర మొఱుఁగఁ దరమె ! 569

ఉ. దేవగణాలి కెల్లఁ బరదేవత లై తనరారు నట్టి వి
ప్రావలి కాన్మ్రారాయణుఁడ వై వెనుపొందిన నీకు నీ ధరా
దేవత లెల్ల నన్న నధిదేవత లైరఁట, యెట్టి చోద్యమో!
దేవ! సమస్తపావన! సుధీజనతావన! విశ్వభావన! 570

చ. కమలదళాక్ష! నీ వలనఁ గల్గిన ధర్మము దావకావతా
రముల నురక్షితం బగుఁ దిరం బగు, నీశ్వర! నిర్వికార! త
త్త్వమునఁ దనర్చు నిన్నరయఁ దత్ఫలరూపముఁ దత్ప్రధాన గో
ప్యము సని పల్కుచుందురు, కృపామయలోచన! పాపమోచనా! 571

చ. మహిఁ దలపోయ నెవ్వని సమగ్రపరిగ్రహమున్ లభింప ని
స్పృహమతులై మునీశ్వరులు మృత్యుభయంబునఁ బాతు, రట్టి స
న్మహిత వివేకశాలి! గుణమండన! నీ కిల నన్యసత్పరి
గ్రహ మది యెట్టి చోద్యము, జగత్పరిపాలన! సత్యచేతనా! 572

సీ. సతతంబు నర్థార్థిజన శిరోలంకార
పద రేణువులు గల పద్మ మనెడు
జలజ కింజల్క నిష్యంద మరంద లో
భాగత భ్రమరనాయకుని పగిది,
ధన్యజనార్పి తోదంచిత తులసికా
దామంబునకు నిజధామ మగుచు
భాసిల్లు భవదీయ పాదారవిందముల్
విలసిత భక్తి సేవించుచుండి,

తే. కమలనయన కృపావలోకనము లొలయ,
నర్థిఁ బొడసూపు భాగవతానురక్తిఁ
జేసి, భవదీయ మహిమంబు చిత్రి మరయఁ
జిర శుభాకార! యిందిరాచిత్తచోర! 573

మ. చిరభాగ్యోదయ! దేవదేవ! లలిత శ్రీవత్స లక్ష్మాంగ! యీ
వర విప్రానుపదైక పుణ్యరజమే వర్ణింప నీ మేని కా
భరణం బంటివి, సర్వలోకులకు విప్రశ్రేణి మాహాత్మ్య మీ
వెలుఁగం జెప్పుటకై ధరించితి గదా యెన్నం బవిత్రాకృతిన్! 574

వ. అదియునుం గాక, 575

సీ. ధర్మమూర్తివి జగత్కర్తవు నగు నీవు
ప్రోవంగఁ దగువారిఁ బ్రోవవేని,
నవిరళ వేదోక్త మగు ధర్మమార్గ ము
సన్మార్గ మగుఁ గాన, సత్త్వగుణ వి
శిష్టుండ వగుచు నీ జీవసంఘము సేమ
మరసి రక్షింతు నీదైన శక్తి
చేతను, ధర్మవిఘాతుల దండించు
నీకు నుచిత మైన నిగమధర్మ

తే. మార్గనాశక విధములు మదికి నింపు
గావు విప్రులయందు సత్కరుణ మెఱసి
ఘనతఁ బలికిన వినయవాక్యములు నీకు
యుక్త మగుచుండు సతతంబు భక్తవరద! 576

వ. అట్లయినం బరులయెడ వినయంబులు పలికినఁ బ్రాభవహాని
యగునని తలంచితివేని, 577

తే విశ్వమున కెల్లఁ గర్త వు, విశ్వనిధివి,
విశ్వసంరక్షకుండవై వెలయు నీకుఁ
గడఁగి ప్రాభవహాని యెక్కడిది? దలఁప
వినయములు నీకు నిలవై వెలయుఁ గాక 578

తే మునుల మగు మమ్ము నతిమోదమునను నీవు,
సత్కరించుట యెల్ల సజ్జన పరిగ్రి
హార్థమై యుండుఁ గాదె, మహాత్మ! యొకటి
విన్నవించెద, మీ జయవిజయులకును 579

తే అలిగి యేము శపించితి, మంతకంటె
పెడిద మగు నాజ్ఞ సేయ నభీష్ట మేనిఁ
జేయు మదిగాక సమధిక శ్రీ దనర్పఁ
జేసి రక్షించెదేని రక్షింపు మీశ! 580

వ అట్లయిన మాకుం బ్రియం బగుం, గావున ననపరాధులు, నతి
నిర్మలాంతఃకరణులు నైన వీరలకు ననృతంబులు వలికితి మేని
నమ్మొయినం జిత్తంబు కొలంది నాజ్ఞాపింపు మని కరకమలం
బులు మొగిచి కృతాంజలులై యున్న మునులం గరుణార్ద్ర
దృష్టిం గనుంగొని, 581

క అనియెడు భగవంతుం డి
ట్లనియెన్ మునులార! వీర లలరన్ భువికిం
జని, యచట నసురయోనిన్
జనియింతురు లోభమోహ సంగతు లగుచున్ 582

క దేవజనావళి కుపహతిఁ
గావించుచు, నిఖిలభువన కంటకవృత్తిన్
జీవించుచు, నాయెడ సం
భావిత వైరానుబంధ భావులు నగుచున్, 583

క. ఆహవముఖమున నను నతి
సాహసమున నెదిరి పోరి చక్రనిశిత ధా
రాహతిఁ దెగి వచ్చెద రు
త్సాహ మెలర్పంగ నాదు సన్నిధి కంతన్ 584

వ. అదియునుం గాక, 585

క. నను వైరంబున నైనను
మనమునఁ దలఁచుటను నా సమక్షమున మదా
నన మీక్షించుచు నిల్లుట
ననఘాత్మకులై వసింతు రస్మత్పదవిన్ 586

క. వినుఁ డిలమీఁద నిఁ కెన్నఁటి
కిని బుట్టువు లేదు వీరికిని, మీరలు ప
ల్కినయట్ల నాదు చిత్తము
నను దలఁకుం, గాన మీ మనంబుల నింకన్ 587

ఉ. దీనికిఁ జింతఁ దక్కుఁడు సుధీలజనపుంగవు," లన్నఁ బ్రీతులై
యా నలినాసనాత్మజు లనంతుని భావము దా మెఱింగి, పెం
పూనన వేడ్కఁ దేలి తెలివొందిన చిత్తములన్ నుతించి రం
భోనిధిశాయి, నార్తజనపోషణ భూషణుఁ బాపశోషణున్ 588

ఉ. ఆ సనకాదు లంతఁ బులకాంకురముల్ నవలొత్త, బాష్పధా
రా సుభగాక్షులై మునిశరణ్యు వరేణ్యు నగణ్యు దేవతా
గ్రేసరు దివ్యమంగళ శరీరముఁ జూచు తదీయ ధామమున్
భాసురలీలఁ జూచి, నవపద్మదళాక్షునకున్ వినమ్రులై, 589

క. తమ పలికిన భాషణములు
గమలోదరు భాషణములుగాఁ దలఁచుచు, నె
య్యమునన్ వైష్ణవ లక్ష్మిం
బ్రమదంబునఁ బ్రస్తుతించి, పరమేశ్వరుచేన్ 590

క. ఆమంత్రితులై తగ నిజ
ధామములకుఁ జనిరి వారు, పిదప లక్ష్మీ
కాముఁడు జయవిజయుల సభి
రామంబుగఁ జూచి పలికె రయ మొప్పారన్ 591

క. మీ రసురయోనియందు దని
వారితులై జనన మందవలసెను, నే దు
ర్వార బలాఢ్యుఁడ నయ్యును
వారింపఁగ నోప విప్రవచనము లెందున్ 592

క. అది గాన దనుజయోనిం
బదపడి జనియించి, మద్విపక్షులరై మీ
మది నెపుడు నన్నె తలఁచుచు
వదలక నాచేతఁ జచ్చివచ్చెద రిటకున్ 593

ఉ. పోం' డని యాన తిచ్చి వారి ఫుల్లసరోరుహ పత్రనేత్రుఁ డా
ఖండలముఖ్య దిగ్ధనికాయ కిరీట లసన్మణిప్రభా
మండిత పాదపీఠుఁ డు రమారమణీమణి దోడ నేఁకడే,
నిండిన వేడ్క నేఁగె నిజపత్నుల పుణ్యనివాసభూమికిన్ 594

వ. అంత 595

క. నిజతేజోహానిగ జయ
విజయులు ధరఁ గూలి రపుడు విహ్వలు లగుచుం,
ద్రిజగముల సురవిమాన
వ్రజముల హాహారవంబు గ్రిందుగఁ జెలఁగన్ 596

క. వారలె యా దితిగర్భా
గారంబున నున్న వారు, గడఁగి తదీయో
దార ఘనతేజ మింపు డని
వారణ మీ తేజ మెల్ల వమ్ముగఁ జేసెన్ 597

ఉ ఇంతకు మూల మూ హరి రమేశ్వరుఁ డర్థి నొనర్చు కార్యముల్
వింతలె! సర్వభూత భవ వృద్ధి వినాశన హేతుభూతుఁ డా
ద్యంత వికారశూన్యుఁడు, దయానిధి మీ యెడ మేలు సేయు,నీ
చింత దొలంగి వేచనుఁడు, చేకుఱు మీకు మనోరథార్థముల్" 598

క అని వనజాసనుఁ డాడిన
విని తద్వృత్తాంత మెఱిఁగి విబుధులు నాకం
బున కేఁగిరి, దితి నిజనా
థుని మాటలు దలఁచి యపరితోషముతోడన్ 599

జయవిజయులు దితియందు హిరణ్యాక్ష హిరణ్యకశిపులై పుట్టుట

తే ఇంతి దన సుతుల్ సురలఁ గారింతు రనుచుఁ
దలఁచుచుండంగ సంవత్సరశతంబు
సనఁగ, నటమీఁదఁ గనియెఁ గశ్యపుని దేవి
యఖిలలోకైక కంటకు లైన సుతుల 600

వ అయ్యవసరంబున 601

తే ధరణి గంపించెఁ, గులపర్వతములు వడఁకె
జలధులు గలంగెఁ, దారకావళులు గుల్లె,
గగన మగలెను, మ్రొగ్గె దిక్కరులు, దిశల
మిడుఁగుఱు లెగసెం, బిడుగులు పుడమిఁ బడియె 602

సీ హోమానలంబుల ధూమంబు లడరెను,
బ్రతికూలవాయువుల్ బలసి వీచెఁ,
దరువు లెల్లెడ విటతాటంబు లై కూలె,
గ్రహ తారకావళి కాంతి మాసె,

బెరసి మొగిళ్ళు నెత్తురు వానఁ గురిసెను
మెఱుఁగులు వెలవిస్త్రిల్లఁ గాలిని
స్వర్భానుఁ డొగి నుగ్రముగ భానునిఁ బట్టె,
గైకొని చిమ్మచీఁకట్లు పర్వె,

తే. మొనసి చుక్కలు మింటఁ గెరలి చొరఁబెట్టె,
పగలు నక్కలు వాపోయె, ఖగము లార్త
రవము లిచ్చెను, దేవతాప్రతిమ లొరఁగె
గన్నులను నశ్రుకణములుఁ గ్రిందుకొనఁగ 603

క. మొదవులు నెత్తురుఁ జీమును
బిదికెన్, గార్దభరవంబు భీషణ మయ్యెన్,
మద ముడిగెఁ గరుల కటములఁ,
బొదివెఁ దురంగముల వాలముల నిప్పులొగిన్ 604

క. గుహలు రొదలిచ్చెఁ, బాప
గ్రహమిత్రతఁ జెంది వక్రగతులను సౌమ్య
గ్రహములు వర్తించె దు
స్సహతేజో దితితనూజ సంభవ వేళన్ 605

మ. భయదప్రక్రియ నిట్లు తోఁచిన మహోత్పాతంబు లీక్షించి సం
శ్రయకాలం బని కాని, సద్భువాన నోగ్ర క్రూర దేవాహితో
దయ సంక్షోభముగా నెఱుంగక, సమస్త ప్రాణిసంఘాతము
ల్భయమందెన్, సనకాది యోగిజనము ల్దక్కన్,
బుధేంద్రోత్తమ ! 606

వ. అట్లావిర్భవించిన యనంతరంబ 607

మ కులశైలాభ శరీరముల్ దనర రక్షోనాథు లత్యుగ్ర దో
ర్బల మొప్పం బదఘట్టనన్ ధర చలింపన్ రత్న కేయూర కుం
డల కాంచీ కట కాంగుళీయక కిరీట స్వర్ణ మంజీర ని
ర్మల కాంతుల్ దులకింప, నాత్మరుచిచే
మందీకృతార్కాంశులై 608

వ ఉన్న సమయంబునం, గశ్యపుండు నిజ తనూభవులం జూడం
దలంచి దితిమందిరంబునకుం జనుదెంచి సుతులం గనుంగొని
వారలకు నామకరణంబు సేయం దలంచి, 609

చ దితి జఠరంబునందుం దన తేజము ము న్నిడినట్టి పుత్రు న
ద్భుతచరితున్ హిరణ్యకశిపుండను పేరం, బ్రసూతి వేళ నా
దితి మును గన్న పట్టి రవి తేజుని గాంచన లోచనుండు నా
హితమతిం బేరు వెట్టి చనియెన్ నిజనిర్మల పుణ్యధామికిన్ 610

వ అయ్యవసరంబున నతుల తేజోవిరాజితుం డైన హిరణ్యకశి
పుండు హిరణ్యగర్భ వరదాన గర్వంబునను, దుర్వార పరిపంథి
గర్వనిర్వాపణాఖర్వ భుజావిజృంభణంబునను, నిఖిల లోకపా
లాదుల జయించి స్వవశం బొనర్చి సంతుష్టాంతరంగుండై,
యెందునుం దనకు మృత్యుభయంబు లేక నిర్భయుండై సుఖం
బుండెం, దత్సోదరుండైన హిరణ్యాక్షుండు ప్రతిదివసంబుం జండ
వేదండ శుండాదండ మండిత భుజాదండంబున గదాదండంబు
ధరియించి, తన్ను నెదిరి కదనంబు సేయం జాలిన యరివీరునిం
గానక భూలోకం బెల్లం గ్రుమ్మరి, దివంబునకు దాడివెట్టి,
యందు సమర విముఖు లయిన బర్హిర్ముఖులం గనుంగొని, వన
జాసన వరప్రదానంబుం జింతించి హితులు సెలంగ నహితులు
గలంగ, మహిత వైజయంతికాదామం బభిరామం బై

వెలుంగఁ, జరణంబుల మాసూ [illegible] వెలయ, నిజదేహ
ద్యుతి దిక్కులం బిక్కటిల్ల జను [illegible] చువారి [illegible] ని [illegible] విత్తు
లయి, దేవతాగణంబులు గగ [illegible] నగి [illegible]
బోలె నిజనివాసంబు లక్ష్మీనివాస [illegible] చరా వాసంబు
లుంగా నౌనట్టి యెక్కడికేనిం జని, 611

ఉ శౌర్యము వోవఁ దట్టె నజనాథ [illegible] దిగనాకి విక్రమో
దార్య పరాక్రమక్రమము దప్పఁగ [illegible] పారి [illegible]
కార్యముఁ దప్పి నాకు, లని [illegible] ని [illegible] సువర్ణ
స్థైర్యుఁడు వార్ధిఁ జొచ్చె నతిదర్పిత భూరిఘనావిజృంభియై 612

వ ఇట్లు సొచ్చిన 613

క వరుణుని బలములు దను జే
శ్వరు తేజముఁ జేఱ చూడఁ జాలక శౌర్య
స్ఫురణము సెడి యొందేనిని
బఱచెం బజ్జలధి మధ్యభాగమునందున్ 614

క అమరారి విపుల నిశ్వా స
సములం బ్రభవించినట్టి జలనిధి కల్లో
లములను విపులగదాదం
డమునం బో నడిచె నతిదృఢం బగు శక్తిన్ 615

చ మఱియును సమ్మహాజలధి మధ్యమునన్ సురవైరి పెక్కు ప
త్సరములు గ్రీడ సల్పి రిపునైన్యవిదారణ శౌర్యకేళనా
పరతఁ జరించి, యవ్వరుణపాలిత మైన లస ద్విభావరీ
పురమున కేఁగి, యందుఁ బరిపూర్ణత నున్న జలాధినాథునిన్
616

వ మఱియును 617

క యాదోగణాధీశుఁ డగుచుఁ బాత శ భు
వనపరిపాలుఁడై తనరుచున్న
వరుణునిఁ గనుగొని పరిహాసితోక్తుల
నిట్లను, "విశ్వముం దెన్నఁ గలుగు
సకల లోకైకపాలకులలో నతిబలా
ధికుఁ డని జగము నుతింపఁ దగిన
శూరుండ, విపుడు నీ పౌరుష మొప్పంగఁ
గదనరంగమున నన్నెదిరి చూడు,

తే నీ భుజావిక్రమంబును ప్రాభవంబు
నడఁతు" నని పల్కుటయు విని యబ్ధివిభుఁడు
పగతు జయమును వృద్ధియు బలము నాత్మ
బలముఁ దలపోసి దనుజుతో బవరమునకు 618

క సమయము గాఁదని, తన చి
త్తమునం గల రోషవహ్నిఁ దాలిమి యను తో
యములం దగ నార్పుచు నుప
శమితోక్తులఁ బలికె దనుజసత్తముతోడన్ 619

చ 'మనమున శాంతిఁ బూని నియమంబున సంగర ముజ్జగించి దే
ననయము నున్నవాఁడ, నిపు డాహవకేళిఁ జరింపరాదు, నీ
ఘనభుజ విక్రమస్ఫురిత గాఢవిజృంభణముల్ జయింపఁ జా
లిన ప్రతివీరు లెవ్వరును లేరు ముకుందుఁడు దక్క నెక్కడన్
620

క. చను నవసరమున నారద
మునివరుఁ డెదు రేఁగుదెంచి ముదము దలిర్పన్
'దనుజేంద్ర యెందుఁ బోయెద,'
వని యడిగిన నారదునకు నతఁ డిట్లనియెన్ 627

చ. సరసిరుహోదరుం దొడరి సంగర మే నొనరించి, యిందిరా
వరుని ననంతుఁ ద్రుంచి, సురవైరికులంబుల కెల్ల మోదవి
స్ఫురణ ఘటింపఁ జేయుటకుఁ బూని వికుంఠపురానువర్తి నై
యరిగెద," నన్న నమ్మునికులాగ్రణి దానవనేత కిట్లనున్ 628

చ. "గురుభుజుఁ డమ్మహాత్ముఁడు వికుంఠపురంబున నేఁడు లేఁడు, భూ
భరము వహింప నాదికిటి భావముఁ దాల్చి రసాతలంబునం
దిరవుగ నున్నవాఁ, డచటి కేఁగఁగ నోపుదువేని నేఁగు, మం
దరయఁగఁ గల్గు నీకు నసురాంతకుతోడి రణంబవశ్యమున్ 629

హిరణ్యాక్షుఁడు యజ్ఞవరాహంబగు హరి నెదిరించి పోరుట

చ. అనవుడు దానవేంద్రుఁడు హుతాశను కైవడి మండి, పద్మలో
చను నెదిరించు వేడుకలు సందడిఁ గొల్పననల్పతేజుఁడై
ఘనగదఁ గేలఁ బూని, త్రిజగద్భయదాకృతిఁ దాల్చి వేల్మిడిం
జనియె రసాతలంబునకుఁ జండ భుజాబలదర్ప మేర్పడన్ 630

వ. చని జలమధ్యంబున 631

క. దివిజారి యెదురఁ గనఁ గనె
నవిరళ దంష్ట్రాభిరాము నమరలలాముం
గువలయ భరణోద్దామున్
సవనమయ స్తబ్ధరోము జలదశ్యామున్ 632

వ. అయ్యవసరంబున సూకరాకారుండైన హరియు 683

క. వనజరుచి సన్నిభము లగు
తన లోచనయుగళ దీప్తిఁ దనరఁ దదాలో
కనమున దనుజాధిపుని
తను కాంతి హరింపఁ జేసెఁ దత్క్షణమాత్రన్ 684

వ. మఱియు న య్యాదివరాహం బవార్యశౌర్యంబున మాఱు లేని విహారంబునం గాఱియించు నట్టియెడ, 685

సీ. తుదముదళ్ళకుఁ జిక్కిఁ దునిసి పాఱఁగ మోరఁ
గులశైలముల జిమ్ముఁ గొంతదడవు,
బ్రహ్మాండభాండంబు పగిలి చిల్లులు వోవఁ
గొమ్ములఁ దాటించుఁ గొంతదడవు,
జలధు లేడును బంకసంకులం బై యింక
ఖురిముల వట్టాడుఁ గొంతదడవు,
ఉడురాజు సూర్యుఁడు నొక్క మూలకుఁ బోవఁ
గురుచ వాలము ద్రిప్పుఁ గొంతదడవు,

తే. గునియుఁ గుప్పించు లంఘించుఁ గొప్పరించు
నెగయు ధరఁ ద్రవ్వు బోరయంగా నేవు రేఁగి
దానవేంద్రుని గుండెలు జల్లుజిల్లఁ
బంది మొల్లన రణపరిపంథి యగుచు 686

వ. మఱియును 687

క. కనుఁగవ నిప్పులు రాలఁగ
సునిశిత దంష్ట్రాగ్రయుత వసుంధరుఁ డగుచుం
దన కెదు రేరేఁ గని య
వ్వనచర మే రీతి నిపుడు వనచర మయ్యెన్? 688

క. అని యాశ్చర్య భయంబులు
దన మనమునఁ దొంగలింపఁ దనుజాధిపుఁ డి
ట్లనియెఁ భీకర సూకర
తను వొంది చరించు దనుజ దర్పాపహుతోన్ 639

క. "ఘనసూకర! మాయాత్మక!
వనరుహాసంభూత దత్త వరదానమునం
గనిన రసాతలగతి భువి
యనయంబును నా యధీన మై వర్తించుఁ 640

క. గొనకొని నీ వీ ధరణిం
గొనిపోకుము, విడుము, కాక కొని యేఁగుద వేఁ
గొనియెద నీ ప్రాణముఁ, గై
కొను నా వచనములు, సలము కొన నేమిటికిఁ? 641

క. మాయావి వగుచు నిప్పుడు
వాయక యీ పుడమిఁ జోరభావంబున నీ
వీ యెడఁ గొనిపోఁ జూతువె
యాయత భుజబలముచేత నడఁపక యనుచున్ 642

సీ. అవిరళ యోగమాయా బలంబునఁ జేసి
యల్ప పౌరుషమున నలరు నిన్ను
నర్థి సంస్థాపించి, యస్మ త్సుహృ ద్భృత్య
కలుల కెల్లను మోద మొలయఁ జేయఁ,
జెలు వేది మద్గదా శీర్ణుఁడ వగు నిన్నుఁ
గనఁగొని దేవతా గణము లెల్ల
నిర్మూలు లై చాల నెఱి నశించెద," రన్న
ని యజ్ఞపోత్రి యై వెలయుచున్న

తే హరి సరోజాతభవ ముఖామరుల కెల్ల
వచ్చు దురవస్థ కాత్మలో వంత కాది
నిశిత దంష్ట్రాగ్ర లసిత మై నెగడు ధరణి
దేవితో నొప్పు నా దేవదేవుఁ డత 643

క సురరిపు వాక్యాంకుశముల
గురు కుపితస్వాంతుఁ డగుచుఁ గొమరాజై వసుం
ధరతోడ భీతి నొందిన
కరిణిం గల కరిపులేంద్ర కరణిం బెలుచన్ 644

తే నిశిత సిత దంతకోటులు నింగిఁ బర్వఁ
గంధి వెడలి భయంకరాకార లీల
నరుగు భీషణ ముఖవరాహావతార
మొనరఁ దాల్చిన పద్మలోచనుని వెనుక 645

క కరి వెనుకఁ దగులు నక్రము
కరణిం జని దైత్యవిభుఁడు గదిసి యిటు లనున్,
దురితపయోనిధి తరికిం,
గిరికిన్ ఖురదళిత మేరుగిరికిన్ హరికిన్ 646

క “ నిందకు నోడక లజ్జం
జెందక వంచనను రణముసేసి జయంబుం
బొందెద నని తలఁచుచు నీకు
పందగతిం బాఱ బంటు పంతమె నీకున్ ? 647

వ అని యాక్షేపించినం బుండరీకాక్షుండు గోపోద్దీపిత మానసుండై, 648

క. తోయముల మీఁద భూమి న
నాయాసత నిల్పి దాని కాధారముగాఁ
దోయజనాభుఁడు దన బల
మాయతనుశిఁ బెట్టె సురలు హర్షము నొందన్ 649

తే. కుసుమముల వృష్టి బోరనఁ గురిసె నంత,
విభవ మొప్పార దేవదుందుభులు మొరసెఁ,
గడఁక వీతెంచె గంధర్వ గానరవము,
నందితము లయ్యె నప్సరో నర్తనములు 650

వ. అయ్యవసరంబున నయ్యజ్ఞవరాహమూర్తిధరుం డైన కమల
లోచనుండు గనక కుండల కేయూర గ్రైవేయ కటకాంగు
ళీయక భూషణ రోచులు నింగిఁ బర్వ సమర సన్నద్ధుం డై, 651

చ. ఘనగదఁ గేలఁ బూని, మణికాంచన నవ్యవిచిత్ర వర్మ మిం
పొనరఁగఁ దాల్చి దానవ నియుక్త దురుక్తి నిశాతబాణముల్
దన ఘన మర్మముల్ గలఁప, దానవహంత నితాంత శౌర్యుఁ డై
కనలుచు వచ్చె సద్దనుజుఁ గన్గొని రోషవిభీషణాకృతిన్ 652

వ. ఇట్లనియె 653

మ. "వినరా యోరి యమంగళాచరణ! యుద్వృత్తిన్ ననున్ నీ మది
న్ననయంబున్ వనగోచరం బగు మృగం బంచుం దలం తౌర! నే
నెనయన్ వన్యమృగంబ యౌదు బలినై యే తెంచు నీవంటి
యా
శునకశ్రేణి వధింతు నేఁ డని మొనన్, శోఁ కోర్చి వర్తించినన్
654

క బలిమి గలజేని నాతోఁ
గలసను నెదిరించి పోరఁ గడఁగుము, నీ కో
ర్కులు నేఁడు దీర్తు, నూరక
తి పోయ విక్థినంబు ళగకు దురాత్మా! 655

చ విను మది గాక సంగరవివేక విశారదు లైనయట్టి స
జ్జనములు మృత్యుపాశము లఁ జాల నిష్ఠులు నయ్యు, నీవలెన్
గానకొని యాత్మసంస్తుతులకున్ మును మందిరోయేల యీ విక
త్థనములు, బంటుపంతము లె, దైత్య కులాధమ! మొన్న
మూఁడ గన్ ? 656

మ ధృతిఁ శాతాళమునందు ని వనెడి సంద్రిత్రోగ్రనిశ్శేప మే
నతిగర్వంబునఁ గొందుఁ, జూడుమిదె, దేవారాతి! యన్నెన్నె, దా,
గతలజ్జుం డన దాఁ యుండి రణముం గావింతు, యుష్మద్గదా
వితత దాగ్రవితు నన్ను నేఁ డెదురుమా! వే తీర్తు నీ కోరికల్
657

ఉ ఎన్నఁ బదాతిం గాధముల కెల్ల విభుండవు, పోటుకాటవై
నన్ను రణోర్వి నేఁ డెదిరినన్ భవదీయబలంబు న యువృన్
మిన్నక కొందుఁ జూడు, మిది మేరగ మేదిని పీతదైత్య మై
వన్నెకు నెక్కఁ జేసెద నవార్యపరాక్రమ విక్రమంబునన్
658

చ నను నెదురంగఁ జాలిన ఘనంబగు శౌర్యము ధైర్యముల్ బలం
బును గలనేని నిల్వు రణభూమిని, నీ హితులైన వారికిం
గనుఁగన శావ్యపూరములు గ్రమ్మఁగ మాన్పఁగ నోపు దేనిఁ జ
య్యనఁ జనఁ బొమ్ము దానవకులాధమ! యూరక ర ఁ లేటికిన్
659

క. నను నిట నిగ్రహించెద
నని పలికితి, వంతవాఁడ వౌదువు, నీకున్
ఘనమైన చుట్టములఁ బొడ
గని రా, యిదె యముని పురికిఁ గాఁపుర మరుగన్ 660

మ. అని యుబ్బంగి సరోరుహాక్షుఁడు హిరణ్యాక్షున్ విడంబించి వ
ల్కిన వాసోక్తుల కుల్కి రోషమున సంగీభూత చేతస్కుఁడై
కనుఁగ్రేవన్ మిడుఁగుర్లు సాలఁ బొడమంగాఁ గిన్కమైఁ దోఁక ద్రొ
క్కిన కృష్ణోరగ రాజు మాడ్కి మదిలోఁ గీడ్పాటు వాటిల్లఁగన్
661

క. చలితేంద్రియుఁడై నిట్టూ
ర్పులు నిగిడించుచును బొమలు ముడివడ రోషా
కులమానసుఁడై గదఁ గొని
జలజాక్షుని కెదురు నడిచె సాహస మొప్పన్ 662

వ. అత్తఱి హిరణ్యాక్షుం డతి భయంకరాకారుండై 663

మ. గద సాధించి మదాసురేంద్రుఁడు సమగ్రక్రోధుఁడై
మాధవున్
గుదియన్ ద్రేసిన, వ్రేటు గైకొనక రక్షోహంత శార్ఙ్గోన్నతిన్
గదఁ గేలన్ ధరియించె, దానఁ దునుకల్ గావించినన్ దైత్యుఁడు
న్మదుఁడై రయి. కు. గదన్ రమావిభుని భీమప్రక్రియన్
వ్రేసినన్, 664

చ. అది దనుఁ దాఁకకుండ దనుజారి గదారణ కోవిద క్రియా
స్పద కరలాఘవ క్రమముఁ బైకొని చూపి విరోధి పేరురం
బదరఁగ వ్రేయ, వాఁడు వివశాంగుల భావము నొంది, యంతలో
మదిఁ దెలివొంది వ్రేసె రిపుమాన విమర్దను నా జనార్దనున్
665

వ. ఇట్లు దలపడి యన్యోన్య జయకాంక్షుల నిత కోపరంహోంగితరంగ తాడితంబులగు దక్షిణోత్తర సముద్రంబుల చాడ్పునఁ, బరస్పర శుండాదండ ఘట్టిత మదాంధ గంధ సింధుర యుగంబు చందంబున, రోషభీషణాటోపంబులం దలపడు బెబ్బులుల గబ్బున నతిదర్పాతిరేకంబున నెదిర్చి ఱంకెలు వైచు మదవృషభంబుల రభసంబున, నసహ్య సింహపరాక్రమంబున విక్రమించి పోరునెడ, హిరణ్యాక్షుండు సవ్యమండల భ్రమణంబునం బరివేష్టించినం బుండరీకాక్షుండు దక్షిణమండల భ్రమణంబునం దిరిగి విపక్షు వక్షం బశనిసంకాశం బగు గదాదండంబునం బగిల్చిన, వాఁడు దెప్పిఱి తెలివొంది లేచి, దనుజపరిపంథి ఫాలంబు నొప్పించె, నప్పు డమ్మేటి పేరులు శోణితసిక్తాంగులై పుష్పితాశోకంబులం బురుడించుచుం, బాయుచు డాయుచు వ్రేయుచు రోయుచు నొండొరుల రుధిరంబు లాఘ్రాణించుచుఁ దిరస్కార పరిహాసోక్తుల నిచ్చుచుఁ బోరు సమయంబున నమ్మహాబలుల సమరంబుఁ జూచు వేడ్కఁ బద్మసంభవుండు నిఖిల మునీంద్ర సిద్ధ సాధ్య దేవగణంబులతోడఁ జనుదెంచి ధరిత్రీ నిమిత్తంబున నసురవరునితోడం బోరు యజ్ఞవరాహున కిట్లనియె 666

ఉ. "అంచితదివ్యమూర్తి! పరమాత్మక! యీ ఖలుపాత్ముఁ డైన న
క్తంచరుఁ డస్మదీయ వరగర్వమునన్ భువనంబు లెల్లఁ గా
రించు మదించి, యిట్టి విపరీత చరిత్రునిఁ ద్రుంప కిట్లుపే
క్షించుట గాదు, వీని బలిసేయ వసుంధరకున్ శుభం బగున్
667

క. బాలుఁడు గరమున నుగ్ర
వ్యాళము ధరియించి యాడు వడువున రక్షః
పాలునిఁ ద్రుంపక యూరక
పాలార్చుట నీతియే, శుభప్రద! యింకన్? 668

వ అదియునుం గాక 669

మ అనఘా! యీ యభిజిన్ముహూర్తమున దేవారాతి మర్దింపవే,
వనయుంబుర్ మఱి దైత్యవేళ యగు సంధ్యాకాల మేతెంచినన్
ఘనమాయా బలశాలి యై, దనుజుఁ ఖండింపఁగా రాదు, గా
వున నీ వేళన తుంపు సజ్జనహిత ప్రోద్యోగ రక్తుండ వై ” 670

క అని సరసిజగర్భుఁడు వ
ల్కిన వచనము లర్థి విని నిలింపులు గుంపుల్
గొని చూడ సస్మితానన
వనజము సెలువొంద నసురవరు కభిముఖుఁ డై 671

తే పుండరీకాక్షుఁ డయ్యును భూరిరోష
నిరతిఁ దరుణారుణాంభోజ నేత్రుఁ డగుచు
ఘన గదాదండ మెత్తి రాక్షసుని హనువు
నుగ్రగతి మొత్తె, వాఁడును నోసరించె 672

క పరవశ దితిసుతుఁ డతిభీ
కర గదఁ జేఁబూని చిత్రగతులను బద్మో
దరుఁ డాసి చేతి గద సా
గరమునఁ బడ నడిచె బాహుగర్వ మెలర్పన్ 673

వ అంత 674

తే హరి నిరాయుధుఁ డైన, సురారి సమర
ధర్మ మాత్మను దలఁచి యుద్ధంబు దక్కి
నిలిచి చూచుచు నుండెను, నింగి నమర
వరుల హాహారవంబుల భరితమయ్యె 675

క. సరసిజనేత్రుఁడు వసుదే
శ్వరు సంగర ధర్మమునకుఁ బరఁగ నధికశౌర్య
స్ఫురణకుఁ దన చిత్తంబునఁ
గర మాశ్చర్యంబు నొంది కొంక దలిర్పన్, 676

మ. కుతలోద్ధర్తృ మనంబునం దలఁచె రక్షోరాడ్వధార్థంబుగా
దితిసంతాన కులాటవీ మహిత సందీప్తప్రభా శుక్రమున్,
సతతోద్యజ్జయశబ్ద సన్ముఖర భాస్వచ్చక్రిమున్, సంతతా
శ్రిత నిర్వక్రిము, గాలిత ప్రకటధాత్రీ చక్రిముం, జక్రమున్. 677

వ. అదియునుం బ్రచండ మార్తాండమండల ప్రభాపటల చటుల
విద్యోతమానంబును, జటులసట జ్వాలికాపాస్త సమస్తకుపితా
రాతి బలాఖర్వ దుర్వార బాహాగర్వాంధకారంబును, వసహ్యా
కహాకహా నినాదాధరీకృత సాగరఘోరంబును, సకలదేవతాగణ
జేగీయమానంబును, ననంత తేజో విరాజితంబును, నిజప్రభా
పటలపూరిత బ్రహ్మాండ కటాహంబును నై రయంబునం జను
దెంచి దనుజారి దక్షిణ కరసరోజంబు నలంకరించిన, నా
శుభాంగుండు రథాంగపాణి యై దివంబున నమరగణంబులు
జయజయ శబ్దంబులు పలుక నసురవిభున కెదురు నడచిన 678

క. పొడగని దనుజుఁడు పెదవులు
దడువుచుఁ బొలిగొని బంటుతనమున భీమం
బుడుగక భీషణగదఁ గొని
యడిచెన్ మఖమయవరాననము నమితోత్సాహా! 679

క. త్రిదశారి దన్ను వ్రేసిన,
గదఁ బదముగఁ బోవఁ దన్ని, కమలాక్షుఁడు పెం
పొదవఁగ మనమున మోదము
గదురఁగ లేనగవు వదనకమలముఁ బొదవన్, 680

వ ఇవ్విధంబున గదఁ బోవం దన్ని యసురవిభునితో నిట్లనియె 681

చ “ఘనగదఁ గేలఁ బూని భుజగర్వ మెలర్పఁగ నన్ను సంగరా
వని నెదిరించు రార యనివారణ, దైత్యకులేశ్వరాధమా!”
యనవుడు వాఁడు నుబ్బి గద నంబుజనాభుని వ్రేసె వ్రేసినం
దనుజవిభేది పట్టికొనెఁ, దార్క్ష్యుఁ డహీంద్రునిఁ బట్టుకైవడిన్ 682

క దితిజుఁడు దన బల మప్రతి
హతతేజుం డగు సరోరుహాక్షుని శౌర్యో
న్నతిమీఁదఁ బెట్టి కుందుట
మతి నెఱిఁగియు బెనఁగె దురభిమానము పేర్మిన్ 683

వ అంత 684

సీ కాలానల జ్వలజ్జ్వాలా విలోల క
రాళ మై పెంపొందు శూల మంది,
సురవైరి యజ్ఞసూకర రూపధరుఁ డైన
వనజనాభునిమీఁద వైవ, నదియు
సద్ద్విజోత్తముమీఁదఁ జపలతఁ గావించు
నభిచారకర్మంబునట్ల బెండు
పడి పఱతేఁ గని, పద్మోదరుఁడు దాఁ
జక్రధారాహతిఁ జండవిక్ర

తే మమున నడుమన వడిఁ ద్రుంచె, నమరభర్త
మహిత దంభోళిచే గరుత్మంతు పక్ష
మతిరయంబునఁ ద్రుంచినగతిఁ జెలంగి,
సురలు మోదింప, నసురులు సొంపు డింప 685

వ అయ్యవసరంబున నయ్యసుర దన శూలంబు చక్రంబుచేత నిహతం బగుటం గని, 686

క దితిజుఁడు రోషోద్ధతుఁడై
యతినిష్ఠుర ముష్టిఁ బొడిచె హరి, నా లోకో
న్నతుఁ డొప్పెఁ గుసుమమాలా
హతి దిగ్గజరాజుఁ బోలె నవిదళితుఁడై 687

మ హరిమీఁదన్ దితిసంభవుండు ఘనమాయాకోట్లు పుట్టించినన్,
ధరణీచక్రము భూరిపాంసుపటల ధ్వాంతంబునం గప్పె భీ
కర పాషాణ పురీష మూత్ర ఘనదుర్గంధాస్థి రక్తావళుల్
గురిసెన్ మేఘము లభ్రవీథిని మహాఘోర క్రియాలోలమై 688

వ మఱియును 689

చ తవిలి విముక్తకేశ పరిధానము, లుగ్రకరాళ దంత తా
లువులును, రక్తలోచనములుం గల భూత పిశాచ డాకినీ
నివహము లంతరిక్షమున నిల్చి నిజాయుధపాణులై మహా
రవముగ యక్ష దైత్య చతురంగబలంబులఁ గూడి తోఁచినన్,
690

వ అంత 691

క త్రిసవనపాదుం డగు నా
బిసరుహనేత్రుండు లోకభీకర మగు నా
యసురాధిపు మాయా విని
రసనకరం బైన శస్త్రరాజముఁ బనిచెన్ 692

క ఆ చక్రభానుదీప్తి ధ
రాచక్రమునందు నిండి రయమున నమ్మా
యా చక్రము నడఁగించెను
నీచక్రముఁ డైన యానిశిచరు నెదురన్ 693

మ దివి నిండా)దల సంతస ప వా మె [illegible] మూ ం
బవిసంకాశ [illegible] వా త్రము [illegible] ల మై [illegible] దా
నవలోకేశుఁ [illegible] త్త నెతు [illegible] వాటిల్లఁగా
భువి మిాఁన్ వ [illegible] నావసీ [illegible] న్
699

క బుడబుడ నెత్తురు గ్రక్కుచు
వెడరూపము దాల్చి గుడ్లు వెలి [illegible] ల
బడి పండ్లు గీటుకొనుచును
విడిచెం బ్రాణములు దైత్యవిభుఁ డంతన్ 700

తే పడిన దనుజేశ్వరునిఁ జూచి పద్మసంభ
వాది దివిజులు వెఱఁగంది రాత్మలందు
నితఁడు వొందుట యెట్లకో యీ యవస్థ
నని తలంచుచు మఱియు నిట్లనిరి వసుస 701

మ వరయోగీంద్రులు యోగమార్గమున నెవ్వానిన్ మనోవీథి సు
స్థిరతన్ లి గశరీర భంగమునకై చింతింతు రా పంకజో
దరు పాణ్యాహతిఁ దన్ముఖాంబుజముఁ దర్శించుచుం జచ్చె దు
ర్భరి తో త్తంసుఁడు దైత్యవల్లభుని సౌభాగ్యం బిదా నెట్టిదో
702

చ సమమతి వీరు దైత్యకులశాసను పార్షదుల్ మునీంద్ర శా
పమున నికృష్టజన్మమునఁ బైకొని పుట్టియు, నేఁడు విష్ణుచే
సమయుటఁ జేసి మీఁద నగు జన్మమునన్ జలజాక్షు నిత్యవా
సమున వసింతు, రెన్నఁటికిఁ జావును బుట్టువు లేవు వీరికిన్ 703

క అన వెఱఁగు నొంది పావన
తను వొందిన యట్టి విఁచ తామరసాక్షు
న్ననిమిషముని యోగిజనా
వనదక్షున్ దనుజ కరటివర హర్యక్షున్ 704

వ కనుఁగొని, 705

చ వనజదళాక్ష! యీ జగతి వారల మర్మము లీ వెఱింగి యీ
సునఁ బగ బట్టు నీ దివిజారాదనుఁ జంపితి గాన యింక శో
భన మగు' నంచు హస్తములు ఫాలములం గదియించి,
యందఱున్
వినమితులై నుతించిరి వివేకవిశాలునిఁ బుణ్యశీలునిన్ 706

వ అంత 707

చ ఘనవరాహమూర్తి సురశాత్రవుఁ ద్రుంచినమీఁద భారతీ
ధవముఖ దేవతా మునికదంబము దన్ను నుతించునట్టి సం
స్తవమున కాత్మలోనఁ బ్రమదమున బొంది, సమగ్ర మంగళో
త్సవము దలిర్ప నందఱఁ బ్రసాదవిలోకన మొప్పఁ జూచుచున్,
708

చ అరిగె వికుంఠధామమున, కమ్మహోత్సవసూచకంబు గా
మొరసె సుపర్వదుందుభు, లమోఘము లై ధరణీతలంబునం
గురిసె బ్రసూనవృష్టి, శిఖికుండము లెల్లెడఁ దేజరిల్లె, భా
స్కర శశిమండలంబులు నిజద్యుతితో వెలుఁగొందె నత్తఱిన్
709

క అని యీ పుణ్యచరిత్రము
వనరుహసంభవుఁడు త్రిదివవాసులకుం జె
ప్పినయది మైత్రేయుఁడు విదు
రున కెఱిఁగించిన విధంబు రూఢము గాఁగన్ 710

క. శుకయోగి పరీక్షిత్తున
కకుటిలమతి నెఱుఁగఁ జెప్పె నవి యాఁకఁడు శౌ
నకముఖ్యు లైన మునివరు
లకుఁ దెలియఁగఁ జెప్పె సూతుఁ డాగమ మొప్పన్ 711

వ. ఇవ్విధంబున మైత్రేయుండు చెప్పిన విని విదురుండు
సంతసిల్లెనని, 712

క. అనఘుం బగు నీ చరితము
వినినఁ బఠించిన లభించు విశ్రుతకీర్తుల్
వనజోదరు పదభక్తియు
మునుకొని యిహపర సుసౌఖ్యములు జనములకున్ 713

వ. అని చెప్పి వెండియు సూతుండు మహాత్ముల కిట్లనియె నట్లు
పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని,
మునీంద్రా! హిరణ్యాక్షు వధానంతరంబున వసుంధర సమస్థితి
బొందిన విధంబును, స్వాయంభువ మనువుం బుట్టించిన యనం
తరంబున విరించి దిర్యగ్జాతి జంతుసృష్టి నిమిత్తంబు లైన
మార్గంబు లెన్ని సృజించె మహాభాగవతోత్తముం డయిన
విదురుండు, కృష్ణున కపకారంబు దలంచిన పాపవర్తనులగు
ధృతరాష్ట్రపుత్త్రులం బాసి, జనకుం డగు కృష్ణద్వైపాయను
నకు సముం డగుచుఁ, దన మనోవాక్కాయ కర్మంబులు కృష్ణు
నందు చేర్చి, భాగవతజనోపాసకుండై పుణ్యతీర్థ సేవాసమాలబ్ధ
యశో విగతకల్మషుం డగుచు మైత్రేయ మహాముని నేమి
ప్రశ్నంబు లడిగె నవి యెల్లం దెలియ నానతిమ్మనిన రాజేంద్రు
నకు శుక యోగీంద్రుఁ డిట్లనియె 714

సీ. విమలాత్మ్యం౯ ప్రైయ వ్విగుగంగు మైత్రేయ
మునివ౯ జూచి యిట్లనియె బ్రీతి
'చతురాన్యా౯ లపరిశపతి మైనట్టి
జలజగర్భుండు పరిశాంగ్గమందు
ముఱు ప్రజాపతులను బుట్టించి వె౯యుం
జిత్ర్తుం దేమి స్తృ ంపం దలంచె?
మనుస్తృజించిన యట్టి మును లస్ఫురించ్యాడ
లబ్జజు నాదేశ గ్గాన్ని నిలిప

తే. యర్థి నెట్లు స్తృజించిరి? యఖిలజగము
మొఱిసి మ వాకు భార్యాసమేతు లగుచు
నేమి స్తృజియించి? రదిగాక కామినులను
బాసి యేమి స్తృజించి రా భద్రియశులు? 715

క. అందఱుం దమలో నైక్యముం
జెందిన నో నేమి దగ స్తృజింపిరి? కరుణా
కందళిత హృదయ! యిన్నియుం
బొందుగ నెఱింగింపు మయ్య పెఫనుత నాకున్" 716

చతుర్ముఖుం డొనర్చు యక్షాది దేవతాగణ స్తృష్టి

సీ. అనిన మునీంద్రుం డిట్లనియె "శివాదృష్ట
పరుండు మాయాయుత్ర పురుషవరుండుం
గాలాత్మకుండు దను కారణంబున నిర్వి
కారుండై నట్టి జగన్నివాసుం
డాది జాతక్షోభుం డయ్యె, నమ్మోటి వ
లనను గుణత్రియంబును జనించె,
నా గుణత్రియమునం దయ్యె మహత్తత్త్వ
మది రజోగుణ హేతు వైన దాని

తే యం దహంకార మొగిఁ ద్రిగుణాత్మకమునఁ
బొడమె, మఱి దానివలనఁ ద్రిభూత మయ్యెఁ
బంచతన్మాత్రి, లందు సంభవము నొందె
భూతపంచక మీ సృష్టి హేతు వగుచు 717

వ అవియును దమలోన బ్రత్యేకంబ భువననిర్మాణ కర్మంబునకు సమర్థంబులు గాక, యన్నింటి సంఘాతంబునఁ బాంచభౌతికం బైన హిరణ్మయాండంబు సృజియించె, నదియును జలాంతర్వ ర్తియై వృద్ధిఁ బొందుచుండె, నంత 718

సీ నారాయణాఖ్య నున్నతి నొప్పు బ్రహ్మంబు
సాహస్రదివ్యవర్షంబు లోలి
వసియించి యుండె నా వాయుదేవుని నాభి
యందు సహస్రసూర్య ప్రదీప్తిఁ
దనరుచు సకల జీవ నికాయయుత మగు
పంకజాతంబు సంభవము నొందెఁ,
బరఁగంగ నందుఁదా భగవ దధిష్ఠితుం
డై స్వరా ట్టగు చతురాననుండు

తే జనన మందెను, దత్పద్మసంభవుండు
నామ రూప గుణాది సంజ్ఞ సమేతుఁ
డగుచు నిర్మాణ మొనరించె నఖిలజగము,
వనజజుండు నిజచ్ఛాయవలన మఱియు 719

సీ తామిస్రమును నంధతామిస్రమును దమ
మును మోహనము మహామోహనంబు
నను పంచమోహ రూపాత్మక మైన య
విద్యఁ బుట్టించి, యవ్వేళఁ దనకుఁ

నది తమోగయదేహ మని తెరోసి ధాత
యైనప్పుడు విడిచె, ధాత్రిముక్త
దేహంబు రాత్రి క్షుత్తృష్ణల కావాస
మును రాత్రిమయము నయ్యెను దలప,

తే. న దురో యక్ష రక్షస్సు లన జనింప
వార లప్పుడు క్షుత్తృష్ణల వశులై గొంద
రా చతుర్ముఖు భక్షింతు మనిరి, కొంద
ఱతని రక్షింతు మని తెగి రాడి రంత 720

వ. ఇట్లు పలుకుచు భక్షింపువార లయి ధాత సన్నిధికిం జనిన నతండు భయవిహ్వలుండై, "యేను మీ జనకుండను, మీరలు మత్పుత్రులరు, నన్ను హింసింపకుం" డనుచు "మా మా జక్షత రక్షత" యను శబ్దంబులు పలుకం, దన్నిమిత్తంబున వారలకుం గ్రమంబున యక్ష రక్షో నామంబులు ప్రకటంబు లయ్యె, వెండియుం బ్రభా విభాసితం బైన యొక్క కాయంబు ధరియించి సత్త్వగుణ గరిష్ఠులుం బ్రభావంతులు నగు సుపర్వులం బ్రముఖులఁగా సృజియించి తత్ప్రభామయ గాత్రవిసర్జనంబు సేసిన, నది యహోరూపంబై దేవతావళికి నాశ్రయంబయ్యె, మఱియును జఘనంబువలన నతిలోలుపు లైన యసురులం బుట్టింప, వార లతికాముకు లగుటం జేసి యయ్యజునిం జేరి మిథునకర్మం బపేక్షించిన, విరించి నగుచు నిర్లజ్జ లయిన యసురులు దన వెంటం దగులం బఱచి, ప్రసన్నార్తిహరుండును భక్తజనానురూప సందర్శనుండును నైన నారాయణుం జేరి తత్పాదంబులకుఁ బ్రణమిల్లి యి ట్లనియె 721

క "రక్షింపుము రక్షింపుము
పేక్షింపక, వినుత నిఖిల భువన దాయక వి
శ్వ క్షేమంకర! విను మిట
దక్షత నీ యాజ్ఞ నేను దలచి వగుసన్ 722

తే ఈ ప్రజాసృష్టి కల్పనం బే నొనర్ప,
నందుఁ బాపాత్ము లైన యీ యసురు లిపుడు
నను రమింపఁగ డాయ వచ్చినఁ గలంగి
యిటకు వచ్చితి నన్నుఁ గావు మిద్ధచరిత 723

వ అదియునుం గాక లోకంబువారలకుం గ్లేశంబు లొనరింపం, గ్లేశంబునం బొందిన వారల క్లేశంబు లపనయింపను నీవ కాక యితరులు గలరే? యని స్తుతియించినం బద్మజు కార్పణ్యం బెఱుంగ నవధరించి విచిత్రధ్యానార్ద దర్శనుం డగుచుఁ, "కమలసంభవ! భవద్ఘోర తనుత్యాగంబు సేయు" మని యానతిచ్చిన నతండు నట్ల చేసె, నంత నదియును 724

సీ నవ్యకాంచన రణన్మణినూపురారావ
విలసిత పాదారవిందయుగళ
కాంచీకలాప సంకలిత దుకూలవ
స్త్రస్ఫార ఘణిగనిత బింబ
రాజితానర్ఘ్య కర్కశ పీన కఠిన ఘన
పృథుకుచభార కృశీభవలగ్న
మదిరా రస స్వాద మద విఘూర్ణిత చారు
సిత నవవికచ రాజీవనయన,

తే యపరపక్షాష్టమీ శశాంకార్ధ నిటల,
మదవదళికుల రుచి రోపమాన చికుర,
లలిత చంపక కుసుమ విలాస నాస,
భాస లీలావలోకన యబ్జపాణి 725

క. అనఁ దగి సంధ్యారూపం
బున నలరా రత్న మపుగుఁ బుట్టిన దానిం
గనుఁగొని దానవు లుపగూ
హాన మొగిఁ గావించి పలికి రందఱుఁ దమలోన్ 726

క. "ఈ సౌకుమార్య మీ వయ
సీ సౌందర్య క్రమం బీ ధైర్యంబు
న్నీ సౌభాగ్యవిశేషము
నే యతులకుఁ గలుగ జూడనిది చిత్రముగన్ 727

చ. అని వెలఁదిం గని యదనుజు లందఱు నిట్లని "రీ తలోదరిం
గని మన మంతనుండియును గాముకవృత్తిఁ జరించుచుండఁగా
మనయెడ దీని చిత్తమున మక్కువ లేమికి నేమి హేతువో!"
యని బహుభంగులం బలికి యా ప్రమదాకృతి యైన
సంధ్యతోన్ 728

క. కదళీ స్తంభోరువ!
యే కుల, మే జాతిదాన, వెవ్వానిసుత ? వి
ల్లోకాంతంబున నచ్చట
నే కారణమునఁ జరించె దెఱిఁగింపు తగన్ 729

క. భవదీయ చారురూప
ద్రవిణ లసత్పూర్ణ భూమిఁ దగు మోహమునం
దవిలిన దుర్భరులను మముఁ
గవయవు పుష్పాస్త్ర బాధ ఘనమయ్యెఁ గదే!" 730

వ. మఱియుఁ దదీయసౌందర్యం బగ్గడింప నలవి గాక చింతించుచు, 731

సీ. గురుకుచభార సంకుచితావలగ్నంబు
  దనరారు నాకాశతలము గాఁగ,
లలితపల్లవ పాణితలముఁ జెన్నొందు
  చెండు పరిస్ఫుటార్కుండు గాఁగ
సలలిత నీలపేశల పృథు ధమ్మిల్ల
  బంధంబు ఘన తమఃపటలి గాఁగఁ,
బ్రవిమలతర కాంతభావ విలోకన
  జాలంబు తారకాసమితి గాఁగఁ,

తే. గడఁగి మైపూఁతఁ సాంధ్యరాగంబు గాఁగ,
నంగనాకృతి నొప్పు సంధ్యావధూటిఁ
గదిసి, మనముల మోహంబు గడలుకొనఁగ
నసురు లందఱుఁ గూడి యి ట్లనిరి మఱియు 782

క. వెలయఁగఁ బద్మజు చేక
స్థలమున నే యొప్పుఁ గాని, త్వత్పదపద్మం
బిల బహుగతుల ననేక
స్థలములఁ దనరారుఁ గాదె తరుణాబ్జముఖీ! 783

క. అని దనుజులు దమ మనముల
ననురాగము లుప్పతిల్ల నందఱు నా సం
ధ్యను బట్టికొనిరి, వనజా
సనుఁ డప్పుడు హృదయమందు సంతసమందెన్ 784

క. సరసిజభవుఁ డయ్యెడఁ దన
కర మాఘ్రాణింప నపుడు గంధర్వులు న
ప్సరసలుఁ బుట్టిరి, ధాత్రియుఁ
బరువడి నాత్మీయ తనువుఁ బాసిన, నదియున్ 785

వ. చంద్రికాహాసంబైన దన్గాత్రంబు విశ్వావసు పురోగములగు గంధర్వాప్సరో గణంబులుగా నిర్మించి, వెండియుం గమల గర్భుండు తంద్రోన్మాద జృంభికా నిద్రారూపంబైన శరీరంబు దాల్చి పిశాచ గుహ్యక సిద్ధ భూతగణంబులం బుట్టించిన, వారలు దిగంబరులు ముక్తకేశులు నయినం జూచి, ధాత లోచనంబులు ముకుళించి తద్గాత్రంబు విసర్జనంబు గావించిన నది వారలు గైకొనిరి. వెండియు నజుండు దన్ను దన్న వంతు నింతం జింతించి యదృశ్య దేహంబు వహియించి పితృ సాధ్య గణంబులం బుట్టించిన, వారలు దమ్ముం బుట్టించిన యదృశ్య శరీరంబునకుం గారణంబగు దేవభాగంబుం గైకొనినం, దత్కారణంబున పితృ సాధ్యగణంబుల నుద్దేశించి శ్రాద్ధంబుల హవ్య కవ్యంబు లాచరింతురు, వ ఱయును 786

సీ. సజ్జనస్తుత! విను, చతురతం బంకజా
సనుండు దిరోధానశక్తివలన
నర సిద్ధ విబుధ కిన్నరులను బుట్టించి
తవిలి వారికి దిరోధాన నామ
ధేయమైనట్టి యా దేహంబు నిచ్చెను,
వెండియు భారతీవిభుండు దనకుం
బ్రతిబింబ మగు శరీరమునం గిన్నరులం గిం
పురుషులం బుట్టింపం, బూని వారు

తే. ధాతృప్రతిబింబ దేహముల్ దాల్చి వరుస
నిద్దఱిద్దరు గవగూడి యింపు లొదవ
బ్రహ్మపరమైన గీతముల్ వాడుచుండి,
రంతం బంకజసంభవుం డాత్మలోన 787

క. తన సృష్టి వృద్ధి సేమిం
గనలుచు శయనించి చింతఁ గాంచరణాబ్జల్
గానకొని కదలఁ బఁగ ా
లిన సోమము లుగ్రమ్మంచెలి వ్రిజ ముమ్మ్యోక్ 738

క. వనజజుఁడు దన్నుఁ గృతకృ
త్యునిఁగా భావించి యాత్మఁ దుష్టి వహింపన్
మనమున నిఖిల జగత్పా
వను లగు మునుల ద్రిలోకవరుల సృజించెన్ 739

సీ. పుట్టించి వారికి బురుషరూపం బైన
తన దేహ మిచ్చినఁ, దగిలి వారు
గనుఁగొని మున్ను పుట్టినవారిఁ గూడి యా
వనజసంభవున కిట్లనిరి "దేవ!
యఖిల జగత్స్రష్ట వైన నీచేతఁ గా
వింపంగఁబడిన యీ వితతి సుకృత
మాశ్చర్యకరము, యజ్ఞాది క్రియాకాండ
మీ మనుసర్గ మం దీడ్యమయ్యెఁ,

తే. ద ద్ధవిర్భాగములు మాకుఁ దవిలి జిహ్వ
లందు నాస్వాదనములు సేయుంగఁ గలిగె,
ననుచు మనముల హర్షంబు లతిశయిల్ల
వినుతి సేసిరి భారతీవిభుని, మఱియు 740

వ. వరతపో యోగవిద్యా సమాధియుక్తం బగుచు ఋషి దేహ
ధరుండును హృషీకాత్మకుండును నై ఋషిగణంబులం బుట్టించి,
సమాధి యోగైశ్వర్య తపో విద్యా విరక్తి యుక్తం బగు
నాత్మీయ శరీరాంశంబు వారికిం గ్రమంబున నొక్కొక్కనికి

నిచ్చె, నని మైత్రేయుఁడు చెప్పిన విని విదురుండు పరమా
నందంబునం బొంది గోవింద చరణారవిందంబులు డెందంబునం
దలంచి వెండియు మైత్రేయునం జూచి యి ట్లనియె 741

సీ " వరగుణ! స్వాయంభువ మనువంశం బిం౹
బరమసమ్మతము దప్పదు తలంపఁ,
గొనకొని తద్వంశమున మిథునక్రియఁ
జేసి ప్రజావృద్ధిఁ జెప్పి తీవు,
అదియును గాక స్వాయంభువ మనువుకుఁ
బూని ప్రియవ్రతోత్తానపాదు
లను నందనులు గల రంటివి, వారు గ
ప్తద్వీపవతి యైన ధాత్రి నెల్ల

తే ధర్మమార్గ బు లేమియుఁ దప్పకుండ
ననఘు లై యెట్లు పాలించిరయ్య? వారి
చరిత మెల్లను సత్కృపా నిరతబుద్ధి
నెఱుఁగ వినిపింపు నాకు మునీంద్ర చంద్ర! 742

వ అదియునుం గాక త న్మనుపుత్రియు యోగలక్షణ సమేతయు
నగు దేవహూతి యను కన్యకారత్నంబును స్వాయంభువుండు
గర్దమునకు నే విధంబు ం బెండ్లి చేసె? నా దేవహూతియందు
మహాయోగి యయిన కర్దముండు ప్రజల నేలాగునం బుట్టించె?
నదియునుం గాక కర్దముండు రుచి యను కన్యను దక్షప్రజా
పతి కిచ్చెనని చెప్పితి, వా రుచియందు న మ్మహాత్ముం డే సృష్టి
యేలాగునం బుట్టించె? నవి యన్నియుం దెలియ నానతీయ
వలయు" నని యడిగిన విదురునకు మైత్రేయుం డి ట్లనియె 743

- కర్దముఁడు భగవదనుజ్ఞఁ బడసి దేవహూతిని బెండ్లియాడుట -

క. "విను మనఘ! కృతయుగంబున
మునినాథుం డయిన కర్దముఁడు ప్రజల సృజిం
పను వనజసంభవునిచే
త నియుక్తుం డగుచు మది ముదము సంధిల్లన్, 744

తే. ధీరగుణుఁడు సరస్వతీ తీరమందుఁ
దవిలి పదివేల దివ్యవత్సరము లోలిం
దపము సేయుచు నొకనాఁడు జపసమాధి
నుండి యేకాగ్ర చిత్తుఁడై యిందువేడ్క, 745

క. వరదుఁ బ్రసన్ను మనోరథ
వరదాన సుశీలు నమరవంద్యు రమేశున్
దురితవిదూరు సుదర్శన
కరుఁ బూజించిన నతండు కరుణాకరుఁడై 746

వ. అంతరిక్షంబునం బ్రత్యక్షం బైన 747

సీ. తరణి సుధాకర కిరణసమంచిత
సరసీరుహోత్పల స్రగ్విలాసుఁ
గంకణ నూపుర గ్రైవేయ ముద్రికా
హార కుండల కిరీటాభిరాముఁ,
గమనీయ సాగరకన్యకా కౌస్తుభ
మణిభూషణోద్భాసమానవక్షుఁ,
సలలిత దరహాసచంద్రికా ధవళిత
చారుదర్పణ విరాజత్కపోలు

తే. శంఖ చక్ర గదా పద్మ చారుహస్తు,
నలికులాలక రుచిభాస్వ దలికఫలకుఁ,
పీత కౌశేయవాసుఁ, గృపాతరంగి
తస్మితేక్షణుఁ, బంకజోదరుని హరిని, 748

వ. ఇట్టియ శబ్దబ్రహ్మ శరీరవంతుండును సదాత్మకుండును, జ్ఞానైక వేద్యుండును వైనతేయాంస విన్యస్త చరణారవిందుండును నయిన గోవిందునిఁ గనుంగొని, సంజాత హర్ష లహరీ పరవశుండును, లబ్ధమనోరథుండును నగుచు సాష్టాంగ దండప్రణామంబు లాచరించి తదనంతరంబ, 749

క. ముకుళిత కరకమలుం డగుచు
యకుటిల సద్భక్తి పరవశాత్మకుఁ డగుచుని
వికచాంభోరుహ లోచను
నకు నట్లనయెం దదాననముఁ గనుఁగొనుచున్ 750

సీ. అజ్ఞాతుఁ సకలభూతాంతరాత్ముఁడ వగు
దనరు చుండెడి నీదు దర్శనంబుఁ
దలకొని సుకృత సత్ఫల భరితంబు లై
నట్టి యనేక జన్మానుసరణ
ప్రకట యోగక్రియాభ్యాస నిరూఢు లై
నట్టి యోగీశ్వరు లాత్మఁ గోరి
యుందురు, యోగీశ్వరేశ్వర! యే భవ
త్పాదారవింద సందర్శనంబు

తే. గంటి, భవవార్ధిఁ గడవంగఁ గంటి, మంటి,
గడఁగి నా లోచనంబుల కలిమి నేఁడు
దవిలి సఫలత నొందెఁ, మాధవ! ముకుంద!
చిరదయాకార! నిత్యలక్ష్మీవిహార! 751

మ 'అనఘా! యొక్కఁడ వయ్యు నాత్మకృత మాయాజాత సత్త్వాది శ
క్తినికాయస్థితి నీ జగజ్జన వృద్ధిక్షోభ హేతుప్రభా
వ నిరూఢిం దగు దూర్ణనాభిగతి, విశ్వస్తుత్యా! సర్వేశ! నీ
ఘనలీల మహిమార్ణవంబు గడవంగా వచ్చునే యేరికిన్? 753

వ దేవా! శబ్దాదివిషయ సుఖంకరం బగు రూపంబు విస్తరింపం జేయు టెల్ల నస్మదనుగ్రహార్థంబు గాని నీకొఱకుం గా, దాత్మీయ మాయాపరివర్తిత లోకతంత్రంబు గలిగి మదీయ మనోరథ సుధాప్రవర్షి వైన నీకు నమస్కరించెద" 754

మ. అని యిబ్భంగి నుతించినన్ విని సరోజాక్షుండు మోదంబునన్
వినతానందన కంధరోపరి చరద్విభ్రాజమానాంగుఁడై
యనురాగస్మిత చంద్రికాకలిత శోభాస్యుండై యమ్మునీం
ద్రునిఁ గారుణ్య మెలర్పఁ జూచి పలికెన్ రోవిష్ణుఁడై
ప్రేల్మిడిన్ 755

క మునివర! యే కోరిక నీ
మనమునఁ గామించి నను సమంచితభక్తిన్
ననరునఁ బూజించితి, నీ
కనయము నా కోర్కి సఫల మయ్యెడుఁ జుమ్మీ 756

వ అని యాన తిచ్చి ప్రజాపతి పుత్త్రుండును సమ్రాట్టును నైన స్వాయంభువ మనువు బ్రహ్మావర్త దేశంబునందు సప్తార్ణవ మేఖలామండిత మహీమండలంబుఁ బరిపాలించుచున్న వాఁ, డమ్మహాత్ముం డపరదివసంబున నెందులకు శతరూప యను భార్యా సమేతుండై ధర్మప్రకామ యగు కూఁతుం దోడ్కొని భవదీయం సన్నిధికిం జనుదెంచి నీకు ననురూప వయశ్శీల సంకల్ప

గుణాకర వైయైన తన [illegible] గావున భవదీయ
మనోరథంబు సిద్ధించు [illegible] చుండు న
మ్మనుకన్యక నీను వరించి [illegible] సౌ పర్యావతు
లయిన కన్యలం దొమ్మండ్ర [illegible] వశంబు
నందు మునీంద్రులు [illegible] గలరు,
నీవు మదీయశాసనంబును ధరియించి [illegible] కర్ముండ
వగుచు నైకాంతిక స్వాంతం బన [illegible] దయాచరిత
జ్ఞానివై నాయందు జగంబులు [illegible] వనియు నీయందు నేఁ గల
ననియు నెఱింగి సేవింపుచుఁ, చరమకాలంబున నను బొందఁ
గలవు భవదీయ వీర్యంబువలన [illegible] భార్యాగర్భంబునఁ బ్రవే
శించి మత్కళాంశంబునఁ బుత్రుఁడ నై సంభవించి, నీకుం
దత్త్వసంహిత నుపన్యసింతు నని జనార్దనుండు గర్దమున కెఱిం
గించి యతండు గనుంగొనుచుండ నంతర్హితుండై, 757

చ అతుల సరస్వతీ సరిదుదంచిత శాల రసాల సాల శో
భిత తటతుంగ రంగ మగు బిందుసరంబు విసర్జించి యం
చిత గరుడాధిరోహణము సేసి తదీయ గరుత్పరిభూత రు
క్ప్రతతి విలక్షణక్రమ విరాజితసామము వించు మోదియై 758

చ అరిగె వికుంఠ ధామమున, కంత సకాముఁడునైన కర్దముం
డరయ విమోహియై మనము నందలి ముందట వచ్చు కోరికల్
పిరిగొనుచుండఁ దక్షిణము [illegible] కేఁగి యుండి తా
వరుఁ దలపోయుచుండె జనవంద్యుఁడు భక్తినితాంతచిత్తుఁడై 759

వ అంత స్వాయంభువుండు [illegible] డగుచు నిజభార్యా
సమేతుండై ధర్మ్యవాంఛాపరుండైన పుత్రికం దోడ్కొనుచు
నిజతనూజకుం దగిన వరు నన్వేషించుచు భువనంబునం గలయం
గుమ్మరి యొందును గానక వచ్చి వచ్చి, 760

ఉ ముందటఁ గాంచె నంత బుధముఖ్యుఁడు విష్ణుఁడు గర్దమున్, దయా
నంద మెలర్పఁ జూడ, నయనంబుల రాలిన బాష్పముల్ ధరన్
బిందువులై వెసం దొరఁగి పేర్చి సరస్వతిఁ జుట్టి పాఱుటన్
బిందుసరోవరం బనెడి పేరఁ దనర్చిన పుణ్యతీర్థమున్ 761

ఉ అందుఁ దమాల సాల వకుళార్జున నింబ కదంబ పాటలీ
చందన నారికేళ ఘనసార శిరీష లవంగ లుంగ మా
కంద కుచందన క్రముక కాంచన బిల్వ కపిత్థ మల్లికా
కుంద మధూక మంజుల నికుంజములం దనరారి వెండియున్ 762

క పరిపక్వ ఫలభరానత
తరుశాఖా సీకర నివసిత స్ఫుటవిహంగో
త్కర బహుకోలాహల రవ
భరిత దిగంతములు గలిగి భవ్యం బగుచున్ 763

క అతినిశిత చంచుదళన
త్రుటి నిర్గత పక్వఫల రసాస్వాదన మో
దిత రాజశుక వచోర్థ
శ్రుతిఘోషము సెలఁగ శ్రవణసుఖదం బగుచున్ 764

క లలిత సహకార పల్లవ
కలితాస్వాదన కషాయకంఠ విరాజ
త్కలకంఠ పంచమస్వర
కలనాదము లుల్లసిల్లఁ గడు రమ్యములై, 765

క అతుల తమాల మహీజ
ప్రతతి ఘనజాత జలదపరిశంకాంగీ
కృత తాండవఖేలన విల
సిత పింఛవిభాసి బాలశిఖి సేవ్యం బై 766

క. కారండవ జలకుక్కుట
సారస బక చక్రవాక షట్పద హంసా
భోరుహ కైరవ నవక
హ్లార విరాజిత సరోరుహాకరయుత మై 767

క. కరి పుండరీక వృక కా
సర శశ భల్లూక హరిణ చమరీ హరి గో
కర ఖడ్గ గవయ వలిముఖ
శరభ ప్రముఖాగ్ర వన్యసత్త్వాశ్రయ మై 768

వ. ఒప్పు నప్పరమతాపసోత్తముని యాశ్రమంబుఁ గనుంగొని
మితపరిజనంబులతోడం జొచ్చి యందు 769

సీ. అంచిత బ్రహ్మచర్య వ్రతయోగ్య మై
యెసఁగిల్లు ఘనతపోవృత్తిచేత
దేహంబు రుచిరసందీప్తమై చెలువొందఁ
గడుఁ గృశీభూతాత్మకాయుఁ డయ్యు
నలినోదరాలాప నవసుధాపూరంబు
శ్రోత్రాంజలులఁ ద్రావి చొక్కి యున్న
కతనఁ గృశీభూతకాయుండు గాక జ
టావల్కలాజినశ్రీ వెలుంగఁ

తే. కమలపత్త్ర విశాలనేత్రములు దనరఁ
నలినసంస్కారసంచితానర్ఘ్య నూత్న
రత్నమును బోలియున్న కర్దమునిఁ జూచి
భక్తి నమ్మను వెరఁగొఁ దత్పాదములకు 770

వ. ఇట్లు వందనంబు గావించినం గర్దముండు దన గృహంబునకు విందై చనుదెంచి, యమ్మునివు నాదరించి యర్ఘ్యపాద్యాది విధులం బరితుష్టుం గావించి పూర్వోక్తంబైన భగవదాదేశంబు సంస్మరించి స్వాయంభువున కిట్లనియె 771

సీ. "నరగుణాకర! భగవద్భక్తియుక్తుండ
వైన త్వదీయపర్యటన మెల్ల
శిష్టపరిగ్రహ దుష్టనిగ్రహముల
కొఱకె గదా, పుణ్యపురుష! మఱియు
వనజహితాంశు తా వహ్ని సమీర వై
వస్వత వార్థిప వాసవత్మ
కుఁడవు, వారిస్వరూపుఁడ వైన నీకును
మానితభక్తి నమస్కరింతు,

తే. ననఘ! నీ విప్పుడే నేమి యఖిలలోక
జైత్ర మగు హేమమణిమయ స్యందనంబు
నెక్కి కోదండపాణివై యుద్ధసైన్య
పదవిఘట్టనచే భూమిభాగ మగల 772

మ. తరణిం బోలెఁ జరింపకున్న ఘననిద్రం బొంది యుండేని, భూ
వర! పద్మకసంకల్పితంబు లగు నీ వర్ణాశ్రమాచార వి
స్తర పాథోనిధి సేతుజాత మహిమాచార క్రియల్ దప్పి సం
కరమై చోరభయంబునన్ నిఖిలలోకంబుల్ నశించుం
జుమీ" 773

వ. అని పలికి "భవదాగమన మెవ్వని నిమిత్తం బెయ్యది?" యనవుడు, సమాహిత సకల నిత్యకర్మానుష్ఠానుం డైన మునీంద్రునకు స్వాయంభువుం డిట్లనియె 774

క " సరసిజగర్భుఁడు దగఁజే
విరచితమైనట్టి వేద విశతిఁ సస్వ
ధర వెలయించుటకై బుధ
వర మిమ్ముం దన వ ఘుబువలన సృజించెన్ 775

క దురితస్వరూప పాట
చ్చరవీశం బొందకుండ సకలక్షోణిం
బరిపాలించుటకై మముఁ
నరవిందభవుండు భుజముల దు సృజించెన్ 776

క నెఱి నట్టి జలజభవుఁకుఁ
గర మంతఃకరణ గాత్రికములై వసుసం
బరగిన బ్రహ్మక్షత్రము
లరయ రమాధీశ్వరునకు నవనియుంబుల్ 777

వ కావున హరిస్వరూపుండవై దుర్జన దుర్దర్శనుఁడ వయిన నిను
గనుట మదీయ భాగ్యంబున సిద్ధించె, భవత్పాదకంజ కింజల్క
పుంజ రంజితం బైన మదీయమస్తకంబును, దావక వచన
సుధా పూరితంబు లైన శ్రవణాగ్రములును మంగళాకరత్వంబున
సాఫల్యంబుగం బొందె, నేను కృతార్థుండ నైతి, దుహితృ
స్నేహ పరిక్లిష్టాంతఃకరణుండ నై సకలదేశ భ్రమణ
ఖిన్నుండ నయిన నా విన్నపం బవధరింపు ' మని యిట్లనియె 778

మ " వర యోగీశ్వర ! దేవహూతి యను నీ వామాక్షి మత్పుత్రి, దా
వరలావణ్య గుణాఢ్యలీల వినియు నవ్వారిజ మదిం గోరి, తా
తుర యై నారదు పంపునన్ మిము వరింతు న్నంచు నేతెంచె, నీ
తరుణీభిక్షఁ బరిగ్రహింపు ము శుభోదాత్త క్రియాలోలతన్
779

క. అమలిన గృహమేధిక ధ
ర్మములకు దదూప గుణవిరాజిత శీల
క్రమములఁ దనరిన తరుణిం
బ్రమదమున వరింపు మత్యభవ్యచరిత్రా! 780

క. అనఘ! విరక్తుల కైనం
దనయంత లభించు సౌఖ్యతతి వర్జింపం
జనదంట, కాముకులకు న
బ్బిన మానుదురే లభించు ప్రియసౌఖ్యంబుల్? 781

క. వినుము ఫలదంభుఁడు గృహ
ణుని నడిగినఁ దన యశంబునుం దగు మానం
బును జెడుఁ, గావునఁ దగ నీ
వెనయ వివాహేచ్ఛఁ దగులు పెటకేఁగి యిచటికిన్ 782

క. చనుదెంచితి, మన్నుత్రా
ర్థనఁ గైకొని మత్తనూజఁ దగ వరియింపుం"
డన ముని స్వాయంభువునిం
గనుఁగొని మరలంగఁ బలికెఁ గడు మోదమునన్ 783

సీ. "అనఘ! నీ చేత ననన్యదత్తముగఁ బ్ర
తిష్ఠితం బైన యీ తీవఁబోఁడి
కమనీయ రూప రేఖా విలాసంబుల
మానిత లక్ష్మీసమాన యగుచు
నొకనాఁటి రాత్రియం దుడురాజచంద్రికా
ధవళిత నిజసౌధతలమునందు
మహిత హిరణ్మయ మంజీరశోభిత
చరణయై నిజసఖీ సహిత యగుచు

తే, గంధుక క్రీడఁ జరియింప గగనమంద
వరవిమానస్థుఁ డగు న విశ్వావసు డ
నాఁగఁ దనరిన గంధర్వనాయకుండు
తరుణిఁ జూచి విమోహితుఁడై ధరఁ బడియె 784

తే పుండరీకాక్షు నెఱుఁగని పురుషపశువు
లీ తలోదరిఁ బొడగాన, రేమి సెప్ప!
నట్టి కొమరాలు భాగ్యోదయమునఁ దాన
వచ్చి కామింప నొల్లనివాఁడు గలఁడె?

క ఈ కన్యారత్నమునకు
నాకను గుణ రూప వర్తనంబులయెడ నా
లోకింప సమము కావునఁ
గైకొని వరియింతు విగతకల్మషవృత్తిన్ 786

క విమలాత్మ! దీని కొకసమ
యము గల, దెఱిగింతు విను, గుణాకర యగు నీ
రమణికి నపత్యపర్యం
తము వర్తింపుదు గృహస్థధర్మక్రియలన్ 787

ఆ అంతమీఁద విష్ణునాజ్ఞ యూఁదలఁ దాల్చి
శమదమాది యోగసరణిఁ బొంది
సన్న్యసించువాఁడ జలజనేత్రుని వాక్య
కారణమునఁ జేసి ధీరచరిత! 788

క శ్రీవిభునివలన నీ లో
కావళి యుదయించుఁ బెఱుగు నడఁగును, విను, రా
జీవభవాదుల కతఁడే
భూవర నిర్మాణ హేతుభూతుం డరయన్ 789

వ అది గావున స్మహోత్మ్మని యాజ్ఞోల్లంఘనంబు సేయరా దని కర్దముండు పలికిన విని స్వాయంభువుండు, నిజభార్యయైన శత రూప తలంపును బుత్రియైన దేవహూతి చిత్తంబును నెఱింగిన వాఁడై, మఱి సకల గుణగణ యుతుండగు కీయ్యకొని పరిష్వక్త హృదయుం డగుచు, సముచిత గుణగణ ధుర్యుం డయిన కర్దమునకు దేవ హూతిని విధ్యుక్త ప్రకారంబున వివాహంబు సేయించె, దదనంతరంబ శతరూపయును బారిబర్హ సంజ్ఞకంబు లైన వివాహోచిత దివ్యాంబరాభరణంబులు దేవహూతి కర్దముల కొసంగె, నివ్విధంబున నిజకులాచారసరణిం బరిణయంబు గావించి విగత చింతా భరుండై స్వాయంభువుండు దుహితృ వియోగ వ్యాకులిత స్వాంతుండై, కూఁతుం గౌఁగిలించుకొని చుబుకంబుఁ బుడుకుచుఁ జెక్కిలి ముద్దుగొని, శిరంబు మూర్కొని, ప్రేమాతిరేకంబున బాష్పధారాసిక్త మస్తకం జేసి తల్లీ! పోయి వచ్చెద నని చెప్పి కర్దమునిచేత నామంత్రి తుండై నిజభార్యాసమేతుండుగ రథం బెక్కి సపరివారుండై 790

చ తరళ తరంగవీచి సముదంచిత బిందుసర స్సరస్వతీ
సరి దరవింద తుందిల లసత్తటి తీర నివాస సన్మునీ
శ్వర నికరాశ్రమాకలిత సంపదలం గనుఁగొంచు, వేడ్క ము
ప్పిరిగొన నేఁగె గాల్మిపుటభేదన విస్ఫుట మార్గవర్తియై 791

వ ఇట్లు సని చని బ్రహ్మావర్త దేశంబునందు 792

సీ ఎందేనిఁ దొల్లి లక్ష్మీశుఁడు యజ్ఞసూ
 కరమూర్తిఁ దాల్చి ని సరభసముగ
నొడలు జాడించినఁ బుడమిపై రాలిన
 రోమజాలంబులు రుచిరహరిత

వర్ణమై పొలుపారు వర కుశకాశ మ
యంబగు యజ్ఞక్రియాకలాప
యోగ్యంబునై చాల నొప్పారి బర్హిస్సు
సంభవించిన, దాన సకల ఋషులుఁ

తే. క్రతువు లొనరించి తద్విఘ్నకారులైన
యసురులను ద్రుంచి రట్ల స్వాయంభువుండు
విష్ణుపరముగ మఖము గావించి రుచిర
మేధ నొప్పొంది వచ్చి యాత్మీయపురము 793

క. డాయంజనఁ బురజనములు
పాయనములు దెచ్చి యిచ్చి బహుగతుల నుతుల్
సేయఁగ మంగళతూర్యము
లాయతగతి మ్రోయఁ జొచ్చె నంతఃపురమున్ 794

వ. ఇట్లు ప్రవేశించి తాపత్రయోపశమనంబగు భగవద్భక్తి వృద్ధిఁ
బొందించుచుఁ బుత్ర మిత్ర కళత్ర సుహృద్బాంధవసహి
తుండై పరమానందంబున 795

మ. అతిభక్తిం బ్రతివాసరంబును హరివ్యాసంగుఁడై మాధవాం
కిత గంధర్వవిపంచికా కలిత సంగీత ప్రబంధానుమో
దితుఁడై యిష్టవిభూతులందు ననురక్తిం బొందకే ప్రొద్దు న
చ్యుతసేవైక పరాయణుండగుచు సప్తోక ప్రభావోన్నతిన్
796

మ. హరి పాదాంబురుహ ద్వయార్పిత తులస్యామోదముం
గొంచుఁ ద
చ్చరితంబుల్ దలపోయుచుం బొగడుచుం జర్చించుచున్
వించుఁ, ద
త్పరిచర్యా వ్యతిరిక్త సంసరణ సద్ధర్మార్థకామంబులం
బరిభూతంబులు సేసి, మోక్షపద సంప్రాప్తి క్రియారంభుఁడై, 797

క. నిగమార్థ గోచరుం డనఁ
దగు హరిచరిత ప్రసంగ తత్పరచిత్తుం
డగు నతనికి స్వాంతరంగము
లగు యామము లొగి నయాత యామము లయ్యెన్ 798

సీ. వెండియు నమ్మేటి విష్ణుమంగళకథా
కర్ణన ధ్యానానుగాన నుతులు
సలుపుచు స్వస్వప్న జాగ్రత్సుషుప్తులఁ
దఱగించి యీ పుణ్యతముఁడు దాను
జక్రిదాసుఁడు గాన శారీర మానస
దివ్య మానుష భౌతిక వ్యథలను
దగులక, సన్మునీంద్ర శ్రేణికిం దగఁ
దనరు వర్ణాశ్రమ ధర్మగతులు

తే. దప్పకుండంగ నడపుచుఁ, దగిలి సర్వ
భూతహితవృత్తి నతుల విఖ్యాతలీల
నేకసప్తతి యుగము లస్తోకచరితుఁ
డగుచు వర్తించె సమ్మోద మతిశయిల్ల" 799

క. అని యమ్మనుచరితము విదు
రునకు మైత్రేయమునివరుఁ డియశ్లోకా
వినిపించి, కర్దముని విధ
వనరంగ నెఱిఁగింతు నని ముదంబునఁ బలికెన్ 800

## కర్దమప్రజాపతి యోగప్రభావంబుచే విమానంబు గల్పించి భార్యతోఁ గూడఁ దాను విహరించుట

వ. ఇట్లు స్వాయంభువుండు దేవహూతిం గర్దమునికి వివాహంబు సేసి మరలి చనినం దదనంతరంబ దేవహూతియుఁ బతిభక్తి గలిగి భవునికి భవాని పరిచర్య సేయు తెఱంగునఁ, బతియ తనకు నేకదైవంబుగా నెంచి యమ్మునీంద్రు చిత్తానువృత్తిఁ గొలఁది దినదినంబునకు భక్తి తాత్పర్య స్నేహంబులు రెట్టింపం బ్రియ శుశ్రూషణంబులు గావించుచు సమాన తేజోవిరాజిత యగుచుఁ గామక్రోధ దంభ లోభాది గుణవిరహితయై, శరీర శుద్ధి వహించి, చతుర సౌహార్ద్ర స్నేహంబులు గలిగి, పతియ దైవంబుగా భావించి మృదుమధుర వచనరచనలఁ బతిభక్తి యేమఱక వర్తింప, దైవయోగంబునం దనను దప్పింప సమర్థుం డైన కర్దముండు నిజసేవాయాస కృశీభూత దేహయై యున్న దేవహూతిం గరుణాతరంగితాపాంగుడై కనుంగొని మంజు భాషణంబుల నిట్లనియె 801

ఉ. "మానిత ధర్మమార్గ మహిమస్ఫుట భూరి తపస్సమాధి వి
ద్యా నిభృతాత్మ యోగసముపార్జిత విష్ణుకటాక్షలబ్ధ శో
భానఘ! దివ్యభోగ బహుభద్ర వితానము లస్మదీయ సే
వా నిరతిం లభించు ననివారణ నిత్తును దివ్యదృష్టియున్ 802

తే. నెలఁత! తద్దివ్యదృష్టి నన్నియును నీకుఁ
గానవచ్చు, విలోకింపు, కమలపత్త్రి
నయను భౌమముడిమాత్రాన నాశమందు
నితరమగు తుచ్ఛభోగంబు లేమి సెప్ప! 803

సీ. అనుపమ రాజ్యదర్పాంధ చేతస్కులై
పాపవర్తనులైన పార్థివులకు
ధృతిఁ బొందరాని యీ దివ్యభోగంబులు
నీదు పాతివ్రత్య నిష్ఠఁ జేసి
సంప్రాప్తములు నయ్యె, సతత భోగింపుము,
కార్యసిద్ధియు నగుఁగాక నీకు
ననుటయు సతివయు ననుపమ యోగమా
యా విచారణవిభుం డైన కర్ద

తే. మునిఁ గనుంగొని, విగతాధియును నపాంగ
కలిత లజ్జానతాస్యపంకజయు నగుచు,
వినయ సౌహార్దములఁ జేసి విహ్వలంబు
లయిన పలుకులఁ బతికి నిట్లనియెఁ బ్రీతి 804

వ. అనఘా! యమోఘ యోగమాయావిభుండవు సమర్థుండవు నయిన నీయందు నీ యనుపమ దివ్యభోగంబులు గలుగుట నిక్కంబని యెఱుంగుదు, భవత్సంగతి నన్నియు నాకుం గలుగు, నయినను, దేవా! నీ వానతిచ్చిన సంతానపర్యంతంబైన శరీర సంగమసమయంబు చిత్తంబునం దలంచి భవదంగ సంగమంబుఁ గృప సేసి మన్నింపుము, భవదీయ సంయోగ వాంఛాపరతం గృశీభూతం బయిన యీ దేహం బే విధ బున మజ్జన భోజన పాన సుఖంబులం బొతుష్టంబొందు నట్టి మన్మనో

రథంబుఁ దీర్చి రతిరహస్య ప్రకాశకం బగు కామశాస్త్ర
ప్రకారం బుపశిక్షించి, యందులకు నుచితంబు లయిన
వివిధాంబ రాభరణ మాల్యానులేపన మందిరారామ ప్రముఖ
నిఖిల వస్తువిస్తారంబు గావించి నన్నుం గరుణింపు మనిన
న మ్మహాత్ముండు నిజ యోగమాయాబలంబునం దత్క్షణంబ
805

సీ. దీప్య మణిస్తంభ దీప్తిఁ జెన్నొందుచు
మరకతస్థలమున మహిమ దనర,
వరవజ్రకుడ్య కవాటశోభితములై
విద్రుమ దేహళీవీథు లమరఁ,
గొమరొప్ప నవశాతకుంభ కుంభములపై
హరినీలకళికల విస్ఫురణ మెఱయఁ
దగఁ బద్మరాగంపు మొగడలఁ జెలువొందు
వైదూర్యపలభులు వన్నెఁ జూపఁ

తే. దరళతర ధూతకేతుపతాక లొలయ,
మంజుశింజ త్సమంచిత మధుపకలిత
సురుచి రాలంబమాన ప్రసూనరాజి
మాలికల నొప్పు వివిధగృహాళి దనరి 806

క. మఱియును దుకూ[illegible] చీనాం
బర కౌశేయాది వివిధపట పరివృత మం
దిర సుభగాకారంబై
యరుదార విచిత్ర పట్టికాలంకృతమై, 807

మ. లలితోద్యాన వనాంతసంచరణ లీలాలోల హంసాళి కో
కిల పారావత చక్రవాక శుక కేకివ్యూహ, మంచత్సుమ
త్కలికం గ్రుమ్మరు షట్పదాళి నిజవహాంగి శ్రేణియంచుం గుతూ
హలివై పల్కుచు నాడుచుం బ్రతిశాఖాగ్రోహణ వ్యాప్తులన్ 808

వ. వెండియు 809

క. ఘనసౌధాంతర శయ్యా
సన కేళీగేహ కృతక జగతీధర శో
భన చంద్రకాంత చారు భ
వన ఫలభరి తావనీజవనంబు లలరఁగన్, 810

క. సకలర్తుశోభితంబును
సకలసుఖావహము సకల సంపత్కరముఁ
సకలోపభోగ యోగ్యము
సకలేప్సిత కామదంబు సత్సంకల్పమున్ 811

వ. అగుచు నొప్పు దివ్యవిమానంబుఁ గల్పించి, తదీయ సుషమా విశేష చిత్రంబులు నిర్మించిన, తానునుం దెలియం జాలని యద్భుతకర్మంబులైన విమానంబు దేవహూతికిం జూపినం, జూచి యమ్ముద్దియ సంతసింప కుండుట యెఱింగి, సర్వభూతాంత రాశయాభిజ్ఞుండును సంతుష్టాంతరంగుండును న కర్దముం డిట్లనియె 812

తే. "అతివ! భగవత్కృతంబును నఖిలమంగ
ళాకరంబును నగు నీ జలాశయమునఁ
దవిలి గ్రుంకిన జంతువితానములకుఁ
గామ్య ఫలసిద్ధి సేకుఱు, గాన నీవు 813

క. ఇజ్జలముల నతిభక్తిని
మజ్జన మొనరించి యీ ఒమానము వేడ్కన్,
లజ్జాపతి! యెక్కవె!' యని,
బుజ్జవ మొనరంగఁ గర్దముఁడు పల్కుటయున్, 814

వ. విని యా కువలయాక్షి పతిసేవాయాస మలినాంబరయు వేణీభూత శిరోజయు ధూళిధూసరి తాలకశ్రీభూతాంగయు కజలస్తనయు నై భర్తృనియోగంబున సరస్వతీ సలిలసంభూత జలచరాశ్రియం బగు బిందుసరోవరంబుఁ బ్రవేశించి తజ్జలంబునఁ గ్రుంకు లిడు సమయంబున, ఉద్వా పూర మధ్య బున నుండి సూక్ష్మాంశుక ధారిణులుఁ గిశోర వయ పరిపాక శోభితలు నుత్పలగంధులు నగు కన్యాసహస్రంబులు దేవ హూతిం గనుంగొని యిట్లనిరి 815

క. "తరుణీ! వంచిత ధర్మా
చరణల మగు మేము నీకు సదమల భక్తిం
బరిచర్య సేయ నేర్తుము
కరుణాకలిత తేక్షణములఁ గనుఁగొను మమ్మున్" 816

సీ. అని పల్కి డాసి, యయ్యతివకు నభ్యంజ
నోద్వర్తనములు పెంపొనరఁ జేసి,
మలయజ కర్పూరమహిత వాసిత హేమ
కలశోదకంబుల జలకమార్చి,
ధవళవస్త్రంబులఁ దడి యొత్తి, సర్వాంగ
ధూపంబు లొసఁగి, కస్తూరి యలఁది
మంజుశింజన్మణిమంజీర కింకిణీ
కలరావకలిత మేఖలలు రత్న

తే ఖచిత కటంక ముద్రికా కంకణాది
భూషణ తానర్ఘ్య పేశలభూషణము లొసంగి
భవ్యమాల్యానులేప నాంబరము లిచ్చి
షడ్రసోపేత వివిధాన్న సమితిఁ దనిపి, 817

వ సుజయంబు గ నకపాత్రిం చితంబు లయిన కర్పూర నీరాజనంబుల నివాళించి రుచిరాసనంబునఁ గూర్చుండఁ బెట్టి దర్పణంబు సేవ కిచ్చినం, దత్ప్రతిఫలిత నిజదేహ కాంతి గనుంగొని కర్దముని మనంబునం దెంచిన సతిండునుం గన్యకాసహస్రంబును దక్షిణంబునఁ దన సన్నిధి నుండుటఁ జూచి, నిజభర్తృ యోగ మహా ప్రభావంబునకు నద్భుతంబు నొందె, నంతఁ గర్దముండునుం గృతస్నానయైన దేవహూతిం గనుంగొని విమానంబునకు ముందట నేచందంబున దనరుచుండె నా చందంబున జెన్నొందుచుండుటకై నాగందధరిత్యుండై భార్యాసహితంబుగఁ దత్కన్యకాసహస్రంబు గొలువ నిజవిమానారూఢుం డై తారాగణపరివృతె రోహిణీయుక్తుండగు సుధాకరుండునుం బోలె నొప్పుచుం దదనంతరంబ, 818

చ ఒరశుభమూర్తి యమ్మునియ శేషదిగీశ విహార యోగ్యముఁ సురుచిర మందగంధవహ శోభితముఁ బ్రకటప్రభాతు ని ర్ఝర సరిదంబు శీతలతుషారము నై తనరారు మేరు కం దరమున కేగి దేవవనితాయుతుఁ డైన కుబేరు చాడ్పునన్, 819

వ మఱియును 820

డా॥ అమరోద్యాన వనప్రదేశములు సద్వ్యారామహర్మ్యముల్ దళ
త్కల్హార ద్వాంభోజ విభాసి మానససరః కూలంబులున్ ము[illegible]
జములుం జైత్రరథంబు విస్ఫురిత వి[illegible]బున [illegible] చూచె నె
[illegible]ంగర్దమయోగి గామగ వి[illegible] [illegible] చెచ్చెరన్
821

వ॥ ఇవ్విధంబున సమస్తభూభాగంబును వాయువేగంబునం గలయం
గ్రుమ్మరి నిఖిల వైమానికలోకంబు నతిక్రమించి లోకంబులం
జరించె మోక్షదాయకుండు దీర్ఘపాదుం[illegible]గు పురుషరీతాత్ముని
సన్నిహితంబు సేవించు పుణ్యాత్ములకుం గానరాని పదార్థంబులు
గలవే? యిట్లు కర్దముండు దేవహూతికి నిఖిలక్ష్మాచక్రం
బుం తియుం జూపి మరల నిజనివాసంబునకుం జనుదెంచి కామకేళీ
వినోదాత్మకయై యున్న భార్య నుపలక్షించి రతిప్రసంగ
వ్యాసంగంబు గైకొని బహువిధంబు లయిన యిష్టోపభోగం
బుల బహువత్సరంబు లొక్క ముహూర్తంబుగా జరుపుచు
నన్యోన్య సరసాలాపంబుల సముచితాలింగన సంభాషణం
బులం గాలనిరూపణంబు సేయనేరక శతవత్సరంబులు గడపి
తదనంతరంబ
822

క॥ మునివరుఁ డొకనాఁ డిమ్ములఁ
దన నిజదేహంబు నవ విధంబులు గావిం
చి నయంబునఁ దద్వీర్యము
దన సతి గర్భమున నవవిధంబుగ నిలిపెఁ
823

క॥ అది కారణంబుగాఁ బెం
పొదవిన మునివలన దేవహూతియుఁ గూఁతుల్
ముదమునఁ గనెఁ దొమ్మండ్రిన్,
ముదితయు మది సంతసించె మునివరుఁ డంతన్
824

తే సన్న్యసింపగఁ గోఁ , సరి యొఱంగి
దోసాస్త్రఁ బోఁయిమిః ప ి ఎ ఖగ్గలింపఁ
ంతి వాటిల్లఁ బెక్కుటఁ జేయి నీచ్చి
పదములను నేల వ్రాయుచుఁ బలికెఁ బతికి 825

సీ అనఘ! సంతానపర్యాప్తంబు ననుఁ గూడి
వర్తింతు ననుచుఁ బూర్వమున బలికి
కూఁతుల నిచ్చితి, కొమరార నిప్పు డీ
తరుణులు పతులను దగుచుఁ దారి
యరసి వర్తింతురో యని భీతి నొందెదఁ,
గావున నీ పుత్త్రికలకుఁ దగిన
వరుల సంపాదించి, పరిణయంబులు సేసి
తత్త్వసంహిత నాకుఁ దవిలి తెలుపు

తే సుతునిఁ గృపసేసి ననుఁ గావు, సుజనవినుత!
యర్థి సంసార దుఃఖంబు నపనయించ
నర్హుఁడవు నీవు కావె? మోహమున నింత
కాల మూరక పోయె నే గతియు లేక 826

చ ఉపరతి పుట్టె నైహిక సుఖోపగ భోగానుభవంబులందు, మఱి
చపలతఁ గామభోగ రతిసంగముఁ గోరి, మహాత్మ! నిన్ను న
చ్చపుఁ దలఁ పొప్పఁగా దెలియఁజాలక యే వరియించుటన్ భవ
త్కృప ఫలియించె, ముక్తి ననుఁ గేవలభక్తి భజింపఁ గల్గదే! 827

వ అదియునుం గాక 828

చ సమమతి నొప్పు సత్ప్రగుమ సఖ్యము ౯ీకారింగంబు, ని
చమతి విహాల దుష్ప్రమపనప్రము క స్నే సీంతు వంచు చి
త్తమునఁ దలంచి, యోగిజనులా నా! బిమ్మ్మ ధ గాబఁ,
[శాణిసం
గమమునఁ బుణ్యపాపములు గైకొన గాఁడవె యెట్టివారలన్!”
829

క అని యిట్లు వేదనాథర
మున మునుకుచుఁ బలుకఁ గద్దముఁ ఁ మనుపుత్రి ౦
గనుఁగొని సరసిజనయను న
చనములు మది సంస్మరించి సఖి కిట్లనియెన్ 830

క మనుసుత! నీ మది దుఃఖం
బును బొందకు, మచిరకాలమున భగవంతుం
డనఘుం డక్షరుఁడు జగా
ర్దనుఁడు భవద్గర్భమందుఁ దగ వసియించున్ 831

క వరనియమ వ్రతనిష్ఠా
చరణ నియుక్తాంతరంగ సమధిక వై సం
భరిత తపోధన దాన
స్ఫురిత శ్రద్ధానుభక్తిపూర్వము గాఁగన్ 832

మ హరి నారాయణు పాదపద్మములు సమ్యగ్భక్తిఁ బూజింపు, త
త్పరుమ శ్రేష్ఠుఁడు మానసంబున భవత్పూజా సుసంప్రీతుఁడై
కర మర్థిం, దరుణీశిరోమణి! భవ ద్గర్భస్థుఁ డై యుండి తాఁ
గరుణం జేయు భవన్మనోజనిత శంకాగ్రంథి విచ్ఛేదమున్. 833

దేవహూతిగర్భంబున విష్ణుండు కపిలాచార్యుండుగాఁ బుట్టుట

చ. అనవుడు దేవహూతి హృదయంబున సంతసమంది, యమ్మునీం
ద్రుని వచనక్రమంబునఁ బరుఁ భగవంతు ననంతుఁ బద్మలో
చను వారి విష్ణు నర్చనము సల్పుచు నుండఁగ గొన్ని యబ్దముల్
సను నెడ, దానవాంతకుఁడు సమ్మతిఁ గార్దమ మైన తేజమున్ 834

క. ధరియించి, యమ్మునీంద్రుని
తరుణీగర్భంబువలన దనుజారి శమీ
తరుకోటరమున వైశ్వా
నరుఁ డుదయించిన విధంబునన్ జనియించెన్ 835

సీ. అయ్యవసరమున నాకాశమున దేవ
తూర్యఘోషంబులు దుముల మయ్యె,
నందిత దేవతా బృందంబు లందంద
కురిసిరి మందార కుసుమవృష్టి,
గంధర్వ కిన్నరగానంబు వీతెంచె,
నప్సరోగణముల యాట లొప్పె,
వావిరి దిక్కులఁ గావిరి విరిసెను,
దవిలి వార్ధుల కలంతలును మానె,

తే. సాధుజనముల మనములు సంతసిల్లె,
హోమవహ్నులు ప్రభలఁ జెన్నొంది వెలిఁగెఁ,
గుసుమఫలభారముల నొప్పెఁ గుజములెల్ల,
సర్వసస్యాళి చెన్నొందె జగతిలోన 836

వ. ఇట్లు మహోత్సవంబున దేవహూతికిం దత్త్వబోధంబుఁ గావించు
కొఱకుఁ దదీయ గర్భంబున నుదయించిన పరబ్రహ్మస్వరూపుం

డైన నారాయణుం దర్శించు కొఱకు మరీచిప్రముఖ మునిగణ సమేతుం డై చతుర్ముఖుం డను దెంచి యమ్మహాత్ముని దర్శించి, కర్దమ దేవహూతులం గనుంగొని యిట్లనియె 837

క నతచరితులారా! మీరలు
కృతకృత్యులు, విష్ణుపూజఁ గేవలభక్తిన్
మతి నిష్కపటులరై చే
సితిరి, తదర్చన ఫలంబు సేసెఁ బో మీకున్ 838

క శ్రితభయహరణుఁడు మునిజన
నుతచరితుఁడు పరుఁడు మీ మనోరథసిద్ధిన్
వితతింబుగఁ గావించుటఁ
జతురత మీ జన్మ మింక సఫలతఁ బొందెన్ 839

క వినుఁడు సకాములు నై హరి
ననుపమభక్తిన్ భజించునదె ముక్తికిఁ జా
లును, మీ పుణ్యం బే మని
కొనియాడఁగవచ్చు నీతికోవిదులారా! 840

వ అని వెండియుం గర్దమునిం గనుంగొని యిట్లను భవదీయ తనూభవలం బ్రకటశీల వ్రతాచార సంపన్ను లైన ముని వరేణ్యులకుం బెండ్లి సేయు, మట్లయిన వారి వలనం బ్రజా సృష్టి బహువిధంబుల వృద్ధిం బొందు," నని చెప్పి మఱియు ని ట్లనియె 841

చ "అనఘ! భవత్సుతుండు సముదంచిత తేజుఁడు నైన యిమ్మహా త్మునిఁ బర మేశు నీశు నజితేశ్ నలినాక్షు నమేయు నచ్యుతున్ ఘనుని ననంతు నాద్యు నవికారుని నక్షరుఁగాఁ దలంపు, మీ ఘనుఁడు సమస్త చేతననికాయ హృదీప్సిత దాయి గావునన్ 842

సీ. మానిత జ్ఞానవిజ్ఞాన యోగంబులు
నను నుపాయంబుల నొనరఁ జేసి
యలవుమైఁ గర్మ్మోర్మిల నుద్ధరించుట
కొఱకు - న్మహాత్మకుఁడు సమగ్ర
హాటకరుచి జటాజూటుండు నుత్ఫుల్ల
పంకజనేత్రుండు పద్మ వజ్ర
హల కులిశాంకుశ లలిత రేఖాంకిత
చరణతలుండును సత్త్వగుణుఁడు

తే. నగుచు నిప్పుడు సరసీరుహాక్షి! నీదు
గర్భమందు దుదయించును, ఘనుఁడు నీకుఁ
దత్త్వబోధంబుఁ గావించుఁ, దావకీన
హృదయసంగత సంశయ మెల్లఁ బాపు 843

వ. మఱియును 844

క. నతికెక్కి సిద్ధగణసే
వితుఁడై ఘన సాంఖ్య యోగ విలసిత తత్త్వ
స్థితి నిరతుఁ డగుచుఁ గపిలా
ఖ్యాతిఁ దనరి చరించు నీ జగత్త్రియ మెల్లన్ 845

క. అని పలికి యమ్మరీచిం
గని యుస్వాహార్థ మునిచి కమలజుఁ డంతం
దన నందను లగు నారద
సనకాదులఁ గూడి యాత్మసదనము కరిగెన్ 846

వ. అంత నా కర్దముండు కమలసంభవ చోదితుం డగుచు యథో చితంబుగా నాత్మీయ దుహితల వివాహంబు సేయం దలంచి మరీచికిం గళ యను కన్యకను, నత్రికి ననసూయను, నంగిరసు

నకు శ్రద్ధను బులస్త్యునకు హవిర్భువను బులహునకు గతిని, గ్రతువునకుఁ గ్రియను, భృగునకు ఖ్యాతిని, వసిష్ఠునకు నరుంధతిని, నథర్వునకు శాంతినింగా నిజకులాచారసరణిం బరిణయంబు గావించిన, వారును గృహదారపరిగ్రహాలును గర్దమకృత సంభావనా సంభావితులును నగుచు పతిచేత ననుజ్ఞాతు లై జాయాసహితు లగుచు నిజాశ్రమభూములకుం జని, రిట్లు వర్తింప యుగత్రయంబు సనుటయుం, గర్దముండు దేవోత్తముండగు విష్ణుండు దన మందిరంబున నవతరించి వసించి యుంటం దన చిత్తంబున నెఱింగి, వివిక్తస్థలంబునకుం జని యచ్చటఁ గపిలునికి వందనం బాచరించి యిట్లనియె 847

సీ. "చతురాత్మ! విను మాత్మకృతము లైనట్టి య
మంగళభూత కర్మంబు లనెడి
దావాగ్ని శిఖలచే దందహ్యమాను లై
నట్టి జీవులు దుద ముట్టఁబోక
పాయక సంసారబద్ధు లై యుందురు,
తద్భవ హేతుభూతంబు లయిన
సకల దేవతలుఁ బ్రసన్నులు నగుదురు,
బహుజన్మ పరిచిత ప్రాప్త యోగ

తే. చిరసమాధి తపోనిష్ఠచే వివిక్త
దేశముల యోగిజనములు ధృతుల నే మ
హానుభావు విలోకింతు, రట్టి దివ్య
పురుషరత్నంబ నా యింటఁ బుట్టితీవు 848

వ. మఱియు సంసారచక్ర పరిభ్రామ్యమాణుల మగుచు గ్రామ్యుల మయిన మా వర్తనంబులను గణింపక, మదీయ గృహంబునం

బూర్వంబునం బ్రతిశ్రుతంబు లయిన భవదీయ వాక్యంబులు
దప్పకుండ ననుగ్రహింప నుదయించి తని వెండియు నిట్లనియె
849

క. తలపోయఁగ నప్రాకృత
బలయుక్త చతుర్భుజాది భవదవతారం
బులు నీ కనురూపములై
పొలుపొందం గాదె పరమపురుష! మహాత్మా! 850

వ. అదియునుం గాక 851

క. అనయము భవదీయాశ్రిత జన
సంరక్షణముకొరకు సమ్మతితోఁ దా
ల్చిన మానవరూపంబులు
ననురూపము లయ్యెఁగాదె హరి నీ కెపుడున్ 852

క. సుమహిత తత్త్వజ్ఞానా
ర్థము విద్వజ్జన గణంబు దవిలి నమస్కా
రము లోలిఁ జేయు పదపీ
రము గల నినుఁ బొగడ వశమె రవణిల్లంగన్? 853

సీ. సమధిక షడ్గుణైశ్వర్య కారణుఁడవు
పరమేశ్వరుండవు ప్రకృతిపురుష
మహదహంకార తన్మాత్ర తత్త్వోధక
హేతుకాలాత్మ విఖ్యాత ధృతివి
జగదాత్మకుఁడవు చిచ్ఛక్తివి నాత్మీయ
జరర నిక్షిప్త విశ్వప్రపంచ
ముడు గల సర్వజ్ఞమూర్తివి స్వచ్ఛంద
శక్తి యుక్తుండవు సర్వసాక్షి

తే వగుచుఁ గపిలాఖ్యఁ దనరారునట్టి నీకు
ననఘ! మ్రొక్కెదఁ, బుత్రుండ వగుచు నీవు
నాకుఁ బుట్టిన కతన ఋణత్రయంబు
వలనఁ బాసితి నిఁక భ క్తవరద! నేను 854

తే మానిత వ్రతి యోగి సమాధి నియతిఁ
జెంది భవదీయ పాదారవిందయుగము
డెందమునఁ జేర్చి శోకంబులందుఁ దొలఁగి
సంచరించెద నంచిత స్థలములందు' 855

క అని యిట్లు విన్నవించిన
మునిపుంగవుఁ డైన కర్దముని వచనంబుల్
విని భగవంతుం డగు న
య్యనఘుఁడు గపిలుండు వలికె నర్మిలి దోఁపన్ 856

సీ "నాచేతఁ బూర్వంబునం బ్రతిశ్రుత మైన
వచనముల్ దప్పక, వరమునీంద్ర!
నీయింటఁ బుట్టితి నిర్వర్తితుక స్థితి
భూరి దయాగుణంబున నవాప్త
సకలకాముఁడ నేను సన్న్యాసవేషంబు
ధరియించుటెల్ల నా కొఱకుఁ గాదు,
విను, మహాత్మకు లైన మునులకుఁ బరమాత్మ
గురుసద్వివేకంబు నరసి చూపు

తే తత్త్వబోధంబు కొఱకును దాల్పఁబడిన
యంచిత వ్యక్తమార్గ మైనట్టి దేహ
మని తలంపుము, మత్ప్రతధ్యానభక్తి
దీపరాయణ మహిమంబు దేజరిల్ల 857

క నసుధికన్యం గృతయో
గముఁ గన్ సన్న్యస్త సకలకర్ముఁడ వై మో
హముఁ బాసి భక్తిచే మో
క్షముకై భజియింపు నను విశారరహితుఁడై 858

క ననుఁ బరమేశుఁ బరంజ్యో
తిని ననము ననంతు దేవదేవు సకలభూ
త నికాయ గుహాశయు నా
ద్యుని నజు నాద్యంతశూన్యు దురితవిదూరున్ 859

క తిరముగ భవదీయాంతః
కరణ సరోజాత కర్ణికా తలమున సు
స్థిరుఁ జేసి యింద్రియంబుల
నిరసించి మనోంబకమున నెఱిఁ గను మనఘా! 860

వ అ న్లైని, 861

క తనరిన మోక్షము నొందెద"
వని పలికినఁ, గర్దముండు న మ్మునికులచం
ద్రుని వలగొని వందనములు
ఘనముగ నతిభక్తిఁ జేసి కౌతుక మలరన్ 862

క మునిగణసేవిత మగు వన
మునకుం జని యందు మౌనమున నిస్సంగుం
డును వహ్నిరహితుఁ డనికే
తనుఁడై యాత్మైక శరణతత్పరుఁ డగుచున్ 863

వ పరబ్రహ్మంబుఁ జిత్తంబున నిల్పి యహంకారంబు విడిచి
మమత్వంబు నిరసించి దయాగుణంబునం జేసి సకలభూతంబు
లందు సమత్వంబు భజియించి శాంత శేముషీ గరిష్ఠుం డగుచు,
నిస్తరంగం బగు వార్ధిచందంబున ధీరుఁడై నిఖిలప్రపం
చంబును వాసుదేవమయంబుగాఁ దలంచుచు భక్తియోగం బన
భాగవతగతిం బొందె 864

# పద్యముల వివరణము

502 టీక గీర్వాణులు=దేవతలు, యుష్మత్ +పూర్వజులు=మీ కంటె ముందు పుట్టినవారు, ఆత్మీయ సుతులు=నా పుత్రులు విచరత్ +నిర్వాణులు=చరించుచున్న మోక్ష స్వరూపము లైనవారు, సర్వంకష = సమస్తమును ఒరసికొనుచున్న, శేముషీ విచక్షణులు=బుద్ధి వివేకము కలవారు, ఎందున్ =సర్వలోకములందును

తా॥ దేవతలారా! మీ యందరికన్న నాకు ముందుపుట్టిన సుతులు సనకుడు మొదలగు నలుగురు కుమారులు వారు నడచుచున్న మోక్ష సంపదలవంటి వారు సమస్తమును స్పృశించి మించగల బుద్ధిబలము గలవారు అన్నిలోకములయందును చరించునట్టివారు

503 టీక నిస్పృహులు=కోరికలు లేనివారు, అవారణన్=అడ్డులేక, భువనంబులు=లోకములు, వడిన్ = వేగముతో, క్రిమ్మరుచున్ =తిరుగుచు, శ్రీరమణీశ్వర=లక్ష్మీపతియైన విష్ణువుయొక్క, పదాబ్జ = పాదపద్మముల, సేవా నిరతిన్ = సేవించు నిష్ఠతో,

తా॥ వారు కోరికలు లేనివారై మూడులోకముల యందును తమ్మడ్డుపెట్టు వారు లేక వేగముగా తిరుగుచుందురు ఒకనాడు లక్ష్మీనారాయణుల పాదపద్మములను సేవింపవలెనను నిష్ఠతో బయలుదేరిరి (కోరిక లేనివారైనను నారాయణుని చూడవలెనను కోరిక యున్నది అది దోషము కాదు గనుక నిష్ఠయైనది

మరియు తిమ్మెవ్వరిని పెట్టరని అభిప్రాయమున్నది అహంకారము కొంచెము మిగిలియున్నదని సూచన )

504 టీక బుధసత్తములు = తెలిసినవారిలో మంచివారు, అంచిత = ఒప్పుచున్న, నిత్య దివ్యశోభ = శాశ్వతము, అప్రాకృత ముగా వెలుగొందునట్టి, విభవ + అభిరామము = వైభవములతో ఒప్పుగా నున్నదాని, ప్రపన్న జన = శరణాగతులకు, స్తవనీయ నామమున్ = స్తుతింపదగిన పేరుగల దానిని, సుజన సన్నుత భూమము = మంచివారిచే కీర్తింపబడిన సకీర్తి మున కాధారమైన దానిని, భక్తలోక పాలన గుణధామము న్ = భక్తిలోకములను పరిపాలించు గుణముల వెలుగులకు నిలయమును, పుర లలామ మున్ = పురములలో తిలకమువంటి దానిని చారు విభంరధామ మున్ = అందమైన వైకుంఠ పురమును, కాంచిరి = చూచిరి,

తా॥ వారు పోయి పోయి శాశ్వత దివ్యశోభలతో, వైభవములతో వెలుగొందు వైకుంఠ పట్టణమును దర్శించిరి శరణాగతి పొందినవారందరు నిత్యము దాని నామమును స్మరించుచుందురు ఆ స్మరణమే జన్మ బంధములను లేకుండ జేయును మంచివారి స్తోత్రములకు అదియే లక్ష్యము భక్తుల సద్గుణములను పరిపాలించు నగరమది కనుకనే పురములన్నిటిలో తిలకము వంటిది ( 1 ఇతరుల సద్గుణముల యందాసక్తి కలిగినచో నితరులతో సంబంధములు తొలగి సద్గుణములు మిగులును ఆసక్తియే సద్గుణముల యందు తాము నివసించుట కాధార మగును

2 అప్పుడు జన్మబంధములు తొలగును

3. దాని నామమును ప్రపన్నులు స్తుతించుచుందురు అనగా దాని నామమే నారాయణుడు అతనికిని అతని పురమునకును స్మరించు భక్తులకును అభేదస్థితి కలుగును

4 పురిలలామను అనుచోట పురమనగా దేహమని చక్రవర్తి అన్నిటిలో శ్రేష్ఠమైన దేహమనగా నారికుపదేశించిన భాగవత శరీరము )

505 టీక మహనీయ = గొప్పదైన, అగ్ని నిష్కామ ఫలంబె=తమ నిష్కామమునకు గల ఫలితమే, సత్ఫలము= మంచి పంట, ముముక్షు ధర్ములు=మోక్షమునకు స్వభావము కలవారు, (శ్రీ)మహిళా + అధిప = విష్ణువు యొక్క, అంఘ్రి సరసీరుహ పూజలు=పాద పద్మములను పూజించుట, మహా + ఉద్దామ= మిక్కిలి యుత్తమమైన, తదియ రూపములన్=వాని రూపములను

తా॥ ఆ వైకుంఠమున నివసించు వారందరు తమ నిష్కామ లక్షణమునే తమ సాధనకు ఫలితముగా దర్శింతురు. ( దేనిని కోరరు కోరకుండగలుగుటయే తమ సాధనకు ఫలితముగా తృప్తి ననుభవింతురు కోరిక పోయినను కోరుట యెన్నడు నుండదు కోరినవారికి అది లభింపదు గనుక కొంత గలుగును ) ఇట్టి మోక్ష ధర్మముతో వారందరును లక్ష్మీనారాయణులను పూజించుచుం దురు ఆ పూజయొక్క నిరంతరత్వమున తమ యస్తిత్వమును కోల్పోయి నారాయణు నస్తిత్వమును పొందుదురు వాని రూప ములై తిరుగుచుందురు (దీనినే సారూప్యము అందురు ) వారు దాని సుఖము నెరిగినవారు

506 టీక విగత రజస్తమోగుణుఁడు=విడువబడిన రజో గుణము, తమోగుణము గలవాడు, విశ్రుతచారు యశుండు= విన బడుచున్న చక్కని కీర్తిగలవాడు అజుండు=జన్మలు లేనివాడు, భగవంతుఁడు=అష్టైశ్వర్యములు సంపదలుగా గలవాడు, అనంత శక్తి =అంతులేని శక్తి గలవాడు, నిగమచయ+అంత వేద్యుఁడు=

వేదసమూహముల చివరిమాటచే తెలియబడువాడు (ఈ మాట లనే యుపనిషత్తు లందురు సృష్టి ధర్మము లన్నియు వేదవాక్యలు వాని ప్రకృతి యంటని వైరాగ్యాది స్థితులే చివరిమాటలు వాని చేత మాత్రమే నారాయణుడు తెలియబడును) నిశ్చల=చాంచల్యము లేని, నిర్మల = కల్మషములేని, ధర్మమూర్తి = ధర్మము యొక్క రూపము, ఆ నగర+ఉపవనమ్ములు = ఆ పట్టణమందలి యుద్యానములు, ఇమ్ములన్=కుతూహలముతో, పెంపెసఁగున్= విస్తృతి గలిగియుండును

తా॥ రజస్తమస్సు లంటనివాడు, వినబడు కీర్తిగలవాడు, సత్త్వగుణ స్వరూపుడు, జన్మలు లేనివాడు, మొదలు లేనివాడు, ఐశ్వర్యములను మహిమలు గలవాడు, వేదాంతములచే తెలియ బడువాడు, ధర్మమూర్తి యగు శ్రీహరి పేరనే యందలి యుద్యాన వనము లన్నియు చెల్లుచుండును

1 వానిపేర చెల్లుట యనగా వానిపేరనే తెలియబడుట, దర్శింపబడుట అతని నామమునకును, అతని నివాసములోని సమస్త లోకములకును అతనికిని భేదములేని స్థితియే వైకుంఠమని యర్థము

2 విశ్రుత చారు యశుండు అనగా వినబడినదే అతని కీర్తి నాద స్వరూపమనియు, జీవుల సంభావనములలోని శబ్దార్థాదులు అతని మయములే యనియు, దర్శించిన వారికి అతని రూపములే యనియు నర్థము)

507 టీక కైవల్యంబు = కేవలము తానే సమస్తమై యుండుట, (అనన్యస్థితి) మూర్తీభవించిన తెరంగున=రూపు కట్టినట్లు, పొలుపారుచు=అందము చిందుచు, నైశ్రేయస నామంబున=నిశ్శ్రేయసు అను పేరుతో (అన్నిటి కన్న మించిన

శ్రీయన్ను లేక మోక్షము) అభిరామంబై =సుందరమై, సతతం బును= నిరంతరము, సకల+ఋతు ధర్మంబులు గలిగి= సమస్త ఋతువుల ప్రవర్తనము కలిగి (జీవుల గర్భధారణాది కాలములను సూచించు శోభలు కలిగి) అర్థి జనంబుల= కోరిన వారియొక్క, ఈరికలెత్తిన= మొలకలు మొలచిన, సారికలు గాగన్ = ప్రవసానము చెందునట్లుగా, ఇతర తరు రవాతంబులు= ఇతర వృక్షములు లేనివి (నారాయణుడు తప్ప మిగిలిన భావములు మొలిచియల్లుకొననివి) కామ దోహనసహితంబులు= కోరికలను వర్షించుట కిష్ట పడునవి పుష్పఫల భరితంబులు= పూలతో పండ్లతో నిండినవి, తనర్చు= విస్తరించు, సంతాన వన సంతానంబులు= కల్ప వృక్షములతోటల సమూహములు (కల్పవృక్షముల తోటలు తర తరములుగా పెరుగు చున్నవి) సముచిత= మిక్కిలి తీరైన, వసంత సమయ= వసంతకాలము యొక్క, సౌభాగ్య సంపదభి శోభిత= శుభ సంపదలను సూచించు చున్న, వాసంతికా కుసుమ విసర= గురివింద పూల సమూహముల, పరిమళ మిళిత గళిత= సుగంధముతో కలిసి బొట్లుగా జారుచున్న, మకరంద లలితా మోద= తేనెయొక్క చక్కని పరిమళముచే, ముదిత హృదయులై = సంతుష్టి చెందిన హృదయములు గలవారై, అఖండ తేజోనిధి= ఎడతెగని వెలుగునకు నెలవు, ఉగ్గడింపలేక= చెప్పలేక, ఖండిత జ్ఞానులు= తెగిన జ్ఞానము గలవారు, నిరతిశయ= తన్ను మించినది లేనట్టి, విషయ సుఖానుభవ కారణంబు= ఇంద్రియార్థముల సుఖము లనుభవించుటకు కారణము, ఇందిరా సుందరీ రమణ= లక్ష్మీపతియగు విష్ణువు యొక్క, చరణ సేవా విరమణ కారి= పాదసేవకు విరామము కల్పించునది, తత్ + గ్రంథ ప్రాపక= ఆ సువాసన నందించునట్టి, గంధవహునిన్= వాయువును, పరాయణులు= నిష్ఠగలవారు, సుందరీ యుక్తులు=

అందమైన స్త్రీలతో కూడిన వారు, వైమానికులు= విమానము లతో తిరుగు వారు, దేవతలు, వైమానిక మానస+ ఉత్సేకంబు = దేవతల మనస్సుల కుల్లాసము కల్గించునది, పారావత= పావురము, సారస= బెగ్గురు పిట్టలు లేక నీటి కొంగలు, శుక పిక= చిలుకలు, కోకిలలు, చాతక= వాన కోయిలలు, తిత్తిరి= తీతువు పిట్టలు మయూర= నెమళ్ళు, రథాంగ= చక్రవాకములు, ముఖ్య =మొదలైన, విహంగ కోలాహల విరామంబు= పక్షుల కిల కిలలు నిలిచి పోవుట, అరవిందనయన కథా గానంబు= విష్ణు మూర్తి కథలను గానము చేయుట, అనూనంబు= మిక్కిలిగా, మొరయన్ = శబ్దము చేయుగా, మదవత్ +ఇందిందిర= మదించిన తుమ్మెదల, సందోహ కలిత= సమూహముతో కూడిన, పుష్పవల్లి మతల్లికలు= శ్రేష్ఠమైన పూల తీగలు, అకుంఠిత చరిత్రుండు= ఆటంకము పడని ప్రవర్తనములు కలవాడు, వికుంఠ నిలయుని=వైకుంఠ వాసుని (విష్ణుమూర్తిని), విలసిత= విలాసము కలిగిన, తులసీ దామంబున్ = తులసి మాలికను, హరి= విష్ణువు మంగళ గళ విలగ్నంబు= శుభమైన కంఠమున వ్రేలాడుచున్నది, చందన= మంచి గంధము, మందార= కల్పవృక్ష పుష్పము, కుంద+ అరవింద= మల్లెలు, తమ్మిపూలు, పున్నాగ నాగ వకుళ= పున్నాగపూలు, నాగకేసరములు, పగడపు లు, అశోక కురవక+ ఉత్పల= అశోకములు, గురివిందపూలు, కలువపూలు, ప్రసూన మంజరులు= పువ్వుల గుత్తులు, మంజీర పుంజ రంజిత= పువ్వుల గుత్తుల గుంపుతో వెలుగొందు, పదకంజాతంబులు= పాదరిల్లు, ఉత్తుంగ= ఎత్తైన, ఆకంపిత= మిక్కిలి కదలిన, మధ్యంబులు= నడుములు, కటితల= మొల ప్రదేశములు, కనక ఘటిత= బంగారముతో చేయబడిన, మేఖలా కలాప= ఒడ్డాణము లను నగలు, నినద+ ఉపలాలిత= శబ్దములచే బుజ్జగింప బడిన, సీల

దుకూల శోభిత = నీలపురంగు గల పట్టు వస్త్రములతో అందముగా నున్న, పృథు నితంబభర = పెద్ద పిరుదుల బరువుచే, అలసయాన = మెల్లగా నడుచుచున్న, హసిత = నవ్వులు, గమనంబులు = నడకలు, అసమశర కుసుమశర విలసితంబు = మన్మథుని పువ్వుల బాణముల తళ తళ, సుందరీ సందోహంబుల న్ = అందమైన స్త్రీల సమూహమును, తగిలి = వెంటబడి, కందర్ప కేళీ విహారంబులు = మన్మథ క్రీడలతో విహరించుటలు, ముకుంద చరణారవింద సేవా = విష్ణుని పాద పద్మముల సేవచే పరిలబ్ధ = లభించిన, హేమ మయ = బంగారముతో చేయబడిన, విమానారూఢులై = విమానము లెక్కినవారై, వారి దాసులు = విష్ణు భక్తులు, ఇందిరా సుందరి = అందకత్తెయగు లక్ష్మీదేవి, సౌందర్యఖని = అందములకు గని వంటిది, రణిత మణి నూపుర చరణారవింద = శబ్దము చేయుచున్న మణుల యందెలు గల పాద పద్మములు గలది, చాంచల్య దోష రాహిత్యంబు = స్థిరము లేకుండుట యను దోషము లేకుండుట, కరకమల భ్రమణీకృత = పద్మముల వంటి చేతులతో త్రిప్పు చున్నట్టి, లీలాంబుజాత = వేడుకకు ధరించిన పద్మము గలది, కాంచనస్ఫటికమయ కుడ్య ప్రదేశములు = బంగారమున తాపిన స్ఫటికపు రాళ్ళచే నిర్మింపబడిన గోడల భాగములు, శ్రీనికేతనుని = సిరికి నిలయమైన విష్ణుమూర్తియొక్క నికేతన సమ్మార్జన కైంకర్యంబు = ఇల్లు తుడుచునట్టి దాసి పని, నిజవనంబునన్ = తనతోట యందు, సౌరభ + అభిరామంబులు = పరిమళములతో నొప్పుచున్నవి, తులసీదళ దామంబులు = తులసి దళముల దండలు, ఆత్మనాయకుని = తన యజమాని యొక్క, నొసటి = నుదుటపై గల, మృగమదపు టసలులన్ = కస్తూరీ తిలక పంకముచే, మసలుకొని = ప్రసరించి, తుంపెసలాడు = అంటుకొని కదలుచున్న, లలిత = అందమైన, తిల ప్రసూన =

నువ్వు పువ్వుయొక్క, రుచిరాభ = కాంతితో మెరయుచున్న, నాసన్ = ముక్కుతో, విమల సలిలంబులన్ = తేట నీటియందు, చుంబింతంబగుట = ముద్దు పెట్టుకొనబడుట, లజ్జా అవనతవదన = సిగ్గునమోము వంచినది, ప్రవాళలతికా కులంబులు = పగడపు తీగల గుంపులు, కూలంబులు = గట్టులు, నడబావులు = నడచి దిగి వెళ్లుట కనుకూలమైన బావులు (వీనినే దొరువులనెడి వారు) సుకృత మూలంబు = పుణ్యముల మొదళ్లు గల చోటు, ఆలవాలంబు = పాదు, పొలుపొందుచుండున్ = అందము నొందుచుండును,

తా॥ ఆ వైకుంఠము నందు పువ్వులతో పండ్లతో నిండుగా నున్న కల్ప వృక్షముల తోటలు వేర్వేరుగా గుంపులుగా పెంచబడి యున్నవి అవి సకల ఋతువుల సుఖములను ప్రసాదించుచున్నవి కోరికలతో సమీపించిన వారి మనస్సున నెంత గొప్ప కోరికలు మొలిచిన నంత కొల్లలుగా ఫలము లిచ్చుచున్న ఈ కల్ప వృక్షముల పరిసరములలో నితర వృక్షములే కనుపింపవు అన్నిటి కన్న పెద్ద కోరిక మోక్షము దానిని గూడ నవి ప్రసాదించుచు కైవల్యమను పేరును ఆ ప్రదేశముగా రూపు కట్టించుచున్నవి (ఇంకొకటి యను భావము కలుగనీయక మిగిలిన కోరికలను కొల్లగా తీర్చుట వలన మిగుల నీయక మోక్షమను కోరికను మాత్రము కలిగించి అనన్యత్వము చేకూర్చు చున్నవి మరియొక తావున గురివింద పూల పొదలున్నవి అవి వసంతకాల శోభలతో సమృద్ధిని చూపుచుండును అచ్చట విహరించు చున్న విష్ణు భక్తులు, ఆ పువ్వుల సుగంధములతో కలసి బొట్లుగా పడుచున్న తేనెలకు సంబర పడుదురు ఇంతలో విష్ణుమూర్తిని గూర్చిన ధ్యానము తెగిపోవుచుండును ఆ శోభల యందు ప్రసరించుట వలన తమ జ్ఞానము అఖండత్వమును గోల్పోయినదని వారు

వెంటనే గ్రహింతురు అట్లు చెదరిన వ్రిజ్ఞ వలన విష్ణుమూర్తి కథలను కొంచెముసేపు మరచి పోదురు ఆ ప్రదేశము ఇంద్రియ సుఖానుభావములకు కారణమై యితర భావములచే చిక్కబడి యున్నదని గ్రహింతురు దాని వలన విష్ణు ధ్యానమునకు విరామము కలిగినదని గుర్తింతురు అట్లు గుర్తించుట వలన ఆ సుగంధములతో గూడిన గాలులు వారిపై పని చేయవు అట్టి యాకర్షణలను తిరస్కరించిన నిరంతర ధ్యానముతో భార్యా సమేతులై దేవతలు విహరించు చుందురు

ఆ దేవతల దంపతుల మనస్సుల కుల్లాసము కలిగించుచు పావురములు, హంసలు, ఏటికొంగలు, చిలుకలు, కోకిలలు, వాన కోయిలలు, తీతువులు, నెమళ్ళు, జక్కవలు మొదలగు పక్షులు కోలాహలముగా, కిలకిలారావములు చేయుచుండును ఆ శబ్దములు విఘ్నము కలిగింపకుండ దేవతల దంపతులు పొదరిండ్లలో జేరి పుండరీకాక్షుని కథలను మనోహర కంఠధ్వనులతో గానము చేయుచుందురు ఆ గానమునకు నాద సౌభాగ్యము కూర్చుచు మదించిన తుమ్మెదల గుంపులు ఝుంకారములు చేయుచున్న పూలతీగల పొదరిండ్లున్నవి

పరిపూర్ణ చరిత్రుడైన వైకుంఠవాసుని కంఠము నలంకరించి యున్న తులసి మాలికను కనుగొని యిది యితని కంఠము నలంకరించి యుండు సదృష్టముగకై నోచుకొన్నది దీనికై యీ తులసి యేమి తపము చేసెనో" యని మెచ్చుకొనుచు సన్మానము చేయు చున్నట్లు గంధపుచెట్లు, కల్పవృక్షములు, మల్లెలు, తామరలు, పున్నాగలు, నాగకేసరములు, పొగడచెట్లు, అశోకములు, గురివిందలు, కలువలు, పారిజాతములు, గుత్తులు గుత్తులుగా పూచి తమ పరిమళములను తులసి చెట్లపై గుబాళింప జేయు చుండును

కొన్ని తావులందు పువ్వుల గుత్తులతో నిండిన చక్కని
పొదరిండ్లున్నవి అందు సౌందర్యము లొలికించుచు పడుచు
లొయ్యారముగా నడచుచుందురు వారి యెత్తైన స్తనముల
బరువుకు నడుములసియాడుచుండును నడుమున పెట్టుకొనిన
బంగారపు వడ్డాణముల శోభలతో మొలనూలి శబ్దములు విని
పించునట్లుగా వారు నడచుచుండగా నీలపు పట్టుచీరలు సింగా
రించుకొనియున్న పెద్ద పిరుదులతో వారి గమనములు మంద
మందముగా సాగుచుండును ఆ గమనముల సొగసులు హంస
లను, నెమళ్ళను గాంచి యెగతాళి చేయుచున్నట్లుండును విచ్చిన
తమ్మిరేకలవలె విశాలములైన కన్నులతో చురుకైన చూపులతో
నడచుచుండగా, వారి వెంట విహరించుచున్న భర్తలు పరవశించు
చుందురు ఈ పరవశత వారి మన్మథ క్రీడా విహారములకు
సంబంధించినది కాదు ముకుందుని చరణారవిందములను
ధ్యానించు చుండుట వలన గలిగినది ఇట్లు పడుచు దంపతులు
కొందరు విమానములెక్కి విహరించు ప్రదేశములును గలవు

మూడు లోకముల సౌందర్యము తన రూపరేఖలందు
ముద్రించుకొనిన లక్ష్మీదేవి అందెల శబ్దములతో పాదపద్మము
లను విన్యాసము చేయుచు సంచరించును తన హృదయమున
కధిన ఋడైన విష్ణుమూర్తి యింట చాంచల్య దోషము లేక స్థిర
ముగా విహరించు చుండును తమ్మిరేకుల వంటి అంగుళుల
యందు తమ్మి మొగ్గను పట్టుకొని త్రిప్పుచుండును

అచ్చట బంగారమును పొదిగిన స్ఫటిక శిలల గోడలపై
నామె రూపము ప్రతిబింబముగా సోకుచుండును ఆ శోభలు
చూడగా నారాయణుని యిల్లు తుడుచుటకు దాసియైన తన ధర్మ
మదృష్టమని తలచుచు అన్ని రూపములతో తిరుగుచున్నట్లుండును

తాను పెంచిన తోటలో గుబాళించిన తులసి వరిమళమును పంపలు (ట్టి విష్ణుని చరణారవిందముల కడ సమర్పించు శ్రీమహా నుమటి పై గల కస్తూరి బొట్టు చెమట బిందువులతో తడియుగా దానిపై వ్రాలి యంటుకొనిన ముంగురులు గాలి కెగురుచుండును

సుకుమారముగా నువ్వు పువ్వువలె వంపు తిరిగిన ముక్కుతో లక్ష్మీదేవి ముఖారవిందము నీలనీలములైన కోనేటి తేటనీటియందు ప్రతిబింబి చునట్లుగా, నామె వంగియున్నపుడు తన ప్రతి బింబము వెనుకగల నీటి నీలకాంతిని చూచి పరాకున తన ప్రాణ ప్రియుడు వెనుకనుండి వచ్చి ముద్దు పెట్టుకొనుచుండె నని తలచి, సిగ్గుతో తల వంచుకొనును అప్పుడు కోనేటి తీరమున నల్లని నిన పగడముల తీగ కనువించి విష్ణుని పెదవులేమో యనిపించును

అట్టి వైకుంఠము పుణ్యమునకు దిక్కు ధర్మములకు నిర్మలమైన స్థానము (ఫలితము గోరి ధర్మము లాచరించుట యుండదు) పుణ్యములు వేళ్ళుపారగా వానిపై పెరిగిన చక్కని పాదువలె నుండును (చేసిన పుణ్యములకు రూపములు కట్టు స్థాన మని యర్థము)

508 టీక హరి విముఖాత్ములు=విష్ణునకు ఎడమొగమైన వారు, అన్యవిషయ+ఆదృత చిత్తులు=ఇతర విషయములం దాదరము గొనిన చిత్తములు గలవారు (విషయము లనగా నింద్రియార్థములు) పాపవర్తులు=పాపమే ప్రవర్తనగా గల వారు, నిరయనిపాత హేతువు=నరకమున పడుటకు కారణము, నింద్య చరిత్రము=నిందింపదగిన నడవడి, దుష్కథానిరతి=చెడ్డ కథలయందాసక్తి, ఇందిరా మనోహర=లక్ష్మీనాథునియొక్క,

చరణారవిందర=పాద పద్మములను, భజనాత్మకులు=భజించువారు, గొంగెన్ =వాసము నందు (దూరుటకు కష్టమైన సన్నని సందు),

తా॥ ఇంద్రియములకు నితర విషయములు గోచరించిన క్షణమున వానిలో నంతర్యామిగా నున్న విష్ణువిపై దృష్టి తొలగును ఇంతలో అన్య విషయములపై నాసక్తి కలుగును విష్ణుని యెడల పెడమొగ మగును ప్రవర్తనమునందు పాపము చేరును అది నరకమున బడుటకు హేతు వగును నడవడిలో నిందింప దగిన లోపములు పుట్టను అప్పు డితరులను గూర్చిన చెడ్డ విషయములు చెప్పుకొనుటయం దాసక్తితో తిరుగుచుందురు అట్టి వారికి విష్ణు కథలు కీర్తించుకొనువారి సాంగత్యము నచ్చదు విష్ణు డంతర్యామి యైనను వారికి మాత్రము విష్ణు స్థానము సన్నని గొందియై చొరబడుటకు శక్యముగాదు ఆ వైకుంఠమున భక్తు లెంత మంది యున్నను పాపాత్ముల కది చొరరాని గొందియే

509 510 టీక ధర్మతత్త్వ ధీ పరిణతి సాధనంబు= ధర్మము యొక్క నిజస్వరూపము నందు బుద్ధి పండు నట్టి సాధనము, మర్త్యులు=మానవులు, భృశంబుగన్ =మిక్కిలిగా మోహితులు=మోహము చెందిన వారు, పొరబడినవారు, తత్ + అంఘ్రి పంకరుహములు= వాని పాదపద్మములు అర్థిమై = కుతూహలముతో, కొలువంగానమిన్ = భజింప లేకుండుట వలన, తత్పదంబున్ =ఆ స్థితి యందు,

తా॥ ధర్మము యొక్క తత్త్వము ను తమ బుద్ధి పరిణామము ననుసరించి సాధించుకొనువా రున్నారు ధర్మముయొక్క నిజమైన స్వరూప మెట్టిదో తెలిసికొనుటకై వారు నిరంతర సాధనము చేయుచుందురు ఇంతలో మృత్యువు వచ్చును అట్టివారు తమ బుద్ధి

బలముతో దేవు నర్థము చేసికొనుటకు యత్నించుచు దానితో మోహము క్రమ్మును వారు విష్ణుభక్తితో నాశన హానిఁ భి ప లేదు కనుక ధర్మ మన నేమో దర్శనమిచ్చు పదవిని పొందలేరు (ఉన్న సృష్టి యందు నంతర్యామిని దర్శించు యత్నము భక్తి పుట్టును అది కలవారికి మోహము కలుగదు వారి ప్రవర్తన కో అప్రయత్నముగా ధర్మము సిద్ధించును. అట్లుకాక ధర్మ మన నేమో తెలిసికొన యత్నించి బుద్ధిబలమును ప్రయోగించినచో మోహము కలుగును మాయ క్రమ్మును ధర్మ మనగా తా మేమని గ్రహించిరో అది మాత్రము దక్కును ధర్మము లొంగదు. ఇంతలో మృత్యువు వచ్చును

తత్పదంబునన్ అనగా దేవుని పాదమునందను యర్థము తత్పదమునకు " అది " అని యర్థము తాము అది, యిది యని నిర్దేశించు వస్తువుల యందు దేవుని చూచుటకు యత్నింపరు గనుక ఆ వస్తువుల సత్యము దేవుడని తెలియదు వారికి దేవు డుండడు వస్తువు లుండవు తమ యభిప్రాయము లుండును. దీనిని అన్నిగా నాశ్రయించు నుపాయమే గాయత్రీ మంత్రమున నిమిడియున్నది ఇట్లు సృష్టిలో దైవమును దర్శించి సృష్టిని సన్యసించు మార్గమే భాగవతముగా నుపదేశింపబడినది గనుక ఈ గ్రంథమునందు గాయత్రీ రహస్యము చెప్పబడినదని ప్రథమస్కంధమున గ్రంథా రంభమున ప్రతిజ్ఞ చేయబడినది)

511 టీక సరోరుహ + ఉదరుని = కమలనాభుడైన విష్ణు మూర్తి యొక్క, అనులాప = ధ్యానించుట ఆలాపము చేయుట నిర్భర = పట్టరాని, పరితోష బాష్పకణ బంధుర = ఆనంద బాష్ప ములతో నిండిన, చారుకపోల = అందమైన బుగ్గలు, గద్గదస్వర = వణికిన కంఠధ్వని, పులకీకృతాంగులు = పులకించిన దేహము గల

వారు, గ్రహాగా విస్తులు = కోరికలు లేని చిత్తములు గలవారు, అతి + అహంకరణ విహారులు = అహంకారమునకు మిక్కిలి దూర మున నున్నవారు, సుకర్ముల = సత్కర్మ చేసినవారికి

తా॥ విష్ణుని మంగళ దివ్య కథలను స్మరించి గొంతెత్తి ఆలపించినచో పట్టరాని యానందమున బాష్పములు బుగ్గలపై జారుచుండవలెను కంఠము గద్గదము కావలెను దేహము పులకింప వలెను ఆ క్షణములో మాత్రమే కోరికలు మాయమగును అహంకారములు దూరము లగును అట్టి సుకృతమునకు నోచుకొనిన వారే వైకుంఠ మనబడు పుణ్యలోకమున నుందురు

512, 513 శ్లో॥ ఐర = శ్రేష్ఠమైన, సారసాకరము = కోనేళ్ళకు నెలవైనది, దివ్యస్వర్ణ శాలాంకగోపుర = మహాచూ న్వీత మైన బంగరురంగుగల శాలలు గుర్తులుగా కట్టబడిన గోపురము లను, హర్మ్యావృతము = మేడలతో నావరింపబడినది, తద్భ వనము = ఆ మేడ, అంభోజంబు = పద్మము, తన్మందిర + అంతర = ఆ మందిరము లోపున, విభ్రాజిత భోగి = వెలుగొందు సర్పము, కర్ణిక = తామరపువ్వు బొడ్డు, తత్ + ఉద్యత్ + భోగపర్యంకము = అతడెత్తిన పడగ యను ఆసనమునందు, ఇరవొందన్ = నివాస ముగా, భృంగాకృతిన్ = తుమ్మెదవలె,

తా॥ వైకుంఠనగరము యొక్క పద్మసరస్సు అందు దివ్యము లైన బంగరురంగు శాలలతో, గోపురములతో, గృహములతో నిండిన భవనమే యొక పద్మము అందున్న సర్పమే తమ్మిబొడ్డు ఆది పర్యంకముగా నివసించు మాధవుడే తుమ్మెద

( 1 అవ్యక్తమే యొక కోనేరు అందు సృష్టికి మూల కారణమగు శాశ్వత నివాసమే యొక పద్మము అది విచ్చుకొనుచు,

516, 517 టీక మరకత రత్న తోరణ =పచ్చలు, రత్నములు గట్టిన తోరణములతో, సమంచిత=కూడిన, కుడ్య=గోడలు కవాట=తలుపులు, గేహాళి=గుమ్మములు, విరచిత=విశేషముగా నిర్మింపబడి, షట్+సుకక్ష్యలు=ఆరు చక్కని యావరణములు, అరుగని దక్షతో విలోకన+ఉత్సవ+ఆదరమతిన్=విష్ణుమూర్తిని చూచుట్టి వైభవముపై నాదరపడిన మనస్సుతో, అన్యమున్, కనన్=ఏమియుకు దానిని చూడక అనంతర కక్ష్యయందు=తరువాతి ప్రాకారము నందు తదీయ పాలురన్=దాని కావలివారిని, ఉదార సమాన వయో విశేషులన్=ఊర్ధ్వముగా ప్రసరించుచున్న తేజస్సులు గలవారిని, వయస్సు మొదలగు విశేషముల యందు సమానులను,

తా॥ గరుడపచ్చలు మొదలగు రత్నములు తోరణములుగా గల గోడలు, తలుపులు, గుమ్మములు నిరుపార్శ్వముల యందు చక్కగా తీర్చిదిద్దబడినవి అట్టి విశేషములతో గూడిన పట్టణమున ఆరు ప్రాకారములను దాటిరి ఆ సనక సనంద నాదులకు మనస్సున నారాయణుని చూడవలెనను కుతూహలమున మరేమియు కనుపించలేదు ఏడవ కక్ష్యయం దిద్దరు ద్వారపాలకులు నిలబడియుండిరి వారు తేజోమూర్తులై సమానమైన వయస్సులు పోలికలు గలవారై యుండిరి

(తపస్సులు చేసి యోగశక్తిని కూడ బెట్టుకొని నంత మాత్రమున వైకుంఠములోనికి ప్రవేశము లభించదు దానికి కావలసిన యోగ్యతలు మూడు 1) తమ యోగశక్తిని ఖర్చు పట్టి లోక కళ్యాణమును సాధింపవలెను 2) అకారణముగా హృదయ సంతుష్టి చెంది చెదరకుండ వలెను 3) దారిలో నెంతటి వైభవములు కనుపించినను మనస్సున కవి గోచరింపరాదు

నారాయణుని దర్శించు కుతూహలము తప్ప మరియొకటి మనస్సున స్థాన మాక్రమింపరాదు

సనకాదులు వచ్చు దారిలో సుందరములైన కోనేళ్ళు, భవనములు, రత్నములు తాపిన ద్వారబంధములు, ప్రాకారములు గలవు వాని వైభవమును అంతకు ముందెన్నడు నెవడు చూచి యుండడు అయినను సనకాదుల కవి కనుపింపలేదు వ మనస్సున నారాయణుడు తప్ప అన్యము లేదు ఈ స్థితినే అ వ్యథి యందురు దాని సహాయముననే వారు మొదటి ఆరు ప్రాకార ములు దాటిరి అయినను ఏడవది యగు బ్రహ్మలోకము దాట నిచో మరల వెనకకు తిరిగివచ్చుచు డుట సంభవించుచుండు నని భగవద్గీత చెప్పుచున్నది అది దాటినవారు తిరిగి పతనము చెందరు చతుర్ముఖబ్రహ్మ మొదట దీని స్వరముగా దాటి నారాయణుని మెప్పు పొందెనని ద్వితీయ స్కంధమున నున్నది కనుకనే యేడవ ప్రాకారముననున్న బ్రహ్మలోకమని చెప్ప వచ్చునది ఆరు ప్రాకారములు దాటువరకు సనకాదులకు దృష్టి నారాయణు నిపైనున్నది అన్య వస్తువుల కనుపింపలేదు కాని యిచట మాత్రము ద్వారపాలకులను చూచిరి అనగా నారాయణుని కన్న నితర వ్యక్తుల నిద్దరను చూచిరి వారియందు నారాయ ణుని చూడలేక పోయిరని యర్థము కనుకనే అడ్డగింపబడిరి తాను యందు నారాయణు నొక్కనినే చూచినవారిని జయవిజయులడ్డ గింపరు అడ్డగించుటకు నెవ్వరు నుండరని యర్థము అపుడు జయ విజయులకు గూడ ఆ వచ్చినవారు కనుపింపరు నారాయణుడే కనుపించును ద్వారపాలకులకు సనకాదులు కనుపించినచో సనకాదులు ద్వారపాలకులను చూచిరిగాన వారిలో నారాయణుని చూడలేదని యర్థము ఒకరి నొకరు చూచకొను నపుడు తమ తమ సృష్టిలోని లోకములును, వ్యక్తులును, కర్మలును, సంబంధ

ముక్తిని వృత్తాంతిములును పుట్టును నారాయణుని పొందగోరిన వారి కట్టివి పుట్టవు అన్నియు నారాయణునియందే యుండును

ఇట్లు సనకాదు లేడవ కక్ష్యయందు అన్యము చూచుటకు కారణమేమి? వారు తమ తపశ్శక్తితో, యోగ సాధనతో సప్తలోకములను దాటదలిచిరి తమ సాధనను నమ్ముకొనక నారాయణుని కరుణను పూర్తిగా నమ్మియున్న చో దాట గలిగెడు వారు తమ సాధనను వేరుగా చూచుకొనుట వలన నారాయణుడు వేరుగా కనుపించును అనగా నడుమ కక్ష్య లుండును )

518 టీక కాంచన= బంగారము, నవరత్న= తొమ్మిది మణులు కటక+అంగుళీయక= కంకణములు, ఉంగరములు, కేయుర=భుజ భూషణములు (బాహు పురులు), మంజీర ధరుల= అందెలను ధరించిన వారు, కమనీయ = కోరదగిన, సౌరభ+ఆగత= పరిమళముల కాకర్షింపబడి వచ్చిన, మత్త మధుకర కలిత= పరవశించిన తేనెటీగలతో కూడిన, సత్ +వన మాలికా విరాజిత= మంచి వన పుష్పముల మాలచే వెలుగొందు చున్న, ఉరస్థలులన్ = వక్షస్థలములు గలవారిని, గదాయుతు లక= గదలతో కూడిన వారిని, ఘన చతుర్బాహులన్ = నాలుగు పెద్ద చేతులు కలవారిని, ఉన్నత+ఉత్సాహమతులన్ = ఉత్సాహముతో కూడిన యుత్తమ మనస్సులు గలవారిని, ఆరూఢ= పెరిగిన, మొలచిన, రోష+ అనల+ అరుణిత+ అక్షులన్ = కోపాగ్నితో నెఱ్ఱబడిన కన్నులు గలవారిని, భ్రూలతా కౌటిల్య= తీగలవలె వంకర తిరిగిన కనుబొమలతో కూడిన, ఫాలతలులన్ = నుదురులు కలవారిని, వేత్రదండ+ అభిరాములన్ = పేప బెత్తముల దండములు ధరించిన వారిని, ముకుంద శుద్ధాంత+ మందిర ఆళింద భూమిన్= విష్ణుని అంతఃపుర మందిరమునకు

సమీప ప్రదేశమున, వృద్ధులు= వయసైన పెద్దవారు, సుభగ మతులు= సౌభాగ్యముతో కూడిన మనస్సులు గలవారు

తా॥ వృద్ధులైనను తపస్సు మొదలగు సద్గుణముల సౌభాగ్యములతో కూడిన మనస్సులు గల సనక సనందనాదులు ద్వారమునకు నిరు ప్రక్కలను ద్వారపాలకులను చూచిరి జయ విజయు లనబడు ఆ ద్వారపాలకులు నవరత్నములు తాపిన బంగారు కంకణములు, రవ్వల యుంగరములు, హారములు, బాహుపురులు, ఘల్లు టందెలు ధరించి యుండిరి ఆకర్షింగల పరిమళమున వచ్చి వాలిన తేనెటీగలు పరవశించు చున్న వన పుష్పముల మాలికలు ధరించిన విశాల వక్షస్థలములు కలిగి యుండిరి చతుర్భుజములతో గదాధరులై ఎత్తైన మూర్తులుగా నుండిరి మనస్సులలో ఔన్నత్యము, ఉత్సాహము తొణికిలాడు చుండెను రోషాగ్ని మొలచిన కన్నులలో నెరసిదనము కనుపించు చుండెను చిట్లించిన కనుబొమలు వంపులు తిరిగిన తీగలవలె నలంకరింపబడిన విశాలమైన ఫాలభాగములు కనుపించెను చేతిలో పెద్ది బెత్తములు దండములుగా నిలిచి నారాయణుని అంతః పురమునకు ముందలి భాగమున నిలబడి యుండిరి

( వారి కన్నులలో రోషాగ్ని యేల? వచ్చిన వారు నారాయణుని చూడక అన్యులను చూచిరని కోపించుట ఈ ద్వార పాలకుల వర్ణన మంతయు కేవలము విష్ణు వర్ణనమే గాని మరి యొకటి గాదు విష్ణుని రూపములో అన్యులను చూచుట పతన హేతువు అన్యులను చూచినపుడు ఇచట నడుమ వీరెందులకు? అనిపించును దాని వలన వచ్చిన వారికి కలిగిన రోషమే ద్వార పాలకుల కన్నులలో ప్రతిబింబించును అన్యులను చూచుట, రోషపడుట, యనువాని పూర్తి కథయే జయవిజయుల శాపాను

భవ కథయైన మూడు జన్మలును ఇచ్చట రోషము సనకాదులలో పుట్టి ద్వారపాలకుల కన్నులలో ప్రతిబింబించి, సనకాదుల శాపముగా, జయవిజయుల రాక్షస జన్మలుగా పరిణామము చెందును అది మరల భూమిపై సనకాదులకును, వారి యనుయాయులైన ఆస్తిక సాధు జనులకును బాధలు కలిగించును ఋషులును, ప్రహ్లాదుడును, భక్తజనులును హిరణ్యకశిపుని వలన పడిన బాధలును, దశకంఠ్యాదులును, విశ్వామిత్రాది మహామునులును, దైవాశలైన వానరులును, విభీషణాదులును రావణుని వలన పొందిన బాధలును, కృష్ణావతారమున శిశుపాలుచే సమీకరింపబడిన జరాసంధ హంసడిభకాది దుష్టులు సాధుజనులను పెట్టిన బాధలును, ఈ సనకాదులు పుట్టించిన రోషాగ్ని నుండి బయలుదేరి దిగివచ్చినవే సృష్టిలో నొకరినొకరు చూచుకొని వ్యవహరించుకొనుట వలన దుష్టత్వము, దుఃఖానుభూతి సంసారబంధములై పట్టుకొనుచున్న వనియును, నిరంతర నారాయణ స్మరణము గుండ యొకరినొకరు వాసుదేవుని మూర్తులుగా దర్శించి వ్యవహరించుట వలన సంసార బంధ మంటదనియు నీ జగత్కథయొక్క నారాంశము ఇన్ని లోకములును, ఇన్ని వృత్తాంతములను, దేనియందు జరుగుచున్నవో అట్టి శాశ్వత లోకమే వైకుంఠము అందుండియు జీవులు తమ తమ దశలను కల్పించుకొనుట వలన వైకుంఠమును తెలియ లేకుండుటయు, సమర్థమౌ బుద్ధితో తెలియ గలుగుటయు నిందలి నిత్య కథ ఈ మొత్తమునే నారాయణుని యోగమాయ అందురు )

519 టీక ధీరతన్ = ధైర్యముతో, పంచాబ్దముల= ఐదు సంవత్సరముల, కుమారకులై = కుర్ర వయస్సు వాండ్రై కంఠం గూరక = సందేహము చెందక, చతురాత్మకులు= ఆత్మ

స్వరూపులైన నలుగురు లేక చతురతతో గూడినవారు, అని వారిత గమనములన్ = వారింపరాని ప్రయాణములతో, డాయ వచ్చినన్ = సమీపింపగా,

తా॥ సనకాదులు వృద్ధులైన ను ఐదు సంవత్సరముల కుమారుల రూపమున కనుపించుచుండిరి తా మెవ్వరున వాంఛ కుండుట వలన నిస్సందేహముగా ద్వారమును సమీపించిరి (ద్వారపాలకులను నారాయణమూర్తులుగా కాక వేరుగా చూచుట వలన వారి యనుమతికై నిలుచు ఎనయము లేక పోయినది )

520 టీక (శ్రీలలనా + ఈశ్వర = లక్ష్మీపతి యొక్క, దర్శన లాలసులు = దర్శించు కుతూహలము గలవారు, బుధ లలా ములు = జ్ఞానమున శ్రేష్ఠులు అతి దుశ్శీలతక = మిక్కిలి చెడ్డ ప్రవర్తనతో, తత్ + వచన ప్రతికూల మతిక = వారి పలుకులకు వ్యతిరేకముగా, కుటిలాత్మకులై = వక్రబుద్ధి గలవారై,

తా॥ లక్ష్మీ నారాయణులను దర్శించు కుతూహలమున పోవు జ్ఞానమూర్తులైన సనకాదులను పోనీయకుండ ద్వార పాలకులు దుర్బుద్ధులై యడ్డగించి దుశ్శీలత చూపిరి (జ్ఞానవంతుల మని వ్యవహరించినచో తమ కనుకూలము కాని చోట నెదుటి వారిలో దుశ్శీలత పుట్టును ఈ దుశ్శీలత చూచువారి నిర్ణయముల బట్టి యుండును ఎదుటి వారు దానిని దుశ్శీలత యనుకొన్నచో అట్లు ప్రవర్తింపరు గదా! యెవరికి వారే సన్మార్గము నడచు చున్నా మనుకొనుట జ్ఞాన దృష్టితో చూచినపుడు సంభవించును భక్తి భావమున్నచో సంభవింపదు )

521 టీక బృందారకులు = దేవతలు, ఈక్షించు చుండన్ = చూచుచుండగా, దారుణపటు రోష + అరుణిత + అంబ

ఆ ఇ= భయంకరమైన రోషమున నెఱ్ఱబడిన కన్నులు గలవారు, రోవ= క్రోధము

తా॥ ఇట్లు ద్వారపాలకులు వారింపగా సనకాదులు తీవ్రముగా కోపించి, యెఱ్ఱబడిన కన్నులతో, అచ్చట దేవతలు మున్నగువారు వినుచుండగా నిట్లనిరి

522 523 టీక పరమున్ = అందరికన్న పైవానిని, అనాశుని = అంతములేని వానిని భక్తపరిపాలున్ = భక్తులను పరిపాలించువానిని, సుహృత్తమున్ = ఉత్తమ మిత్రుని, ఇష్టున్ = ఇష్టమైనవానిని, ఈశ్వరేశ్వరున్ = అధికారులపై నధికారము గల వానిని, అనివారణన్ = వారింపరాని విధమున, ఇందు + అరుదేరన్ = ఇచ్చటికి రాగా, నిచ్చలున్ = నిత్యము, భరితముత్ + ఆత్ములు = నిండిన సంతోషము కలవారు, పాయక = తొలగక, తత్ + భజన + అంతరాయ తత్పరమతిన్ = వానిని భజించుట యందు విఘ్నము కలిగించు బుద్ధితో, అరిబడ్డ = అడ్డుపడినట్టి,

తా॥ మేము సర్వేశ్వరుడైన నారాయణుని భక్తులము అత డాద్యంతములు లేనివాడు (మీ అధికారములు ఆద్యంతములు గలవి) అతడు అందరికన్న పైవాడు ఇష్టుడైన స్నేహితుడు అధికారము ను గలవారిపై నధికారి వానిని దర్శింపవలెనని వచ్చితిమి ఆనందమున మేము వానిని నిరంతరము కొలుచుచుండగా మీరు డడ్డుపడి మా భక్తికి విఘ్నము కలుగ చేసితిరి ఇట్లు భక్తజనుల నడ్డగించు దుర్మార్గుల నింతకాలమునకు చూచితిమి (ఒక రడ్డగించినచో విఘ్నము చెందునది భక్తి కాదని తెలియక పలుకుచున్నారు)

524 స్వామిహితార్థంబై = యజమాని మేలుకోరి, నిష్కపట వర్తనులము = కపటము లేని ప్రవర్తనగలవారము, కుహక

వృత్తి=మోసపు ప్రవర్తనము, భగవత్ + సదనంబు=కేవ యిల్లు దౌవారిక స్వభావంబు=ద్వారముకడ కావలివారి లక్షణము, గత విగ్రహుండు = విరోధము తొలగిపోయినవాడు, విశ్వగర్భుండు=విశ్వమే గర్భముగా గలవాడు, ప్రాప్యంబు= పొందదగినది, ప్రాపకంబు =పొందుట, ప్రాప్తి = పొంద దగినది భేదశూన్యుండు=భేదము లేనివాడు, మహాకాశంబు = పెద్దదైన యాకాశము, ఘటపటాది+ఆకాశంబు=కుండ లోపల, వస్త్రముల లోపలగల చోటు,సకల+ఆత్మభేదరహితుని—అన్నిటియందు నుండి కును తన యస్తిత్వమున భేదములేని వానిని, స+అపరాధులు= అపరాధముతో గూడినవారు కింకరజనులు=సేవకులు, భూసుర వేషధారులు = బ్రాహ్మణ వేషము ధరించినవారు, శంక= సందేహము, మందబుద్ధులు = బుద్ధి మందగించిన వారు అనుచిత కర్మలు=తగనిపనులు చేయువారు, మదీయశాపార్హులు = మా శాపమునకు తగినవారు,

తా॥ సనక సనందనాదులు జయవిజయులను చూచి యిట్లనిరి సామాన్యముగా ద్వారపాలకులు తమ యజమాని హితము కోరి ద్వారమున నిలబడుదురు యజమాని హితము కోరి నిష్కపటముగ ప్రవర్తించునట్టి మా బోటివారు లోపలికి పోవచ్చును ఈ నడుమ సందు చేసికొని మోసకాండ్రైన యితరులు కొందరు దేవుని యింటిలో ప్రవేశింతురను సందేహముండుట మంచిదే ఆ దృష్టితో పరిశీలించిన పెనుకనే కొందరికి ప్రవేశ మీయ వచ్చును, కొందరిని వారింప వచ్చును ఇది సామాన్య ద్వారపాలకుల లక్షణము కాని అది యిచ్చట పొసగదు మన స్వామి భగవంతుడు వానికెవ్వరితోను విరోధము లేదు అతని గర్భమునందే యీ సృష్టి యంతయు వర్తించుచున్నది జీవులకు పొంద దగినది, దానిని పొందువాడు, పొందునట్టి

మాన్యము, అని మూడున్నవి ఈ మూడిటి యందు దేవు డంత ర్యామి కనుక వానికీ భేదములు లేవు కుండకు కుండలో చోటున్నది వస్త్రమునకు వస్త్రమందలి చోటున్నది దేనికది వేరు వేరుగా నుండును కాని యివన్నియు చోటులోనే యున్నవి అట్టి మహాకాశమున కిన్ని చోటులు లేవు అట్లే యంతర్యామి యైన భగవంతుడు అందరిలో నొకడే ఎవనికి వానిలో నాత్మగా వేరుగా ఉండడు ఈ భేదము లేని వానినిగా విద్వాంసులు దేవుని చూచుచున్నారు ( అట్లు దర్శించు నట్టి వారిని పోనీయకుండుట తప్పు అని యిందలి యభిప్రాయము అంతేకాని, పోనిచ్చుట పోనీయ కుండుట, పోనిచ్చువాడు, పోవువాడు అను భేదములు దేవుని యందు లేవని తట్టలేదు వీరి నందరిని దేవునికన్న వేరుగా చూచుట వలననే యీ నిరోధము కలిగినది దానిచే తాము వారికి బోధించుచున్నారు గాని తాము గ్రహించుట లేదు )

లోకమున రాజులు తప్పులు చేసిన సేవకులను దండించెదరు అట్లే దేవుడు కూడ మిమ్ము దండించునను భయమున వారించితి రన్నచో అదియును పొసగదు మేము బ్రాహ్మణుల మని మా వేషము లను బట్టి తెలియుట లేదా? అట్టి మా బ్రాహ్మణులకును, దేవునకును భేదము లేదని మీ యజమానియే చెప్పి యున్నాడు గదా! ఇక సందేహించుట కవకాశ మెక్కడిది? ( తాము చెప్పిన ప్రకారమే యితరులు బ్రాహ్మణుల వేషము ధరించి మోసమున ప్రవేశింప యత్నించుట సాధ్యము గదా! అపుడు ద్వారపాలకుల గతి యేమి కావలెను? ఇది వారికి తట్టలేదు మరియు వేషమును బట్టి నిర్ణయించునది బ్రాహ్మణత్వమా? సనకాదులు బ్రాహ్మణులే అయినను రోషపడుట, శపించుట కనుపించు చున్నవి గదా! ఇచ్చట తమ బ్రాహ్మత్వమునకు భంగము కలుగుటను గూడ వారు గుర్తింప లేదు

" మీ దేవుడును బ్రాహ్మణులమైన మేము నొకటే" అనుట వలన తమ్ము రానిచ్చినందులకు కొంచెము తేడాలు వచ్చెనను మేము దేవునకు జెప్పి, సద్ది మిమ్ములను కాపాడగలము కదా! అను ధైర్యము కూడ సనకాదుల పలుకులలో వినుపించును ఇచ్చట దేవుడు గూడ భూలోకమందలి ప్రభుత్వాధికారి వలె భావింప బడెను ఒక కులము వారి నాదరించి వారికి ప్రత్యేకముగా పదవులకు ఉద్యోగములకు ఖాళీలు రిజర్వు చేయుచు, వారి సిఫార్సుల ప్రకారము మిగిలిన వారిపై నిగ్రహానుగ్రహములు చూపువాడు కాదు గదా దేవుడు! వారికిది గూడ తట్టలేదు పూర్వ మొక సాహిత్య సభలో నీ ఘట్టము ను గూర్చి చర్చించుచు ఒక బుద్ధిమంతుడు ఇందు బ్రాహ్మణ ప్రశంస హెచ్చుగా నున్నదనియు, నివి బ్రాహ్మణులు వ్రాసికొన్న గ్రంథము లనియు నాక్షేపించెను ఇట్టిదే యిచ్చటి సనకాదుల పొరపాటు గూడ! దైవము విషయమున సంసార జీవులు మోసపోయి బాధలు పడుట దేవుని గూర్చిన యీ పాక్షిక విశ్వాసముల వలననే వైరాగ్య మభ్యసించి సంసారమునకు దూరముగా నున్నవారు గూడ మోసపోవుదని యిచ్చటనే )

మేము శ్రీహరి వారమని మా సేవకులచే యెరిగి కూడ మీరు మందబుద్ధులై మమ్ము వారించిరి కనుక మీరు చేసినది తెలిసి చేసిన యపరాధమే గాని పొరపాటు గాదు అట్టి మిమ్ము మా శాపమునకు గురి చేయదగును మీరు శపింప తగిన వారు గనుక భూలోకమున కామము, క్రోధము మోహము లు మొదలగు శత్రువులు బాధించునట్లుగా జన్మము లెత్తుడు ( శాము చిరి ) మైన అయుధము అది తపస్సుతో చేయబడినది శపింప గోరువాడు మొదట కామక్రోధాదులకు లొద్దు నగును. వారి క్రోధ కారణము సత్యమైనచో శాప ఫలము అపరాధునకు సోకను

సత్వ కానిచో గూడ శాపము యెదుటి వారి పైననే పని
చేయును కాని దాని కష్ట నష్టములు శపించు వానికి చెందును
ఇచట కామ క్రోధ లోభము లనబడు శత్రువులు జయవిజయులను
పట్టుకొన్నను లోకమున బాధలు మాత్రము మిగిలిన వారికి
చుట్టుకొన్నవి )

525 టీక భూరిస్ఫుట = మిక్కిలిగా వెలువడిన,
చండకాండ పూగంబులు = వాడియైన బాణముల సమూహములు,
భూసుర దారుణ వాక్యములు = బ్రాహ్మణులు పలికిన కఠినము
లైన వాక్యములు, ఉలికి = ఉలిక్కిపడి, తల్లడపడుచున్ = తల్లడిల్లుచు

తా॥ బ్రాహ్మణుల శాపవాక్యములు భయంకరములైన
వాడి బాణముల వలె ద్వారపాలకుల మనస్సులలో గుచ్చుకొన్నవి
వారు ఉలికిపడి తాము అపచారము చేసితిమని భయపడి తల్లడిల్లిరి
( వారు భయపడినది శాపమునకు కాదు విష్ణునకు తెలిసినచో
కోపించు ననియు కాదు తాము చేసినది యపచారమని భయపడిరి
ఇచ్చట నిర్ణయించినది సనకాదులు వారి నిర్ణయమును ద్వార
పాలకులు శంకింపలేదు కారణ మేమనగా వారిలో నారాయణుని
తప్ప మరియొకనిని జయవిజయులు చూడలేదు కనుకనే తిరిగి
కోపింపక క్షమింపుమని వేడుకొనిరి ఇచట సనకాదుల రూపమున
గూడ నారాయణుడు కోపించెనని వారు భయపడలేదు నారాయ
ణుడు కోపింపడని వారెరుగుదురు ఇక భయమెందుల కనగా
తాము చేసినది అనుచితమేమో యని సజ్జనులు భయపడ వలసినది
తమ ప్రవర్తనమును గూర్చియే గాని మరి దేనిని గూర్చియు కాదు )

526 టీక కరమర్థిన్ = మిక్కిలి శ్రద్ధతో, నిటలఘటిత +
అంజలులై = తమ నుదుటిపై నమస్కారముద్రలు పట్టినవారై,

తా॥ జయ విజయులు చాల దుఃఖపడి సనకాది మునీశ్వరుల పాదపద్మములకు మిక్కిలి శ్రద్ధతో శిరస్సులు వంచి నమస్కరించి యిట్లనిరి

527, 528 టీక వర = శ్రేష్ఠమైన, మదినొవ్వన్ = మనస్సు నొచ్చుకొనునట్లుగా, నిష్ఠుర వాక్యంబులు = కఠిన వాక్కులు, సత్పురుష శ్రేణిన్ = మంచివారి సమూహమును, వృథా భూతాత్ములు = వ్యర్థ జీవులు, దురితంబు = పాపము, మీఁదన్ = ఇటుపైన, దూకొందుము = చేకూర్చుకొందుము

తా॥ మహా యోగీశ్వరులారా! మీరు మా మనస్సులు నొచ్చుకొనునట్లుగా కఠినములైన వాక్కులు పలికితిరి ఇట్లు పలికితిమని మరల మీరు బాధపడకూడదు మీ పలుకులకు కారణము మా చేతనే సజ్జనుల సమూహమును పరాభవించిన వ్యర్థ జీవులము మా పాపకార్యమే మీ శాపవాక్యములను కలిగించినది ఇటుపైన మాకు శుభము కలుగునట్లుగా ప్రవర్తించుకొనుటకు యత్నింతుము

529, 530 కరుణ + అవలోకన సమేతులు = దయాదృష్టులతో కూడినవారు, దూకొనెనేని = సమకూర్చుకొన్నచో, చనవు = పరిచయము, తోఁయక = తోసిపుచ్చక, నవకంజ దళాక్షుని = విష్ణుమూర్తి యొక్క, నామ విస్మృతిన్ = పేరు మరచుటను, పైకొనకుండ = మించి పోకుండ,

తా॥ అది యెట్లనగా మీ దయ మరల మా మీద ప్రసరించునట్లుగా మీ మనస్సులకు మేము తృప్తి కలిగింప యత్నింతుము మరల మీకు మాపై దయ కలిగినచో మాకొక మేలు

చేయుడు మేము కామ క్రోధ లోభాదులతో భూమిపై పుట్టి నపుడు మన స్వామి నామస్మరణము మరపు రాకుండునట్లు మమ్మనుగ్రహింపుడు దానితో నటుపై జన్మములు శుభము లగునట్లుగా మలచుకొనగలము

( ఇచ్చట జయ విజయులు శాపము తొలగింపుడని వేడు కొనలేదు శాపమో కాదో అది తమ ప్రవర్తనము నాధారముగా సర్దుకొనవలసినది గాని, యెదుటివారి సహాయమున మారునది కాదు ఇక శాపావసానమును దెలుపుమని కూడ ప్రార్థింపలేదు అది కూడ తమ ప్రవర్తనమే సాధించుకొనవలెను మమ్ము దయ చూడుడని కూడ కోరలేదు మరల మీకు నచ్చునట్లుగా ప్రవరించి మీకు దయ పుట్టించుకొందు మని చెప్పిరి ఇక కోరిన దొక్కటే, దైవ స్మరణము మరపురాకుండుట దానికి స్వప్రయత్నము వలన లాభములేదు పెద్దల సాంగత్య మావశ్య కము దానికొరకు ప్రయత్నించుట వలననే వారు సనకాదు లలో నారాయణుని చూచి సంభాషించిరి అది యొక్కటి మరపు రాకున్నచో కామ క్రోధాది రాక్షస గుణముల వలన భయము లేదు సాధకుడు కామ క్రోధాదులను చూచి భయపడుట కన్న నెదుటి వారిలో దైవమును చూచుట వలన కామ క్రోధాదులను దాటవలెను )

581 582 టీక - పద్మాలయా=లక్ష్మీదేవి యొక్క, సరస+ఆలాప వినోద సౌఖ్య రచనలు=సరసమైన పలుకులతో వినోదము కలిగించు సుఖమును కల్పించుట, శుద్ధాంతమందిర= అంతఃపుర గృహముయొక్క, మాణిక్య సుగేహళుల్=మణులు తాపిన చక్కని గుమ్మములు, ప్రపన్న+ఆర్తి సంహారుఁడు=శరణు జొచ్చినవారి బాధలను పోగొట్టువాడు, నిత్యవిభూతి శోభన కరుండు

= తరుగని వైభవములతో శుభములు కలిగించువాడు, మానిత +ఆకారుఁడు =పూజింపబడిన యాకారము గలవాఁడు,

తా॥ అట్లు వెలుపల జరుగుచున్న కలకలమును కృష్ణమూర్తి వినెను లక్ష్మితో చేయుచున్న సరస సల్లాపములు చాలించి, యంతఃపుర గృహము గుమ్మము దాటి తన శరణాగతుల బాధలు దీర్చుటకై వెలుపలకు వచ్చెను తన నిత్య వైభవముచే చూచు వారికి శుభములు కలిగించు నాకారముతో దర్శన మిచ్చెను [తన్నాశ్రయించిన జయ విజయులకు సనకాదుల శాపము వలన బాధలు కలుగకుండవలెను శపించిన దుష్కర్మచే సనకాదులకు భూలోకమున బాధలు కలుగకుండ దుష్కర్మ నాశమగు మార్గము చూపవలెను ఈ రెండును సిద్ధించుటకొకటే మార్గము సనకాదుల మనస్సునందు జయ విజయులు నిర్దోషులని తెలియవలెను. వారు నిర్దోషులని తాను సమర్థించినచో సనకాదులకు తృప్తి కలుగదు దేవుడు పక్షపాతము వహించెనని వారు మరల నజ్ఞానమున బడవచ్చును కనుక వారికి తృప్తి కలుగు మరియొక ఎధమైన సంభావణ చేయవలెను దానితో తాము తప్పుచేసితిమని సనకాదులు తెలిసికొనవలెను తెలిసికొనినను అవమాన పడరాదు అప్పుడే వారు జయ విజయులను దయతో చూడగలరు దానివలన జయవిజయులు రాక్షసులుగా పుట్టియు వారి నామ స్మరణము మరువకుందురు వాని వలన లోకములకు క్షేమము కలుగుట, ధర్మ సంస్థాపనము జరుగును ]

583, 584 టీక శరనిధి కన్యకామణీ=సముద్రుని పుత్రిక యగు లక్ష్మి, సంభ్రమము=తొట్రుపాటు, నిజలీలనై = తన లీలతో, పరమహంస=నిత్యముక్తులయిన మహాత్ములు, గవేష్య= వెదుక దగిన, పాదపంకరుహములు=పాదపద్మములు, వినూత్న=

మిక్కిలి కొ్రిత్తవి, మణికాంచన = రత్నములు బంగారుగల, నూపుర = అందెలయొక్క, మంజుఘోషముల్ = వినసొంపైన శబ్దములు, ఆర్యజన వంద్యుఁడు = పూజ్యులచే నమస్కరింప దగినవాడు, యోగిజన + ఏక సేవ్యుడు = యోగులందరకు సేవింప దగిన యొక్కడు.

తా॥ లక్ష్మీదేవి భయభక్తులతోడి తొట్రుపాటుతో వెంట నడచి రాగా విష్ణుమూర్తి లోపలినుండి దిగివచ్చెను వాని లీలలకు పరమహంసలు నమస్కరించుచుండిరి మునీంద్రులచే వెదుకబడుచున్న తన పాదపద్మములు బంగారు కాంతుల మణుల అందెల శబ్దములు చేయుచు కదలివచ్చెను పూజ్యులందరు నమస్కరించిరి యోగి జనులందరు సేవించిరి (వైకుంఠమున ద్వారము దగ్గర జరిగిన కల్లోలమునకు లోకములయం దేమి దుష్పరిణామములు కలుగునో యని పెద్దలందరు గడగడ లాడుచుండిరి వారికి విష్ణుని పాద దర్శనము శాంతిని సంతోషమును చేకూర్చెను)

535 కరమణి హేమకంకణ = బంగారమున మణులు తాపిన చేతి కంకణములు, నికాయ = సమూహము, ఝణం కృతులు = గల గలమను శబ్దములు, ఉల్లసిల్లన్ = విస్తరింపగా, అచ్చరలు = అప్సరసలు, హంసపక్ష = హంస రెక్కల ఈకలతో చేయబడిన, సితచామర = తెల్లని చామరములు, గంధవహ + ఉచ్చలత్ = సుగంధమైన గాలులకు పైకెగురుచున్న, సుధాకర కుంర + ఆతపత్ర = చంద్రునివలె కాంతిమంతమైన గొడుగు, శుభగ = సౌభాగ్యముగా, ప్రవిలంబిత = మిక్కిలి వ్రేలాడుచున్న, హార వల్లరీ = పూల తీగెలవంటి హారములు, సరసగళత్ + తుషార = సరసముగా జారుచున్న మంచు, కణజాల = తుంపురుల సమూహము, విరాజిత = ప్రకాశించు, మంగళాంగుఁడై = శుభములైన అవయవములు కలవాడై,

తా॥ లక్ష్మీనారాయణులు చేతులకు ధరించిన బంగారు మణికంకణముల శబ్దములు వినిపించుచుండెను అప్సరసలు హంస రెక్కల ఈకలతోను, చామరములతోను వీవనలు వీచుచుండిరి ఆ గాలికి మెల్లగా కదలుచున్న పెద్ద చంద్రబింబమువలె తెల్ల గొడుగు పట్టిరి దాని చుట్టును చివళ్ళయందు ముత్తెముల హార ములు వ్రేలాడుచుండెను వానిలో నుండి కనుపించుచున్న విష్ణుమూర్తి మంచు బిందువుల తెరలలోనుండి కనుపించుచున్న చంద్రుని వలె శుభదర్శను డయ్యెను

536, 537 టీక సస్మిత = చిరునవ్వుతో కూడిన, ప్రసన్న = శాంతమైన, ఆననాంబుజము = ముఖపద్మము, అలరు వాడు = ప్రసిద్ధి చెందువాడు, విశ్రుత = ప్రసిద్ధి కెక్కిన, స్నేహ + ఆర్ద్రవీక్షణ = ప్రేమతో కూడిన చూపులుగల, గుహా + ఆశ యుడు = గుహాయందు నివసించువాడు, మానిత = గౌరవింపబడిన, శ్యామాయమాన = నల్లని రంగుగల, అంచిత = తీర్చిన, వైజయంతి = విష్ణుని మెడలోని మాల, నతజన + అవన = నమస్క రించు వారిని రక్షించునట్టి, కృప + అమృత తరంగితములు = దయ యను అమృతమునందు అలలు గలవి, లోచన + అబ్జములు = కన్నులను పద్మములు, సేవ్యుడు = సేవింప దగినవాడు, భువన మూడా విభూష = భూదేవి నెత్తిన ధరించిన ఆభరణము,

తా॥ విష్ణుమూర్తి సకల మునీంద్రులచే వర్ణింప బడిన ప్రసన్నమైన చిరునవ్వు మొగము గలవాడు జగత్ప్రసిద్ధమైన స్నేహములతో కూడిన చూపులచే హృదయమున స్థిరముగాను గుహా యందువలె హృదయములందు నిలిచిన వాడు నల్లని వక్ష స్థలమున వైజయంతి యనబడు ప్రశస్తమైన వనమాలను ధరించి యుండను నమస్కరించు జనులను రక్షించునట్టి దయ తరంగము

లుగ ప్రవహించు మాపులు గలవాడు సమస్త యోగి జనులచే సేవింప బడువాడు మంచి వారి నెప్పుడును రక్షించుచుండువాడు అన్ని లోకములకు శిరోభూషణమైన వైకుంఠమునకు భూషణము వంటివాడు

588 టీక కటివిరాజిత = మొల చుట్టును మెరయు చున్న, ఎత శాతకౌశాటి= పచ్చని పట్టు పంచె, వితత = విస్తారమైన, కాంచి గుణద్యుతి= మొలనూలి దారము కాంతి, ఆలంబి= వ్రేలాడుచున్న కంఠహారావళి= మెడలోని దండల వరుస, ప్రభలతో= కాంతులతో, కౌస్తుభరోచులు= కౌస్తుభ మణి కాంతులు, క్రిందుకొనగా= చుట్టును ఆక్రమింపగా, నిజకాంతి జిత= తన కాంతులచే జయింపబడిన, తటిత్ =మెరపుతీగె, వజ్ర కర్ణకుండల రుచులు= వజ్రము తాపిన చెవికుండలముల కాంతులు, గండద్యుతుల్ = బుగ్గల కాంతులు, ప్రోదిసేయన్ = భద్ర పరుపగా, ప్రభానిచయంబు= కాంతుల సమూహము, వైనతేయ = గరుత్మంతుని యొక్క, అంస విన్యస్త = మూపుపై నిలపబడిన, వామ హస్తకలిత= ఎడమ చేతికి కూడిన, కేయూర= భుజముల యాభరణములు, వలయ= మురుగులు, అన్య కరతల= మరియొక చేతి లోపలి భాగము, భ్రమణీకృత= త్రిప్పుట వలన చేయబడిన, అనుమోద= సమ్మతి, లీలారవిందము= విలాసముగా ధరించిన పద్మము

తా॥ ఆ విష్ణుమూర్తి నడుమున పచ్చని పట్టు పంచెపై తళుకులు గల మొలనూలు తాల్చి యుండెను మెడలోని హారముల రత్నకాంతులు కౌస్తుభమణి చుట్టును వ్యాపించెను చెవుల కుండలముల వజ్రముల కాంతులు తళుక్కుమనుచు మెరపు తీగలను మించుచుండెను నవరత్నములు తాపిన కిరీటము కాంతులు

దిక్కుల వ్యాపించెను గరుత్మంతుని మూపుపై నెడమ హస్తము నిలిపెను అతని ముంజేతి కంకణములు, మురుగులు ముచ్చటగా కనుపించెను కుడిచేతి యందు పద్మమును ధరించి లీలగా త్రిప్పు చుండెను

589 టీక చరణ+అరవింద= పాదములను పద్మముల యొక్క, మంజు కింజల్క పుంజ = మనోహరములైన కేసరముల గుత్తుల పరిభారంజిత=కాంతిచే వెలిగింపబడిన, మకరంద బంధుర= తేనెతో నిండిన, గంధ+అనుబంధ = వాసనతో సంబంధించిన, సుగంధి గంధివహ=సుగంధము గల వాయువును, ఆస్వాదకలిత= ఆఘ్రాణించుటచే నేర్పడిన, సేవాతిగ్పకలు = సేవించుట యందు నిష్ఠ కలవారు, మానస+ఆనందకారి=మనస్సునకానందము కలిగించునది, బహిః కరణ+అంతఃకరణ పరితోష=వెలుపలి యింద్రియముల యొక్క లోపలి యింద్రియముల యొక్క సంతోషము, ప్రకీర్ణ=చల్లబడిన, కోమలాంచ రుచిదాయకంబు=కనకాంచనకు వన్నెలు కలిగించునది, పరిభాపూర్తి యుక్తంబు=కాంతియొక్క సంపూర్ణతతో కూడినది, మూర్తి=ఆకారము, నిజసౌందర్య= తన యందము, వరకళా వినిర్జిత=శ్రేష్ఠమైన అంశచే జయింపబడిన, శ్రీ రమణీ సౌందర్య=లక్ష్మీదేవి యందముచే, భాసమానుండు= ప్రకాశించువాడు, పాదచారి=కాలి నడకను వచ్చినవాడు, అఖిల విశ్వ గురుండు=సమస్త లోకములకు పూజనీయుడు, (జగద్గురువు)

తా॥ ఆ విష్ణుని పాదపద్మముల కేసరముల గుత్తుల వలె కాంతులు వెదజల్లుచున్న తులసి దళములు, వాని వాసనతో కూడిన పుష్ప వాసనలు, సుగంధ ద్రవ్య వాసనలు గొనివచ్చు చున్న మంద వాయువులను అనుభవించుచు నతని పాదములు సేవించుచు యోగీంద్రులు నడచుచుండిరి వారి మనస్సులకు ఆనందము

కలిగించుచున్న విష్ణుమూర్తి దివ్య రూపము వెలుపలి యింద్రి
యములకు, లోపలి యింద్రియములకు సంతోషమును వెదజల్లు
చున్నది దాని యనుభవమున వారందరును గగుర్పాటు చెందు
చున్నారు ఇట్లు పరిపూర్ణమైన కాంతితో గూడిన ఆకారముతో
విష్ణుమూర్తి నడచి వచ్చెను ప్రక్కన లక్ష్మీదేవి నడచుచున్నది
ఆమె సౌందర్య కాంతులు వర్ణింప నలవి కాకున్నవి ఆ మొత్తము
సౌందర్యము తనలో నొక భాగముగ విష్ణుమూర్తి సౌందర్యము
పరిపూర్ణమై నొందియున్నది అట్టి వైభవముతో సర్వలోకములకు
గురుడైన విష్ణువు కాలి నడకను దయచేసెను

540 టీక విద్రుమ + అరుణ = పగడమువలె నెఱ్ఱ
నైది అధర పల్లవ = చిగురుటాకు వంటి క్రింద పెదవియందు,
స్ఫురత్ + ఉదంచిత = స్పందించుచు నొప్పుచున్నది, కుంద
రుచి = మల్లెమొగ్గ కాంతి, స్మిత + ఏకసుందర = చిరునవ్వుచే
ప్రత్యేకముగా అందము గూర్చిన, వదనారవిందము = ముఖ
మను పద్మము, ముదంబునన్ = సంతోషముతో, నిజ + ఆత్మ
లన్ = తమ హృదయములందు, తనివి + చాలక = తృప్తి
చెందక, వెండియున్ = మరియు, ఇమ్ములన్ = కుతూహలముతో,

తా॥ శుభములు స్థిరత్వముగొనిన రూపముతో విష్ణు
మూర్తి వచ్చి నిలబడి మందస్మితముతో కటాక్షించెను పగడము
వలె నెఱ్ఱనైన పెదవి చిగురు దొడిగినట్లు వికసించెను దానిపై
మల్లెమొగ్గల కాంతితో పలువరుస కొంచెము కనుపించునట్లుగా
నవ్విన శోభతో రూపుకట్టిన ముఖపద్మమును మునీశ్వరులు తదేక
దృష్టితో చూచిరి చూచిన తృప్తిలేక మరల మరల నెట్టుకొని
చూచిరి

541 టీక సునిశితభక్తిన్ = మిక్కిలి తీవ్రమైన
భక్తితో, తత్ + ముఖము = వాని ముఖము, చూడ్కులు =

చూపులు, అకల్మష=మలినము లేని, భక్తవిధూత విపదముల్ = భక్తుల దుఃఖముల నెగురకొట్టునవి, మునిజన చిత్తమోహములు= మునిజనుల మనస్సులలోని సంతోషములు, ముక్తినివాస = మోక్షమున్న తావునకు, కవాటభేదముల్ = ద్వారములు తెరచునవి, వినుత = స్తుతింపబడిన, వినూత్న = క్రొత్తవి, నూపురిత వేదములు=అందెలుగా చేయబడిన వేదములు గలవి

తా॥ నిశ్చలమైన భక్తితో విష్ణుదేవుని ముఖముపై నిలబడిన తమ చూపులను మరలించుకొనుట వారికి కష్టమయ్యెను కాని వారి పాదపద్మములను దర్శించు నభిలాష వారి కెక్కువ తుద కెట్లో చూపులను మరలించి విష్ణుని పాదములపై నిల్పిరి నిర్మల జీవితము నడుపు భక్తుల దుఃఖముల నెగుర దన్నునట్టి పాదము లవి మునుల మనస్సున నిల్చిన మోహములై, మోక్ష దేవత నివాసమునకు ద్వారములను తెరచినట్లు ఆ పాదములు చేర వచ్చుచున్నవి క్రొత్త క్రొత్త శబ్దములతో వేదములు ఆ పాదముల అందెలుగా నున్నవి అట్టి పాదముల దర్శనము వారికి కలిగెను

542 టీక నఖ పద్మరాగమణి = పద్మరాగములవంటి కాలిగోళ్లు, కాంతి విభాసిత = కాంతితో వెలుగొందిన, కీల్కొలిపి=బిగించి, లబ్ధమనోరథయుక్తులు=కోరికలు తీరినవారు, పునః పునరభివందనములు = మరల మరల నమస్కరించుటలు, విభూతి దలిర్పన్=వైభవము పుష్పింపగా, యోగమార్గ నిరత చిత్తులు=యోగమార్గమున నిష్ఠ పొందిన చిత్తములు గలవారు,

తా॥ వాని పాదములను దర్శించి కాలిగోళ్ళ పద్మరాగముల వంటి కాంతులతో కూడిన పాదపద్మములను హృదయములకు హత్తించుకొని కోరిక దీరిన తృప్తితో వారందరు మరల మరల

నమస్కరించు కొనుచుందురు ఆ దృశ్యము మహావైభవమును పుట్టించెను అవును మరి! యోగసాధన మార్గమున నిరంతరము మనస్సులు నిలిపి వెదకినను కనుపించడా మహానుభావుడు

(ఎన్ని సాధనలు చేసినను వాని దర్శనము వాని యనుగ్రహమున దప్ప తక్కిన మార్గములలో లభ్యముకాదు వాని కథా సంకీర్తనము చేయుచు అనుగ్రహమునకు పాత్రులగుట యొక్కటే మార్గము )

543 టీక తత్+ధ్యాన+ఆస్పదుడు=వారి ధ్యానమే నివాసముగా గలవాడు, తత్త్వజ్ఞులు=యథార్థ స్వరూపము తెలిసినవారు, భక్తజన+ఆనందకర+ఏకమూర్తిన్ =భక్తుల కానందము కలిగించు నొకే యాకారమైన వానిని,

తా॥ విష్ణుమూర్తి తమ ధ్యానమే నివాసముగా గలవాడు సృష్టియందలి యథార్థము రూపుకట్టినవాడు అది ధ్యానించువారి యానందము రూపమున నుండును అన్ని మార్గముల వారికి ఆనందానుభూతి ఒకే విధముగా నుండును అదొక్కటే యతని రూపము అట్టి రూపమును వారు కన్నులతో చూచి

544 టీక చక్షురింద్రియ గ్రాహ్యంబు = కంటితో గ్రహింపదగినది, ఉదాత్త తేజోనిధి = ఉత్తమమైన తేజస్సునకు నివాసము

తా॥ కంటికి గోచరించు దివ్యమంగళ విగ్రహమును ధరించి యున్నను అతడు ఉత్తమ తేజోనివాసమైన పురుషోత్తముడే గాని ఆ కనుపించు నాకారము మాత్రమే కాదు అట్టివానిని దర్శించి సనకాదు లిట్లని స్తుతించిరి

(దేహము నశించును గనుక క్షరపురుషు డనబడును జీవుడు దేహములందుండువాడు గనుక అక్షరపురుషు డనబడును ఈ రెండను ఏ వెలుగునకు కిరణములో అతడు పురుషోత్తముడు. అతని యంశలే ఈ మిగిలిన రెండు రూపములతో జీవుల లోకము లుగా దిగివచ్చి దర్శనమిచ్చును కనుక ఈ రూపములలో నున్నా డని ధ్యానించినచో వాని రూపము కంటికి కనుపింపదు ఈ రూప ములు వానిలో నున్నవని ధ్యానించినచో కనుపించునది వాని రూపమే నేను వాని యందుండుట గాదు ఆ రూపములు నా యందున్నవి" అని కృష్ణుడు గీతలో చెప్పెను అట్లు సమస్త సృష్టిని వాడుగా దర్శింపగల వారే వైకుంఠవాసులు

545 వనజదళాక్ష = పద్మములవంటి కన్నులు గల వాడా, భక్త జన వత్సల = భక్తుల యందు ప్రేమ గలవాడా, భవత్ + సుతుండు = నీ కుమారుడు, మత్ + జనకుఁడు = మా తండ్రి, పంకరుహజాతుఁడు = పద్మమున పుట్టిన వాడు, భవదీయ = నీయొక్క, మంగళగభీర = శుభమైనది, గంభీర మైనది, పరిగ్రహ విగ్రహంబు = స్వీకరించిన రూపము అనయ మున్ = మిక్కిలిగా తప్పక, కృతార్థులము = ధన్యులము, తగ మంటిమి = తగినట్లు జీవించితిమి

తా॥ నీవు భక్తుల వాత్సల్యమును చూరగొనిన వాడవు నిన్ను దర్శించు రహస్యమును నీ కుమారుడు, మా తండ్రియగు చతుర్ముఖుడు మా కుపదేశించెను నీ శుభమైన, గంభీరమైన రూపమును చూచితిమి ఇది నీవు మాకై స్వీకరించిన రూపము దీనిని దర్శించుట వలన మా జీవితము తగిన రీతిన ధన్యమైనది జీవించుట యెట్లో తెలిసినది

( బ్రహ్మ దర్శించి యుపదేశించిన రహస్య మపూర్వముగా వ్యాఖ్యాని ం బ డి న ది చతుర్ముఖుడు నీ కుమారుడు, మా తండ్రి' అను మంత్రమున నీ రహస్య మున్నది నీ కుమారు డన్నను మా తండ్రి యన్నను నొక్కడే అతడే సృష్టి క ర్త, అనగా నీ సృష్టి యందలి జీవులలో తండ్రికి కొడుకుగా, కొడుకునకు తండ్రిగా కనపించును ఈ ఇద్దరి సంబంధ మే సృష్టి క ర్త ఇద్దరిలో నున్నది నారాయణుడు ఈ రూపములు చూచు వారి ననుగ్రహించుటకు నారాయణుడు ధరించినవే గాని వానిని చూచి వేర్వేరు వ్యక్తులను కొ ని సంబంధములు పెట్టుకొని చెడిపోవుటకు కాదు ఈ రహ స్యము నారాయణుడు బ్రహ్మ కుపదేశించుటయే సృష్టి విధానము నేర్పుట బ్రహ్మ అట్లు పుత్రులను కని వారి కుపదేశించుటయే సృష్టి చి సార్థకము చేయుట జీవించుట యనగా నిట్టిదని ద ర్శించి నపుడే నిజమైన జీవించుట యగురు

ఈ రహస్యమునే చెప్పుచు భగవద్గీతలో నేనీ సృష్టికి తండ్రిని, తల్లిని, తాతను, ఈ విధముగా బ్రహ్మను అని చెప్పెను ఎచ్చట పుత్రులు తండ్రు లగుచున్నారో అదే రహస్యము'' అనియు ''దీనిని తెలిసిన వాడు తండ్రికి తండ్రి యగుచున్నాడు'' అనియు ఋగ్వేదము కీర్తించుచున్నది

అదే సంబంధ మును సనకాదులు నారాయణునకును, జయ విజయులకును నడుమ చూడలేక పోవుట మాయ )

546 టీక దర్శనులు = చెడ్డ వా రు, హృదయసంగ తుఁడు = హృదయమున నున్నవాడు, కడఁగి = పూనుకొని, స మం చి త + ఆశ్రితులు = ఆశ్రయించి పరికాశించుచున్న వారు, చేకొని = స్వీకరించి, అతిశయ కారుణ్యామతిన్ = మిక్కిలి కరుణతో కూడిన మనస్సున, తనర్చి = వ్యాపించి, సర్వలోక

ప్రజా+అధిప = అన్ని లోకముల జీవుల కధిపతియైన వాడా!,
భవత్ + అనుసరణ + అభిలాష = నీవెంట నడచు కోరిక,
అనులాప విదిత = అనుసరించి సంభాషించు కొనుటతో వ్యక్త
మైన, దృఢ భక్తి యోగ ప్రవీణులు = నాటుకొనిన భక్తి
యోగమున నిపుణులు, అర్థిమై = కుతూహలముతో, విగత
రాగులు = రాగము లేనివారు, మమకారము లేనివారు, యోగ
జన మనః పంకజాత = యోగుల మనస్సను పద్మమున, నిషణ్ణ
మూర్తి = కూర్చున్న రూపము గలవాడవు, ఆత్మ విదులు =
ఆత్మను తెలిసిన వారు,

తా॥ దేవా! నీవు దుర్జనుల హృదయమునందు గూడ
నున్నావు వారి భావనల కందవు నీ దివ్యమంగళ రూపమును
ఆశ్రయించిన వారిని నీ వారినిగా చేసికొని కరుణతో సంప్రీతు
లనుగా చేయుదువు నిన్ననుసరించు నభిలాష గలిగి నిన్ను గూర్చి
చెప్పకొనుట వలన భక్తియోగము స్థిరపడును మమకారములు
తొలగును అట్టి వారి హృదయము లందు నీవు కూర్చుంటి వని
వారు గమనించుచున్నారు తమ్ము గూర్చి తెలిసినవారు వారే
ఇట్లు తెలియుటయే యాత్మ విద్య

("నే నున్నాను అని ప్రతి జీవికిని తెలియును ఆ
తెలివి దేవుడని తెలియదు కనుక వారిలో నున్న విష్ణువు
వారికి గోచరింపదు తమ దేహము యొక్క రూపము తమదే
యని వారు పొరబడుదురు అది అతని దివ్యమంగళ విగ్రహమని
తెలియవలె నన్నచో వారి హృదయము తెలియవలెను అందున్న
నారాయణు డనుగ్రహింప వలెను వాడున్న చోటును తా మున్న
చోటనుకొనుచుండగా తమ భావనకు వాడందడు తమ రూపము
గాని, ఎదుట కనుపించు రూపములుగాని అతని విగ్రహములని

భావించుట కావలెను అప్పుడు తమ జీవితము వాని వెంట నడచుటయే యగును ఇతరులతో సంభాషణలు వానితో సంభాషణలే యగును ఇతరులను గూర్చి చెప్పుకొనుట వానిని గూర్చి చెప్పుకొనుటయే యగును ఈ మార్గము నిజమైన భక్తి యోగము ఇది స్థిరపడినపుడు దేవుడు తమ హృదయములలో నున్నాడని తెలియును ఇట్లు తెలిసిన వారే ఆత్మవిద్య నెరిగినవారు వీరికి ఈ తెలివి జయవిజయుల యెడ భావించునపు డేమయ్యెనో తెలియదు )

547 టీక యుక్తిన్ = యోగముతో, భవత్ + వ్యతిరిక్తములు = నీకన్న వేరైనవి, దృఢకర్మ బుల్ = పటిష్ఠము లైన సత్కర్మలు, ముక్తిదములు = ముక్తినిచ్చునవి, తత్ + కర్మములు = ఆ పనులు,

తా॥ యోగమార్గమున నిన్ను స్మరించుటలో నాత్మవిద్య తెలిసినవారు నీకన్న ఇతరములైన సత్కర్మ లేవియైనను లెక్కచేయరు అవి మోక్షమును కలిగించునవి అయినను వాని నాదరింపక నీ పాదభక్తులుగా నుందురు

( నీపాద భక్తులకు యోగ మనగా చిత్తో కూడియుండుట నీ స్మరణయందు తాము లీనమై యుండుట దానికన్న వేరైన మార్గమునసే కర్మలను నాచరింపరు అవి సత్కర్మలైనను ఆదరింపరు అనగా నారాయణునకు సమర్పణముగా తప్ప తదితర భావముతో నే సత్కర్మలైనను జప తప, హోమ, వ్రతాదులైనను ఆచరింపరు మోక్షము కలిగించు పనులను గూడ నాచరింపరు అనగా నారాయణుని స్మరణయందు లీనమగుట యొక్క చేవా రంగీకరింతురు గాని, మోక్షమును గూడ లెక్కచేయరు భగవంతుని స్మరణగాక వేరుగా మోక్ష మున్నదని భావించుట భ్రాంతి ఉన్నచో అది మోక్షమను నభిప్రాయమేగాని మోక్షము

కాదు అభిప్రాయములు అభిప్రాయమునుండి విమోచనమను కలిగింపవు గనుక దైవస్మరణ కన్న మోక్షమున్నదని వారు నమ్మరని భావము )

548 టీక కీర్తనీయ = సంకీర్తనము చేయదగిన, గత కల్మష=దోషములు తొలగిపోయిన, మంగళ తీర్థకీర్తి=శుభమై పవిత్రము చేయు భగవంతుని వ్యాప్తి, సుశ్రీవిభవ= చక్కని సంపదతో, వైభవముతో, ప్రశస్త సుచరిత్రుఁడు= చెప్పుకొనదగిన చక్కని నడవడి గలవాడు, భవత్ పాదాబ్జ సేవా=నీపాదపద్మములను కొలుచుటవలన, విమల+అంతరంగ= నిర్మలహృదయముగల, బుధవర్గము = జ్ఞానులగుంపు, అనర్గళ భంగిన్=అడ్డులేని మార్గమున, అన్యమున్=ఇతరమును, కృపా గుణభూషణ = దయాగుణమే అలంకారముగా గలవాడా!, పాప శోషణా=పాపములను శుష్కింప జేయువాడా!,

తా॥ కనుక నో దయాస్వరూపుడా! పాపహరమైన నీ పాద సేవ శుభకరమై తరింపజేయును భక్తుల స్మరణయందు నీ వ్యాప్తి కలిగి సంపదయు వైభవమును కలిగించును నీ ప్రవర్తనము సన్మార్గ మున ప్రశస్తమై యుండును అట్టి నీపాదములను సేవించువారి హృదయములు నిర్మలములు వారే తెలిసినవారు వారి భావ నలో అన్యముండదు

( పూజనీయమైన నడవడి గలవానిని భగవంతుని స్తోత్రము చేయుట యనగా సృష్టిలోని సజ్జనుల ప్రవర్తనము గూర్చి మున నతడు వర్తించుచున్నాడని తెలిసికొనుట అట్లు తెలిసికొనువారు జనులలోని సద్గుణములు స్వీకరింతురుగాని మిగిలిన వానిని స్వీక రింపరు కనుకనే వారి ధ్యానమున అన్య ముండదు )

549 టీక పరమ తపోవిధూత = ఉత్తమ తపస్సున నాశనము చేయబడిన, భవపాపులము = సంసార పాపము కల వారము, భవత్ + పదాశ్రితులకు = నీ పాదము లాశ్రయించిన వారికి, అల్గి = కోపించి, భూరిదుష్కృతి స్ఫురణన్ = మిక్కిలి చెడ్డపనియొక్క ప్రకటత్వము వలన, అకత్ పథ + ఏక = ఒకే చెడ్డ మార్గమున, పరిభూతులము = పరాభవింపబడిన వారము, నిజ ధర్మహాని = మా ధర్మమునకు భంగము, నిరయము = నరకము, నేరము + పెట్టక = అపరాధమును గుర్తింపక,

తా॥ మే మెంతో తపస్సుచేసి సంసారమందలి పాపములను పోగొట్టుకొంటిమి అట్లు నిర్మల మార్గమున చరించుచు గూడ నేను మీ పాదము లాశ్రయించిన ఈ ద్వారపాలకులను శపించి తిమి అహా! చెడ్డమార్గమే గెలిచినది మా తాపస ధర్మమునకు హాని కలిగినది మరల నరకమున బడితిమి తప్పులెన్నక దయ జూచి మమ్ము రక్షింపుము

( సనక సనందనాదులు తమ తపోబలమున పాపములను పోగొట్టుకొనుట సహజమే గాని, దైవానుగ్రహమును గూడ తమ తపోబలమునసనే పొందగలమని పొరపడి మోసపోయిరి దైవాను గ్రహము దేవు డనుగ్రహించుట వలన కల్గునుగాని, జీవుడు తపస్సు చేయుట వలన గలుగదు తప్పులు చేసినను సమర్పణ బుద్ధి కలి గినచో నిజముగా పాపములు నశించుటయు, దేవు డనుగ్రహించు టయు కల్గును )

550 టీక కరము = మిక్కిలి, అనురక్తిన్ = అపేక్షతో, మట్పదము = తుమ్మెద, కమ్ర = కోరదగినది (మనోహరమైనది), సుగంధ = మంచివాసన గలది, మరందవాంఛ = తేనెపై కోరిక, తరమిడి = వేగముగా, శాత = వాడియైన, కంటకవృత =

ముండ్లతో ఆవరింపబడిన, స్ఫుటనవ్యతర ప్రసూన మంజరులు= పొటమరించిన క్రొత్తపువ్వుల గుత్తులు, డాయుపోల్కి=సమీపించు విధమున, చరణ సరోజముల్ = పాదపద్మములు, సమ్మతిన్ = అంగీకారముతో,

తా॥ మిక్కిలి యనురాగముతో తుమ్మెద సుగంధములతో కూడిన తేనెకోసము వెదకికొనుచు వచ్చును దానికి తేనెపై గల యభిలాష వలన సూటిగా పూల గుత్తుల దగ్గరకు పరువెత్తును దానికిగల తీవ్రమైన కోరికవలన అతివేగముగా గాలిలో ప్రయాణము చేయుచు దారిలో నెన్ని ముండ్ల పొదలున్నను, తప్పించుకొని ముండ్లు గుచ్చుకొనకుండ పువ్వుల గుత్తుల దగ్గరకు చేరును అట్లే సమస్త విఘ్నములను జయించి మేము నీ పాదములు కొలుచు నిశ్చయముతో వచ్చితిమి

( భగవద్భక్తి లేనివారు యోగసాధన చేసినను, తమ కోరికలకై తపస్సులును, వ్రతములును చేసినను విఘ్నము లెక్కువగు చుండును దైవమునకు సమర్పణబుద్ధి కలిగినపుడు విఘ్నములలో చిక్కుకొనకుండ సూటిగా దేవుని సాన్నిధ్యమును చేరుట సాధ్యమగును )

551 టీక అలరు=ప్రసిద్ధమైన, భవత్ + పద + అంబుజయుగ + అర్పితము = నీ పాదపద్మముల జంట కర్పింప బడినది, పొలుపొందు=అందము చెందు, భవత్ కథాసుధా + ఆకలితములు= నీ కథామృతముతో కూడినవి, అకల్మషయుక్తిని = దోషములు తొలగించుకొనిన యోగమార్గమున ( మనస్సు దేవుని తో యోగము చేయు మార్గమున ), కర్ణముల్ = చెవులు, విలసిత లీలమై=రూపొందు విలాసముతో,

తా॥ ఓ లక్ష్మీపతీ! ఈ తులసి నీ పాదపద్మముల కర్పితమై పవిత్రతను చేకూర్చుకొన్నది అట్లే మా చెవులు గూడ నీ కథామృతములో గూడిన వాక్కులను నిర్మల మనస్సుతో వినుటవలన పవిత్రము లైనవి

( భగవంతుని అద్భుత లీలలతో గూడిన కథలు వినుటతో మనస్సు పవిత్రమైనంతగా మిగిలిన తపస్సులతో, యోగమార్గములతో జరుగదు భగవంతుని దివ్యకథలనగా జీవులలోని పుణ్యకర్మలను మెచ్చుకొని ఆనందించ గలుగుట దేవుడే అనేక రూపములైన జీవులుగా నవతారమెత్తి వారి సద్బుద్ధిగా సత్కర్మాచరణముగా తన లీలలను చూపునని తెలియవలెను )

552 టీక మహిత యశోవిలాస = గొప్పకీర్తితో సాగసైన, గుణమండన = సద్గుణములతో నలంకరింపబడిన వాడా!, సర్వశరణ్యా = అందరికిని శరణమైన వాడా!, ఇంద్రియ స్పృహులకు = ఇంద్రియ సుఖములు కోరినవారికి, అతసీ కుసుమద్యుతి= అవిసెపువ్వుకాంతి, భృశంబుగన్ = ఎక్కువగా, మదీయ దృక్కులు = మా చూపులు, కృతార్థతన్ పొరసెన్ =సార్థక్యము నొందినవి,

తా॥ ఘనమైన కీర్తిని కలిగించు సద్గుణములే యలంకారములుగా గలిగి యెల్లరకును శరణాగతుడైన వాడవు నీ సహజశరీరము ఇంద్రియ సుఖములు గోరువారికి గనపింపదు అది నల్లవిసె పువ్వు కాంతి వంటిది అట్టి నీ దేహకాంతిని చూచుటవలన మా కన్నులు నేడు సార్థక్యము బొందినవి మా నమస్కారములు స్వీకరించి మమ్మానందింప జేయుము

( నల్లవిసె పువ్వు మిగిలిన రంగుల పువ్వులవలె కంటి

నాకర్షింపదు అట్లై ఇంద్రియముల సుఖములు మనస్సు నాకర్షించి సంతగా నింద్రియములకు వెనుక నున్న దేవుని సహజమైన మూ మనసున కందదు ఇంద్రియ ప్రవృత్తి ఆగినచో జీవునిలోపల నున్న అంతర్యామి యస్తిత్వము తెలియును అదొక్కటే గమనింప దగిన సహజ స్థితి మిగిలినవి ప్రకృతియొక్క వికారములు )

553 టీక తత్ + పద వనజములకున్ = వాని పాదపద్మ ములకు, భక్తివశమానసులు = భక్తికి వశమైన మనస్సు గల వారు, ముదితాత్ముండు = సంతసించిన హృదయము కలవాడు,

తా॥ ఇట్లు పలుకుచు సనకాదులు తన పాదపద్మములకు మ్రొక్కి భక్తితో గూడిన మనస్సుకలిగి తన్ను స్తుతింపగా, వారిని జూచి నారాయణుడు సంతుష్టిచెంది యిట్లు పలికెను

554 టీక జయవిజయ + అభిధానంబులు = జయవిజ యులను పేర్లు, మదీయ = నాయొక్క ఆజ్ఞా + అతిక్రమణులు = ఆజ్ఞ నుల్లంఘించిన వారు భృత్యవర్గ బు = పరిచారకుల సమూ హము, మాననీయుండను = లెక్కచేయ దగిన వాడను,

తా॥ ఈ ఇద్దరును జయవిజయులను పేర్లు గల నా ద్వార పాలకులు వీరు మిమ్ము లెక్కచేయక నా యాజ్ఞ నతిక్రమించి యపరాధము చేసిరి మీరు వారికి తగిన దండనము విధించిరి అది నా కంగీకార మయ్యెను అంతేకాదు సేవకులు చేసిన తప్పు యజమానికి చెందును కనుక ఈ తప్పునకు నేను బాధ్యుడ నైనను నేను మీకు గౌరవనీయుడ నగుట వలన నన్ను మన్నించి, మీరు ప్రసన్నులు కావలసినది

555 టీక తనువునన్ = దేహమునం, బెడిదంబు = కఠిన

మైనది, కుష్ఠమహాగదంబు = ఘోరమైన కుష్ఠువ్యాధి, వసరి = బాధపడి, తదీయ చర్మము = వాని చర్మము, వివర్ణత నొందిన రీతిన్ = రంగు మారిపోయినట్లు, భృత్యులు = సేవకులు, ఒప్పనిపని = కూడనిపని, విభులు = యజమానులు, బంధుర చారుయశంబు = నిండైన మనోహరమైన కీర్తి, పేరు = మంచి పేరుబడుట, పెంపు = అభివృద్ధి, దుర్యశము = అపకీర్తి, విష్టపంబులన్ = లోకములందు,

తా॥ శరీరమందు ఘోరవ్యాధియగు కుష్ఠు ప్రవేశించినపుడు చర్మము దుష్టమై రంగు విరిగి పాలిపోవును అట్లే సేవకులు దోషము చేయుటవలన యజమానుల పేరు ప్రతిష్ఠలు గభివృద్ధి చెడిపోవును చెడ్డపేరు వచ్చును ఇది లోక సహజము

556 టీక అలవడన్ = అభ్యాస మగుట వలన తీర్థసుకీర్తనీయ = తరణోపాయమైన, స్తుతింపదగినది యైన, సత్ + లలిత = మంచి అందమైన, వినిర్మల + అమృత = స్వచ్ఛమైన అమృతము వంటి, విలాస = శోభగలిగిన, యశోవిభవ + అభిరామము = కీర్తి వైభవముతో నొప్పుచున్నది, వికుఠనామము = వైకుఠమను పేరు, అపవిత్ర మనస్ = అంటు పడిన మనస్సులు గల, శ్వపచ + అధమ + ఆది = కుక్కలను వండుకొని తినువారు, నీచులు, మున్నగు వారి యొక్క,

తా॥ నా వైకుంఠ నామము మీ వలన పవిత్రత చెందినది మీ వలన తరణోపాయముగ నిలచినది మంచి వారిచే స్తుతింప బడుచున్నది అమృతము వంటి కీర్తితో నొప్పుచున్నది నా నామమున కిట్టి గొప్పదనము మీ రుచ్చరించుట వలన గలిగినది అట్టి నా నామము చండాలురు, నీచులు మొదలగు వారి చెవులు సోకినపుడు వారిని పవిత్రులను చేయుచున్నది

557 టీక నాధుజనులకు=మంచి వారికి, అర్థి=కోరికతో, మదీయ బాహుసములు + నా చేతులవంటి వారు, ఉత్సాహలీలన్ =సంతోషముతో, మీ మోలిలన్=మీ సన్నిధి యందు,

తా॥ ఇట్టి నేను మీ వంటి వారికి సపకారము చేసిన వారిని క్షమింపను వారు నా చేతుల వంటి వారైనను నరికి పార వైచెదను ఇంక నితరులను గూర్చి మీ సన్నిధిలో లెక్క-చేయు టెందులకు ?

558 టీక ధరణసురోత్తమ = బ్రాహ్మణోత్తముల యొక్క-, సేవాపరిలబ్ధంబు = సేవవలన ప్రత్యేకముగా లభించినది, పాతకనాశంకర = పాపములను నశింపజేయునట్టి, నిఖిలభువన పూత = సకల లోకములను పవిత్రులను జేయునట్టి, స్ఫురిత + అంమిర సరోజతోయములు = పాదపద్మముల నుండి పొటసరించు చున్న జలములు

తా॥ బ్రాహ్మణోత్తముల సేవవలన నా పాదములు పాప ములను నశింపజేయుచున్నవి సకల లోకములను పవిత్రము చేయు చున్నవి (బ్రాహ్మణసేవ యనగా బ్రాహ్మణులను సేవించుట యని యొక యర్థము బ్రాహ్మణులు చేసిన సేవయని యొక యర్థము తన పాదములను బ్రాహ్మణులు సేవించుట, తాను బ్రాహ్మణుల పాదములను సేవించుటవలన నతని పాదపద్మములు పూజ్యస్థాన మలంకరించినవి నారాయణుడు బ్రాహ్మణులను సేవించుట యనగా క్షత్రియ, వైశ్య శూద్రుల, చండాలుర రూపములో నంతర్యామిగా నుండి సేవించును)

559 టీక అలఘుమతి = గొప్పమనస్సు గలది, విరక్తునిగా = వైరాగ్యముగల వానినిగా, నిజశుభ కటాక్ష దామ

కలిత = తన శుభమైన కటాక్షము లనబడు పుష్పమాలలతో కూడిన, అఖిల సంపత్ + విభవ = సమస్త సంపదలతో, వైభవములతో కూడిన, శ్రీలలనారత్నంబు = లక్ష్మీదేవియను స్త్రీరత్నము, ఉరస్స్థలంబును = వక్షస్థలమును,

తా॥ అట్టి నన్ను వైరాగ్య సంపన్నుడుగా తలపక లక్ష్మీదేవి తన శుభమైన కటాక్షములను పూలదండలవలె గొనివచ్చి, తన సర్వసంపదలతో నా వక్షస్థల మలంకరించినది ఆమె స్త్రీరత్నము

( తాను ఋషీంద్రుల వలన గలిగిన గౌరవమును, పవిత్రతను తనదిగా స్వీకరించుటలేదు పాపులు తన నామస్మరణము చేసినచో వారికి సంక్రమింప జేయుచున్నాడు కనుక తన కే సంపద నెవ్వ రర్పించినను, తాను నిలుపుకొనక లోకహితమునకై దానము చేయును అత డట్టివాడని తెలిసి కూడ లక్ష్మీదేవి వానికి తన సర్వసంపద లర్పించి తన్ను గూడ నర్పించుకొనెను )

560 టీక క్రతువుల = యజ్ఞములు, శిఖ ముఖంబునన్ = అగ్నిహోత్రుని నోటియందలి, వెలుచునట్టి = హోమము చేయునట్టి, తత్ + ఘృతప్లుత = ఆ నేతులతో తేలుచున్న, చరుభక్షణన్ = చరువనబడు హోమద్రవ్యమును భక్షించుట చేత, ముదము = సంతోషము, నిస్పృహా = కోరికలేని, ధరమార్గసంగతుండు = ధర్మమార్గము ననుసరించువాడు, భూసురోత్తము ముఖమున = బ్రాహ్మణుని నోటియందు, వేడ్కన్ = వేడుకతో, ఆ + అవిస్తృతి కబళంబునన్ = ఆ చాలని ముద్దచేత, నిచ్చలున్ = ప్రతి దినము,

తా॥ బ్రాహ్మణులు యజ్ఞము చేయునపుడు హోమమునందు

చరువు నాహుతి చేయుచున్నారు ఆ చరువు నేతులతో మునిగి తేలుచున్నది వైరాగ్య సంపన్నుడై ధర్మమార్గమున నడచుకొను బ్రాహ్మణుడు చాలిచాలని అన్నము తినుచున్నాడు అతడు నాకు సమర్పణముగా సర్వము నాచరించుచున్నాడు గనుక వాని ముఖమున అది నాకు సమర్పిత మగుచున్నది దానితో నేను తృప్తుడ నంతగా ఈ నేతులలో మునిగి తేలిన చరువుతో తృప్తి పడుట లేదు.

561 టీక అప్రతిహత = ఎదురులేనట్టి, విభూతి = వైభవము, మహీసురుల = బ్రాహ్మణుల, సమిద్ధ = చక్కగా సమకూర్చబడిన, నిర్మల = దోషములేని, పాదనలిన = పాద పద్మముల యొక్క, రజోవితానములు = ధూళియొక్క పొరలు, హాటకనవరత్న కోటీరమున = బంగారముతో నవరత్నములతో గూడిన కిరీటమున, తాల్తున్ = ధరింతును, చరణాంబుజ + అంబువులు = పాదపద్మముల యందలి జలములు, తిలి = పూని, సద్య పవిత్రాత్ములు = వెంటనే పవిత్రులైన వారు, అర్థిన్ = కోరికతో, చంద్ర + అవతంస + ఆది = చంద్రశేఖరుడు మొదలైన, దేవచయములు = దేవతల సమూహములు, అపకృతుల్ = అపకారములు అలుగఁడు = తిరిగి కోపింపడు, విప్రులను = బ్రాహ్మణులను, ధర్మపద్ధతిన్ = ధర్మపు టడుగు జాడలయందు,

తా॥ నేను నిరంతరము నాయోగ మాయావైభవము చేత ప్రసిద్ధుడ నగుచుందును అట్టి నా మాయ యెదురు లేనిది నేను బ్రాహ్మణుల నిర్మలమైన పాద పద్మముల యందలి రేణువులను భక్తితో నా రత్నమయములైన కిరీటములందు ధరించుచున్నాను అట్టి నా పాదపద్మము లందలి జలములను శిరస్సున ధరించి, శివుడు మొదలగు దేవతలు వెంటనే పవిత్రులగుచున్నారు. బ్రాహ్మణులు తన్నవమానించినను తిరిగి కోపింపని

వాడును, బ్రాహ్మణులను నన్నుగా భావించు వాడును, నా ధర్మ మార్గము ననుసరించు వారు వారే నాకు ప్రియతములు

562 టీక గోవితతిన్ = గోవుల సమూహమును, ధరాదివిజ కోటిని = బ్రాహ్మణుల సమూహములను, దీనవర్గమున్ = దిక్కులేనివారి సమూహములను, వావిరిన్ = బాహాటముగా, భేదబుద్ధిన్ = వేరైన దృష్టితో, అధోగతిన్ = దిగువకు జారిపోవుట, ఆశీవిష రోష విస్ఫురణన్ = కాటువేయు పాముల పగవంటి కోపము వెలిబుచ్చుటతో, కృతాంత భటుల్ = యమభటులు, మహా + ఉగ్ర = మిక్కిలి భయంకరమైన, గృధ్రావలి = గ్రద్దల గుంపు, చంచువులన్ = ముక్కులతో, అంగములు = దేహములు, ఉద్ధతిన్ = అదరిపాటుతో, చింతురు = చీల్చి వేయుదురు,

తా॥ బ్రాహ్మణులను, గోవులను, దీనులను, నన్ను నొకటిగా సమబుద్ధితో చూడక భేదభావముతో చూచువారు అధోగతిపా లగుచున్నారు యమభటులు త్రాచులవలె వారి యందు పగబూని వేచి యుందురు సమయము వచ్చినపుడు భయంకరముగా గద్దల వోలె మీదబడి ముక్కులతో చీల్చి పారవైచుదురు

563 టీక ధరణీ సురోత్తముల్ = బ్రాహ్మణోత్తములు, దరహసిత + ఆస్యులై = చిరునవ్వు మొగములు గలవారై, అతిముదంబునన్ = మిక్కిలి సంతోషముతో, నిచ్చలున్ = నిత్యము సరసవచో విలాసములన్ = సరసమైన సంభాషణల సొగసులచే, సన్నుతి = చక్కని స్తోత్రములు, ఆత్మజుల్ = కుమారులు, అనురక్తిన్ = ప్రేమతో,

తా॥ బ్రాహ్మణు లనేక విధములుగా త మ్మవమానించి

నను, చిరునవ్వుతో వారిని పలుకరించి నిత్యము పూజించు చూడ్కి వలెను తండ్రిని పుత్రులు ఏ విధముగా పలుకరింతురో అట్లే సరసమైన సంభాషణలతో సంతోష పెట్టి మెచ్చుకొనుచుండు వలెను అట్లు చేయువారు నాతో సమాను లగుచున్నారు

564 టీ॥ ఆ + అనఘ చరిత్రులకు = ఆ పుణ్య ప్రవర్తనము గలవారికి, అనయమ్ముగ = ఎల్లప్పుడు, కినలక = కోపింపక, పరితోష వృత్తిగ = సంతోషముతో గూడిన ప్రవర్తనమున,

తా॥ అట్లు ప్రవర్తించు మహనీయులకు నేను ప్రియతము డనై నిత్యము వారి కమ్ముడు బోవుదును పూర్వము భృగువు నన్ను తన్నినపుడు కోపించితినా! సంతోషముతో వాని చేష్టలను స్వీకరించితిని

565 టీక పొలుచు = ప్రకాశించు, మానస + అంభోజాత భావంబు = మనస్సను భావనమున గల యభిప్రాయము లేక మనస్సుయొక్క పద్మమువంటి నిర్మలస్థితి, ఉత్ + వృత్తులు = మిడిసిపడినవారు, తత్ + దోషఫలము = ఆ దోషమునకు ఫలితము అంతికమునకు = సమీపమునకు, ఓలిన్ = వరుసగా, మృదుల = మెత్తనైన, భాషా + అమృతంబు = భాషయను నమృతము, తవిలి కోరియు = పూని, తాగియు, రోషసందష్టులు = రోషముకాటు పొందినవారు

తా॥ నా మనస్సునందలి నిర్మలమైన భావమును తెలియ లేక మిడిసిపడి మీ యాజ్ఞలను వీరు తిరస్కరించిరి ఆ దోషము నకు ఫలమును వీ రనుభవించిరి ఓ మునులారా! నా మనస్సున గూడ నిది యంగీకారముగానే యున్నది వినను ఈ జయవిజ

యులు భూమిపై పుట్టి వీలైనంత త్వరలో నాదగ్గరకు తిరిగివచ్చు నట్లుగా మీా రనుమతింప వలెను

ఇట్లు విష్ణువు పలుకగా సనకాది మహామునులు అతని మృదువైన యమృతమువంటి సంభాషణలు విని కుతూహల పడిరి కాని అందలి గంభీర భావములకు మనస్సున రోషపడిరి

566 టీక పంకజా తాక్షుఁడు=విష్ణువు, పరిమిత=అల్పము లైన, గంభీర = లోతైన, బహుళార్థ = వివిధార్థములు గలిగిన, దురవగాహములు = అర్థము చేసికొనుటకు కష్టమైనవి, విస్ఫురత్ +అమృత తుల్య=అమృతము వెదజల్లుచున్నట్లు, మాధుర్య సుగుణ సమన్వితములు=తియ్యదనముతో మంచిగుణముల బోధలతో కూడినవి, వినిర్గత=వదలిపోయిన, శబ్ద=పదముల, దోష నికాయములు=దోషముల సమూహములు కలవి, పరితోషము= సంతోషము, నెయ్యమునన్ = స్నేహమున, ఒడయఁడు= ప్రభువు, నందించిరో=సంతోషించిరో, అర్థిన్ = కోరికతో, నిందించిరో=తప్పు చూపించిరో, మత్ కృత + ఏకదండము నకు= మే మొక్కటిగా కూడి దండించుటకు,

తా॥ ఆ విష్ణుమూర్తి పలికిన పలుకులు మితభాషణములు వివిధములైన యర్థములతో, లోతులు గలిగి బోధపరచు కొనుటకు మిక్కిలి కష్టముగా నున్నవి అయినను తప్పు పట్టుటకు వీలులేని విధముగా అమృతము చిందించుచున్నట్లు తియ్యతియ్యని ప్రసంగములుగ నున్నవి సద్గుణముల బోధలతో కూడి యున్నవి అందలి శబ్దప్రయోగమును చూచినచో ఆ ఋషులకు తమ దోషములు తమకెత్తి చూపునట్లుగా నున్నవి అట్టి పలుకులు విని మునుపు మొదట సంతోషించినను తరువాత చిన్నబుచ్చుకొనిరి ఇంతలో మరల హృదయములలో సంతోషపడిరి (విష్ణుమూర్తి

తమ దోషములెత్తి చూపెనన్నచో వారిని తనవారుగా స్వీక రించెనని గ్రహించి సంతోషపడిరి) ఇప్పుడు విష్ణువు ఈ పలుకులను సంతోషించి పలికెనా? అని తమలో తాము ముచ్చటించుకొనిరి

567 టీక నలినాక్షుఁడు = విష్ణుమూర్తి, కౌతుకము + ఎలయన్ = కుతూహల మెక్కువ కాగా, పులకీకృత + అంగులు = పులకరించిన దేహములు గలవారు, ఉత్కలికన్ = ఉత్సాహముతో, హర్షించి = సంతోషపడి, నిటల ఘటిత + అంజలులు = నుదుట నిలిపిన సంస్కారములు గలవారు,

తా॥ తమ తప్పులు తమకు చూపుట వలన విష్ణుమూర్తి తమపై దయగలవాడయ్యెనని గ్రహించి, వారు పులకించిరి సంతోషముతో మొగముల యందు నమస్కారముద్రలు ధరించి శిరస్సులు వంచిరి

568 టీక భరిత = నిండిన, నిజ = తనయొక్క, స్ఫురణన్ = ప్రకటితము జేయుట వలన, తనరారు = విస్తృతి చెందునట్టి, అతి విభూతి = మహావైభవము, పరమ + ఉత్కర్షము = మిక్కిలి గొప్పదనము

తా॥ ఆ విష్ణుమూర్తి యోగమాయ అతని చేష్టలలో ఎట్లు నిండియున్నదో, దాని వైభవ మెట్టిదో, బల మెట్టిదో, గొప్పదన మెట్టిదో తెలిసికొని మునులు వినయముతో వాని కిట్లనిరి

569 టీక పొలుపు దీపింపన్ = సౌందర్యము ప్రకాశింపగా, నిత్య విభూతి నాయకుఁడవు = తరుగని వైభవము నడిపించు వాడవు, భగవంతుఁడవు = ఐశ్వర్యములను మహిమలుగా గలవాడవు, అనఘుఁడవు = దోషమంటని వాడవు, మత్ కృతంబు = మేము చేసినది, అభిమతము = అంగీకారము, చారిత్రము = నడవడి,

తా॥ నీవు నిత్యము వైభవమును నిలిపి అందీ లోకములను నడిపించు చున్నావు సకల మహిమలు గలవాడవు పాప మంటని వాడవు మేము చేసిన పని నీ కంగీకార మంటివి నీ నడవడిని గ్రహించుట సాధ్యమా?

570 టీక పం దేవతలు=ఉత్తమ దేవతలు, తనరారు నట్టి=విస్తృతి చెందునట్టి, విప్రావలికి=బ్రాహ్మణుల సమూహము లకు, పెనుపొందిన+విస్తృతిచెందిన, ధరాదేవతలు=బ్రాహ్మణులు, సమస్తపావన=అన్నిటిని పవిత్రము చేయువాడా!, సుధీజనత+ అవన=మంచి బుద్ధి గల వారిని రక్షించు వాడా!, విశ్వభావనా= లోకములను భావించు వ డా!,

తా॥ దేవగణముల కందరకును పూజనీయులగు దేవతల వంటి వారు బ్రాహ్మణులు వారి యాత్మలకు నీవు కధానాయకు డవు అట్టి నీకు బ్రాహ్మణు లిష్ట దైవము లనుచున్నావు ఇంత కన్నా వింత పలుకు లున్నవా?

571 టీక తావక+అవతారములన్=నీ యవతారము లందు, తిరంబగు=స్థిరమగును, నిర్వికార తత్త్వమునన్=ఏ మార్పు లెరుగని యథార్థస్వరూపముతో, తనర్చు=విస్తరించునట్టి, అరయగా=పరిశీలింపగా, తత్ ఫల రూపము=దాని ఫలితముయొక్క రూపము, తత్ ప్రధాన గోప్యము=అందు ప్రధానముగా దాచి యుంచబడినది,

తా॥ ఓ విష్ణుమూర్తీ! నీనుండి యుద్భవించిన ధర్మము నీ యవతారములచే చక్కగా రక్షింపబడి స్థిరమగుచుండును నీ వీశ్వరుడవై ఆ అవతారములలో దాగియుందువు ఏ మార్పు లెరుగని యథార్థస్వరూపమైన నీవు ధర్మమునకు రక్షకుడవు నిన్నే

ధర్మమునకు ఫలితముగా కొందరు చెప్పుచుందురు, ధర్మిస్వరూప మున నవతారములలో దాగియున్న రహస్యముగా కొందరు నిన్ను కీర్తింతురు

( తాను ఏ మార్పులులేని నిజస్వరూపుడుగా శాశ్వతుడై యుండగా తననుండి గుణాదులు వెల్వడి, వాని నుండి యవతార ముల మూర్తులు వచ్చుచుండను వానియందు గుణములు ప్రవర్త నము రూపమున వెలువడుచుండను ఇట్లు వెలువడు ధర్మిస్వరూ పమే అవతారము లెత్తుటకు ప్రయోజనమని కొందరు చెప్పుదురు ఇన్నిటిలో నున్న రహస్యస్వరూపుడగు నంతర్యామిని తెలిసి కొనుటయే ప్రయోజనమని మరి కొందరు చెప్పుదురు )

572 టీక మహిన్ = భూమియందు, సమగ్ర పరి గ్రహము = సంపూర్ణమైన అనుగ్రహము, నిస్పృహమతులు = కోరికలు లేని మనస్సులు గలవారు, పాతురు = తొలగుదురు, గుణ మండన = గుణములే అలంకారములుగా గలవాడా!, అన్య సత్పరి గ్రహము = ఇతరుల యనుగ్రహము,

తా॥ లోకమున నెవరైనను నీ యనుగ్రహము పరిపూర్ణ ముగ లభించిన తోడనే కోరికలు లేనివారై మృత్యుభయము నుండి తొలగుదురు మునీశ్వరులు గూడ నీ యనుగహ్రముననే ఈ స్థితి పొందుచున్నారు అట్టి నీవు వివేకస్వరూపుడవు గుణములే అలంకారములుగా గలవాడవు నీ కీక నితరుల యనుగ్రహము వలన మహిమ గలుగుచున్నదని ఎలుకుచున్నావు ఇది వింత గాదా!

( మునీశ్వరులకు గూడ తవ యనుగ్రహమే మృత్యు భయము పోగొట్టును గాని మరియొక సాధనము లేదు అట్టి నీవు

శాస్త్ర్వాణుల యనుగ్రహమున పెద్దవాడనై తినని చెప్పుట మాయ మాటలు )

573 టీక సతతంబున్ =ఎల్లప్పుడు, అర్థార్థిజన=కోరికలు గోరువారికి, శిరోలంకార = శిరస్సునకు అలంకారములైన, పదరేణువులు = పాదముల ధూళి, జలజకింజల్క = పద్మకేసరములు, నిష్యంద మరంద=చిందుచున్న తేనె, లోభ+ఆగత= ఆశపడివచ్చిన, భ్రమర నాయకుని పగిది = గండుతుమ్మెదవలె, ధన్యజన+అర్పిత=జన్మసార్థక్యము చెందినవారిచే సమర్పింపబడిన, ఉదంచిత=మిక్కిలి యొప్పుచున్న, తులసీదామంబునకు=తులసిదండకు, నిజధామము=తన నివాసము, కృపా+అవలోకనములు= దయతో గూడిన చూపులు, అర్థిన్=కుతూహలముతో, భాగవత+అనురక్తి=భగవద్భక్తులపై ప్రేమ,

తా॥ ఎల్లప్పడును కోరికలు కలవారి శిరస్సులను అలంకరించుచున్న రేణువులకు పద్మములు నీ పాదములు ఆ పద్మకేసరములనుండి చిందుచున్న తేనెపై లోభము గలిగి ఆకర్షింపబడి వచ్చిన గండు తుమ్మెద వంటివారు నీ భక్తులు అట్టి సార్థక జన్మలర్పించిన తులసిమాలకు సహజ నివాసములైన నీ పాదారవిందము లున్నవి వానిని భక్తితో సేవించుచుండి నీ కరుణా కటాక్షములను పొందువారు భాగవత జనులు వారి యనురాగము వలన నీ మహిమ నిలబడియున్నదని చెప్పుచున్నావు ఇది మిక్కిలి చిత్రము.

574 టీక చిరభాగ్యోదయ=చిరకాలము మహిమలను పుట్టించువాడా!, లలిత శ్రీవత్స లక్ష్మాంగ = అందమైన శ్రీవత్స మనబడు పుట్టుమచ్చగల దేహము ధరించినవాడా!, వర =శ్రేష్ఠ

మైన, విప్ర+అనుపద=బ్రాహ్మణుల పాదములను ననుసరించియే, ఏకపుణ్యరజము=ఒకే పుణ్యము వలన కలిగిన పాదరేణువు

తా॥ తరుగని భాగ్యములను లోకముల కిచ్చుటకై శ్రీవత్సమను పుట్టుమచ్చతో కూడిన శుభమైన రూపమును ధరించి యున్నావు అట్టి నీవు బ్రాహ్మణుల పాదములయందు పుట్టిన పుణ్య రేణువులే నీ దేహము నలంకరించుటకు ఆభరణము లనుచున్నావు లోకు లందరికిని బ్రాహ్మణుల మహిమను తెలియజెప్పుటకై నీ విట్లు ధరించితివి అంతేకాని నిజముగా నీవు బ్రాహ్మణ పాద రేణువులను ధరించు టావశ్యము కాదు

575, 576 టీక అవిరళ=దట్టముగా, వేద+ఉక్తము= వేదమునందు చెప్పబడినది, అసత్+మార్గము = చెడ్డమార్గము, సత్త్వగుణ విశిష్టుండు=సత్త్వగుణముచే ప్రశ్యేకత చెందినవాడు, ధర్మవిఘాతులన్ = ధర్మమునకు హానిచేయువారిని, నిగమధర్మ మార్గ=వేదధర్మపు దారులు, నాశకవిధములు=నశింపచేయు విధానము, యుక్తమగుచుండు=తగినవి అగుచుండును,

తా॥ ధర్మ స్వరూపుడవు, సృష్టికర్తవగు నీవు రక్షింపదగిన వారిని రక్షింపనిచో వేదములందు చెప్పబడు ధర్మ మార్గము అప మార్గము పట్టును కనుక నీవు సత్త్వ గుణము చేత ప్రత్యేక లక్షణ ములు కలవాడవై జీవుల క్షేమమును కనిపెట్టి యుండి నీ శక్తితో ధర్మ వ్యతిరేకులను దండించుచుందువు అట్టి నీకు వేద ధర్మ మార్గ ములు చెబ్బతిను విధములు మనసునకు నచ్చవు బ్రాహ్మణుల యందు దయతో నీ విట్లు వినయ వాక్యములు పలుకుట యుక్త ముగా నున్నది

( సృష్టిని సత్త్వ గుణమున నిలుపుటచే వేద ధర్మము

రక్షింప బడును కనుక దానికొరకు నీవు బ్రాహ్మణులను సృష్టించి తివి అట్టి బ్రాహ్మణుల మగు మేము తప్పు చేసితిమి అయినను మమ్ము నీవు గౌరవించుట సృష్టిలోని సంప్రదాయము చెడిపోకుండ చూచుటకే గాని మేమంత గొప్పవార మని యర్థము కాదు నీవు పలికిన వినయ వాక్యములు సృష్టిని స్థితి చెడకుండ కాపాడుటకే కనుక చాల యుక్తములై యున్నవి )

577, 578, టీక - ప్రాభవహాని = గొప్పదనము తక్కు వగుట, అధికార శక్తి తగ్గుట, విశ్వనిధివి=లోకమునకు నివాస మైన వాడవు, కడఁగి=పూని,

తా ॥ ఇతరులను పెద్ద చేసి నిన్ను గూర్చి నీవు వినయముగా పలికితివి అట్లు చేయుట వలన నీ అధికార శక్తికి లోపము కల్గు నని చెప్పుటకు గూడ విలు లేదు లోకములను సృష్టించిన వాడవు నీవే, అందు జీవులుగా నున్న వాడవు నీవే, రక్షించు నట్టి రూపములు ధరించు వాడవు కూడ నీకే మైనపుడు ప్రభుత్వము నకు లోపము కలుగునని భయము కూడ లేదు ఇట్లు వినయము చూపుట నీ కొక క్రీడ మాత్రమే

( పరిపాలించువాడు, పరిపాలింపబడువాడు, అధికారి, రక్ష కుడు, ప్రజలు వేరువేరుగా నున్నచో పై యధికారి క్రింది వాని యందు వినయము చూపించినచో క్రిందివానికి అలుసుగా నుండు ననియో, పొగరెక్కి మాట వినడనియో సందేహించుటకు తావున్నది అది జీవుల పరస్పరత్వమునందు సాధ్యము కావచ్చును ఇందరిలో నంతర్యామిగా నున్నవాడు ఎట్లు పలికినను నష్టము లేదు పొగరుగా పలికినను కాదన గలవాడు లేడు వినయముగా పలికినను అవకాశము తీసికొన గలవాడు లేడు అయినచో నారాయణుడు వినయముగనే పలుకుట యేల ? పొగరుగా

కూడ పలుకవచ్చును కదా! అను సందేహము కలుగవచ్చును వినయ మనగని లక్షణ మగుటయే దీనికి కారణము [illegible] యము చూపుట యితని కొక క్రీడ కనుకనే వాని వ్యాఖ్యాపించు వారు వినయ మభ్యసింపవలె నను నియమము కలుగుచున్నది।

579 టీక సజ్జన పరిగ్రహార్థము = మంచివారి ననుగ్రహించుటకొరకు,

తా॥ మునులమైన మమ్ము నీవు సంతోషముతో నెందులకు సత్కరించితివో గ్రహించితిమి అది మా గొప్పతనము కాదు నీవు సజ్జనులను అనుగ్రహింతు వని లోకము తెలిసికొనుటకే యిట్లు చేసితివి ఈ సందర్భమున మాదొక మనవి యున్నది

(తాము త్వరపడి జయ విజయులను శపించినను తమ్మాతడు గౌరవించెను మంచివారొక తప్పుచేసినను, క్షమించి గౌరవించుట దేవుని మార్గమని లోకమునకు తెలియజేయుటకై అతడిటు చేసెను మరియు జయవిజయులను తానే స్వతంత్రించి అనుగ్రహించినచో లోకుల దృష్టిలో సనకసనందనాదులపై గౌరవము తగ్గవచ్చును. అట్లు కాకుండ వారిచేతనే జయవిజయుల ననుగ్రహింప జేసినచో అందరి స్థానములను గౌరవించి నట్లగును ఇట్లు ఎవరి గౌరవము చెడకుండ ధర్మము నిలబెట్టుటయే నిజమైన ప్రభుత్వ లక్షణము దానివలననే ఏ ప్రభుత్వమైన సృష్టివలె క్రమము తప్పక నడచును. అట్లుగాక కొందరి నవమానించుట, కొందరిని అభిమానించి వ[illegible]ములు పుట్టించుట చేసినచో నరుని ప్రభుత్వమువలె చిక్కులు పడవలసి వచ్చుచుండును)

580 టీక ఏము = మేము , బెడిదము = కఠినము , సగుధిక (శ్రీ) = మిక్కిలి అధికమైన సంపద, తనర్పన్ = విస్తరింప చేయగా, ఈశ ! = పరిపాలకుడా !

తా॥ మేము కోపించి జయవిజయులను శపించితిమి మేము చేసినది తప్పే మే మిచ్చిన శాపము కఠినమైనది నీవు మమ్మంతి కన్న కఠినముగా శాసింపవలసినచో శాసించి శిక్షింపుము దానికి మేము బాధపడము లేదా ఈ జయవిజయులకు మహాసంపద కల్గించి, అభివృద్ధి నిచ్చుట నీ యభీష్టమైనచో తప్పక చేయుము దానికిని మేము సంతోషించెదము

( ఇట్టి సందర్భమున మాయందు నీవు మధురోక్తులు పలికి యిట్లు గూఢమైన యర్థములతో మాటాడవలసిన ఆవశ్యకత లేదు సూటిగా మమ్ము శిక్షించినను వారిని మా శాపమునుండి తప్పించి రక్షించినను, మాకు సంతోషమే యని సనకాదుల యుద్దేశ్యము కాని సనకాదులు చేసిన తప్పును గ్రహించి బాగుపడి పరిపూర్ణు లగుటయే దైవసంకల్పముగాని వారిని తాను నియమించిన పనిలో మరల తాను జోక్యము కలిగించుకొని వారి ప్రాభవమునకు భంగము కలిగించుట సృష్టి పరిపాలనకు తగిన మార్గము కాదు )

581 టీక అనపరాధులు = తప్పుచేయనివారు , అతి నిర్మల + అంతఃకరణులు = మిక్కిలి స్వచ్ఛమైన మనస్సులు కలవారు , అనృతంబులు = అసందర్భములైన మాటలు, చిత్తంబు కొలది = మనస్సున కిష్టమైనట్లు

తా ॥ నీ విట్లు మమ్ము శపించినను, వారి ననుగ్రహించినను మా కిష్టమే తప్పు చేయనివారు, నిర్మల హృదయములు కల వారు నగు జయ విజయుల విషయమున మేము చేసినది అసంబద్ధ ప్రలాపమైనచో నీ యిష్టము వచ్చినట్లు మమ్ము శాసింపుము

అని చేతులు మోడ్చి ప్రార్థించుచున్న సనక సనందాదు లను దయార్ద్ర దృష్టితో చూచి విష్ణుదేవు డిట్లనెను

582 టీక అనపుడు=పుణ్యాత్ములు ..... మున నోవ్వారుచు, అసుర యోనిన్ = రాక్షస గర్భ ..... లోభ మోహ సంగతులు=లోభము ..... మోహము ..... వారు,

తా॥ ఓ సనక సనందనాది మునులారా! మీర ..... నకు తగినట్లు భూమికి పోయి, అచ్చట రాక్షస గర్భముల జన్మించి, లోభ మోహాదులతో గూడి జీవింతురు

(సందర్భమునకు తగినట్లు అనగా వారు మిమ్ము ద్వారముల దగ్గిర కనుక నిట్లు జరుగవలయు నని యొక భావము మీరు సాధుమూర్తు లయ్యు నిష్కారణముగా శపించిరి గనుక వీరు సాధు మూర్తులను హింసించు వారుగా పుట్టి, మిమ్ము, మా పరివారమును కొంత కాలము హింసించుట కర్మ సిద్ధాంతము ..... ఈ సందర్భమునకు తగియున్న దని మరియొక భావము )

583 టీక దేవ జనావలికి = దేవతలకు, దేవతా లక్షణములు కల జీవులకు, ఉపహతి =ఆపద, నిఖిల ..... వృత్తిన్ = సమస్త జీవులను బాధ పెట్టునట్టి ప్రవర్తనమున సం భావిత=పాటింప బడిన, వైర+అనుబంధ భావులు=వైరముతో సంబంధించిన భావములు కలవారు,

తా॥ ఈ జయ విజయులు దేవతలకును దివ్య లక్షణము లు గల వారికిని ఉపద్రవములు కలిగించుచు సమస్త జీవులకు భాధా కరముగా ప్రవర్తింతురు నా యందు వైరమును పెంచుకొని అది తరుగకుండ పాటించుచుందురు.

584 టీక ఇవానముఖంబుగన్ = యుద్ధ మార్గమున, ఎదిరి = ఎదుర్కొని చక్రనిశితధారా + హతిన్ = చక్రాయుధము యొక్క వాడియైన అంచు దెబ్బతగిలి,

తా॥ వీరు నన్ను యుద్ధమున నెదిరించి మిక్కిలి సాహసముతో పోరాడుదురు. వాడియైన నా చక్రాయుధము దెబ్బకు తెగి, మరల నుత్సాహముతో నా సన్నిధికి చేరుకొందురు

585, 586 టీక మత్ + ఆననము = నా ముఖమును, ఈక్షించుచున్ = చూచుచు, ఈల్గుటన్ = చచ్చుట వలన, అనఘాత్మకులు = పాపము లేని ఆత్మలై, అస్మత్ ఎదవిన్ = నా స్థితియందు,

తా॥ విరోధముతో నైనను వీరు నన్నే మనస్సున తలచుచుండుట వలనను, నా ముఖము చూచుచు నా సాన్నిధ్యమున చనిపోవుట వలనను పాప మంటని వారై నా స్థితిని జేరుకొందురు

( దైవాంశలు జీవులుగా దిగి వచ్చినపుడు భూమి యందలి దేహముల ప్రకృతి వలన కామ క్రోధాది రాక్షస శక్తులు క్రమ్ముకొనుట చేతనే నొకరినొకరు ద్వేషించు కొందురు అయినను, ద్వేషము వలన నొకరి నొకరు తలచుకొనుట దృఢ మగును వారిలో నంతర్యామిగా నున్నవాడు భగవంతుడే కనుక ఈ ద్వేషాదులు వానియందే సమర్పింపబడును. కర్మ ఫలములు, దోషాదులు, మనస్సునను, ఇంద్రియముల యందును వర్తించినను, జీవులకు వర్తింపవు వారి ప్రవర్తనము ననుసరించు కాల చక్రము వెంట ఫలితముల రూపమున నాపదలు చెందినను, చనిపోయిన వెనుక మనస్సు, నిందిృయములు లేవు గనుక వారు దైవ స్థితిని చేరుకొందురు ఎవ్వరే పాపములు చేసి దుష్టత్వము ప్రవర్తింప

చేసినను శుభుడు భగవంతుని సాన్నిధ్యము చేరకుండుట స్వభవము కాదని ఈ యితిహాసముయొక్క పరమార్థముల గో నాశకః )

587 టీక ఇలమీదన్ = భూమిపైన, పుట్టువులేదు= జన్మము లేదు

తా॥ నేనును వీరినిగూర్చి మీరు చెప్పిన విధముననే నా మనసున భావించుచున్నాను గనుక ఈ జయవిజయులకు నీ మూడు జన్మలను మించి వేరుగా నిక పైన మీపై జన్మము కలుగదు

( భూమిపై జన్మింప వలెనన్న చో త్రిగుణములు పంచభూతములు, ప్రకృతి గుణములు కామక్రోధాదులు పట్టకొనను దైవానుగ్రహము పొందుట వలన జయవిజయులకు రాబోవు రాక్షస జన్మలు తప్ప మరి వేరుగా జన్మలుండవు నీని యభిప్రాయ మేమనగా దైవాంశలు జవులుగా భూమికి దిగి వచ్చిన అయినను వారికి జన్మ లుండవు దేహము, మనస్సు, ఇంద్రియములు కామ క్రోధములను వానియందే జనన మరణములు వచ్చినను వానికి పై నున్న దైవాంశ మెచ్చట నున్నను దానికి జన్మలు లేవు

" మీరు చెప్పినట్లె నేను వీరిని గూర్చి భావించు చున్నాను కనుక వీరికి జన్మ లుండవు అని విష్ణువు పలుకుటలో నర్థ మేమనగా సనకాదులు జయవిజయులను దయచూడు మని విష్ణువుతో పలికిరి కనుక తాను జయవిజయుల ననుగ్రహించితి నని చెప్పుచున్నాడు ఇచ్చట సనకాదులకు సద్బుద్ధి కలుగుటయే ముఖ్యము గనుక వారిచేతనే జయవిజయుల యందు సత్సంకల్పము ప్రసరింప జేయుచున్నాడు )

588 టీక సుధీజన పుంగవులు = మంచి బుద్ధిమంతు

లలో శ్రేష్ఠులు, నలినాసనాత్మజులు = బ్రహ్మదేవుని పుత్రులు (సనక సనందనాదులు), అనంతుని భావము = విష్ణుమూర్తి అభిప్రాయము, పెంపూనిన వేడ్క = విస్తారత చెందిన యుత్సాహము, నుతించిరి = స్తోత్రము చేసిరి, అంభోనిధి శాయిన్ = సముద్రమున శయనించిన వానిని, ఆర్తజన పోషణ భూషణున్ = బాధ చెందిన వారిని పోషించు వారి కలంకారమైన వానిని, పాప శోషణున్ = పాపములను శుష్కింప జేసినవానిని

తా॥ నేను మీ మాట చెప్పిన వీరి ననుగ్రహించు చున్నాను. గనుక దు ఖపడకురని విష్ణువు పలుకగా, సనకాదులు వాని భావము గ్రహించి సంతోషించిరి జ్ఞానోదయమైన మన సుతో విష్ణుమూర్తిని స్తోత్రము చేసిరి

(బాధ గలిగిన వారిని పోషించు వారి కలంకారమని వారు విష్ణువును స్తుతించిరి బాధ గలిగిన వారు జయవిజయులు వారి ననుగ్రహించి క్షమింపుమని కోరిన వారు సనకసనందనాదులు వారికి భూషణమైన వాడు విష్ణుమూర్తి )

589 టీక సనలోత్తన్ = పువ్వులు మొగ్గ తొడుగగా, బాష్పధారా సుధగాత్రులు = ఆనందబాష్ప ధారలతో సౌభాగ్యము చెందిన కన్నులు గలవారు, ముని శరణ్య వరేణ్యుల్ = మునులకు శరణాగతులైన వారిలో శ్రేష్ఠుని, అగణ్యుల్ = ఇంత వాడని లెక్కించుటకు వీలులేని వాని, దేవతాగ్రసరు = దేవతలకు ముందు నడచు వాని యొక్క, చారు తదీయ ధామమున్ = అతని మనోహరమైన నివాసమును ( వైకుంఠమును ) భాసుర లీలన్ = వెలుగొందునట్లుగా, పద్మ దళాక్షునకున్ = తమ్మి రేకులవంటి కన్నులు గలవానికి (విష్ణువునకు), వినమ్రులై = మిక్కిలి వినయభావము గలవారై వంగి,

తా॥ ఆ విష్ణుమూర్తి పలుకులకు సనక సనందనాదుల దేహములు పులకరించినవి మొగ్గ తొడిగినట్లు గగుర్పాటు గలిగెను ఆనంద బాష్పములు కన్నుల నలంకరించెను విష్ణువు గా నట్టివాడో తెలిసెను మునులకు శరణమిచ్చు వారిలో న[illegible]మించిన వాడో బోధపడెను అతని దివ్యమంగళ శరీర [illegible] పొడకట్టెను అతని నివాసమన్న వైకుంఠము పద్ధతి యేమో విశద పడెను వారు అతనికి వంగి నమస్కరించిరి

(సనకాదులు మునులు గదా యని విష్ణువు అభిమానింప లేదు జయ విజయులు తనవారు గదా యని ఋషుల మాట తిరస్కరింప లేదు అట్లని మొగమోటముతో వారిని గౌరవింప లేదు తప్పు చేసిన వారిని విడిచి పెట్టలేదు వారి చేతనే స[illegible]ముగా జయ విజయులపై దయ జూపించునట్లు చేసి, సనకాదులను సత్ప్రవర్తనకు మార్చి వారికిని రక్షకుడయ్యెను కనుకనే జగ[illegible]డైన మునిశరణ్యావరేణ్యుడు

అతని దివ్యమంగళ శరీరము నుండి మృదువైన సద్గుణాలు వెలువడును వానియందే మొదలింపు లుండును వానియదే పాపము తొలగించుట యుండును వాని వైకుంఠము నందు తప్పు చేసిన వారికిని, చేయని వారికిని పరిశుద్ధి, రక్షణము నిమిడి యున్నవి సనకాదులును, జయ విజయులును గూడ వాని వైకుంఠము లోని వారే అంతే కాదు భూలోకమందు రాక్షస స్వభావములు గల జీవులును తనలోని వారుగనే యుండి జనన మరణాదుల వృత్తాంతములతో పరిశుద్ధులై తన్నే చేరుకొనుచున్నారు అట్టి జంగమవై కుంఠము పడని భగవంతుని సృష్టి లేక వైకుంఠము దాని పరిపూర్ణతకు సనకాదు లాశ్చర్యపడి వినయము నేర్చుకొనిరి )

590, 591 టీక కమలోదరు = విష్ణుమూర్తి యొక్క,

నైద్యుయోగన్ = స్నేహ భావమున, వైష్ణవ లక్ష్మిన్ = విష్ణుని సం పద యైన లక్ష్మీదేవిని, ప్రమదంబునన్ = సంతోషముతో, ప్రస్తుతించి=స్తోత్రము చేసి, ఆమంత్రితులై=హెచ్చరిక చేయ బడిన వారై, నిజధామములకు=తమ నివాసములకు, తడయక = ఆల స్యము చేయక, లక్ష్మీకాముడు = విష్ణుమూర్తి, అభిరామంబు గన్ =తగిన విధముగ, రయమొప్పారన్ = వేగముతో,

తా॥ ఆ సనకాదులు తా మింతవరకు పలికిన పలుకు లన్నియు విష్ణుమూర్తియే తమలో నుండి పలికినట్లు గ్రహించిరి (ఈ వృత్తాంత మంతయు లీలార్థమై విష్ణుచే కల్పింప బడినదని గ్రహించిరి ) అట్టి విష్ణుని సమస్త సంపద యొక్క రూపమే లక్ష్మీ దేవి యని గ్రహించిరి వా రిరువురను సంతోషముతో స్తుతించి విష్ణు యాజ్ఞగొని వెంటనే తమ నివాసములకు బోయిరి విష్ణువు తక్షణమే జయవిజయులతో నిట్లనెను

592 టీక అసురయోని యందు = రాక్షస గర్భము నందు, అనివారితులై = వారించుటకు వీలులేని వారై, దుర్వార బలాఢ్యుడన్ = వారింపరాని బలముచే నధికుడను, విప్రవచనములు = బ్రాహ్మణుల పలుకులు

తా॥ మీరు రాక్షస గర్భమున జన్మించుట నుండి తప్పించు కొనలేరు నేను వారింపరాని బలము కలవాడ నయ్యును బ్రాహ్మణుల కిట్టి యధికారము నిచ్చితిని కనుక వారి శాపమును వారించుటకు సమర్థుడనుగాను

593 టీక దనుజయోనిన్ = రాక్షస గర్భమున, మత్ + విపక్షులరై = నాకు శత్రుపక్షము వారై, ఇటకున్= ఇచ్చటకు,

తా॥ కనుక మీరు రాక్షస గర్భమున పుట్టి నా శత్రు పక్షము వారై ఎల్లప్పుడును నన్నే దలచుచుండుడు నా చేతనే చనిపోయి, నా దగ్గరకే రాగలరు (ఇచ్చట శత్రుపక్షము వహించుట ద్వేషముతో మరువక తన్నే తలచుచుండుటకు విష్ణువు చేతిలో చచ్చిన వెనుక తన దగ్గరకె రాగల రనగా వారికి చనిపోవుట ఉండదు మృత్యువు జీవులకు సాధన కొరకై లీలార్థము కల్పింపబడినదే గాని సత్యము కాదని యర్థము)

594 టీక ఫుల్ల సరోరుహ పత్ర నేత్రుఁడు=విచ్చిన పద్మ పత్రముల వంటి కన్నులు కలవాడు, అఖండల ముఖ్య = ఇంద్రుడు మొదలైన, దిగ్వర నికాయ=దిక్పతుల సమూహాముల యొక్క, కిరీటలసత్=కిరీటములందు వెలుగుచున్న, మణి ప్రభా= మణులకాంతులచే, మండిత పాదపీఠుఁడు=అలంకరింపబడిన పాద పీఠము గలవాడు, రమా రమణీమణి = లక్ష్మీదేవి, వెంగుడేన్ = రాగా, నిజ = తనయొక్క, నిర్మల = స్వచ్ఛమైన, పుణ్యనివాస భూమికిన్ = పుణ్యములుండు ప్రదేశమునకు,

తా॥ జయవిజయులను పోయి రండని పంపి ఇంద్రాది దిక్పాలకుల కిరీటముల మణికాంతులతో వెలుగుచున్న పాద పీఠము గల వాడై (ఇంద్రాదులచే నమస్కారము లందిన వాడై) లక్ష్మీ దేవితో కూడి పుణ్యములకు నివాసమైన తన వైకుంఠమునకు వచ్చెను

595 596 టీక నిజతేజోహానిగన్ = తమ తేజస్సు తొలగిపోవునట్లుగా, ధరన్ = భూమిపై, విహ్వలు లగుచున్ = మొత్తుకొనుచు, త్రిజగములు = మూడు లోకములు, అ సు ర విమానవ్రజముల = రాక్షసుల విమాన సమూహములందు (త్రిజగములన్ + సురవిమాన వ్రజములన్ = మూడు లోకముల

యందలి దేవతా విమాన సమూహములతో), క్రిందుగన్ = గుమిగూడి, చెలఁగిన్ = చెలరేగగా,

తా॥ అపుడు జయవిజయులు తమ తేజస్సులను కోల్పోయి, భూమిపై గూలిరి మూడు లోకములందలి రాక్షసుల గుంపులు హాహాకారములు చేసి మిక్కిలి మొత్తుకొనిరి (విష్ణు లోక ము లో ని యంశలు రాక్షస గణములలో చేరుట వలన రాక్షస సంహార మగు నని వారు దిగులుపడి మొత్తుకొనిరి) మూడు లోకముల యందలి దేవత సమూహములును గూడ హాహారావములు చేసిరి (విష్ణు లోకము వ రు రాక్షస జన్మలెత్తు చున్నారు గనుక తమ దేవలోక ములపై దండెత్తి చావగొట్టుదురని భయపడిరి)

597 టీక దితిగర్భాగారంబునన్ = దితిగర్భ మను గృహమున, తదీయ = వారియొక్క, ఉదార ఘన తేజము = పై కప్పుకు చున్న గొప్ప తేజస్సు (మేఘముల నలుపు వంటి చీకటి యైన తేజస్సు), వమ్ముగన్ = వ్యర్థమగునట్లుగా,

తా॥ ఆ జయవిజయులే దితి గర్భమున పెరుగుచున్నారు వారి భయంకరమైన నల్లని తేజస్సు బయలుదేరి ఇపుడు మీ తేజస్సును పని చేయకుండ చేసినది

598 టీక రమా + ఈశ్వరుఁడు = లక్ష్మీపతి, అర్థిన్ = కోరికతో, సర్వభూతభవ = సమస్త జీవుల పుట్టుక, వృద్ధివినాశన = పెరుగుట, నశించుట, హేతు భూతుండు = కారణమైనవాడు, ఆది + అంత వికారశూన్యుఁడు = మొదలు, చివర యున్నగు మార్పులు లేనివాడు, దయానిధి = దయకు నివాసము, చింత దొఱంగ = దుఃఖము విడిచి, వేచనుఁగు = వేగముగా పొందు, మనోరథ + అర్థముల్ = మనస్సున కోరిన ప్రయోజనములు,

తా॥ ఇంతకును మూల మూ విష్ణు మూర్తి చేయు సక్ల వింతలే సర్వజవులకును జననము, వృద్ధి నాశము కలిగించు వాడును, మొదలు చివరయను మార్పులు లేనివాడును అగు విష్ణు మూర్తి దయామయుడు అతడు మీకు మేలే కలిగించును దు ఖము మాని మీ నివాసములకు పొందు మీ కోరిన ప్రయోజనము లన్నియు సిద్ధించును

( సర్వ జీవులకును సృష్టి, స్థితి లయములు కలుగును గనుక దేవతలు భయపడి బాధము వేదు తెల్లని వెలుగునకు, నల్లని వెలుగునకును నడుమ విష్ణువు కల్పించిన లీల వలననే ఇన్ని వింతలు జరుగుచున్నవి కనుక దేవతలకు రాక్షసులకు నొకొక్కరికి మాకు అభివృద్ధియు, నొక్కొక్క మారు పరాజయము తప్పవు అయినను దేవతలు కోరునది స్వర్గ రాజ్యమే గనుక రాక్షస సంహారము వలన మరల నది సిద్ధించును )

599 టీక వనజాసనుడు = బ్రహ్మ, తద్+వృత్తాంతము = ఆ కథ, విబుధులు = దేవతలు, నాకంబునకు = స్వర్గమునకు, నిజనాథుని = తన భర్తయొక్క, అపరితోషము= సంతోషము లేకుండుట,

తా॥ ఇట్లు బ్రహ్మ పలికిన పలుకులు విని ఆ జయవిజయుల వృత్తాంతమును తెలిసికొని దేవతలు స్వర్గమునకు పోయిరి కశ్యపుడు చెప్పిన మాటలను దలచి దితి సంతోషము లేని మనసుతో నుండెను

600 టీక కారింతురు = బాధ పెట్టుదురు, వత్సర శతంబు = నూరు సంవత్సరములు, అఖిల లోక + ఏక కంటకులు = లోకములు మొత్తముల కొకటిగా బాధ గలిగించు వారు,

తా॥ తనకు పుట్టిన బిడ్డలు దేవతలను బాధలపాలు చేయుదురని తలచి దితి దుఃఖించుచుండగా నూరు సంవత్సరములు నిండెను అప్పుడు గర్భము పూర్ణమై లోకము లన్నింటిని బాధ పెట్టు పుత్రులిద్దరిని గనెను

601, 602 టీక ధరణి కంపించెన్ = భూకంపము పుట్టెను, కుల పర్వతములు=ఏడు ప్రధానమైన పర్వతములు, జలధులు = సముద్రములు, కలంగెన్ = కలతపడెను, తారక + ఆవళులు=తారకల వరుసలు, డుల్లెన్ = రాలెను, గగన మగలెను = ఆకాశము బ్రద్దలయ్యెను, దిక్ + కరులు= దిగ్గజములు, మొ్రగ్గెన్ = తిరుగబడెను, మిణుంగురులు = నిప్పురవ్వలు, పుడమిన్ = భూమిపై,

తా॥ దితి పుత్రులు జన్మించిన సమయమున భూకంపము కలిగెను సప్త కులపర్వతములు వణకెను సముద్రములు పొంగి కలతపడెను మింటి నుండి చుక్కలు రాలెను ఆకాశము బీట లిచ్చెను దిగ్గజములు తిరుగబడెను దిక్కులలో నిప్పురవ్వలు రాలెను భూమిపై పిడుగులు పడెను (కులపర్వతములు మహేంద్ర గిరి, మలయము, సహ్యము, శుక్తి మంతము, ఋక్ష వంతము, వింధ్య, పారియాత్రము )

603 టీక హోమ + అనలంబులన్ = హోమగుండ ములలోని యగ్నులయందు, ధూమంబులు + అడరెన్ = పొగ లెక్కు వయ్యెను, ప్రతికూల వాయువుల్ = జీవులను బాధపెట్టు గాలులు, బలసి = మిక్కుటమై, తరువులు = చెట్లు, విటతా టంబులై = అడ్డదిడ్డముగా, గ్రహతారక + ఆవళి = గ్రహ ముల, తారకల వరుసలు, కాంతిమాసెన్ = ప్రకాశము మరుగు పడెను, చెరసి = అతిశయించి, మొగిల్లు = మబ్బులు, మెఱుం

గులు = మెరపులు, స్వర్భాను = రాహువు, ఉపప్లవము నన్ = పర్వదినము కాని సమయమున, భానుడు = సూర్యుని మొనసి = గుమ్మిగూడి, మోరలు = మెడలు, ...ములు = పక్షులు ఆర్తరవములు = బాధను సూచించు శబ్దములు

తా॥ హోమాగ్నులయందు పొగలు అధికమయ్యెను. జీవులను బాధపెట్టు విధానమైన గాలులు విజృంభించి వీచెను. వృక్షములు దారులందు దడ్డదిడ్డముగా కూలెను. గ్రహముల తారకల గుంపులు తేజస్సును గోల్పోయెను. మబ్బులు విపరీత విధముగా రక్తవర్షము కురిసెను. మెరపులు దిక్కులను మిరుమిట్లు గొల్పెను. అమావాస్య దినము కానినాడు రాహువు సూర్యుని గ్రహణము పట్టెను. పగలంతయు చీకటి యయ్యెను. కుక్కలు గుంపులు గూడి మెడలెత్తి మొరిగెను. పగలే నక్కకూతలు వినిపించెను. పక్షులు బాధ పడుచున్న కూతలు పెట్టెను. దేవతల ప్రతిమలు కన్నీటితో నేలపై కొరగెను.

(1 ఇవన్నియు నుత్పాత లక్షణములు. లోకములను బాధపెట్టువారు పుట్టినప్పుడు కాని, లోకముల కేదో కీడు కలుగునపుడు కాని కనిపించును.

2 పర్వమనగా పూర్ణిమ, అమావాస్య. పూర్ణిమనాడు చంద్రగ్రహణము జరుగును. అమావాస్యనాడు సూర్యగ్రహణము కలుగును. అమావాస్య రాకయే సూర్యగ్రహణము కలుగుట ఉత్పాత లక్షణము. భారతయుద్ధమునకు ముందట్లు కలిగెను. ఇది యెట్లు కలుగుననగా త్రయోదశినాడు చతుర్దశి అమావాస్య కూడ వర్తించును. అనగా నొక సూర్యోదయము నుండి మరియొక సూర్యోదయము లోపున మూడు తిథులు జరుగును. ఇది

అరుదుగా వచ్చును ఇది రాహువు ఉన్న తావుననే అమావాస్య నాడు వర్తించును గనుక సూర్య గ్రహణము వచ్చును )

604 టీక మొదవులు = ఆవులు గార్దభరవంబు = గాడిదల శబ్దము, భీమణమయ్యెన్ = భయంకరముగ వినిపించెను ఉడిగెన్ = తగ్గిపోయెను, కరులకటములన్ = ఏనుగుల చెక్కిళ్ళ యందు, పొదివెన్ = అంటుకొనెను, తురంగముల వాలములన్ = గుర్రముల తోకలందు, ఒగిన్ = వరుసగా,

తా॥ ఆవుల పొదుగులలో చీము నెత్తురు కురిసెను గాడిదలు సహజముగ గాక భయంకరముగా కూసెను ఏనుగుల చెక్కిళ్ళయందు మద మారిపోయెను గుర్రముల తోకలకు నిప్పంటుకొనెను

605 టీక రొదలిచ్చెన్ = శబ్దములు చేసెను, పాప గ్రహ మిత్రతన్ = పాపగ్రహములతో మైత్రికలిగి, సౌమ్య గ్రహములు = శుభగ్రహములు, వక్రగతులును = వెనుకకు పోవుచున్నట్లు కనిపించు గమనములతో, దుస్సహ = సహింప రాని, కేజన్ = వెలుగులగల, దితితనూజ = దితిబిడ్డలు, సంభవ వేళన్ = పుట్టిన సమయమున

తా॥ దితి బిడ్డలిద్దరు జన్మించు సమయమున గుహలలో రొద వినిపించెను శుభగ్రహములు పాపగ్రహములతో కలిసి వక్రించెను

(జ్యోతిశ్శాస్త్రమున సూర్యుడు, అంగారకుడు, శని, రాహువు, పాపగ్రహము లనబడును వారితో కలిసిన బుధుడును పాపగ్రహామే గురుశుక్రులు శుభగ్రహము లనబడును వారితో

కలిసిన బుధుడు శుభగ్రహమే పాపగ్రహములు శుభగ్రహములు కలిసినపుడు పుట్టినవాడు మంచిచెడు లక్షణములు కలగలుపుగా కలవాడగును వక్రగతి అనగా గ్రహములు వెనుకకు నడచుచున్నట్లు కనిపించుట అది గ్రహముయొక్క వేగమునకును భూమియొక్క వేగమునకును గల భేదముచే కనిపించును పాపగ్రహములతో కలిసి శుభగ్రహములు వక్రించినచో చాల చెడ్డ లక్షణము అపుడు జన్మించిన వారు ఇతరులను హింసించువారగుదురు )

606 టీక భయదప్రక్రియన్ = భయము కల్గు విధమున, మహా+ఉత్పాతంబులు = గొప్ప అశుభ సూచకములు సంక్షయ కాలంబు = ప్రళయకాలము, సాధుహింసన = మంచి వారిని చంపునట్టి, ఉగ్రక్రూర = భయంకరులై క్రూరులైన దేవత+అహిత+ఉదయ+సంక్షోభము = దేవతలకు కీడు కలిగించు వారు పుట్టునపుడు కలుగు కల్లోలము, ప్రాణివ్రాతముల్ = జీవుల సమూహములు, బుధేంద్రోత్తమా = జ్ఞానులలో శ్రేష్ఠమైన వాడా!

తా॥ ఇట్లు భయంకరముగా కనిపించిన మహోత్పాతములను చూచి దేవతలకు కీడుచేయు క్రూరస్వభావులు పుట్టినట్టి సమయమున జరుగు కలవరమని తెలియక జీవులందరు ప్రళయ కాలము వచ్చినదని భయపడిరి సనక సనందనాది యోగిజనులు మాత్రము సత్యమును గమనించిరి

(తాము జయవిజయుల కిచ్చిన శాపమును దాని పరిణామమును తెలిసినవారు గనుక సనకాదులు దితికి కొడుకులు పుట్టిరని గ్రహించిరి )

607, 608 కులశైల+ఆభ = కుల పర్వతములవంటి, తనరన్ = వ్యాపింపగా, రక్షోనాధులు = రాక్షసాధిపతులు, అతి + ఉగ్ర + దోర్బలము = మిక్కిలి భయంకరమైన బాహుబలము, పదఘట్టనన్ = కాలితన్నుచే, ధర చలింపన్=భూమి యదురగా, రత్న కేయూర = మణులు తాపిన బాహుపురులు కాంచీ = మొలనూలు, కటక = మురుగులు, అంగుళీయక = ఉంగరములు, స్వర్ణమంజీర=బంగారు గజ్జెటందెలు, తులకింపన్= ప్రకాశింపగా, ఆత్మరుచిచేన్=తమ ప్రకాశముతో, మందీకృత+అర్కాంశులు = మందగించిన సూర్యకిరణములు గలవారు

తా॥ పుట్టిన రాక్షస కుమారులు కులపర్వతముల వంటి కఠినమైన దేహములతో భయంకరమైన బలిష్ఠత గలిగియుండిరి వారు పాదములతో నేల తన్నుచుండగా భూమి యదరుచున్నది వారి కలంకరింపబడిన రత్నముల బాహుపురులు, కుండలములు, మొలనూళ్ళు మురుగులు, ఉంగరములు, కిరీటములు, బంగరు టందెలు తళుకించుచుండెను వారి తేజస్సుతో సూర్యకిరణములు మరుగుపడిన ట్లుండెను

609 నిజతనూభవులన్=తన పుత్రులను, మందిరంబునకున్ = ఇంటికి

తా॥ ఇట్లు జన్మించి పెరుగుచున్న తన యిరువురు పుత్రులను చూడదలచి కశ్యప ప్రజాపతి దితి ఇంటికి వచ్చెను సుతులను చూచి వారికి నామకరణము చేయ సంకల్పించెను

610 టీక జఠరంబునందు = గర్భమునందు, తన తేజమున్ = తన వీర్యమును, అద్భుతచరితున్ = ఆశ్చర్యకరమైన ప్రవర్తన కలవానిని , ప్రసూతివేళన్ = ప్రసవ సమయమున, మునుగన్న పట్టిన్=మొదట కన్నకొడుకును, రవితేజుని=

సూర్యునివంటి తేజస్సుగలవానిని, కాంచన లోచనుండు = హితమతిన్ = హితముగోరిన మనస్సుతో, నిజ = తనయొక్క-

తా॥ దితి గర్భమున మొట్ట మొదట పడినట్టి పుత్రునికి హిరణ్యకశిపుడని పేరు పెట్టెను మొట్ట మొదట జన్మించిన వానికి హిరణ్యాక్షుడని పేరు పెట్టెను వారి మేలు గోరి ఇట్లు నామకరణము చేసి కశ్యపుడు వెంటనే నిర్మలమైన తన తపోవనమునకు బోయెను

( దితి గర్భమున మొదట పడినవాడు హిరణ్యకశిపుడు మొదట జన్మించినవాడు హిరణ్యాక్షుడు అనగా వారిరువురి లో అన్న యెవరో తమ్ము డెవరో తెలియుట సాధ్యము కాదు

హిరణ్యమను శబ్దమునకు బంగారు రంగు గల సూర్య తేజ మని యర్థము కనుక వారి కా పేర్లు పెట్టుటలో తండ్రి వారి హిత మును గోరెను వారు సూర్య తేజమైన గాయత్రిని ధరించి హిరణ్యవర్ణము గల లక్ష్మీదేవిని ఆశ్రయింపవలెనని ఆత ఉద్దే శించెను అందు మొదటిది జరుగలేదు రెండవది జరిగినది ( శ్రీ కటాక్షముతో అన్ని దిక్కులను జయించి వారు ప్రభువులైరి )

611 టీక ఆ + అవసరంబునన్ = ఆ సమయమున అతుల తేజోవిరాజితుండు = సాటిలేని తేజస్సుతో వెలుగువాడు, హిరణ్యగర్భ వరదాన గర్వంబు = బ్రహ్మ ఇచ్చిన వరముల వలన గలిగిన గర్వము, దుర్వార = వారి పరాని, పరిపంథి గర్వ = శత్రువుల గర్వమును, నిర్వాపణ = పోగొట్టుటలో, అఖర్వ = కురుచగానట్టి భుజావిజృంభణంబునన్ = బాహుబల వ్యాప్తితో, నిఖిల=సమస్తమైన, స్వవశంబు + ఒనర్చి=తనకు

వశము చేసికొని, సంతుష్ట + అంతరంగుండు = సంతోషించిన హృదయము కలవాడు, తత్ + సోదరుండు = వాని తమ్ముడు, ప్రతి దివసంబున్ = ప్రతి దినము, చండ = భయంకరమైన, వేదండ శుండాదండ = ఏనుగు తొండము వంటి, మండిత=అలంకరింపబడిన, భుజాదండంబు = దండమువంటి చేయి, తన్ను నెదిరి= తన్నెదిరించి, అరివీరునకా = శతృవీరుని, కుర్మ్మరి = తిరిగి, దివంబునకు = స్వర్గమునకు, దాడి + పెట్టి = దండెత్తి, సమర విముఖులు = యుద్ధమునకు అంగీకరింపనివారు బర్హిర్ముఖులు= దేవతలు వనజాసన వరప్రదానంబు = బ్రహ్మ తనకు వరము లిచ్చుట, హితులు = తన మేలు గోరినవారు, అహితులు = శతృవులు, కలంగన్ = కలతపడగా, చెలంగన్ = చెలరేగగా, మహిత + వైజయంతికా దామంబు = గొప్పదియగు వైజయంతికయను పూలదండ, అభిరామంబు = తగినరీతిలో నున్నది (అందమై యున్నది), మణినూపురంబులు = రత్నాల యందెలు, మొరయన్ = శబ్దము చేయగా నిజ దేహద్యుతి = తన శరీర కాంతి, పిక్కటిల్లన్ = ఎక్కువ కాగా, పటుచు = పారిపోవునట్టి, ఉరగంబులు = పాములు, అర్క నివాసంబులు = జిల్లేళ్లు మొలిచిన ప్రదేశములు, కాంచనా వాసంబులు = ఉమ్మెత్త చెట్లకు నివాసములు,

తా॥ మహాతేజస్సుతో మెరసిపోవుచున్న హిరణ్యకశిపుడు బ్రహ్మవలన వరములను పొందెను వరముల గర్వముతో తన శతృవులైన దేవతల గర్వమడచుటకు బాహుబలము చూపెను లోకపాలకు లందరను జయించి వశపరచుకొనెను మహా సంతోషముతో మృత్యు భయము లేనివాడై సుఖము లనుభవించెను ( దిక్పాలకులలో యముడుగూడ నొకడు గనుక వానిని గూడ జయించి వశపరచుకొనెను దానితో మృత్యుభీతి లేదనుకొనెను )

## పద్యముల వివరణము

వాని సోదరుడైన హిరణ్యాక్షుడు[1] ప్రతిదినము మదించి, ఏనుగు తొండ మెత్తినట్లు చేయి పైకెత్తి, గద్దా దండము త్రిప్పుచు, తనతో యుద్ధము చేయగల శత్రువు లెక్కడ నున్నాడో యని వెదకు చుండును తన్నెదిరింపగల వీరుడు భూలోకమున లేడని నిశ్చయించుకొనెను స్వర్గముపైకి దాడి చేసెను దేవత లెవ్వరును తనతో యుద్ధము చేయుట కంగీకరింప లేదు అది అంతయు బ్రహ్మ ఇచ్చిన వరముల మహిమ యని నిశ్చయించుకొని మిత్రులకు సంతోషము కలిగించుచు, శత్రువులకు కలవరపాటు కలిగించుచు వైజయంతి యను పుష్ప మాల ధరించి స్వర్గ మెల్లెడల విహరించెను పాదములకు నలంకరింపబడిన రత్నపుటందెలు శబ్దము చేయుచుండగా నలుదిక్కులు తన తేజస్సుతో వెలిగిపోవుచుండగా స్వర్గ మంతయు తిరిగెను వానిని చూచి దేవత లందరు గరుడుని చూచిన సర్పములవలె నలుదిక్కులకు పారిపోయిరి తమతమ నివాసములను విడిచిపెట్టిరి వారి ఇండ్లలో జిల్లేళ్ళును ఉమ్మెత్తలును మొలిచినవి

612 టీక పోవఁదిట్ట=ప్రక్కకు నెట్టి (పోగొట్టినా), దిగనాడి=జారవిడిచి, విక్రమ=పరాక్రమము ఔదార్య=ఉదార బుద్ధి, పరాక్రమక్రమము = ఇతరులను జయించుపద్ధతి, తప్పఁగన్ =తొలగిపోగా, భీతిలి=భయపడి, పాఱిరి=పారిపోయిరి, నాకులు=దేవతలు, గైకొని=గ్రహించి, అర్చి = కేకలుపెట్టి, సుమేరుపర్వతస్థైర్యుఁడు=మేరుపర్వతమువంటి స్థిరత్వము కలవాడు, వార్థిఁజొచ్చెన్ =సముద్రమును ప్రవేశించెను, అతిదర్పిత=మిక్కిలి గర్వించిన, భూరిభుజావిజృంభి=మిక్కిలిగా బాహుబలము పెచ్చు పెరిగినవాడు,

తా॥ దండెత్తి వచ్చిన హిరణ్యాక్షుని జూచి దేవత లందరును

శౌర్యము పోగొట్టుకొని తమ సాధనములను విడిచిపెట్టిరి (మానవులు యోగ సాధనమును, మోక్షసాధనమును, మరచి రాక్షస శక్తులకు లోనైరి) పరాక్రమము, దానబుద్ధి, శౌర్యము విడనాడిరి భయపడి పారిపోయిరి మొనపువలె ధైర్యము వహించిన హిరణ్యాక్షుడు పెచ్చు పెరిగిన శాహుబలముతో సముద్రమున ప్రవేశించెను (వరుణ దేవుని రాజ్యముపై దండయాత్ర చేసెను రాక్షస గుణములు సంసార జీవుల రక్తము లోని కెక్కినవని యర్థము)

613, 614 శౌర్యస్ఫురణము = శూరత్వము ప్రకాశించుట, పరచెన్ = పారిపోయెను, తత్ + జలధి మధ్యభాగమునన్ = ఆ సముద్ర మధ్యభాగమునందు,

తా॥ వరుణుని సైన్యములు హిరణ్యాక్షుని సైన్యము తేజస్సు తుది చూడజాలక శూరత్వము తెగిపోయి ఆ సముద్రము మధ్యభాగము నందెచ్చటికో పారిపోయినవి

(వరుణుని బలము లనగా జలస్వరూపులైన దేవతామూర్తులు సంసార బద్ధులైన జీవుల రక్తనాడులందు రాక్షస గుణములు సంక్రమింపగా దేవతా గుణములు మరుగుపడి యెచ్చటనో మాయమయ్యెను)

615 టీక అమరారి = దేవతలకు శత్రువు (రాక్షసుడగు హిరణ్యాక్షుడు), విపుల ఎశ్వాసములన్ = దీర్ఘములైన నిట్టూర్పులందు, జలనిధి కల్లోలములను = సముద్రపుటలలను, విపుల గదా దండమునన్ = పెద్దదియైన గగతో లేక విస్తారమైన వ్యాధి రూపమగు దండనతో, పోనడచెన్ = పోవు నట్లణగ ద్రొక్కెను

తా॥ హిరణ్యాక్షుడు తన దీర్ఘ నిశ్వాసముల వలన పుట్టి నట్టి సముద్రపు టలలను గదా దండముతో తొలగించుచు దృఢ శక్తితో పురోగమించెను

(సంసార జీవులలోని రాక్షస గుణముల రాగ ద్వేషాదు లైన ఆవేశములతో దీర్ఘనిశ్వాసములు పుట్టినవి తత్ఫలితముగా మానసిక, శారీరక రోగాదులు పుట్టి దృఢమైనవి )

616 టీక మహాజలధి = మహాసముద్రము, సురవైరి= దేవతల శత్రువు, రిపుసైన్య విదారణ = శత్రుసైన్యములను చీల్చిచెండాడుట, శౌర్య ఖేలనాపరతన్ = శౌర్యమే క్రీడగా నిమ గ్నుడగుటగా, లసత్ + విభావరీపురము = వెలుగొందుచున్న విభావరియను వరుణుని ముఖ్యపట్టణము, లేక యొప్పుచున్న రాత్రివంటి సంసార తమస్సుచే నిర్మింప బడిన స్థితి, పయోధి నాథునిన్ = సముద్రమున కధిదేవతను

తా॥ మరియు నా మహాసముద్ర మధ్యమున రాక్షసుడు పెక్కు సంవత్సరములు క్రీడలు చేసెను శత్రుసైన్యము చీల్చి చెండాడుటయే ఆటగా చరించెను. వరుణునిచే పరిపాలింప బడుచున్న ముఖ్యపట్టణమగు విభావరియను నగరమును చేరుకొని అచ్చట వరుణదేవుని చూచెను

(సంసార జీవులలోని రాక్షస లక్షణము రక్తనాడులలో తరతరములుగ ప్రవహించెను జీవులు పరస్పరము శత్రుత్వము వహించి యొకరినొకరు చీల్చి చెండాడు నుటయే క్రీడగా జీవిం చిరి అంధకారమే రక్తమందలి ముఖ్యలక్షణముగా ప్రవర్తించిరి )

617, 618 టీక యాదోగణ + అధీశుండు = జలచర ముల గుంపుల కధిపతి, పాతాళ భవన పరిపాలుండు = అధో

లోకమైన పాతాళము పరిపాలించువాడు, పరిహాసితోక్తులన్ = ఎగతాళి పలుకులతో, కదనరంగము = యుద్ధభూమి, ఎదిరిచూడు=ఎదిరించిచూడు, భుజావిక్రమున్ = బాహుబలము, అబ్ధివిభుఁడు = సముద్రరాజు, పగతు జయము = పగవాని జయము, బరము=యుద్ధము,

తా॥ వరుణుడు సమస్త జలచరముల వైభవములతో పాతాళమును పరిపాలించుచుండెను వానిని చూచి హిరణ్యాక్షుడు పరిహాసములు పలుకుచు నిట్లనెను లోకపాలురు లనగా లోకములం దెన్నదగినవారు వారిలో నీవు ముఖ్యుడవు అందరికన్న బలము కలవాడవని లోకములు నిన్ను స్తుతించుచున్నవి అట్టివాడవు నీ పౌరుషము జూపి యుద్ధరంగమున నాతో నిలబడుము, నీ బాహుబలమును, వైభవమును అణగ ద్రొక్కెదను రాక్షసుడిట్లను చుండగా విని వరుణదేవుడు తన శత్రువు పొందుచున్న విజయమును, వృద్ధిని గమనించెను వాని బలము, తన బలము గమనించి శత్రునితో యుద్ధమునకు దిగక విరమించెను

( సంసారజీవుల రక్తము నందు రాక్షస గుణముల సంక్రమించి దేవగుణములను తిరస్కరించి ఎలబడినవి, యుద్ధరంగమున నెదిరించుట పుట్టినది ఆ రక్తమందు జలముల కధిదేవతగా నున్న వరుణుడు రాక్షసుని విజృంభణము గమనించి పోరాడుట కిది సమయము కాదని నిర్ణయించు కొనెను )

619 టీక చిత్తమునన్ = మనస్సు నందు, రోషవహ్నిన్ = కోపమను నగ్నిని, తాలిమి = ఓర్పు, తోయములన్ = నీటితో, ఆర్చుచున్ = ఆరిపోవునట్లు చేయుచు, ఉపశమిత + ఉక్తులన్ = శాంతింపజేయు మాటలను, దనుజసత్తముతోడన్ =రాక్షసులలో శ్రేష్ఠుండగు వానితో,

తా॥ అది యుద్ధమునకు సమయము కాదని గ్రహించి వరుణుడు రాక్షసుని రోషాగ్నిని ఓర్పు అనబడు జలములతో ఆర్పుచు ఉపశమింప జేయు మాటలతో నిట్లనెను

620 టీక సంగరము = యుద్ధము, ఉజ్జగించి = విడిచి, ఏన్ = నేను, అనయము=మిక్కిలిగా, ఆహవకేళిన్ =యుద్ధమను క్రీడయందు, చరింపరాదు =వర్తింపరాదు, ఘన భుజ విభ్రమ= గొప్ప బాహు బలముచే, స్ఫురిత = ప్రకటించునట్టి గాఢ విజృంభణమున్ = దిట్టముగా విజృంభించుట, ప్రతివీరులు = ఎదిరింప గలవారు, ముకుందుఁడు = విష్ణువు,

తా॥ నేను యుద్ధము మాని మనసునకు శాంతి నభ్యాసము చేసికొను నియమము గలిగియున్నాను కనుక నే నిపుడు యుద్ధ క్రీడలో పాల్గొనరాదు మరియు విజృంభించుచున్న నీ బాహు బలమునకు నిలిచి ఎదిరింపగల వీరు లెవ్వరును లేరు ఒక్క విష్ణువే యెదిరింప గలడు

(తా నెదిరింప గలడో లేడో చెప్పలేదు తాను యుద్ధము చేయనని నియమము కలిగి యున్నానని మాత్రము చెప్పెను ఇంకెవ్వరును ఎదిరింపలేరని చెప్పు చున్నాడు తా నెదిరింపలేరని సూటిగా చెప్పినచో నోటమి నంగీకరించినట్లగును తాను తప్ప నింకెవ్వ రెదిరింపలేరని చెప్పినచో రాక్షసుడు తప్పక యుద్ధము చేసి త న్నవమానించును కనుక తాను నియమమున నున్నాననియు, నిక విష్ణువు తప్ప మరియెవ్వరు నెదిరింప లేరనియు పలికెను రోషముతో నున్న రాక్షసుడు ఇందలి యుక్తిని గ్రహింపడు గదా అని నమ్మకము )

621 టీక గొనకొని = ప్రయత్నించి, అనిమొనన్ =

యుద్ధమునందు, అభియాతులన్ = తనపైకి వచ్చిన శత్రువులను, ఓలి = వరుసగా, సడిసన్ని = అరితేరిన, భూజనకోటి = భూమి యందలి జన సమూహము, వేచను = వేగముగా పొమ్ము,

తా॥ ఆ విష్ణుమూర్తి వైకుంఠమున నున్నాడు తన పైకి దండెత్తిన శత్రువులను పలుమారు జయించిన శక్తిమంతుడు మహావీరుఁడని జనులందరిచే ప్రసిద్ధి పొందిన వాడు నీ వతని కడకు వేగముగా పొమ్ము నీకు కావలసిన యుద్ధము కావలసిన విధముగా నతడు చేయఁగలడు దానితో సర్వము సమకూరును

( సర్వము సమకూరుట యనగా నీవు కోరిన విధముగా నీకు యుద్ధము లభించును నీ శౌర్యమునకు తృప్తి కలుగును లోకమునకు కూడ నీ బాధ లేకుండ నిన్న తడు చంపునని యర్థము )

622 టీక ఆజిమొనన్ = యుద్ధరంగమున, వీఁగిపాటు = వెనుతిరిగి పారిపోవునట్టి, పందలు = పిరికివారు, మగపంతము = మగతనమా?, వివేకవిహీన = మంచిచెడ్డలు చూచుకొన లేనివాడా!, ఓపు దేని = సమర్థుడవైనచో, అమరారులన్ = రాక్షసులను నిచ్చలున్ = ప్రతిదినము

తా॥ తిట్లను భరించి యుద్ధభూమిలో నిలువలేక వెన్ను చూపి పారిపోవు పిరికిపందల వెంటపడుట నీకేమి మగతనము? అందరికిని శరణాగతుఁడైన విష్ణువు నీకార్యము నెరవేర్పగలడు సమర్థుడవైనచో వాని కడకుపొమ్ము అతడు ప్రతిదినము రాక్షసులను చంపుచునే యుండును

( నారాయణ డందరికిని శరణ్యు డనగా నీకును గతి వాడే యని అర్థము యుద్ధము చేసి నీకు కావలసిన గతి చూపు నను అర్చించిన వారి కెట్లు గతియగుచున్నాడో తనతో పోరాడిన వారిని యుద్ధమున చంపికూడ వానికిని గతి యగుచున్నాడు ఎవరి కేది కావలెనో వారి కది నెరవేర్చును నీవు యుద్ధము కోరితివి కనుక నీ కోరిక కూడ నెరవేర్చునని యర్థము

623, 624 పురుషాకృతిన్ = జీవుని ఆకారముతో, పురుషోత్తముఁడు = విష్ణువు, భూరిభుజావిస్ఫురణన్ = మిక్కిలి బాహు బలముతో, దుష్టనిశాటులన్ = దుర్మార్గులైన రాక్షసులను, మునిగణ + అర్చితపదుఁడు = మునిగణములచే నర్చింపబడిన పాదములు గలవాడు,

తా॥ పురుషోత్తముడై విష్ణువు ప్రతియుగమున జీవుని రూపమున నవతరించి, తన బాహుబలముతో దుష్టరాక్షసులను సంహరించి మునిగణములచే నర్చింపబడిన పాదపద్మములు గల వాడై యున్నాడు

(పురుషుడనగా జీవుడు పురుషోత్తము డనగా జీవునియందు గల ముగ్గురు పురుషులలో మూడవవాడు నశించునట్టి శరీరము నశింపనట్టి జీవుడు, ఆ రెండింటియం దంతర్యామిగా నున్న దేవుడు ముగ్గురు పురుషు లనబడుదురు ఆ ముగ్గురును వరుసగా, క్షర పురుషుడు, అక్షరపురుషుడు, పురుషోత్తము డనబడుదురు అందు పురుషోత్తముడు భగవంతుడు మిగిలిన వారిద్దరు వాని యంశలు

అవతరించుట యనగా దేహముతో దిగివచ్చుట దేవుడే జీవులుగా దేహముతో దిగివచ్చును అందు క్షరపురుషుడుగా చరించువాడు దేహము అక్షరుడు బల పరాక్రమాదులతో విహ

రించును పురుషోత్తముడు ఈ ఇద్దరి కర్మబంధములను త్రెంచును కనుక పురుషోత్తముడుగా చరించుటకై దేహమున దిగివచ్చిన వాడు అవతారమూర్తి యనబడును జీవు లొకరితో నొకరు పోరాడినచో నెంత పరాక్రమవంతులైనను ఒకడు జయించి ఒకడు ఓడిపోవును ఆ ఇద్దరును పురుషోత్తముని చేతిలో జయింప బడుదురు కనుక మిగిలిన వారితో యుద్ధము నీ కేల ? చేత నైనచో వానితో యుద్ధము చేయుమని యర్థము)

625 టీక ఆ విభున్ = ఆ ప్రభువును, తొడరి = సమీపించి, కయ్యము = యుద్ధము, దయ్యము = దైవము, రక్షోవర! = రాక్షస శ్రేష్ఠుడా!, భుజాబలము = బాహుబలము, సొంపఱి = రూపుమాసి, మేదినీగూలి = నేలగూలి, సార మేయావళికి = కుక్కలకు, ఆశ్రయంబు = ఆధారము, చేవ = సత్తువ, లావు = బలము, మీఁది కార్యముల్ = భవిష్యత్తున జరుగు పనులు,

తా॥ కనుక నీవు విష్ణువును సమీపించి యుద్ధము చేయుము ఆ పైన నీ స్థితి దైవ మెరుగు నీ బాహుబలము రూపుమాసి పోవును నీవు నేలగూలుదువు నీ దేహము కుక్కలకు మాత్రము పనికి వచ్చును నీ వచ్చటకు పోయినచో నీ బలము, సామర్థ్యము తేలిపోవును అటుపైన నేమగునో చెప్పుట ఎందులకు?

(ఒకరి నొకరు ఎదిరించుట, పోరాడుట మున్నగునవి చేయు వారిలో దేహాభిమాన ముండును వారి బలముపై సామర్థ్యముపై వారికి నమ్మక ముండును లేనిచో పోరాడరు కాని మైఁగ నిజ సామర్థ్యము జీవునియందు అంతర్యామిగా వర్తించు పురుషుని దే గాని దేహము మున్నగువానిది గాదు కనుక దైవము నెదిరించిన వానికి ఒల పరాక్రమములు మాయ మగును ఎంత బలవంతు

డైనను చనిపోయిన వెనుక దేహము బలమునకు పనికి రాదు కుక్కలకు మాత్రము పనికి వచ్చును ఒకరి నొకరు కొట్టు కొన్నచో తేలున దేమియు లేదు దైవముతో పోరాడినచో భవి ష్యత్తు చక్కబడును

హిరణ్యాక్షుడు జయవిజయులలో నొకడు గనుక దైవముతో పోరాడినచో రాక్షసత్వమును దేహముతో వదలి త్వరగా వైకుంఠ మును చేరవలెనని వరుణు డిట్లు పలికెను )

626 టీక దురాగ్రహము = పట్టరాని కోపము, హిరణ్యలోచనుండు = హిరణ్యాక్షుడు, అనయము = మిక్కిలి, సంగరావనిన్ = యుద్ధభూమి యందు అమర వర్ధనున్ = దేవతలను వర్ధిల్ల జేయు వానిని, దుష్ట విమర్దనుఁ = దుష్టులను విశేషముగా మర్దించు వానిని, జనార్దనున్ = విష్ణువును, వికుంఠ నగరస్ఫుట=వైకుంఠ పట్టణమును స్ఫురింప జేయునట్టి, సంచిత= కూర్పు చేయబడిన, మార్గ వర్తియై = మార్గమున వర్తించువాడై,

తా॥ వరుణు డిట్లు పలుకగా పట్టరాని ఆగ్రహముతో హిరణ్యాక్షుడు నిర్భయుడై బయలుదేరెను యుద్ధభూమియందు విష్ణు నెదిరింతునని వైకుంఠము వైపునకు సమకూర్చుకొనిన మార్గము గలవాడై పరువెత్తెను

( అతడు పూర్వ మెరిగిన మార్గమే గనుక జ్ఞప్తి లేక పోయినను ఎట్టుపిలతో వైకుంఠము దారి గుర్తుంచట్టి పోయెనని యర్థము )

627 టీక అవసరమునన్ =సమయమున, మునివరులు= ముని శ్రేష్ఠులు, ముదము+తలిర్పన్ = సంతోషము చిగుర్చగా,

తా॥ రాక్షసుడు శీఘ్రముగా వైకుంఠమునకు బోవు చుండగా నారదుడు దారిలో నెదురు వచ్చి సంతోషముతో ఓ రాక్షసరాజా! ఎచ్చటికి పోవుచున్నావు? అని ప్రశ్నించెను వానికి రాక్షసు డిట్లనెను

( రాక్షసుడు విష్ణువును సమీపించు చున్నాడు గనుక ఇంతటితో వీని పని సరి యని నారదుడు సంతోషపడెను పని మీద పోవుచున్నప్పుడు ఎచ్చటికి పోవుచున్నావు అని ప్రశ్నించుచు నెదురు వచ్చినచో రాగద్వేషాదులు గలవారికి వెళ్ళిన పని జరుగ దగు అపశకునము నారదుడు హేళనగా నెదురు వచ్చి ప్రశ్నించెను )

628 టీక సరసిరుహ + ఉదరుండు = ఉదరమున పద్మము గలవాడు, (విష్ణువు), తొడరి = ప్రయత్నము చేసి, సంగరము = యుద్ధము, ఇందిరావరుని = లక్ష్మీదేవి భర్తను, అనంతునిన్ =అంతములేని వానిని, త్రుంచి = నరకి పారవైచి, సురవైరికులంబులకు = రాక్షసుల వంశములకు, మోద విస్ఫుర ణన్ = సంతోషము స్ఫురించునట్లుగా, ఘటింపన్ = సందర్భ పరచుటకు, వికుంఠపద + అనువర్తి = వైకుంఠ మార్గమును అనుసరించువాడు, మునికుల + అగ్రిణి = మునుల సమూహము లకు మొదటివాడు ( నారదుడు ), దానవనేత = రాక్షసుల నాయకుడు (హిరణ్యాక్షుడు)

తా॥ లక్ష్మీదేవి భర్త, అనంతుడు నగు విష్ణుమూర్తితో యుద్ధము చేసి అతనని త్రుంచి రాక్షసుల వంశములకు సంతోషము పెంపొందింప జేయుటకై సంకల్పించి వైకుంఠము మార్గము బట్టి వెళ్లుచున్నాను అని హిరణ్యాక్షుడు పలుకగా మరల నారదు డిట్లనెను

( భగవంతుడు అనంతుడు అతనిని తుంచుట యనగా కామక్రోధములు గల సృష్టిలో వేరు వేరు వ్యక్తులుగా, వేరు వేరు వస్తువులుగా చూచుచు సంసార బంధము ననుభవించుట అదియే రాక్షసత్వము అఖండుడైన అంతర్యామిని ఖండ ఖండము లుగ ననుభవించినచో రాక్షస గుణములు పెచ్చు పెరుగును కనుక దానికై ప్రయత్నించు చున్నానని ధ్వని ఇదియే విష్ణువును చంపుటగా రాక్షసుడు పట్టుబట్టి యత్నించుచున్నాడు )

629 టీక గురుభుజుఁడు = గొప్ప బాహువులు గల వాడు, వికుంఠ పురంబునన్ = వైకుంఠమున, భూ భరము వహింపన్ = భూమియొక్క భారమును మోచుటకు, ఆదికిటి భావము = ఆదివరాహమూర్తి అవతారము, రసాతలంబునందు = పాతాళమున, ఇరవుగా = నివాసముగా, ఓపుదు వేని = సమర్థుడవైనచో, అరయఁగన్ = పరిశీలించినచో, అసురాంతకుతోడి = రాక్షసులను చంపువానితో (విష్ణువుతో), రణంబు = యుద్ధము, అవశ్యమున్ = తప్పక,

తా॥ మహాబాహు బలముగల విష్ణుమూర్తి నేడు వైకుంఠమున లేడు భూభారము దాల్చుటకు ఆది వరాహమూర్తియై పాతాళము నివాసముగా నున్నాడు నీ వచ్చటకి పోగలిగినచో పొమ్ము నీకు తప్పక విష్ణుమూర్తితో యుద్ధము లభించును

(వైకుంఠమున రాక్షసత్వ ముండదు గనుక హిరణ్యకశిపుడు యుద్ధము చేయక యే అంత మొందును యుద్ధమే కావలె నన్నచో పాతాళమునకు బోవలెను అచ్చట విష్ణుమూర్తి భూభారము మోచుచున్నాడు అనగా భౌతిక సృష్టియొక్క స్వరూపములను తనయందు ధరించియున్నాడు వేరు వేరుగా సృష్టిలోని వివిధత్వము రూపమున పాతాళమునందు అంతర్యామిగా నున్నాడు

అందు ఒకరి నొకరు వేరు వేరుగా చూచుటకు రాగద్వేషములు చెందుటకును వీలున్నది కనుక విష్ణువుతో నితరుల రూపమున పోరాడుటకు వీలున్నది కనుక రాక్షసత్వము పాతాళమున కేగిన వో తనకు భగవంతునితో పోరు గలుగును)

630 అనవుడు=అని పలుకగా, దానవేంద్రుడు=రాక్షస రాజు, హుతాశనుకై వడి=అగ్నిహోత్రునివలె, మండి=కోపించి, మండిపోయి, పద్మలోచను=విష్ణుమూర్తిని, సందడిగొల్పన్=వేగ పరుపగా, అనల్ప తేజుడు=మహా తేజస్సు గలవాడై, త్రిజగత్ + భయద+ఆకృతి = మూడులోకములకు భయమును గలిగించు నాకారము, వ్రేల్మిడిం=చేతిబట్ట, రసాతలంబునకు = పాతాళము నకు, చండభుజాబల దర్పము=భయంకరమైన శౌర్యబలము,

తా॥ నారదు డిట్లు పలుకగా రాక్షసుడు అగ్నిహోత్రుని వలె కోపముతో మండిపడి విష్ణుమూర్తి నెదిరించు నేడుక వేగము గలిగింపగా మహా తేజస్సుతో పెద్దగద చేతిబట్టి మూడు లోకములకు భయాకరమైన యాకారముతో క్షణకాలములో పాతాళమునకు బోయెను

631, 632 జలమధ్యంబునన్ = నీటిరథము, దివిజారి= దేవతల శత్రువు (రాక్షసుడు), అంరశదంష్ట్రా + అభిరామున్ = దట్టముగా కోరలతో నొప్పువానిని, అమరలలాముని = దేవతలకు తిలకము వంటివానిని, కువలయభరణ + ఉద్దామున్ = భూమిని భరించి మోస్తున్నట్టి ప్రియల్లము కలవానిని, సవనమయు = యజ్ఞ స్వరూపుడైన, స్తబ్ధరోమున్ = అడవిపంది రూపమువానిని, జలదశ్యామున్=మేఘమువంటి చామనచాయ గలవానిని,

తా॥ రాక్షసుడు పాతాళమునకు బోయి నీటినడుమ యజ్ఞ

వరాహస్వరూపుడైన విష్ణుమూర్తిని చూచెను అతడు గట్టి కోరలు గలిగి యజ్ఞవరాహమూర్తి రూపమున నుండెను నీల మేఘ ఛ్ఛాయ గలిగి నిలబడి భూమియొక్క భారమును ధరించి పైకెత్తు చుండెను

633, 634 ఆ + అవసరంబునన్ = ఆ సమయమున, సూకర + ఆకారుండు = అడవిపంది రూపమువాడు, హరి = విష్ణువు, వనజ రుచి సన్నిభములు = పద్మముకాంతివంటి కాంతిగలవి, లోచన యుగళదీప్తిన్ = రెండుకన్నులకాంతి, తత్ + ఆలోకనములన్ = ఆ చూపులతో, దనుజ + అధీశుని = రాక్షసరాజుయొక్క, తనుకాంతి = శరీర కాంతి,

తా॥ ఆ సమయమున నడవిపంది రూపము ధరించిన విష్ణు మూర్తి తన పద్మదళములవంటి కన్నులనుండి ప్రసరించుచున్న చూపులతో క్షణమాత్రమున హిరణ్యాక్షుని దేహకాంతిని హరించెను

(పూర్వము హిరణ్యాక్షుడు దితి గర్భము నందుండగా నొక నల్లని తేజస్సు వెలువడి దేవత లందరను నిశ్చేష్టులను చేసినది ఇప్పుడు విష్ణువు దేహకాంతి కూడ అంతకన్న నల్లనై రాక్షసుని కాంతిని హరించినది అనగా దేవుని కాంతి అంధకారమునకు గూడ చీకటిని కలిగించి వెలుగు కావలసిన చోట వెలుగు నిచ్చు నని యర్థము కన్నులు మొదలగు నింద్రియములకు చీకటిగాను, ఆత్మకు వెలుగుగాను వ్యాపించు నట్టిదని భావము దీనినే ఆదిత్య వర్ణము, చీకటి కవ్వల నున్నరూపము అని కీర్తించుచున్నాము

635, 636 టీక అవార్య శౌర్యంబునన్ = వారింపరాని శూరత్వములో, మాఱులేని = ఎదురులేని, అట్టియెడన్ = అట్టి సమ

యమున తుదమొదళ్ళకు జిక్కన్ = చివర మొదలు అను నంచు
లకు చిక్కనట్లుగా, తునిసి = చినిగి, పాఱఁగన్ = పొచ్చుకొని
పోవునట్లుగా, మోరన్ = మెడను, కొంతతడవు = కొంతకాలము,
కులశైలములన్ = కులపర్వతము లను, చిమ్మన్ = చెదరగొట్టును
బ్రహ్మాండభాండంబు = బ్రహ్మాండమను కుండ, కొమ్ములన్ = దంతము
లతో, తాటించును = విసరికొట్టును, జలధులు = సముద్రములు,
పంకసంకులంబు = బురదతో కలత చెందినవి, ఇంకన్ = ఇరిగిపోవునట్లు
ఖురములన్ = గిట్టలతో, మట్టాడున్ = త్రొక్కుచు నెగురును,
ఉడురాజు = చంద్రుడు, కఱుచ వాలమున్ = పొట్టియైన తోకను,
గునియఁగ = తిరుగును, కుప్పించున్ = ఊతగొనును, లంఘించున్ =
దుముకును, కొప్పరించున్ = త్రివ్వి పెల్లగించును, గగయున్ =
మీది కెగురును, ధరణి + త్రివ్వన్ = భూమిని త్రవ్వను, బొఱియఁ
గాన్ = కన్నము గునట్లుగా, ఏపు రేఁగి = ఎజృంభించి, రణపరిపంథి =
యుద్ధమున శత్రువు,

తా॥ ఆది వరాహామూర్తి యెదురులేని శౌర్యములో వీర
విహారము చేయుచుండెను వానిని వారింప గలవారు లేరు సప్త
కుల పర్వతములకు తన మోర రాచుకొని పోవునట్లుగా వరాహ
మూర్తి మెడచాచి పరువెత్తు చుండెను అతని కోరలు ఒసలకు
విసరు కొనునపుడు బ్రహ్మాండము కుండవలె పగిలి చిల్లులు పడు
నటుపించెను సప్తసాగరములును బురదవలె పోవునట్లు గిట్టలతో
మట్టుచుండెను సూర్యచంద్రులు లిద్దరు నాక మూలకు పోవునట్లుగా
కురుచయైన తన వాలము త్రిప్పుచుండెను గునగున పరువు
లెత్తుచు కుప్పించి లంఘించి గిట్టలతో త్రివ్వుచుండెను ఆ దృశ్య
మును చూచిన పరిణాత్ములకు గుండెలు తల్లడిల్లెను

(సప్తకుల పర్వతము లనగా మహేంద్రగిరి, మలయ

పర్వతిము, సహ్యా పర్వతము, శుక్తిమంతము, ఋక్షవంతము, వింధ్యాద్రి, పారియాత్రము అను పర్వతములు సప్తసాగరము లనగా లవణార్ణవము, ఇక్షు సముద్రము, సురా సముద్రము, సర్పి సముద్రము, దధిసముద్రము, క్షీర సముద్రము, జలసముద్రము ఇవి సప్త ద్వీపముల చుట్టు నావరించి యుండును జ బూ ద్వీపము నకు లవణ సముద్రము, ప్లక్ష ద్వీపమునకు ఇక్షు సముద్రము, శాల్మల ద్వీపమునకు సురా సముద్రము, కుశ ద్వీపమునకు సర్పి సముద్రము, క్రౌంచ ద్వీపమునకు దధిసముద్రము, శాకల ద్వీపము నకు క్షీర సముద్రము, పుష్కర ద్వీపమునకు జల సముద్రము చుట్టు కొని యుండును

ఈ ద్వీపములును, సముద్రములును తొలుత భూగోళ మేర్పడు నపుడు రూపొందునట్టి విభాగములు వీని ననుసరించియే తల్లి గర్భమున మన శరీరమందలి ఏడు ముఖ్యభాగములు ద్వీపము లుగా (కేంద్రములుగా) నేర్పడు చున్నవి అవి ముఖ్యముగా తల, పుర్రె, కన్నులు, కంఠము, గుండెకాయ, నాభి, కాలేయము, యకృత్తు మూలము, వీని కేంద్రములే వరుసగా పైనుండి క్రిందకు వెన్నెముక వెంట అజ్ఞాచక్రము, విశుద్ధి, అనాహతము, మణి పూరము, స్వాధిష్ఠానము, మూలాధారము అను ఆరు చక్రము లుగ నేర్పడుచు మొదటిదిగా సహస్రారము రూపొందుచున్నది వీని అలజడివలన వెన్నెముక చుట్టును ఏర్పడు సప్త ధాతువులే సప్తసాగరములుగా రూపు కట్టుకొనుచున్నవి పై జెప్పిన ఏడు కేంద్రములే సప్తకుల పర్వతములుగా మన దేహమునందు పని చేయుచున్నవి

నర దేహ సృష్టికి మొదటి స్థానమగు భారత భూమియందు

ఋషులు ఈ స్థానములను దర్శించి వానికి సరియగు స్థానములను తమ దేహములందు దర్శించుకొని న్యాసము చేసిరి దాని వలన వారికి అంతర్బహిర్లోకముల యందలి యోగదృష్టి గోచరించి వేదము సృష్టి రహస్యముగ దర్శన మిచ్చినది )

637, 638 టీక కనుఁగవన్ = కన్నుల జంటనుండి, సునిశిత = మిక్కిలి వాడియైన, దంష్ట్రా + అగ్రయుత = కోరల చివర గూడియున్న, వసుంధరుఁడు=భూదేవి కలవాడు ఎదురే తేరన్ = ఎదురురాగా, వనచరము = నీటియందు తిరుగునది, లేక అడవియందు తిరుగునది,

తా॥ ఇట్లు ఎపారము చేయుచు కన్నులనుండి నిప్పులు వర్షించుచు వాడియైన తన కోరల చివర భూమిని దాల్చి వచ్చు చున్న వరాహమూర్తిని చూచి హిరణ్యాక్షు డాశ్చర్యపడెను. అడవియందు తిరుగునట్టి జంతువగు అడవిపంది నీటిలో నీదుచు నెట్లు వచ్చినదని నివ్వెరపోయెను

639 టీక తోంగలింపన్=నగము కలసికొనగా, దను జాధిపుఁడు = రాక్షసరాజు, భీకర = భయంకరమైన, సూకర తనువు=అడవిపంది శరీరము, దనుజదర్ప+అపహుతోన్ =రాక్ష సుని దర్పము నపహరించు వానితో,

తా॥ ఇట్లాశ్చర్య పడుచు తన దర్పము నపహరించిన వరాహమూర్తి రూపమును జూచి రాక్షసు డిట్లనెను

640 టీక ఘనసూకర! = ఓ పెద్దపంది! వనరుహ సంభూత = బ్రహ్మచేత, దత్త=ఈయబడిన, వరదానమునన్ = వరముల దానముచేత, కనిన=చూచిన, రసాతలగతభువి=పాతా ళమునకు పోయిన భూమి, అనయంబును=నిశ్చయముగా,

తా॥ ఓరీ అడవిపంది! మూర్ఖా! నీ వెవ్వడవు? ఈ పాతాళ మున నున్న భూమి నాది నేను బ్రహ్మవలన వరములను బొంది తిని ఈ పాతాళము గూడ నాదే

(సృష్టికి ముందు పుట్టిన అహంకారమే జీవులలో అహంకా రమై నిలుచును అదియే హిరణ్యాక్షుడుగా వర్ణింపబడినది ఈ పాతాళము ఇందలి భూమి నాది యనగా నేను నిలబడిన చోటు, అందేర్పడు దేహము నావి యని అహంకార మనుకొనును ఆ చోటునందు అంతర్యామిగా లీనమై తిరుగుచున్న సకల సృష్టి ధర్మముల మూర్తియే ఆది వరాహము )

641 టీక గొనకొని = పూనుకొని, గై కొను=అంగీక రింపుము , సలము కొనన్ = పట్టు పట్టుటకు,

తా॥ నీ వీ భూమి నెచ్చటకు గొనిపోయెదవు? విడిచిపెట్టుము నా మాట వినుము లేనిచో నీ ప్రాణములు తీసెదను నాతో పట్టుదల యెందులకు?

(అహంకారము కలవా డెదుటివారిపై పట్టుదల బూని, ఎదుటివారు పట్టుదల కలిగియున్నా రనుకొని భ్రమపడును )

642 టీక మాయావి = మాయకలవాడు, పాయక = తొలగిపోక, చోరభావంబునన్ = దొంగతనమున, ఈ యెడన్ = ఈ సందున, అయుత భుజ బలము = విస్తారమైన బాహుబలము,

తా॥ నీ వెవరో మాయావి వలె నున్నావు దొంగతనమున భూమిని గొనిపోవుటకు యత్నించుచున్నావు దీనిని బాహు బల ముతో గొనిపోవుట సాధ్యమగును గాని, దొంగతనమున గొని పోవుట సాధ్యమగునా?

( పౌరుషబలము చూపుటకు, యుద్ధములు చేయుటకు కారణము జీవుల యహంకారమే భగవంతుడు మాత్రము అహంకారము లేకుండ సృష్టిని తన యంతర్యామిత్వమున జేర్చుకొనును తా నందు అంతర్యామిగా లీనమై యుండును ఈ రెండును గమనింపలేరు గనుక అది అహంకారమునకు లొంగని దొంగతనముగా వర్ణింపబడినది )

648 టీక అవిరళ = దట్టమైన, అలరు = వెలుగొందు, అర్థిన్ = కుతూహలముతో, సంస్థాపించి = పాతిపెట్టి, అస్మత్ = నా యొక్క, సుహృత్ + భృత్యకులులు = స్నేహితుల, భటుల గుంపులు, మోదము = సంతోషము, ఒలయఁజేయన్ = కలిగింపగా, చెలువు + ఏది = అదము తొలగి, మత్ + గదా శీర్ణుడవు = నా గదచే తునిగి పోయిన వాడవు, నిర్మాలులు = మొదలు నరికినవారు, నెరిన్ = పూర్తిగా, యజ్ఞపోత్రి = యజ్ఞ వరాహము, హరి = విష్ణువు, సరోజాత భవ ముఖ = బ్రహ్మ మొదలైన, అమరులకు = దేవతలకు, వంత నొంది = దిగులు చెంది, నిశిత దంష్ట్ర + అగ్ర = వాడియైన కోరల చివర, లసిత = ప్రకాశించుచున్న, నెగడు=ప్రసిద్ధిగల, ధరణీ దేవి = భూదేవి,

తా॥ నీది యోగమాయపై నాధారపడిన బలమే గాని నీకు పౌరుషము చాల తక్కువ అట్టి నిన్ను పట్టుకొని పాతి పెట్టెదను నా మిత్రులకు, భృత్యులకు సంతోషము కలిగింతును నా గదాదండము దెబ్బకు నీవు చిదికి పోయినచో దేవత లందరు మొదలు నరకిన వృక్షముల వలె నశింతురు ఈ పలుకులు విని యజ్ఞవరాహమూర్తి రూపమున వెలుగుచున్న శ్రీహరి తన వారైన బ్రహ్మాదులకు, దేవతలకు ఈ రాక్షసుడు తెచ్చి పెట్ట

గల కష్టము లెట్టివో గమనించి ఆత్మలో బాధ పడెను కోరలపై మెరయుచున్న భూదేవితో నిశ్చలుడై నిలబడెను

( యోగమాయ అనగా పంచభూతములను, మనస్సును, ఇంద్రియములను ఒకటిగా కలిపియుంచునట్టి మాయ దాని వలననే సృష్టిలో వేరు వేరు జీవులు నిలుచుట సాధ్యపడును అటుపైన వారి కహంకారము పుట్టును దాని యందు పౌరుషము పుట్టును అహంకారము వేరుగా రాక్షసుని రూపమున నిలబడి మాట్లాడుచున్నాడు వాని కున్న పౌరుషము అనగా నొకరిపై నొకరు ప్రసరింప జేసికొను పట్టుదల యోగమాయ కుండదు అట్లని అతడు హేళన చేయుచున్నాడు

జీవులలోని అహంకారము వలన ఒకరి నొకరు బాధించు కొందరు కోపతాపములు, ఈర్ష్యానూయాదులు, దెబ్బలాటలు మున్నగునవి పుట్టును వాని వలన బాధపడునది ఆ దేహముల యందు నిలబడియున్న బ్రహ్మాది దేవతలే దానికి విష్ణువు ఆత్మలో బాధపడుచున్నాడు అనగా అహంకార వశమున వేరు వేరు జీవులుగా బాధ నభినయించుచున్నాడు

రాక్షసుడు వరాహమూర్తిని పాతిపెట్టుదు ననెను అనగా అహంకారముల లోపల జీవుడుగా భగవంతుడు నిలిచి యుండు నట్లు చేయుట )

644 టీక సురరిపు = రాక్షసుని యొక్క, వాక్య + అంకుశములన్ = అంకుశముల వంటి మాటలకు, గురు కుపిత స్వాంతుడు = మిక్కిలి కోపించిన మనస్సు కలవాడు, కోమ రారెన్ = అందము కలిగి నిలిచెను, వసుంధర = భూదేవి, కరిణిన్ = ఆడు ఏనుగును, కరికులేంద్రు కరణన్ = ఏనుగుల రాజువలె

తా॥ అంకుశముల వంటి హిరణ్యాక్షుని పలుకులకు కోపించిన వరాహామూర్తి భూదేవితో నీటి నుండి వెలువడెను భయపడిన పెంటి ఏనుగను వెంట బెట్టుకొని వచ్చుచున్న గజేంద్రుని వలె నతడు కనుపించెను

645, 646 టీక నిశిత = వాడియైన, సితదంతరోచులు = తెల్లని దంతకాంతులు, నింగిఁబర్వన్ = ఆకాశమునందు ప్రసరింపగా, కంధివెడలి = సముద్రము వెలువడి భీషణ = భయంకరమైన మఖవరాహ + అవతారము = యజ్ఞవరాహావతారము, ఒసరన్ = ఒప్పునట్లు, కరి వెనుకన్ = ఏనుగువెంట, నక్రము = మొసలి, దైత్యవిభుఁడు = రాక్షసరాజు, కదిసి = సమీపించి, దురిత పయోనిధి తరికిన్ = పాప సముద్రమును తరింపజేయు నావ వంటి వానికి, కిరికిన్ = అడవి పందికి, ఖురదళిత = గిట్టలచే చీల్చబడిన, మేరుగిరికిన్ = మేరుపర్వతము గలవానికి,

తా॥ వాడియై తళుకైన తెల్లని కోరలతో సముద్రము వెలువడి యజ్ఞవరాహామూర్తి వచ్చుచుండెను అతడు పాపసముద్రమును దాటించు నావవలె నుండెను గిట్టలతో మేరుపర్వతము నైన చీల్చివైచునట్లుండెను ఏనుగు వెంటపడిన మొసలివలె వరాహామూర్తిని వెన్నాడుచు రాక్షసుడిట్లు నిందించెను

647 టీక రోయక = అసహ్యించుకొనక, లజ్జన్ జెందక = సిగ్గుపడక, వంచనను = మోసముతో, పందగతిన్ = పిరికివానివలె, పాఱన్ = పారిపోవుట, బంటు పంతము = శూరుని పట్టుదల యేనా?

తా॥ "నీకు తిట్టినను పౌరుషము లేదు సిగ్గు మొదలే లేదు నీవు వంచకుడవు యుద్ధము చేసి జయింతునని తలంచితివి ఇపుడు

నన్ను చూచి పిరికిపందవలె పారిపోవుచుంటివి నీకు శౌర్య మున్నదా? నీకు పట్టుదల యున్నదా?

(శౌర్యము, పట్టుదల అహంకారమునకు సంబంధించిన వైభవములు అవి అంతర్యామికి లేవు అట్లే దేహములాదున్న ముక్తజీవులకు కూడ లేవు భూమి నుద్ధరించి నిలబడిన వరాహ మూర్తి యనగా ముక్తజీవులయందు గల దేహాదులయందలి పంచ భూతములు, మొదలగు సంపదను కూడ భరించుచున్న దేవుడని యర్థము మోక్ష ధర్మము నవలంబించిన వారు దైవముయొక్క మూర్తులే వారిని జూచి అసుర ధర్మముగల అహంకారులు పౌరు షము లేనివారని హేళనచేయుట ఈ కథలో వేదార్థముగా ఉన్మీలనము చేయబడినది )

648, 649 టీక కోప + ఉద్దీపిత మానసుండు = కోపముతో రగుల్కొనిన మనస్సు కలవాడు, తోయములమీదన్ = జలముల మీద, అనాయాసతన్ = శ్రమలేకుండ, తోయజనాభుఁడు = విష్ణువు, ఆయతమతిన్ = విస్తారమైన మనస్సుతో, సురలు = దేవతలు

తా॥ ఇట్లు హిరణ్యాక్షుఁడాక్షేపింపగా కోపించి అవలీలగా వరాహమూర్తి భూదేవిని జలములపై నిలిపెను దాని కాధార ముగా తన బలము నామె యందు నిహితము చేసెను దేవత లంద రును సంతోషించిరి

(రాక్షసునితో యుద్ధమునకు విష్ణువు దిగుచున్నాడని సంతో షించిరి ఇది బాహ్యార్థము ఇదికాక భూమిని జలములపై నిలిపి తన శక్తిని ప్రసరింపజేయుట వలన సంతోషించిరని మరియొక యర్థము పాంచ భౌతికమైన సృష్టియందు జీవులలో తా నంతర్యా మిగా నుండెనని తెలిసి దేవతలు సంతోషించిరి అహంకార మద్ధ

పడినను జీవునకు జననమరణముల నిరంతర సాధనలో హరి దర్శన మను విజయము తప్పదని దేవతలు గుర్తించి సంతోషించిరి ఈ నడుమ గల ఒడ్డులలో జరుగునదియే హరికిని హిరణ్యాక్షు నకును నడుమ జరుగునట్టి యుద్ధము )

650 టీక విభవము = వైభవము, మొరసెన్ = శబ్దము చేసెను, కడకన్ = ప్రయత్నముతో, వీచెను = వీచుచు వచ్చెను రవము = శబ్దము, నందితము = ఆనందించినవి, అప్సరస్ + నర్తన ములు = అప్సరసల నృత్యములు

తా॥ దేవతలు వరాహమూర్తిపై పుష్పవృష్టి గురిపించిరి దేవదుందుభులు మోగెను గంధర్వులు గానము చేసిరి అప్సర సలు సంతోషించి నృత్యము చేసిరి

651 టీక ఆ + అవసరమునన్ = ఆ సమయమునందు, మూర్తిధరుండు = రూపము ధరించినవాడు, కమల లోచనుడు = పద్మముల వంటి కన్నులు గలవాడు, (విష్ణువు), కనక కుండల = బంగారపు కుండలములు, కేయూర = బాహుపురులు, గ్రైవేయ = హారములు, కటక = కంకణములు, అంగుళీయక = ఉంగరములు, భూషణాదులు = నగల కాంతులు, నింగిన్ + పర్వన్ ఆకాశ మున పరిసరింపగా, సమరసన్నద్ధుడు యుద్ధ సన్నాహము కలవాడు,

తా॥ ఆ సమయమున వరాహరూపము ధరించిన విష్ణువు బంగారుకుండలము లను, హారములను, బాహుపురులను, కంకణము లను, అంగుళీయకములను మొదలగు భూషణములను ధరించి తళుక్కు మనుచు యుద్ధ సన్నద్ధుడయ్యెను అతని భూషణముల కాంతులు గగనమున నిండెను

[విష్ణుమూర్తి భూషణము లనగా జీవులయందు పరిశోభించు ధర్మగుణములు, ధర్మరక్షణ శక్తులు అని నారాయణ కవచ మందలి నర్వచనము జీవులలోని యహంకారమును తొలగించుటకై దేవుడే ఆ జీవుల యందలి సద్గుణములుగ పుట్టి సాధనచే పెంపొంది పరిశోభించునని యర్థము అవు డహంకారము తోడి యుద్ధమున జయము కలుగును

652 టీక ఘనగదన్ = పెద్దగదను, కేలన్ + పూని = చేతిలో ధరించి, మణికాంచన = మణులతో, బంగారముతో, నవ్య విచిత్ర = క్రొత్తరంగులతో కూడిన, వర్మము = కవచము ఇంపొనరఁగన్ = మనోహరముగా, దానవనియుక్త = రాక్షసులచే ప్రయోగింపబడిన, దురుక్త = చెడ్డపలుకులు, నిశాత బాణముల్ = వాడియైన బాణములు, ఘన మర్మముల్ = గొప్ప సంధి బంధములను, కలఁపన్ = కలతపెట్టగా, దానవ హంత = రాక్షసులను చంపువాడు(విష్ణువు), నితాంత శౌర్యుఁడు = మిక్కిలి శౌర్యము కలవాడు, కనలుచున్ = కోపముతో కుమిలిపోవుచు, దనుజున్ = రాక్షసుని, రోషవిభీషణ + ఆకృతిన్ = రోషముతో మిక్కిలి భయంకరమైన యాకారమున,

తా॥ చేతిలో పెద్ద గద ధరించి, రత్నములు తాపిన వన్నె చిన్నెలు గల బంగారు కవచము తాల్చి నిలబడెను రాక్షసుడు పలికిన నిందావాక్యములు వాడియైన బాణములవలె తనకు గ్రుచ్చుకొన్నవి అతడు వెంటనే కోపించి మహా శౌర్యమున విజృంభించెను రోషముతో భయంకరాకారము దాల్చెను

[ఆత్మహితమునకు శత్రువులైన రాక్షసశక్తులను సంహరించునట్టి మహా సంకల్పమే విష్ణునిగద రత్నములు జీవుల సద్గుణములు బంగారము సహజమైన ఉత్తమప్రకృతి కవచము భగ

వంతుని ధ్యానము దానికి కావలసిన నామము స్తోత్ర స్వరూపమైన మంత్రము

జీవులు పరస్పరము చేయు నిందలే రాక్షసుని నిందావాక్యములు అవి భక్తులపై ప్రయోగింపబడినపుడు అంతర్యామియైన దేవునకు గుచ్చుకొనును అపుడు సాధకుడు శ్రద్ధయందు మేల్కొని విజృంభించును అతడు తన దీక్షతో హరిమయముగా ధ్యానించి నపుడు రాక్షస శక్తులపై హరి విజృంభించి యుద్ధము చేయును )

653, 654 టీక అమంగళాచరణ = కీడు మూలు నట్టి పనులు ఆచరించువాడా, ఉత్ + వృత్తిక = అదరి పాటుతో, అనయంబుక = నిశ్చయముగా, వనగోచరంబు = అడవిలో కనుపించునది, లేక నీటి యందు కనుపించునది, మృగంబు = జంతువు, ఎనయన్ = మాదిరికి, వన్య మృగంబు = అడవి జంతువునే బలియై = బలము కలవాడై లేక నాకు బలియైపోవు వాడై, శునక శ్రేణిన్ = కుక్కల వరుసను, అనిమొనన్ = యుద్ధ రంగమున, సోఁకోర్చి = నా తాకిడికి ఓర్చుకొని,

తా॥ హిరణ్యాక్షునితో వరాహమూర్తి ఇట్లనెను " ఓరీ! అమంగళము లాచరించు మూర్ఖుడా! నీకు పొగ రెక్కినది నేను వనచరమని, జంతువని భావించుచున్నావు బలవంతులమని, అనుకొని నీ బోటి వారు నాకు బలియై పోవుదురు. నన్నెదిరించి పరుగెత్తుకొని వచ్చు నీ బోటి కుక్కల వరుసను వధించుటకు నే నీ వనచరము రూపము ధరించిన చాలును యుద్ధమున మాత్రము పారిపోకుండ నిలబడుము

( మాచువాని లోని అహంకారము మిగిలిన జీవులలోని నారాయణుని చూడలేక దేహాకారములను మాత్రము

చూచుచు. చూచి ఆ యా జంతువులని అనుకొనును ఒక జీవి యందలి అహంకారము మరి యొక జీవి యందు బలముతో డను కొనును కాని ఒకరి నొకరు ఎదిరించు చున్నా మనుకొని అందరును అహంకారములుగా నారాయణు నెదిరించి ఒలిసై పోవుదురు ఈ లోపున మాత్రము కుక్కలవలె వెంటబడుట, వేటాడుట, పగ తీర్చుకొనుట మున్నగు లక్షణములతో ప్రవర్తింతురు ఆ లక్షణములే అసురులు వారి కధిపతియగు నహంకారమే హిరణ్యాక్షుడు వానిని చంపుటకు ఒక జంతువునకు ఇంకొక జంతువు రూపము చాలునని తత్త్వము )

655 టీక కలనను = యుద్ధమున, కడంగుము = ప్రయత్నింపుము, వికత్థనంబు = తన్ను తాను పొగడు కొనుట,

తా॥ బలమున్నచో యుద్ధమున నన్నెదిరించి నిలబడుము నీ కోరికలను తీర్చెదను అంతే గాని నిన్ను నీవు పొగడుకొనుట తగదు, అది దుష్టుని లక్షణము

(ఒకరింకొకరి నెదిరించినచో అహంకారము చావదు ఎదుటి వారిలోని అంతర్యామి కెదురుగా నిలబడినచో చచ్చును ఇక పోరవలెనని, జయింపవలెనని అనిపించు కోరిక లన్నియు తీరి పోవును )

656 టీక సంగర వివేక విశారదులు = యుద్ధమున మంచి చెడ్డలు తెలిసి ఆరితేరినవారు మృత్యుపాశములన్ = మృత్యుదేవత యొక్క త్రాళ్ళతో, నిబద్ధులు = గట్టిగా కట్ట బడిన వారు, కొనకొని = సంకల్పించి, ఆత్మ సంస్తుతులు=తన్ను తాను పొగడుకొనుట, వికత్థనములు = తన్ను తాను పొగడు కొనుట, బంటు పంతములే = శూరుని పౌరుషములా? దైత్య కుల + అధమా = రాక్షస వంశమున నీచుడా!

తా॥ యుద్ధ విద్యయందు మంచి చెడ్డలు తెలిసినవారు నిపుణత నార్జించిన వారు సజ్జనులు అట్టి వారు కూడ నీ వలెనే మృత్యువు యొక్క పాశములచే కట్టబడిరి వారెవ్వరును ఆత్మ స్తుతి నీ వలె చేసికొనరు నిన్ను నీవు పొగడుకొనుట యుద్ధ పౌరుష మగునా?

(మంచివారు దేహమునకు మృత్యువు తప్పదని వివేకము కలిగియుందురు కనుక తా మే దేహ మనుకొని పొగడుకొనరు ఆత్మస్తుతి అహంకార మున్నప్పుగు మాత్రమే యుంగును అహం కారము మనస్సున్నంత వరకే యుండును మనస్సు తనకు వెల కువ యున్నంతవరకే యుండును కనుక అహంకార మను రాక్ష సుడు ఎప్పుడును మృత్యుపాశములచే బంధింపబడి యుండును )

687 టీక ధృగిన్ = ధైర్యముతో, సందీప్త + ఉగ్ర నిక్షేపము = ప్రకాశించుచున్న, భయంకరమైన, పాతిపెట్టబడిన వస్తువు, దేవ + అరాతి = దేవతలకు శత్రువు (రాక్షసుడు), గతలజ్జుండు = సిగ్గులేనివాడు, ర ణ ము న్ = యు ద్ధ ము ను, యుష్మత్ + గదావితత ద్రావితున్ = నీ గదచే విస్తారముగా పరుగెత్తింపబడిన వానిని,

తా॥ నీ వీ పాతాళమున వెలుగుచున్న ధనపు పాతువలె లోపల దాగియున్నావు నిన్ను నేను దర్పముతో స్వీకరించెదను నన్ను సిగ్గులేని వాడంటివి దాగుకొని యుంటినని హేళన చేసి తివి ఇచ్చట దాగియుండియే నీతో యుద్ధము చేసెదను నీ గదతో నన్ను పారద్రోలెద నంటివి నన్నెదిరించి చూడుము, నీ కోరికలు తీరిపోవును

(1 అహంకారము తనలో అంతర్యామిని కప్పి తాను

దేహాధారులందు దాగియుండును అంతర్యామి దానిని తనలో లీనము చేసికొనను

2 అహంకారులు ఒకరినొకరు సిగ్గులేని వారని తిట్టు కొందురు లోపల నున్న దేవునకు సిగ్గు, అభిమానము అంటవు అవి (అహంకారమునకు విలువగల విషయములు గనుక అట్లు తిట్టుకొందురు

3 వరాహమూర్తిని దాగియుండి యుద్ధము చేయుదువని రాక్షసుడు నిందించెను ప్రతి జీవియందును దేవుడు అహంకారము వెనుక దాగి యుండి దానిని పోగొట్టుటకై ఇతరులతో సంబంధము రూపమున యుద్ధము చేయుచుండును

4 కోరికలను తీర్తును అన్నమాటకు కూడ నంతరార్థమున్నది అహంకారము నే నను పేరుతో నుండి భూగోళమైన ఈ దేహము మొత్తము నాది యనుకొనును ఆ లోపలనే 'నే' నను పేరుతో దేవుడు దాగి యుండును వాడు, వీడు నెదురు పడి నపుడే అహంకారము తీరుట, కోరికలు మాయమగుట, తాను పరబ్రహ్మమని తెలియుట జరుగును )

658 టీక పదాతి యూథములకు = కాల్బలముల సైన్యమునకు, విభుండవు = అధిపతివి, పోటుబంటు = యుద్ధమున శౌర్యము కలవాడవు, రణోర్విన్ = యుద్ధభూమియందు భవదీయ బలంబులు = నీ సైన్యములు, సామర్థ్యములు మిన్నక = మాట్లాడక, మేరగ = హద్దుగా, వీతిదైత్యము, తొలగిపోయిన = రాక్షసులు గలది, అవార్య = వారింపరాని పరాక్రమ = ఇతరుల నాక్రమించునట్టి విక్రమంబునన్ = పౌరుషముతో,

తా॥ నీవు శాంబ్బలముల సైన్యము లన్నిటికిని నాయకుండవు కావచ్చును నీకు మిక్కిలి శౌర్య మూడా వచ్చును నన్ను యుద్ధమున నెదర్కొనిన తృణమువలె నీ బలమును, ఆయువును నేను స్వీకరింతును ఇది మొదలుగా భూమిపై రాక్షసులు లేకుండ చేయుదును నా పరాక్రమము, విక్రమము లోకమునకు తెలియగలదు

(దీని యంతరార్థము రహస్యార్థ ప్రకాశమున 71వ పుటలో వివరింపబడినది )

659 టీక ఎదురంగన్ =ఎదిరించుటకు, కనుంగవన్ = రెండుకన్నుల యందు, బాష్పపూరములు = కన్నీటి ప్రవాహములు, ఓపుదేని = సమర్థుడవైనచో, చయ్యనన్ = వెంటనే, దానవకుల + అధమ = రాక్షస వంశము నందు నీచుడా, రజ్జులు = పేలుటలు,

తా॥ నన్నెదిరింప గలిగిన శౌర్యము, ధైర్యము, బలము కలిగినచో యుద్ధమున నిలబడుము నీ హితులైన వారికి కన్నీరు కలుగకుండ వలెనన్నచో వెనుదిరిగి పొమ్ము రాక్షస జాతిలో అధముడవై ఊరక పేలెదవేల?

(అంతరార్థము 71 వ పుట)

660 టీక సంస్థాపించెదన్ = పాతి పెట్టెదను, లేక ప్రతిష్ఠచేసెదను నెనరైన = ప్రియమైన, యముని పురికి = యమలోకమునకు,

తా॥ నన్నిచ్చట స్థాపించెద నంటివి నీ వంతవాడవే! నాతో యుద్ధము సంకల్పించితివి గనుక నిక వెనుతిరిగిపోవు నీ చుట్టములను చూడవలె నన్నచో ముందే పోయి చూచిరమ్ము

(అహంకారము చనిపోయిన వెనుక జీవికి చుట్టములుండరు )

661 టీక ఇబ్బంగిన్ = ఈ విధముగా, సరోరు హాక్షుణడు = విష్ణుమూర్తి, విడంబించి = హేళనచేసి, హాసో క్తులు = ఎగతాళి మాటలు, రోషమదసంభూత చేతస్కుండు = రోషము, మదము కలిసిపోయిన మనస్సు కలవాడు, కనుఁగ్రేవన్ = కంటితుదలందు, మిడుగుర్లు = నిప్పురవ్వలు, పొడమంగా = కనుపింపగా, కిన్కమై = కోపముతో, కృష్ణ + ఉరగరాజు మాడ్కిన్ = శ్రేష్ఠమైన నల్లత్రాచువలె, కీడ్పాటు = కీడు గలుగుట,

తా॥ ఈ విధముగా విష్ణుమూర్తి వరాహరూపమున నెదురు వచ్చి ఎగతాళి చేయగా హిరణ్యాక్షుడా పలుకులకు రోషముతో ఉలికెను కోపము, మదము మనసున నిండగా కన్నులెర్ర బడినవి కన్నుల చివళ్ళయందు నిప్పురవ్వలు రాలునట్లు కోపించెను తోక త్రొక్కిన నల్లత్రాచువలె మనసున చికాకుపడెను

(శత్రువును చూచి చికాకుపడుట అహంకార లక్షణము చికాకుపడి రోషపడినచో మనస్సు స్థిమితము చెడిపోవును కనుక శత్రువునకే లాభము )

662 టీక చలిత + ఇంద్రియుండు = చంచలమైన ఇంద్రియములు కలవాడు, నిగిడించుచున్ = పెద్దవి చేయుచు, బొమలు = కనుబొమలు, రోష + ఆకుల మానసుండు = రోషముచే చికాకు పడిన మనస్సు కలవాడు, జలజాక్షునకు = విష్ణుమూర్తికి

తా॥ ఇంద్రియములు చంచలములు కాగా కనుబొమలు బిగించి రాక్షసుడు కోపముతో చికాకుపడిన మనస్సు కలవాడై గదపట్టుకొని సాహసముతో విష్ణుమూర్తి కెదురు నడచెను

(ఇంద్రియములు చలించుట, మనస్సు చికాకుపడుట అహంకార పూరితమైన రోష లక్షణములు దాని వలన నెదుట నున్న వాడు కనుపింపడు ఇక నెదుట నున్న వానిలో అంతర్యామియైన నారాయణుడు కనిపించుట యెట్లు సంభవము? శత్రువు కనుపింపని స్థితిలో నెదుర్కొనుట వలన నోడిపోవుట జరుగును )

663, 664 టీక సారించి = ప్రసారము చేసి, మద + అసురేంద్రుఁడు = మదించిన రాక్షసరాజు, సమగ్రక్రోధుఁడు = నిండిన క్రోధము గలవాఁడు, గుదియన్ వ్రేసినన్ = కూలిపోవునట్లు కొట్టగా, వ్రేటు = దెబ్బ, సైకొనక = లెక్క చేయక, రక్షోహంత = రాక్షసులను జంపువాడు, శౌర్య + ఉన్నతిన్ = మించిన శౌర్యముతో కేలన్ = చేతితో, తునుకన్ = ముక్కలు, దైత్యుఁడు = రాక్షసుడు, ఉత్ + మదుఁడై = వెర్రెత్తిన వాడై, ఒండుగదన్ = మరియొక గదతో, రమావిభుని = లక్ష్మీపతియైన విష్ణువును, భీమ ప్రక్రియన్ = భయంకరమైన విధమున, వ్రేసినన్ = కొట్టగా,

తా॥ అతి భయంకర స్వరూపుడై వరాహస్వామి గదను చిగిరగిర త్రిప్పి, వరాహమూర్తిని చకితులబడునట్లు మోదను అతిగు లెక్క చేయక మించిన శౌర్యముతో ఆ వచ్చుచున్న గగను చేతపట్టి ముక్కలు చేసెను రాక్షసుడు వెర్రెత్తినట్లు మరియొక గద పెట్టికొట్టెను

665 టీక దనుజ + అరి = రాక్షసులకు శత్రువు, విష్ణుమూర్తి, గదారణ = గదాయుద్ధమున, కోవిద క్రియ + ఆస్పద = నేర్పరి తనములో కూడిన, కరలాఘవ క్రమమున్ = చేతి సుళువును, పైకొను = మించి, పేరురంబు = పెద్ద వక్షస్థలము, వివశ + ఆకుల భావము = ఒడలు తెలియక చికాకుపడుట, రిపుమాన

వివర్ధనున్ = శత్రువుల గర్వమును అణచువానిని, జనార్దనున్ = విష్ణుమూర్తిని

తా॥ ఆ విసరిన గద తన్ను తగులకుండ నేర్పరితనముతో వరాహమూర్తి నిపుణత చూపి తప్పుకొని గద పట్టుకొనెను పరాక్రమమున శత్రువును మించి తన గదతో వాని వక్షస్థలమున మోదెను అతనికి తెలివి తప్పెను మరల తెలివి తెచ్చుకొని అతడు విష్ణువును మోదెను

666 టీక తలపడి=ఎదుర్కొని, అన్యోన్య జయ కాంక్షలన్ = ఒకరినొకరు జయించుకొను కోరికలతో, ఇతర + ఇతర = ఒకదాని నొకటి, తుంగతరంగ తాడితంబులు = ఎత్తైన తరంగములతో కొట్టబడినవి, దక్షిణ + ఉత్తరసముద్రంబు = దక్షిణమున, ఉత్తరమున గల సముద్రములు (దక్షిణ ధ్రువమునకు, నుత్తర ధ్రువమునకు దగ్గరనున్న సముద్రములు) రౌద్రింబునన్ = క్రోధముతో, పరస్పర = ఒకదాని నొకటి, శుండాదండ = తొండములచే, ఘట్టిత=కొట్టబడిన, మదాంధ గంధ సింధుర యుగంబు= మదముతో కన్నుగానని ఏనుగుల జంట, రోషభీషణ = రోషముతో భయంకరమైన, ఆటోపంబులన్ = విజృంభణతో, బెబ్బులుల గబ్బునన్ = పెద్దపులుల వలె గర్వముతో, అతిదర్ప + అతిరేకంబు = మిక్కిలి దర్పము పెచ్చుపెరుగుట, మదవృషభంబులు = మదించిన ఎద్దులు, రభసంబునన్ = గందరగోళముతో, అసహ్య = సహింపరాని, సింహ పరాక్రమమునన్ = సింహము వంటి శౌర్యముతో, సవ్యమండల భ్రమణంబు = ఎడమ చేతి వైపు గిరున తిరుగుట, పరివేష్టించినన్ = చుట్టుకొని రాగా, దక్షిణ మండల భ్రమణంబునన్ = కుడి చేతివైపుగా గిరున

తిరుగుట, విపక్షువక్షంబు = శత్రువు వక్షస్థలము, అళని సంకాశంబు = పిడుగువంటిది, తెప్పిఱి = తేరుకొని, దనుజవరివంథి= రాక్షసుల శత్రువు, ఫాలంబున్ = నుదుటిని, మేటి వీరులు = గొప్ప శౌర్యము గలవారు, శోణిత సిక్తాంగులు = రక్తముతో తడిసిన దేహములు గలవారు, పుష్పిత + అశోకంబులు = పూచిన అశోక వృక్షములు, పురుడించుచున్ = సాటి యగుచు, పాయుచున్ = దూరముగా బోవుచు, డాయుచున్ = దగ్గరగా వచ్చుచు, వ్రేయుచున్ = కొట్టుచు, రోయుచున్ = వెదకుచు, రుధిరంబులు = రక్తములు, ఆఘ్రాణించుచు=వాసన చూచుచు, తిరస్కార పరిహాస+ఉక్తులన్ = లెక్కచేయక నగతాళి చేయు మాటలతో, పద్మసంభవుండు = బ్రహ్మ, నిఖిల మునీంద్ర = సమస్త మునిశ్రేష్ఠుల ధరిత్రీ నిమిత్తంబున = భూదేవి కారణముగా, అసురవరుని గోడన్ = రాక్షస శ్రేష్ఠునిలో,

తా॥ ఇట్లు కలియబడి యొకరినొకరు జయించు పట్టుదలతో నెదుర్కొనుచుండిరి ఉత్తర దక్షిణ సముద్రములు పొంగి యొకదాని అల లింకొక దానిపై కొట్టుకొనుచున్నట్లుండెను రెండు మదపుటేనుగులు కలబడున ట్లుండెను మిక్కిలి కసితో కలబడిన రెండు పెద్ద పులుల వలె వారు భయంకరముగా పోరిరి హిరణ్యాక్షుడు వేగముగా తన యెడమ వైపునకు తిరిగి వరాహమూర్తి గుండెలపై పిడుగు పడినట్లు గదతో మోదెను ఆతడు తన కుడి ప్రక్కకు తిరిగి తప్పుకొని మరియొక పిడుగు వంటి దెబ్బ తన గదతో రాక్షసుని గుండెలపై కొట్టెను రాక్షసుడు దిమ్మెరపోయి మరల తెలివి పొంది వరాహమూర్తి నుదుటిపై గొట్టెను. ఇద్దరు రక్తముచే తడిసిపోయిన దేహములు కలవారై పూచిన ఎర్రని అశోక వృక్షములవలె దగ్గరకు వచ్చుచు మోదుచు, వెనుకకు పోవుచు మరల నొకరినొకరు వెదకికొని దగ్గరకు వచ్చుచుండిరి ఒకరి నెత్తు

రాక్షసు వాసన చూచి శిరస్కారముగా సంభాషించుకొనుచుండిరి ఆ మహా బలవంతుల యుద్ధము చూడవలెనను వేడుకతో చతుర్ముఖ బ్రహ్మ సమస్త మునీంద్రులతో, సిద్ధులతో సాధ్యులతో, దేవ గణములతో వచ్చెను భూదేవి నిమిత్తముగా రాక్షసునితో పోరాడుచున్న వరాహమూర్తిని చూచి యిట్లనెను

( బ్రహ్మ సృష్టిలో దేవతల దరు దేహ నిర్మాణమునకై యొకచోట చేరుదురు ఆ దేహములతో కొందరు మునీంద్రులు, సిద్ధులు, సాధ్యులుగా సాధన చేసి తరింతురు దేవతలుగా సద్గుణములు సాధింప బడును

ఇక మిగిలిన సంసారబద్ధులైన జీవులలో అహంకారమునకు అంతర్యామికి పోరాటము జరుగుచుండును అది దేహ మనబడు మట్టిముద్ద నిమిత్తముగా జరుగును దానిని చూచుచు తరించిన వారు ఆ పోరాటమున దైవలీలలను గమనించుచుందురు )

667 టీక అంచిత దివ్యమూర్తి = ఒప్పారుచున్న దివ్యమైన రూపము కలవాడ, కలుషాత్ముడు = పాపాత్ముడు, నక్తంచరుడు = రాత్రియందు చరించువాడ, అస్మదీయ = మా యొక్క, వరగర్వమునన్ = వరములచేత పొందిన గర్వముతో, భువనంబులు = లోకములు, కారించునే = బాధపెట్టును, ఉపేక్షించుట = నిర్లక్ష్యము చేయుట, వసుంధరకున్ = భూదేవికి బలి సేయుము = సంహరింపుము లేక బలవంతునిగా చేయుము ,

తా॥ ఓ దివ్యరూపా! నీవు పరమాత్ముడవు ఇతడు పాపాత్ముడు రాత్రియందు చరించు రాక్షసుడు మే మిచ్చిన వరముల గర్వముతో మదించి లోకము లన్నింటిని బాధ పెట్టు చున్నాడు వీని ప్రవర్తనము సృష్టికి వ్యతిరేకము నీవు వీనిని

జంపక యిట్లు నిర్లక్ష్యము చేయుట తగదు వెంటనే వానిని బలి చేయుము భూదేవికి శుభమగును

( 1 నక్తంచరు డనగా రాత్రులందు చరించువాడు లేక రాక్షసుడు యోగసిద్ధునకు ఏది రాత్రియో అది రాక్షస లక్షణము గలవానికి పగలు అనగా యోగసిద్ధుడు ఆత్మతో ప్రకాశించును అతని యందు ఇంద్రియములు, మనస్సు, కోరికలు, కర్మలు, ఫలములు ప్రకాశింపవు కనుక వానికది రాత్రివంటిది వానియందే అసుర గుణములు కలవారు జీవించి చరించుచుందురు గనుక రాక్షసులు రాత్రి బలము గలిగి చరించువారని శాస్త్రము చెప్పును అహంకార స్వరూపుడైన వాడు ఈ ఇంద్రియాదులతో గూడిన రాత్రియందు చరించును వానిని భగవంతు డంత మొందించినచో శుభమగును

2 భూదేవికి శుభమగుట అనగా భౌతిక దేహములకు క్షేమము కలుగుట అంతర్యామిని దర్శించి అహంకారమును పోగొట్టుకొనినవారి నడుమ మాత్రమే జీవుల దేహములకు క్షేమము కలుగును అపుడే సృష్టికర్తయైన బ్రహ్మ చేసిన సృష్టికి సార్థకత కలుగును )

6ు8 టీక కరము నన్ = చేతియందు, ఉగ్రవ్యాళము = భయంకరమైన సర్పమును, ఆడు వడువునన్ = ఆడుకొనునట్లు, రక్షః పాలునిన్ = రాక్షసనాయకుని, తుంపక = చంపక, పాలార్చుట = ఉపేక్షించుట,

తా॥ పిల్లవాడు చేతిలో భయంకరమైన సర్పమును పట్టుకొని ఆడుకొనుచున్నట్లు, రాక్షసనాయకుని చంపక నీ విట్లు విలంబనము చేయుట నీతియగునా? లోకములకు శుభమగునా?

(భగవంతుని అనుగ్రహము కలుగ నంతవరకు జీవుల యందహంకారము చావదు అట్లుబాధపడువారి యెడల కాల విలంబనము చేయుట బాగు లేదని యర్థము )

669, 670 టీక అనఘా! = పుణ్యాత్ముడా!, అభిజిత్ + ముహూర్తమున = సూర్యోదయము తరువాత పదునాలుగు గడియలనుండి పదునారు గడియల వరకు గల కాలము, దేవారాతిన్ = దేవతల శత్రువును, మర్దింపనేన్ = అణగగొట్టనిచో, అనయంబున్ = నిశ్చయముగా, దైత్యవేళ = రాక్షసకాలమున, ఘనమాయాబలశాలి = గొప్ప మాయాబలము గలవాడు, దనుజున్ = రాక్షసుని, ఖండింపఁగారాదు = చంపుట సాధ్యము కాదు, సజ్జనహిత = మంచి వారి మేలు గొరకై పాౕ + ఉద్యోగ = సంకల్పమునందు, రక్తుండవై = ఆపేక్ష గలవాడవై,

తా॥ ఇంకొక విషయము గమనింపుము నీ వీ అభిజిత్కాలమున రాక్షసుని సంహరింపనిచో ఆలస్యమగును సంధ్యవేళ సమీపించినచో రాక్షసునకు మాయా బల మెక్కువగును అపుడు వానిని జంపుట దుష్కరము కనుక నీ విప్పుడే వాని సంహరించి మంచివారికి హితము కలిగింప సంకల్పింపుము

(మిట్ట మధ్యాహ్నమున కటునిటు రెండు గడియల కాలము అభిజిత్ అనబడు ముహూర్తము ఆ సమయమున రాక్షసుని జంపుమని చతుర్ముఖుడు వరాహమూర్తిని వేడుకొనుచున్నాడు

రాత్రికాలము వంటిది సంసారి బద్ధుల జీవితము అందు మాయకు బల మెక్కువ యుండుచు అసుర శక్తులు జీవితమున విజృంభించును పగటికాలము వంటిది ఆత్మదర్శనము చేయువాని జీవితము అందు మాయకు బలము తక్కువ మిట్టమధ్యాహ్నము

వంటిది ఎరబ్రిహ్మాను తెలిసికొనవలసిన జీవితము అపుడే అహంకార మంతరింపవలెను నడి నెత్తిపై సూర్యుడున్న కాల మైన మిట్ట మధ్యాహ్నమును సహస్రారమందు మేల్కొని ప్రిష్ఠ కలవారి జీవితముగా శాస్త్రకులు చెప్పెను

జననము సూర్యోదయము వంటిది మరణము సూర్యాస్తమయము వంటిది మిట్ట మధ్యాహ్నము నడివయస్సు వంటిది ఉదయసంధ్య బాల్యమువంటిది అస్తమయ సంధ్య ముసలితనము వంటిది జన్మించినవాడు నడివయస్సు వచ్చుసరికి తాను బాల్యయవ్వన వయస్సులలో చేయవలసిన సాధనతో మేల్కొని అహంకారమును దమించి అంతర్యామిని గుర్తింపవలెను లేనిచో వయస్సు దేహపటుత్వ ముడిగి మాయ రూపమున వార్ధకము, మృత్యువు సమీపించును ఆ జన్మ వ్యర్థ మగును అట్లయినచో సజ్జనులకు మేలు చేసినట్లు కాదు)

671 టీక సరసిజగర్భుఁడు=బ్రహ్మ, అర్థిన్ = కుతూహలముతో, నిలింపులు=దేవతలు, సస్మిత + ఆనన వనజము = చిరునవ్వుతో గూడిన ముఖపద్మము, చెలువొందఁగ=అందము చె దగా, అసురవరుకు = రాక్షసశ్రేష్ఠునకు, అభిముఖుఁడై = వానివైపు మొగము త్రిప్పిన వాడై,

తా॥ ఇట్లు బ్రిహ్మ పలుకులు విని వరాహమూర్తి చిరునవ్వుతో రాక్షసశ్రేష్ఠుని వైపు తిరిగెను దేవత లందరు గుమిగూడి చూచిరి

672 టీక పుండరీకాక్షుఁడు=తెల్లతామర పువ్వులవంటి కన్నులు గలవాడు, భూరి రోషనిరతిన్ = మిక్కిలి రోషమందలి అతిశయముతో, తరుణ+అరుణ అంభోజనేత్రుఁడు = క్రొత్త

ఎఱ్ఱతామర పువ్వులవంటి కన్నులు గలవాడు, హానుపున్ = ముట్టెను, ఓసరించెన్ = తప్పుకొనెను,

తా॥ తెల్లతామర పువ్వుల రేకలవంటి కన్నులుగల వాడైన యసురుని మిక్కిలి రోషముతో వరాహమూర్తి ఎఱ్ఱతామర పువ్వుల కన్నులతో నొప్పారెను పెద్ద గదాదండ మెత్తి రాక్షసుని ముట్టెపై భయంకరముగా గొట్టెను రాక్షసుడు యుక్తితో తప్పుకొనెను

673 టీక పరువడి = వెనువెంటనే, దితి సుతుఁడు = దితి కొడుకగు రాక్షసుడు, చిత్రగతులను = విచిత్రమైన వరుసలలో, పద్మోదరున్ = విష్ణుమూర్తిని, డాసి = సమీపించి, సాగరమునన్ = సముద్రమున, బాహుగర్వము = భుజబలము, ఎలర్పన్ = అతిశయింపగా,

తా॥ వెంటనే రాక్షసు డతి భయంకర మైన గదను చేపట్టి చిత్రములైన వరుసలలో విష్ణుమూర్తిని సమీపించి అతని చేతిలోని గద యెగిరి సముద్రమున పడునట్లుగా కొట్టెను గద యెగిరిపోయి పడినది రాక్షసుడు గర్వముతో నవ్వెను

674, 675 టీక నిరాయుధుఁడు = ఆయుధము లేనివాడు, సురారి = రాక్షసుడు, యుద్ధంబుఁదక్కి = యుద్ధము మాని, నింగిన్ = ఆకాశమునందు, భరిత మయ్యెన్ = నిండెను,

తా॥ అపుడు వరాహమూర్తి నిరాయుధు డయ్యెను రాక్షసుడు యుద్ధ ధర్మమును పాటించెను ఆయుధము లేని హరితో యుద్ధము చేయలేదు వాని ధర్మ బుద్ధికి మెచ్చుకొని ఎల్లవు యుద్ధము చేయక నిలచి చూచు చుండెను ఆకాశమున గమనించు చున్న దేవతలు హాహారవములు చేసిరి

[ అహంకారము వలన రాక్షస గుణము గల్గ్కట ఫ్రుట్టుట లేదు ధర్మ గుణములు గూడ పుట్టును నేను ధర్మమాచరించు చున్నాను ధర్మబుద్ధి గలవాడను అధర్మయుద్ధముగ నితరులను చంపను నేను దానబుద్ధి గలిగి పెక్కుమందికి నుపకారములు చేసితిని చాలమంది జీవితములు నిలబెట్టితిని " అని చెప్పుకొనుటకు అహంకారులు కూడ ధర్మబుద్ధి, పరోపకారము ప్రదర్శింతురు దానిం గూడ మెచ్చుకొని అంతర్యామి యగు దైవము సంతోషించెను ]

676 టీక సరసిజ నేత్రుఁడు=విష్ణుమూర్తి, గనుఁ+ ఈశ్వరు = రాక్షసరాజుయొక్క, సంగరధర్మము గనిన్ = యుద్ధ ధర్మమునకు, సమధిక శౌర్య స్ఫురణకుని = మిక్కిలి పరాక్ర మీరత్వము పరికాశించుటకు, కరము + ఆశ్చర్యము = మిక్కిలి యాశ్చర్యము, కడంక దలిర్పన్ = పట్టుదల చిగురొత్తగా,

తా॥ హిరణ్యాక్షుని యుద్ధ ధర్మమునకు మహా పరాక్రమము నకు వరాహమూర్తి మిక్కిలి యాశ్చర్యము చెందెను మరల పట్టుదలతో ప్రారంభించెను.

(వరాహమూర్తి చేతి గోని ఆయుధము జారిపోయి నపుడు నిరాయుధుఁడు గనుక వానితో యుద్ధము చేయక హిరణ్యాక్షుడు యుద్ధ ధర్మమును పాటించెను దానికి దేవుడు సంతోషించెను లోకమున సత్కర్మాచరణకు ధర్మ మార్గమును లోకమున ప్రకా శింప జేయుటకు గూడ నహంకారమే కారణమగును అట్టివా రహంకారముతో ధర్మము పాటించినను దైవము మెచ్చునని యిందలి వేదార్థము )

677 టీక కుతల + ఉద్ధర్త = భూమి నుద్ధరించినవాడు

(వరాహమూర్తి), మనంబునన్=మనస్సులో, రక్షోరాట్ + వధార్థంబు = రాక్షస రాజును వధించుటకొరకు, దితి సంతానకుల= దితి పుత్రుల వంశమనబడు, అటవీ = అడవియందు, మహిత= విస్తరింప జేయబడిన, సందీప్తప్రభా = వెలుగొందిన కాంతులు గల, శుక్రమున్ = అగ్నిహోత్రము కలదానిని, సతత + ఉద్యత్ = ఎల్లప్పుడు వృద్ధి బొందుచున్న, జయశబ్ద = జయ అను శబ్దముచే, సత్ + ముఖర = ఆకాశమును ధ్వనింపజేయు చున్న, భాస్వత్ + చక్రమున్ = ప్రకాశించుచున్న దిక్చక్రము గలదానిని, సంతత + ఆశ్రిత=నిరంతర మాశ్రయించిన వారికి, నిర్వక్రముగ=అనుకూలమైన దానిని, పాలిత=పరిపాలింపబడిన, ప్రకటధాత్రీ చక్రమున్ = ప్రసిద్ధమైన భూచక్రము గలదానిని, చక్రమున్ = సుదర్శన చక్రమును,

తా॥ రాక్షసవంశ మనబడు అడవి యందు వ్యాపించి, మండించుచు వెలుగునట్టి అగ్నిహోత్రము వంటిది విష్ణుచక్రము అది బయలుదేరినపుడు దిక్కుల చక్రమాదెల్లెడల జయ జయ ధ్వానములు ప్రతి శబ్దము చేయును అది ఆశ్రయించిన వారి నెపుడును వేరులేక కాపాడును ప్రసిద్ధమైన యీ భూచక్రము మొత్తమును తానే పరిపాలించుచుండును అట్టి సుదర్శన చక్రమును రాక్షస సంహారము కొరకై వరాహమూర్తి మనస్సున స్మరించెను

678 టీక ప్రచండ = భయంకరమైన, మార్తాండ మండల = సూర్యమండలము యొక్క, ప్రభాపటం = కాంతుల సమూహమువలె, చటుల విద్యోతమానంబు = భయంకరముగా వెలుగుచున్నది, పటునటత్ = మిక్కిలి పటిష్ఠముగా నటించు చున్న, జ్వాలికా + అపాస్త=మంటలచే తొలగింపబడిన, సమస్త

కుపిత+అరాతి=కోపించిన సర్వశత్రువులయొక్క, బల+అఖర్వ=
బలమునందు కుంటుపడని, దుర్వార = వారింపరాని, భుజా
గర్వ+అంధకారంబు=భుజబల గర్వమనబడు చీకటి, అసహ్య=
సహింపరాని, కహాకహ నినద = కహకహమను శబ్దములచే,
అధరీకృత = క్రిందు చేయబడిన, సాగర ఘోషంబు=సముద్రపు
హోరు, సకలదేవతాగణ = సమస్త దేవతల సమూహములచే,
జేగీయమానము = కీర్తింప బడుచున్నది, నిజప్రభాపటల =
తన కాంతుల గుంపులచే, పూరిత = నింపబడిన, బ్రహ్మాండ కటా
హంబు = బ్రహ్మాండపు డిప్పగలది, రయంబునన్ = వేగముగా,
దనుజారి = విష్ణుమూర్తి, దక్షిణకర సరోజంబు = పద్మమువంటి
కుడిచేయి, శుభాంగుండు = శుభలక్షణములు గల దేహము
గలవాడు, రథాంగపాణి = చేతియందు చక్రము ధరించినవాడు,
అమరగణంబులు = దేవతల గుంపులు,

తా॥ ఆ సుదర్శన చక్రము భయంకరమై సూర్యమండ
లము వంటి కాంతుల గుంపులతో భీకరముగా మెరసిపోవు
చుండెను కోపించిన శత్రువుల మొత్తము యొక్క బలమునకు
లొంగక ఆ శత్రువుల బాహుగర్వమను చీకటిని పారద్రోల
గలిగి నట్టిది అది తిరుగుచుండగా వచ్చునట్టి రివ్వురివ్వుమను
శబ్దములు సముద్ర గర్జనను వినుపింపకుండ జేయుచున్నవి సకల
దేవతల గణములు స్తోత్రములు చేయుచున్నారు అనంతమైన
తన తేజస్సుచేత మెరసిపోవుచు బ్రహ్మాండపు డిప్ప లోపలి
భాగమును నింపివైచుచు వేగముతో వచ్చెను వచ్చి ఆ చక్ర
మును వరాహమూర్తి కుడిచేతి నలంకరించెను అతడు దానితో
శుభమైన మూర్తియై వెలుగొందెను ఆకాశమున దేవతలందరు
జయము జయమని స్తుతించుచుండగా వరాహము హిరణ్యాక్షుని
కెదురు నడచెను

679 టీక పొడగని = దాని లక్షణములు చూచి, దనుజుఁడు = రాక్షసుడు, పాలివోని = వ్యర్థము గానట్టి, బ టు తనమునన్ = శౌర్యముతో, బేరంబు + ఉడుగక = వీర్యమున తగ్గక, భీమణగదన్ = భయంకరమైన గదతో, అడిచెన్ = అణగిపోవునట్లు కొట్టెను, మఖమయవరాహ న్ = యజ్ఞమే దేహముగా గల వరాహమూర్తిని, అమిత + ఉత్సాహున్ = మిక్కిలి ఉత్సాహము కలవానిని,

తా॥ చక్రివ ధరించిన వరాహమును చూడగనే రాక్ష సునికి దడబుట్టి నోరెండెను పట్టుదల విడువక పెదవులు తడుపు కొనుచు మహా శౌర్యముతో తన భయంకరమైన గదపెట్టి అణగు నట్లు గొట్టెను

680 టీక త్రిదశ + అరి = దేవతల శత్రువు, హిర ణ్యాక్షుడు, వేసినన్ = కొట్టగా, కమలాక్షుఁడు = విష్ణువు, పెంపు + ఒదవఁగన్ = విస్తారత కలుగునట్లుగా, మోదము గదు రఁగన్ = సంతోషము కలుగగా, లేనగవు = లేత నవ్వు వదన కమలమున్ = ముఖపద్మమున, పొదువగ = హత్తుకొనగా,

తా॥ రాక్షసరాజు విసరిన గద ప్రక్కకు పడునట్లు కాలితో తన్ని వరాహము చిరునవ్వు నవ్వుచు నిలబడెను

681 682 టీక ఘనగదన్ = పెద్దగదను, కేలఁ బూని = చేత పట్టుకొని, భుజగర్వము = బాహుబలము, ఎల ర్పఁగన్ = అధికము కాగా, సంగర + అవనిన్ = యుద్ధభూమియందు అనివారణన్ = వారింపరానట్లు, దైత్యకుల + ఈశ్వర + అధముా = రాక్షస రాజులలో నీచుడా, ఉబ్బి = సంతోషపడి, అంబుజ నాభునిన్ = విష్ణువును, వేసెన్ = కొట్టెను, దనుజ విభేది =

రాక్షసులను జంపువాఁడు, విష్ణువు, తార్క్ష్యఁగు = గరుత్మంతుడ
అహి+ఇంద్రినిన్ =సర్పరాజును,

తా॥ ఇట్లు రాక్షసుడు ప్రయోగించిన గదను ప్రక్క
తన్ని వరాహ మిట్లనెను "శాహుబలము సాహించుచున్న పెద్ద గ
పట్టుకొని యుద్ధభూమి కో నన్నెదిరింప రమ్ము నీ కెవ్వరడ్డు లేరు
నీవు రాక్షసరాజులలో అల్పుడవు ' అనగా విని ఉత్సాహముతో
హిరణ్యాక్షుడు మరియొక గదపెట్టి వరాహమును కొట్టను గ
త్మంతుడు సర్పరాజును పట్టుకొని నట్లు వరాహ మా గదను ఒ
పుగా పట్టుకొనెను

683 టీక దివిజాఁడు=రాక్షసుడు, అప్రతిహత తేజుంగు=
ఎదురులేని తేజస్సు గలవాడు, సరోరుహాక్షుని = విష్ణుమూర్తి
యొక్క, శౌర్య+ఉన్నతి = శౌర్యముయొక్క గొప్పదనము
పేర్మిన్ = అధికత చే,

తా॥ విష్ణుమూర్తి యెదురులేని తేజస్సు గలవాడనియు
నతని బలముమీద తన బలము చాలదనియు తెలిసికూడ రాక్షసుడు
మిక్కిలి దురభిమానముతో పెనగులాడెను

684, 685 టీక కాలానల = కాలాగ్ని, జ్వలత్+
జ్వాలా=మండుచున్న మంట, విలోల=వివిధముగా, కదలుచున్న
కరాళము=భయంకరము, సురవైరి=రాక్షసుడు, యజ్ఞ సూకర
రూపధరుఁడు = యజ్ఞ వరాహరూపము ధరించినవాడు, వనజ
నాభుని మీఁదన్ =విష్ణుని మీద, వైవన్ = విసరగా, సత్+
ద్విజోత్తము మీఁదన =మంచి బ్రాహ్మణుని మీద, చపలగతి=
చాంచల్యముతో, అభిచారకర్మంబు=శత్రువును చంపునట్టి కర్మ
కాండము, బెండువడి=నిస్సారమై, పఱతేన్ = పరుగెత్తిరాగా,

పద్మోదరుఁడు = విష్ణువు, చక్రధారాహతిన్ = చక్రపుటంచు దెబ్బతో, చండ విక్రమమునన్ = భయంకరమైన శౌర్యముతో, వడిన్ = వేగముగా, అమరభర్త = దేవతలను భరించువాడు, విష్ణువు, మహిత = గొప్పదియైన, దంభోళిచేన్ = వజ్రముచేత, పక్షము = రెక్క, సురలు మో దింపన్ దేవతలు సంతోషింపగా, సొంపు డింపన్ = శోభ తొలగిపోగా,

తా॥ ప్రళయ కాలాగ్ని మంటలవలె కణకణలాడుచు భయంకరమైన శూలమును రాక్షసుడు వరాహము మీదకు విసరెను సద్బ్రాహ్మణుని మీద ప్రయోగించిన చేతబడివలె ఆ శూలము వ్యర్థమై పనిచేయక వచ్చుచుండగా వరాహము చక్రముతో దానిని నడుమనే తుంచెను వజ్రాయుధముచే గరుత్మంతుని రెక్క ఈక యెంత కష్టముగా తునిగెనో అంత కష్టముగా రాక్షసుని శూలము తునిగెను దేవతల మొగములు వికసించినవి రాక్షసుల మొగములు ముడుచుకొనినవి

686, 687 ఆ + అవసరంబునన్ = ఆ సమయమున, నిహతంబు = కొట్టబడినది, దితిజుఁడు = రాక్షసుడు, రోష + ఉద్ధతుఁడు = రోషముచే అదరి పడినవాడు, అతి నిష్ఠుర ముష్టిన్ = అతికఠినమైన పిడికిలితో, కుసుమ మాలాహతిన్ = పుష్పమాలచే కొట్టబడి, దిగ్గజరాజు = దిగ్గజములలో శ్రేష్ఠుడైన ఐరావతము,

తా॥ ఆ సమయమున తన శూలము చక్రముచే దెబ్బతినుట చూచి హిరణ్యాక్షుఁడు కడు రోషముతో వరాహమును కఠినముగా పిడికిట పొడిచెను పుష్పమాలతో కొట్టబడిన ఐరావతము వలె వరాహము దర్పించి నవ్వెను

688 టీక దితిసంభవుండు = రాక్షసుడు, భూరిపాంసు

పటల ధ్వాంతంబు=మిక్కిలి ధూళి రేణువులు క్రమ్ముటచే కలిగిన చీకటి, భీకర = భయంకరమైన, పాషాణ = రాతిబండలు, పురీష మూత్ర = మల మూత్రములు, ఘనదుర్గంధ=మిక్కిలి చెడువాసన, అస్థిరక్తవళుల్ = ఎముకలు, రక్త ధారలు, అభ్రవీధినన్ = ఆకాశ మార్గమున, మహాక్షోభ క్రియా లోలమై=మిక్కిలి కలవరపాటు తాండవించుటచే చీకాకుపడినది

తా॥ హిరణ్యాక్షునిగు వరాహామూర్తిమీద కోట్ల విధము లుగ రాక్షస మాయలు పుట్టించెను భూమిపై ధూళి రేగి చీకట్లు క్రమ్ముకొనెను ఆకాశమునుండి మలమూత్రములు, దుర్వాసనతో కూడిన యెముకలు, రక్తము, బండలు వర్షించినవి మేఘములనుండి కురిసిన యిట్టి వర్షము దిక్కులను చీకాకు పరచెను

(అహంకారమునకు దైవముతో పోరాటము కలిగినపుడు జీవుల జీవితములందు పట్టుదలలు, కోపము, పోరాటములు, రోగ ములు, మలమూత్రములు బంధింపబడుట, ఎముకలు, రక్తము కుళ్ళి కంపుకొట్టుట మొదలగు మాయాబద్ధమైన కష్టకాలము గడచును)

689 690 తవిలి=పూని, విముక్తకేశ పరిధానములు= జుట్టు విరియబోసికొని వస్త్రములు విప్పివేచినవి, ఉగ్రకరాళ దంతతాలువులు = భయంకరమైన విషపుకోరలు, గడలు గలవి, రక్తలోచనములు = ఎర్రని కన్నులు, నివహములు = సమూ హములు, గజ+ఆయుధపాణులు = తమ ఆయుధములను పట్టు కొనిన వారు, మహారవముగన్ = మిక్కిలి శబ్దముతో,

తా॥ మరియును భూతములు, పిశాచములు, ఢాకినులు జుట్లు విరియబోసికొని నగ్నములై తాండవించినవి యక్షులు,

దైత్యులు అంతరిక్షమున తమతమ ఆయుధములను ధరించి పెద్దగా నరచుచు చతురంగ బలములతో కూడి నడచిరి

(ఇందు వర్ణింపబడిన భూత పిశాచాదులు కామమునకు సంబంధించిన ఆవేశములు యక్షులు, దైత్యులు క్రోధమునకు సంబంధించిన ఆవేశములు అహంకారము కారణముగా దేహ ధారులైన జీవులలో కామ క్రోధములు పెచ్చుపెరిగి తమ చేష్టలను చూపించెనని యర్థము కామము పెరిగినచో నగ్నముగా విహరిం తురు క్రోధము పెరిగినచో యుద్ధసన్నాహమున చత్తురు)

691, 692 టీక త్రిపవనపాదుండు = యజ్ఞమందలి మూడు స్తోత్రములు తన పాదముల నడకలగా గలవాడు, వరా హామూర్తి, బిసరుహనేత్రుండు = కమలములవంటి కన్నులు గలవాడు, లోకభీకరము=లోకమునకు భయంకరము, అసుర + అనిపు = రాక్షసరాజుయొక్క, మాయావినిరసన కరంబు = మాయను పూర్తిగా తిరస్కరించు నట్టిది, శస్త్రరాజమున్ = శస్త్రములలో గొప్పది, చక్రము,

తా॥ యజ్ఞమూర్తి యగు వరాహము లోక భయంకర మైన రాక్షసుని మాయను తిరస్కరించుటకై శస్త్రములలో శ్రేష్ఠ మైన చక్రమును ప్రయోగించెను

693 టీక చక్రభానుదీప్తి = చక్రముయొక్క కిరణ ముల కాంతి, ధరాచక్రము = భూచక్రము, మాయాచక్రము మాయల వరస, నీచక్రముఁడు = నీచమైన ప్రవర్తన కలవాడు, యామినీచరుఁడు = రాత్రి చరించువాడు (రాక్షసుడు),

తా॥ ఆ చక్రముయొక్క కిరణకాంతులు భూచక్రము నిండి వేగముతో రాక్షసుని కంటి యెదుటనే వాని మాయల నన్నింటిని మాయము చేసెను

694, 695 టీక తిగ్మ విభు వాక్యంబుల = తిన భర్త మాటలయొక్క, శోణితధారలు = రక్తధారలు, రక్షఃపతి = రాక్షసరాజు, సనకాత్మ = హిరణ్యాక్షుని యొక్క, పతన భావము = పడిపోవుటను నభిప్రాయము,

తా॥ ఇంటనున్న దితిదేవికి స్తనముల నుండి రక్తధార లొలికెను తన భర్త కశ్యపుని పలు కెట్లును తప్పదనియు, హిరణ్యాక్షుడు చనిపోవుననియు నామె మనమునను శోచెను

696 టీక అ + అవసరంబునను = ఆసమయమున, అసుర విభుండు = రాక్షసరాజు, మాయా శతంబులు = వందలకొలగిమాయలు కృతిమన్ననకున్ = మేలుమరచినవానికి, పొలివోవని = మొక్క బోని, బంటుతనంబునను = శౌర్యము, పుండరీకాక్షుని = విష్ణువును, బాహాయుగళంబు = రెండు చేతులు, పంది = ప్రయత్నించి, పోరిచి = యుద్ధమున కలబడి రక్షోవైరి = రాక్షసుల శత్రువు,విష్ణువు, వక్షంబునన్ = గుండెలను, పీడించినన్ = నొక్కగా, అధోక్షజుండు = అధోలోకములకు దిగిన నీర్యము గలవాడు, విష్ణుమూర్తి తలంగి నన్ = తొలగగా, తెలంగి = చెలరేగి, దైత్యుండు = రాక్షసుడు, నిష్ఠురంబగు ముష్టిన్ = కఠినమైన పిడికిటి పోటుతో అసుర + అంత కుండు = విష్ణువు, మిడిమిండిసుడు = అలసటపడినవాడు, రోష భీమ + ఆకారంబుననన్ = రోషముతో భయంకరమైన యాకార మున, వాసవుండు = ఇంద్రుడు, తెగటార్చిన = చంపిన, వరి = ఇంద్రుడు, వజ్ర సన్నిభంబు = వజ్రమువంటిది, కఱకు + అసుర = మోటువాడైన రాక్షసుడు, కటకటంబున్ = కణతల ప్రక్కన, చటులగతిన్ = భయంకరమైన విధమున, వేసినను = కొట్టగా, ఉదస్తలోచనుండు = మిడిగుడ్లు బడినవాడు, సోలి = అలసి,

తా॥ ఆ సమయమున తాను ప్రయోగించిన పలువిధము లైన రాక్షసమాయలు విశ్వాసము లేనివానికి చేసిన ఉపకారముల

వలె వరాహము మీద పనిచేయక నిష్ఫలము లయ్యెనని హిరణ్యాక్షుడు గ్రహించెను అయినను అధైర్యపడక మొక్కబోవని శౌర్యముతో విష్ణుమూర్తిని సమీపించెను రెండుచేతులు చాచి విదలించి వరాహమూర్తి గుండెలపై కొట్టి నొక్కిపట్టెను వరాహము తప్పించుకొని నిలబడగా రాక్షసుడు భయంకరముగా పిడికిటి పోటుతో నొప్పించెను వరాహమూర్తి అలసట చెందక భయంకరుడై విజృంభించెను ఇంద్రుడు వృత్రాసురుని చంపుటకు వజ్రము ప్రయోగించినట్లు తన అరచేతితో రాక్షసుని కణతపై కఠినముగా మోదెను హిరణ్యాక్షుడు గిరగిర తిరిగెను గుడ్లు తేలవైచి తెలివి దప్పి మరల నెట్లో తెలివి తెచ్చుకొని ఎదిరించి నిలబడెను

697 టీక దిటచెడి=పటుత్వము దప్పి, సటికిన్=జూలు గలవానికి, దంష్ట్రావిభిన్న=కోరలతో బ్రద్దలు కొట్టబడిన, శత్రుమహః+ఉరస్+తటికిన్=శత్రువుయొక్క విశాలమైన వక్షస్థలము కలవానికి, ఖరఖురపుటికిన్=తీవ్రమైన గిట్టల చేర్పుగల వానికి, కటితట ఘాత=నడుము భాగమున తాకబడిన, కమలజ+అంతఘటికిన్=బ్రహ్మాండమను ఘటము కలవానికి,

తా॥ ఆ దెబ్బతో హిరణ్యాక్షుడు పట్టుదప్పి వరాహమూర్తికి లొంగిపోయెను వరాహము కోరలు శత్రువుల గుండెలు చీల్చ గలిగినవి అతని గిట్టలు కడువాడియైనవి ఈ బ్రహ్మాండము మొత్తము ఒక కుండవలె ఎధజింపబడి యున్నది

698 699 దివిన్=దేవలోకమున, కర్ణమూలంబునన్=చెవి క్రింద, పవిసంకాశ=వజ్రాయుధమువంటి కఠోరహస్తమున్=

కరినమైన చేతితో, శుంభత్ + లీలమై = క్రీడవలె పరికాశించుచు దానవన్ = దానితో, దానవలోక + ఈశుండు = రాక్షసలోకమునకు రాజు, రక్తనేత్రుడు = ఎర్రబడిన కన్నులు గలవాడు, దైన్యంబు = దీనత్వము, సోలెన్ = గెలివి దప్పెను, మారుతహత + ఉన్మూల + అవనీజ + ఆకృతిని = గాలిదెబ్బకు వేళ్ళు పెల్లగిలిన వృక్షమువలె,

తా॥ దేవలోకము నుండి యుద్ధము చూచుచున్న ఇంద్రాదులు సంతోషించునట్లుగా వరాహము తన వజ్రాయుధము వంటి కఠినమైన హస్తముతో హిరణ్యాక్షుని మొఖమైన కొట్టెను రాక్షసుడు కన్ను లెర్రబడి దీనుడై గాలికి వేళ్ళతో పెల్లగిలిన మహావృక్షమువలె నేలపైబడి కెలివితప్పెను

700 టీక వెకరూపము = వికృతాకారము, వెలికుఱుకన్ = వెలుపలకు రాగా, పండ్లు గీటుకొనుచు = పండ్లు కొరుకుచు,

తా॥ అతడు బుడ బుడ నెత్తురు గ్రక్కుచు గుండ్లు మీదికి రాగా పండ్లికిలించి కొరుకుచు వికృతమైన రూపముతో ప్రాణములు విడిచెను

701 టీక పద్మసంభవ + ఆది = బ్రహ్మ మొదలగు, దివిజులు = దేవతలు, వెఱగందిరి = ఆశ్చర్యపడిరి,

తా॥ అట్లు కూలిన హిరణ్యాక్షుని జూచి బ్రహ్మ మొదలగు దేవత లందరు వీనికిట్టి దురవస్థ చెందుట యేల? అని ఆశ్చర్యపడిరి

702 టీక వరయోగీంద్రులు = ఉత్తములైన యోగులు, మనోవీధిన్ = మనస్సునందలి మార్గమున, లింగశరీర భంగమునకై = లింగ శరీరమును పోగొట్టుకొనుటకై, పంకజ + ఉదరు = విష్ణు

మూర్తియొక్క, పాణి + ఆహతిన్ = చేతి దెబ్బకు, తత్ + ముఖాంబు రుహామున్ = వాని ముఖపద్మమును, దుర్భరిత + ఉత్తింసుఁడు = భరింపరానివారిలో శ్రేష్ఠుఁడు దైత్యవల్లభుఁడు = రాక్షసనాయ కుడు,

తా॥ ఉత్తములైన యోగులు తమ యోగాభ్యాస మార్గ ములలో మనస్సునందు వరాహమూరిని ధ్యానమున నిలిపి తమ లింగ శరీరముఁను అదృశ్యము చేసికొనుటకై యెంతయో ప్రయ త్నించుచుందురు అట్టి వరాహమూర్తి యొక్క చేతిదెబ్బ తిని, వాని ముఖపద్మమును చూచుచు ప్రాణమును విడిచెను ఈ రాక్షస రాజు కూరులలో శ్రేష్ఠుడు వీని కింత యదృష్ట మెట్లబ్బినదో॥

( యోగమార్గమున సాధన చేయువారు అహంకారమును తప్పించుకొనుటకు దేవుని శరణు పొందుదురు అహంకారమే లింగ శరీరమునకు కారణము సూటిగా అహంకారమునే తొలగింప వలసి వచ్చినపుడు దైవమే అనుగ్రహింప వలెను గాని మరెవ్వరికిని సాధ్యము కాదు కనుక వరాహమూర్తి స్వయముగా కొట్టిన అదృష్టము వాని కబ్బె నని జీవరాసుల దేహముల యందున్న దేవత లాశ్చర్యపడుచున్నారు )

703 టీక సమమతిన్ = సమదృష్టితో, దైత్యకులశాసను = రాక్షస వంశములను శిక్షించు విష్ణుమూర్తి యొక్క, పారిషదుల్ = కొలువు వారు, నికృష్టజన్మమునన్ = నీచజన్మములో, పైగొని = రూపము ధరించి, సమయుటఁజేసి = చనిపోవుట వలన, మీఁదనగు జన్మమునన్ = రాబోవు జన్మమున, జలజాక్షు = విష్ణుమూర్తియొక్క, నిత్యవాసమునన్ = శాశ్వత స్థానమైన వైకుంఠమున,

తా॥ వీరు విష్ణుమూర్తి ద్వారపాలకులు, సమబుద్ధి కలవారు

మునీంద్రుల శాపమున నీచ జన్మము కలిగి రాక్షస దేహములు ధరించి యిట్లు పుట్టినారు నేను విష్ణువు చేతిలో చనిపోవుటచే మరల రాబోవు జన్మమున శాశ్వత వైకుంఠ మగు విష్ణులోకమున నివసింతురు వీరి కెన్నడును జనన మరణములు లేవు

( దేవుని నుండి దిగివచ్చిన నీవు నేనను రెండు పక్షులే ద్వారపాలకులు ఒకటైన దేవుని నుండి యిట్లిద్దరుగా దిగి వచ్చుట అహంకారము వలన సృష్టింపబడుచున్నది అహంకార మున్నంత కాలము నీవు నేను భేదముండును దాని వలన నీచముగా ప్రవర్తింతురు గనుక నీచ జన్మ లందురు మరల సర్వము భగవంతుని మయమే యని తెలిసికొన్న అసురుల శాపమున నున్న అహంకారము తొలగును ఆ వెనుక నున్నది మరల శాశ్వత మనబడు లోకమే వారచ్చటికే తిరిగి పోదురు జీవిగా దిగివచ్చిన వానికి ఒక్కమారీ యనుభూతి కలిగినచో నిక జనన మరణము లుండవు )

704 టీక వెఱఁగు=ఆశ్చర్యము, పావన తనువు=పవన మనబడు స్తుతిరూపమైన యజ్ఞమే తన దేహముగా ధరించిన వరాహమూర్తి, వికచ తామరసాక్షున్=విచ్చిన పద్మములవంటి కన్నులు గలవాని, అనిమిష ముని యోగిజన+అవనదక్షున్= దేవతలను, మునులను, యోగులను రక్షించుటలో సమర్థుని, దనుజకరటివర హర్యక్షున్ = రాక్షసులను ఏనుగులరాజులకు సింహము వంటివానిని,

తా॥ ఇట్లాశ్చర్యముతో పలికి యజ్ఞ స్వరూపుడైన పుండరీకాక్షుని జూచి ఇతడు దేవతలను, మునులను, యోగులను రక్షించుటకు సమర్థుడనియు రాక్షసులను ఏనుగులను సింహము వలె చీల్చు నని యును మాత్రమే యెరుగుదుము, ' అని భావించి వరాహమూర్తితో నిట్లనిరి

705 706 టీక ఈ జగతివారల= ఈ లోకము లందలి జీవుల యొక్క, మర్మములు=కీలకములు, ఈసునన్ =ఈర్ష్యతో, వగలబెట్టు = దు ఖపెట్టు నట్టి, దివిజసూదనున్ = దేవతలను మర్దించు వానిని, శోభనము = శుభము, ఫాలములన్ = నుదుటి భాగములందు, కదియించి=ఆనించి, వినమితులు=వంగి నమస్కరించువారు,

తా॥ ఓ పద్మాక్షా! నీ వీ లోకముల యందలి జీవుల మర్మము లన్నియు నెరుగుదువు ఈర్ష్యతో లోకములను దేవతలను బాధ పెట్టు హిరణ్యాక్షుని జంపితివి గనుక నిక లోకములకు శుభమగును అని పలికి నుదుటి పైకి హస్తము లెత్తి నమస్కరించి అందరును స్తుతించిరి అతని వివేకము విశాలమైన దనియు, పుణ్యమే అతని శీల మనియు కీర్తించిరి

( ఈర్ష్యతో దుఃఖపెట్టు రాక్షసు డనగా ఈర్ష్య, దుఃఖము రూపమున వర్తించు నహంకార మని యర్థము జీవుల మర్మము లనగా ప్రశ్నలకును, ప్రాణములకు దేహమునకు నడుమ బిగింపబడిన బంధములు అవి యన్నియు నహంకారముతోనే బిగింపబడియున్నవి గనుక దేహధారుల కెవరికిని నందవు అందలి అంతర్యామియైన వానికి మాత్రమే తెలియును

అహంకారము పోయిన వెనుక నిక జీవిత మంతయు శుభ మగును అటుపైన వివేకము విశాలతర మగును అనగా మంచి చెడ్డలను చక్కగా తెలిసికొని జీవుడు తాను నిర్ణయములు చేసి చిక్కుపడక అంతర్యామికి సమర్పణ చేయును అప్పటి అతని ప్రవర్తనము పుణ్యకర్మగా మాత్రమే యుండును కనుక వానిలో నున్నవాడు దేవుడే గాని జీవుడు గాడు )

707 708 టీక సవన వరాహమూర్తి = యజ్ఞ వరాహ
మూర్తి, సురశాత్రవుఁ = దేవతల శత్రువును, హిరణ్యాక్షుని,
భారతీధవముఖ = సరస్వతీ భర్త మొదలగు, దేవత ముని
కదంబము = దేవతల మునుల సమూహము, సంస్తవనకు =
సరియైన స్తోత్రములకు, ప్రమదంబును = సంతోషమును, సమగ్ర
మంగళ + ఉత్సవము = సంపూర్ణమైన శుభములతో గూడిన
పండుగ, తలర్పఁ = పుష్పింపగా, ప్రసాద వీక్షణము =
అనుగ్రహదృష్టి,

తా॥ యజ్ఞవరాహమూర్తి యిట్లు హిరణ్యాక్షుని వధించిన
వెనుక చతుర్ముఖుడు మొదలగు దేవతలు, మునులు గన్న స్తుతించు
చున్న వాస్తవమైన ప్రశంసకు మనస్సున సంతోషించి అందరను
సంతృప్తి పరచునట్టి లోకశ్రేయస్కరమగు దృష్టిని వారిపై ప్రస
రింప జేసెను

(దేహముల యందు అహంకారము మాయమైన వెనుక
కనుపించునది చతుర్ముఖబ్రహ్మ, అతని సృష్టి, దేహము లందలి
దేవతలు, అందు ప్రధానముగా నున్న సద్గుణములు మాత్రమే అట్టి
స్థితిలో దేహధారులు పలుకు వాక్కులు ఆ దేహనిర్మాణము
లందు పనిచేయుచున్న దేవతల, ఋషుల వాక్కులుగా నుండును
అవి చెవులకు, మనస్సునకు కాక జీవులలో నున్న తనకు సంతోషము
కలిగించును అనగా ఆత్మ స్వరూపుడైన అంతర్యామి సద్గుణ
మయుడైన సగుణమూర్తియై యొకరినుండి యొకరిని అనుగ్రహ
పూర్ణములైన చూపులతో చూచును ఇదియే యీ కథయందలి
వేదార్థ ప్రతిపాదకమైన ఇతిహాసము )

709 టీక వికుంఠధామమునకు = వైకుంఠమను లోకము
నకు లేక కుంటుబడని వెలుగులోనికి, మహిత + ఉత్సవ సూచకంబు

గాన్ = గొప్ప పండుగను సూచించునదిగా, ప్రసూనవృష్టి = పుష్ప వర్షము, శిఖికుండములు = యజ్ఞము లందలి అగ్నికుండములు, భాస్కరశశిమండలంబులు = సూర్యచంద్ర మండలములు

తా॥ వారంద రనుగ్రహించి విష్ణుమూర్తి పరిపూర్ణమైన వైకుంఠమను వెలుగులోనికి మాయ మయ్యెను ఆ మహోత్సవ మును ప్రకటించుచు దేవదుందుభులు మ్రోగెను పుష్పవృష్టి కురిసెను అగ్నికుండములు మిక్కిలి తేజస్సుతో వెలుగొందెను సూర్యచంద్ర మండలములు తమ తమ సహజకాంతులతో వెలిగెను

(1 అహంకారము మాయము కాగా జీవుడు దేవుని వెలుగున అనుభూతి పొందుటయే విష్ణువు నిజ నివాసమునకు బోవుట లేనిచో సర్వాంతర్యామికి నిజనివాస మేమి?

2 అట్టి స్థితిలో నొకరితో నొకరు సంభాషించుకొను వాక్కులు ఆకాశగుణమైన మహాశబ్దము రూపములగా మ్రోగును గనుక దేవతలు దుందుభులు మ్రోగించుట యని చెప్పబడినది పుష్పవృష్టి ఇచ్చుట మనస్సు ఆత్మలక్షణముతో వికసించుట తెలియజేయును అగ్నికుండములు వెలుగొందుట జీవుల యజ్ఞార్థమైన జీవిత వికాసమును సూచించును

3 సూర్యచంద్రమండలము లనగా ఆత్మజ్ఞానము మనస్సు జీవుల లోపల భాసించునట్టి ప్రజ్ఞాకేంద్రములని యర్థము అవి నిజ ద్యుతితో వెలుగొందుట యనగా అహంకారము తొలగిన వెనుక ఈ ప్రజ్ఞ నాది, యీ మనస్సు నాది అను సంకుచితత్వము తొలగి ఆ ప్రజ్ఞలు అంతర్యామి మూర్తులుగా అనుభవమునకు వచ్చుట )

710, 711 టీక వనరుహాసంభవుఁడు = పద్మము నందు

పుట్టినవాడు, బ్రహ్మ, త్రిదివవాసులకున్ = దేవతలకు గూగము = నాటుకొన్నది, స్థిరపడినది, అకుటిల వితన్ = వక్రతలేని మనస్సుతో, శౌనక ముఖ్యులు = శౌనకుడు మొదలగువారు, మునివరులు = ముని శ్రేష్ఠులు, లాలనము = బుజ్జగింపు,

తా॥ వరాహమూర్తి హిరణ్యాక్షుని సంహరించిన యీ పుణ్యకథను చతుర్ముఖబ్రహ్మ మిగిలిన దేవతలకు చెప్పెను మైత్రేయుడు విదురునకు వివరించెను ఈ మొ. గము వృత్తాంతమును శుకయోగి పరీక్షిత్తునకు ఎడబరచి చెప్పెనని సూతుడు శౌనకాది మునులకు కథగా చెప్పెను

714, 718 అనఘంబు = పాప మంటనిది, ప్రగుత కీర్తుల్ = పేరు ప్రఖ్యాతులు వనజోదరు = విష్ణుమూర్తియొక్క, మును కొని = మొదలుకొని,

తా॥ ఇట్లు మైత్రేయుడు వివరించి చెప్పిన కథ విధానము నకు విదురుడు సంతోషించి అనుభూతిని పొందెను ఈ పుణ్య చరిత్రము చదివినను, విన్నను నిర్మలమైన కీర్తియు, విష్ణుదేవుని చరణారవిందములయందు భక్తియు మొదలుగా నిహపర సౌఖ్యములు జీవులకు గలుగును

714 టీక వెండియున్ = మరియు, అనంతరంబునన్ = తరువాత, వసుంధర = భూదేవి, తిర్యక్ జాతి = జంతువుల జాతి, పాప వర్తనులు = పాప ప్రవర్తనము కలవారు, మనోవాక్కాయ కర్మంబులు = మనస్సు, వాక్కు, దేహము అనబడు మూడు సాధనములు, భాగవతజన + ఉపాసకుండు = దేవుని భక్తులను దేవుని రూపములుగా నెరిగి పూజించువాడు, పుణ్యతీర్థసేవా = పుణ్యనదులను సేవించుట, సమాలబ్ధ = చక్కగా లభించిన, యశో విగత కల్మషుండు = కీర్తిచే పోగొట్టుకొనిన పాపము గలవాడు,

తా॥ ఈ కథ చెప్పి సూతుడు మహర్షులతో నిట్లనెను ఈ కథ విన్న పరీక్షిత్తు శుకయోగీంద్రు నిట్లు ప్రశ్నించెను మునీంద్రా! హిరణ్యాక్షుడు వధింపబడిన వెనుక భూదేవి సంపదలను ధరించి సమస్థితి పొందిన విధానమున వివరింపుము స్వాయంభువ మనువు జంతువుల జాతులను సృష్టించుటకు నిమిత్తములైన మార్గముల నెన్నిటిని కల్పించెను? పరమ భాగవతోత్తముడైన విదురుడు పాపాత్ములైన ధృతరాష్ట్రుని పుత్రులను విడిచి పెట్టెనని చెప్పితివి వారు కృష్ణుని కపకారము తలపెట్టిన వారు కనుక విడిచిపెట్టెను అటుపైన విదురుడు తన తండ్రియగు వేదవ్యాస మునీంద్రునివలె మనస్సును, వాక్కును, శరీరకర్మను కృష్ణుని యందు సమర్పణచేసి భాగవత జనుల నుపాసించుచు పుణ్యతీర్థములు సేవించు చుండెనని తెల్పితివి అట్లు సేవించుట వలన లభించిన వికాసముచే సకల కల్మషములును క్షాళనమై జ్ఞాన మార్జించి యుండును అపుడు మరల మైత్రేయుని ప్రశ్నించిన ప్రశ్నలెట్టివి? వీనిని వివరించి చెప్పుము " అని అడిగిన పరీక్షిత్తునకు శుకయోగీంద్రు డిట్లనెను

715 టీక విమలాత్ముఁడు =నిర్మలమైన ఆత్మకలవాడు, చతురాత్మ! = చతురతతో కూడినవాడా!, జలజగర్భుఁడు = పద్మమున పుట్టినవాడు, బ్రహ్మ, ప్రజాసర్గము = సంతతిని పొందుట, వెండియున్ = మరియు, మరీచి + ఆదులు=మరీచి మొదలగువారు, అబ్జజు + ఆదేశము = బ్రహ్మయొక్క యాజ్ఞ, అర్థిన్ = కుతూహలముతో, అఖిలజగము=సమస్త లోకములు, భార్యా సమేతులు = భార్యతోకూడిన వారు, కామినులను = కామముగల స్త్రీలను, పాసి=దూరము చేసి, భద్రయశులు= శుభదృష్టి, కీర్తి కలవారు,

తా॥ విదురుడు నిర్మలుడైన మైత్రేయుని జూచి ప్రేమతో నిట్లనెను నీవు చక్కని వాక్చాతుర్యము గలిగి వివరింతువు వినుము సకల సృష్టికి కర్తయైన చతుర్ముఖ బ్రహ్మ మొదట ప్రజాపతులను సృష్టించి ప్రజాసర్గము నుద్దేశించెను అతని మనస్సునందు దేనిని సృష్టించుటకు భావన చేసెను? మొదట సృష్టింప బడిన మరీచి మొదలగు ప్రజాపతులు చతుర్ముఖుని ఆదేశమును ఆత్మలో నిలిపి యీ లోకముల నెట్లు సృష్టించిరి? అది కాక వివాహితులై భార్యాసమేతులై ఏమి సృష్టించిరి? స్త్రీలను విడిచిన వెనుక నేమి సృష్టించిరి?

(చతుర్ముఖుడు చేసినది సృష్టి (Creation) సాధింపబడినది ప్రజాసర్గము (Reproducton) అందు సృష్టి అన్నిని సంబంధించినది ప్రజాసర్గమనగా గర్భధారణము వలన దేహములను కల్పించునట్టిది చతుర్ముఖుడు చేయగలిగినది సృష్టి మాత్రమే సృష్టి శక్తితో మరీచి మున్నగు ప్రజాపతులను సృష్టించెను వరాహమూర్తి యీ భౌతికమైన భూగోళము నుద్ధరింపనిదే పాంచ భౌతిక సృష్టి లేదు గనుక మరీచి మొదలగు వారు కేవలము తేజో మయ స్వరూపులు వారు బ్రహ్మ యాదేశమును ఆజ్ఞగా మాత్రము ధరింప గలిగిరి అటుపైన సృష్టి చేయుటకు ప్రకృతు లనబడు శక్తు లుండవలెను వారిని భార్యలుగా స్వీకరించి గృహస్థాశ్రమ మార్గమున జీవుల సృష్టి చేసిరి. మరల తపస్సు చేసి యోగ మార్గమును, వైరాగ్యమును సాధించి యిచ్చిరి. ఈ క్రమమంతయు నెట్లు జరిగినది? ఇందలి అంతర్భాగములను వివరింపు మని విదురుడు మైత్రేయుని ప్రశ్నించుచున్నాడు)

716 టీక ఐక్యము = ఒకటియగుట, కరుణా కందళిత హృదయ = దయతో చిగురించిన హృదయము గలవాడా! బుధ నుత = జ్ఞానులచే స్తుతింపబడు వాడా!

తా॥ ఈ ప్రజాపతులందరును కలసి ఐకమత్యముతో నేమి సృష్టించిరి? ఈ రహస్యము లన్నియు నాయందు దయయుంచి వివరింపుము

717 టీక జీవ + అదృష్టపరుఁడు = జీవులచే చూడ బడక వారికి పై నున్నవాడు, మాయాయుక్త పురుషవరుఁడు = మాయతో కూడిన పురుష శ్రేష్ఠుడు, కాలాత్మకుఁడు = కాలమే తానుగా నున్నవాడు నిర్వికారుఁడు = మార్పులేనివాడు, జగత్ + నివాసుఁడు = సృష్టియే నివాసముగా కలవాడు, ఆది జాతక్షోభుఁడు = మొదటగా పుట్టిన కదలింపు గలవాడు, రజోగుణహేతువు = రజోగుణము కారణముగా గలది, పరిభూతము = పుట్టినది, భూత పంచకము = పంచభూతములు,

తా॥ ఇట్లు ప్రశ్నింపగా మైత్రేయి డిట్లనెను, పరమ పురుషుడైన దేవుడు జీవులకు గోచరించువాడు కాడు కారణ మేమనగా జీవులు వాని యందుండి వాడు జీవుల కతీతుడుగా నుండును అతనియందు మాయ యున్నది మాయతో కలసినప్పు డతడు పురుషు డనబడును అపుడు తానే కాలముగా వర్తించును అపుడు కూడ సతతం డంతర్యామిగానే యుండును గనుక మార్పులకు గురికాడు అతని యందు మార్పు లుండును ఈ సృష్టియే తానున్నచోటైనను తన యందు సృష్టి యుండునట్లు చూచు కొనును అట్టి సృష్టికి మొదలు, చివర అనునవి యెల్లప్పుడు శాశ్వత ముగా వర్తించుచుండును మొదలు అనునది మొదటి కదలికగా వ్యక్తమయ్యెను అప్పు డతనివలన సత్త్వము, రజస్సు తమస్సు అను మూడు గుణములు ఒకమారుగా వ్యక్తమయ్యెను అందు రజో గుణమువలన మహత్తు అను తత్త్వము పుట్టెను దాని యందు అహంకారము పుట్టెను అది త్రిగుణములచే మూడు విధములైన

అహంకారముగా వ్యక్తురుయ్యెను అందు పంచతన్మాత్రలు పుట్టెను వాని నుండి పంచభూతములు పుట్టెను అవి సృష్టికి హేతువు లయ్యెను

718 టీక భువన నిర్మాణ కర్మంబు = లోకములను నిర్మించు పని, సంఘతంబు = కలిసి యేకమగుట, హిరణ్మయ + అండంబు = బంగారు రంగు గుడ్డు, జల + అంతర్వర్తి = నీటిలో వర్తించునది

తా॥ ఈ పై చెప్పిన త్రిగుణములుగాని, మహత్తగాని, అహంకారముగాని తన్మాత్రలుగాని, పంచభూతము లుగాని ఏ ఒక్కటియు లోకములను నిర్మాణము చేయునట్టి పనికి సమర్థములు కాకుండెను అన్నియు కలిసి యొక్కే ముద్దగా నేర్పడను పంచ భూతములతో ముద్ద చేయబడిన గుడ్డ్డ కటి నేర్పడెను అది బంగారు వంటి రంగుతో వెలుగొందు చుండెను నీటియందు వర్తించుచు పెరుగుచుండెను

719 టీక నారాయణ + ఆఖ్యన్ = నారాయణుడను పేరుతో, ఉన్నతిన్ = గొప్పతనమున, బ్రహ్మంబు = పెరిగి పెద్దదియగు లక్షణము గలది, సాహస్ర దివ్య వర్షంబులు = వేయి దివ్య సంవత్సరములు, ఓలిన్ = వరుసగా, నాభియందు = బొడ్డునందు లేక కేంద్రము నందు, సహస్ర సూర్య ప్రగ్రీ ప్తన్ = వేయిమంది సూర్యుల వెలుగుతో, తనరుచున్ = విస్తరించుచు, సకల జీవనికాయ యుతము = సమస్త జీవుల గుంపులతో కూ, డినది, పంకజాతంబు = పద్మము, పరంగంగన్ = ప్రసిద్ధి కెక్కగా, భగవత్ + అధిష్ఠితుండు = భగవంతునిచే స్థానము పొందబడిన వాడు, స్వరాట్ = తనకుతానే అధిపతి, చతురాననుండు = నాల్గు

మొగములు గలవాడు, తత్ + పద్మసంభవుండు = ఆ పద్మమున పుట్టినవాడు, నామరూపగుణాది సంజ్ఞ సమేతుఁడు = పేరు ఆకారము గుణము మొదలగు గుర్తులతో కూడినవాడు, వనజజుండు = పద్మమున పుట్టినవాడు, నిజచ్ఛాయ = తన నీడ

తా॥ ఆ గ్రుడ్డు వ్యాపించు లక్షణము కలది గనుక బ్రహ్మాము జలముల మార్గమున వర్తించునుగనుక నారాయణుడు అది వేయి దివ్యసంవత్సరములు వసించియుండెను అందు వసించు దేవుని నాభియందు పద్మము పుట్టెను అది సకల జీవుల గుంపుల రూపముతో విప్పారుచుండెను వేల సూర్యుల కాంతి కలిగియుండెను ఆ మొత్తమునందున్నవాడు భగవంతునితో నిండియున్నవాడు నాలుగు మొగములు గలవాడు తనయందు పుట్టుచున్న సకల ధర్మములకు తానే యధిపతి అతడు పేర్లు, రూపములు, గుణములు అనబడు గుర్తులతో కూడినవాడై తన నీడ వలన లోకముల నన్నిటిని సృష్టించెను

720 టీక తామిస్రము = చీకటితో నిండినది, అంధతామిస్రము = గ్రుడ్డితనమను చీకటిలో నిండినది, తమము = చీకటియను పదార్థము, మోహము = ప్రజ్ఞను మరగుపరచునది, మహామోహము = తన యంతర్యామిత్వమును మరగు పరచునది, పంచ మోహరూపాత్మకము = అయిదు విధములుగా మరగు పరచునట్టి రూపములు తానే యైనది, అవిద్య = తెలియకుండుట, తమోమయ దేహము = చీకటితో నిండిన శరీరము, రోసి = అసహ్యించుకొని, తత్ + తనువు = ఆ శరీరము, విసర్జించెన్ = విడిచిపెట్టెను, ధాత్రుముక్త దేహంబు = బ్రహ్మచే విడువబడిన శరీరము, సతతక్షుత్ + తృష్ణలకు = ఎల్లప్పుడు కలుగుచున్న ఆకలిదప్పులకు, ఆవాసము = నివాసము, రాత్రిమయము =

రాత్రిలో చేయఎడినది, (సృష్టపడుచేయఎడి) క్షుత్ + తృషల్ = ఆకలిదప్పులు, ఎబిలన్ = వర్ణింపగా,

తా॥ చతుర్ముఖ బ్రహ్మశరీరచ్ఛాయనుండి అవిద్య పుట్టెను అది అయిదు విధము లైన మోహస్థితులు కలది అవి 1 తామిస్రము 2 అంధతామిస్రము 3 తమము 4 మోహము 5 మహామోహము ఆది తన తమోమయ శరీరము తెలిసి బ్రహ్మ అసహ్యించుకొని ఆ దేహమును విడిచెను అట్లు ఎడువ బడిన దేహము ఆకలిదప్పులకు స్థానమయ్యెను మరియు రాత్రితో నింకెను అందుండి యక్షులు, రాక్షసులు అనబడు జీవులు పుట్టిరి అందు కొందరు ఆకలితో చతుర్ముఖుని భక్షింతుమనిరి కొందరు రక్షింతుమనిరి

(మొట్టమొదటి పాంచ భౌతికమైన సప్తధాతుమయ శరీరము యొక్క వ్యుత్పత్తి యిందు చెప్పబడినది తన నుండి భౌతిక దేహ ముద్భవింపగా ఆది మోహరూపముగ వ్యక్తమయ్యెను జీవకణములు, అణువులు పరమాణువులు అందు పనిచేయు ఎద్ధ లైన దేవతలు చేరిన చో భౌతిక దేహమగును వారందరి అస్తిత్వము కనుపింపక అది మొత్తము ఒక దేహముగా కనుపించుటయే మోహము ఉన్నవి కనుపింపక లేనిది కనుపించుట మోహమన బడును ఏ ద్రవ్యమైనను ఉన్నట్లు కనుపించునే గాని దాని కస్తిత్వ ముండదు అందలి యంతర్భాగములకే అస్తిత్వముండును కనుక భౌతిక దేహసృష్టి మోహరూపమని చెప్పబడినది దానియందు తన ప్రజ్ఞ పనిచేయక అందు తానుండుట వలన జడపదార్థము వలె కనుపించును దానికి సంబంధించినవే తామిస్రము మొదలగు స్థితులు

ధరింపబడిన భౌతిక దేహమునకు విడువబడుట తప్పనిసరి

యగును కనుక చతుర్ముఖుడు ఆ దేహమును విరిచెనని చెప్పబడి
నది ఆకలి దప్పులు భౌతిక శరీరమునకు కావలసిన పోషణము
నకై కల్పింపబడినవి ఇట్టి శరీరము మొట్టమొదట సృష్టికంతకును
నొక్కటియే పుట్టెను దాని నుండి వేర్వేరు శరీరప్రజ్ఞలు పుట్టెను
వారే యక్ష రక్షస్సులు ఒక జీవికి నింకొక జీవి శరీరము భక్షింప
వలెనని బుద్ధి పుట్టును ఉదాహరణమునకు కుక్కకు పిల్లిని తిన
వలెనని, పిల్లికి ఎలుకను తినవలెనని, మనుష్యునకు జంతువుల,
వృక్షముల దేహములు తినవలెనని అభిలాష సహజముగ పుట్టును
దీనినే వేదార్థమున చెప్పినచో సృష్టికర్తను తినవలెననించినది
యని చెప్పబడినది కొందరు జీవులకు కొందరిని తినరాదనియు
రక్షింపవలెననియు అనిపించును ఉదాహరణమునకు ఏ జంతువున
కైనను దాని పిల్లల దేహములను తినరాదనియు రక్షించుకొన
వలెననియు సహజముగా పుట్టును )

721 టీక ధాత = బ్రహ్మ, భయ విహ్వలుండు =
భయముచే కేకలు పెట్టువాడు, మామాజక్షత = హింసింపకుడు,
రక్షగ = రక్షింపుడు వెండియున్ = మరియు, ప్రభా విభాసితంబు =
తేజస్సుతో వెలుగొందునది, కాయంబు = శరీరము, గరిష్ఠులు =
గొప్పవారు, సుపర్వులు = చక్కని విభాగములు కలవారు,
దేవతలు, తత్ + ప్రభామయ = ఆ వెలుగుతో నిండిన, గాత్ర
విసర్జనంబు = దేహము విడుచుట, అహోరూపంబు = పగటి
రూపము, దేవత వళికి = దేవతల సమూహమునకు, జఘనంబు =
పిరుదుల భాగము, అతిలోలుపులు = మిక్కిలి కుతిలవారు,
అజునిశ = బ్రహ్మను, మిథునకర్మంబు = సంభోగించుట, అపే
క్షించినన్ = కోరగా, విరించి = బ్రహ్మ, నగుచున్ = నవ్వుచు
నిర్లజ్జులు = సిగ్గులేనివారు, పఱచి = పారిపోయి, ప్రపన్న +
ఆర్తిహరుండు = శరణుబొందినవారి బాధలను హరించువాడు,

భక్తజన+అనురూప సందర్శనుండు = భక్తజనులకు తగిన రూప మున కనుపించువాడు, ప్రణామిల్ల = నమస్కరించి

తా॥ వారిట్లు పలుకుచు బ్రహ్మను తినుటకై సమీపించిరి అతడు భయపడి నేను మీకు తండ్రిని మీరు నాకు బిడ్డలు నన్ను హింసింప కూడదు" అను నర్థము నిచ్చునట్టి పలుకులను మా జక్షత, రక్షత" అని పలికెను. అప్పటనుండి వారు యక్షులు రక్షస్సులు అనబడిరి

మరల బ్రహ్మ యొక్క తేజోమయమైన దేహమును ధరించెను దానినుండి తేజోవంతులు, సత్వగుణముచే గొప్పవారు నగు దేవతలను మహానుభవులుగను సృష్టించెను ఆ శరీరమును వారికి విడిచెను అది పగటి రూపమై దేవతలకు నివాస స్థలమయ్యెను

మరల తన నడుము క్రింది భాగమునుండి కొందరిని పుట్టించెను వారు అసురు లనబడిరి చంచలస్వభావులు అసక్త స్వరూపులు అగు నసురులు బ్రహ్మను సమీపించి వానిని సంభోగింతుమనిరి సిగ్గులేక తనవెంటపడుచున్న అసురులను చూడ చతుర్ముఖునకు నవ్వు కలిగెను అతడు వేగముగా పరుగెత్తి శరణరుల బాధలు తొలగించు విష్ణుమూర్తికి నమస్కరించెను విష్ణువు భక్తులకు తగిన విధమున తగిన సమయమున దర్శన మిచ్చును వానిని జూచి నమస్కరించి బ్రహ్మ యిట్లనెను

(1 యక్షులు బ్రహ్మను తిందుమనుట యనగా బ్రహ్మమయములైన సృష్టి దేహములపై నాహారాపేక్ష కల్గుట.

2. "నేను మీకు తండ్రిని మీరు నన్ను చంపరాదు" అని బ్రహ్మ పలుకుట యనగా సృష్టికి తండ్రులను చంపరాదను భావము బిడ్డలకు పుట్టుట ఇది జీవుల జీవధర్మముల చరిత్ర

ఇచ్చట మంత్రార్థము రూపమున రచింపబడినది మంత్రార్థ మనగా వేదార్థము

3 బ్రహ్మయొక్క తేజోమయ దేహమునుండి సత్త్వగుణ స్వభావులైన దేవతలు పుట్టిరనగా దేహధారులకు సత్త్వగుణమయ మైన ప్రజ్ఞ యేర్పడి అందుండి దేవగుణములైన దయా దాన ధర్మ దమాదులు పుట్టినవని యర్థము

4 జఘనమునుండి అసురులు పుట్టుట యనగా జననేంద్రియ ముల నుండి సంభోగశక్తులు పుట్టుట వారు బ్రహ్మను సంభోగింతు మని వెంటపడి రనగా సృష్టిజీవులు దేహములయందు సంభోగ స్థానములను గమనించి కామము వ్యక్తము చేయుట నేర్చుకొనిరి అని యర్థము బ్రహ్మ పారిపోయి విష్ణువును శరణు జొచ్చెననగా కామమయలోకమునుండి విమోచనము చెందుటకై జీవులలోని సత్వలోక ప్రజ్ఞ, దైవభక్తి, వైరాగ్యము, మోక్షధర్మములను నేర్చుకొనెనని యర్థము )

722 టీక వినుత నిఖల బృందారక = స్తుతించుచున్న సమస్త దేవగణములు గలవాడా!, దక్షతన్ = సమర్థతతో, తల నిడి = శిరస్సున ధరించి

తా॥ దేవా! రక్షింపుము నీవు లోకములకు క్షేమము చేకూర్చువాడవు నేను నీ యాజ్ఞను శిరస్సున ధరించి సమర్థతతో సృష్టించు టారంభించితిని

723 టీక రమింపఁగన్ = సంభోగించుటకు, డాయవచ్చి నన్ = సమీపింపగా, కలంగి = కలతచెంది, ఇద్ధచరిత = ప్రసిద్ధమైన నడవడి కలవాడా!

తా॥ ఈ జీవుల సృష్టిని గర్భధారణము విధానమున కల్పించుటకు నేను ప్రారంభింపగా అందు పాపాత్ములైన అసురులు నన్ను సంభోగింతుమని వెంట పడిరి నేను కలవరపాటు చెంది నిన్ను శరణు జొచ్చితిని

724 టీక క్లేశంబులు = కష్టములు, అపనయింపను= తొలగించుటకు, పద్మజు = బ్రహ్మయొక్క, కార్పణ్యంబు = దీనత్వము, అవధరించి = దయతో విని, వివిక్త + అధ్యాత్మ దర్శనుండు = వివేకము చేయబడిన ఆత్మయందు అధిష్ఠించిన దర్శనము కలవాడు, లేక ఏకాంతము పొందిన ఆత్మయందు దర్శనము కలవాడు, భవత్ + ఘోరతను త్యాగంబు = నీ భయంకరమైన శరీరమును విడచుట,

తా॥ బ్రహ్మ యింకను నారాయణు నిట్లు ప్రార్థించెను. "దేవా! అనేక లోకములలో సృష్టింపబడిన జీవులకు కష్టములను కల్పించినను, కలిగిన కష్టములను తొలగించినను నీవే గదా! నీవు కాక యితరు లెవ్వరున్నారు?" ఇట్లు ప్రార్థించిన బ్రహ్మ యొక్క దీనత నెరిగి అతని యందు దయచూపి ఆధ్యాత్మ స్వరూపుడై దర్శన మిచ్చెను ఆ భయంకరమైన దేహమును విడిచిపెట్టు మని ఆనతిచ్చెను చతుర్ముఖుడు వెంటనే స్త్రీ పురుష కామ సంబంధమైన ఘోరశరీరము విడిచి పెట్టెను

( 1 జీవులకు కష్టములు తొలగించుటకు కారణము భగవంతుని కరుణ యనుట స్పష్టమే ఇక జీవులకు కష్టము కలిగించుట కూడ వాని వలననే అనుట యెట్లనగా నొకరి కొకరు శత్రువులుగా వర్తించు వారి యందు గూడ నున్నది భగవంతుడే గాని తదితరము గాదు తాత్కాలికముగా వ్యక్తమైన అహంకారము వలన నితరుల మూర్తులు శత్రువులుగా వర్తించును.

2 ఘోరమైన కాపు శరీరమును విడిచిపెట్టు మని బ్రహ్మను నారాయణు డాజ్ఞాపించె ననగా కామబంధము సహజము కాదనియు దైవకార్యము నిమిత్తమై మనసున కొంత కాలము వర్తించుననియు, నొక వయస్సు తరువాత దానిని తొలగించుకొనుట జ్ఞానియైన జీవునకు సహజ మనియు మంతార్థము అన్నమయ, ప్రాణమయాది శరీరముల వలె కామమయ శరీరము ప్రకృతి సిద్ధము కాదనియు, వికృతి సిద్ధము, తాత్కాలిక మనియు నర్థము )

725 టీక నవ్యకాంచన = క్రొత్తది బంగారముతో చేయబడినది, రణత్ + మణి నూపుర + ఆరావ = శబ్దము చేయుచున్న మణుల అందెల ధ్వనులచే, విలసిత = శోభచెందిన, పాదారవింద యుగళ = పద్మములవంటి పాదముల జంట గలది, కాంచీ కలాసంకలిత = మొలనూలితో కూడిన, దుకూల వస్త్ర స్ఫార = జిలుగు వస్త్రము విస్ఫారిన, పులిన నితంబ బింబ=ఇసుక తిన్నెల వంటి పిరుదుల భాగము గలది, రాజిత=ప్రకాశించినది, అన్యోన్య కర్కశ = ఒకదాని కొకటి కఠినముగా నుండిన, పీన కరి కుంభ = బలిసిన ఏనుగుల తలపై బుడిపెల వంటి, పృథు = పెద్దవైన, కుచభార = స్తనముల బరువుచే, కంపితవలగ్న = వణకుచున్న నడుము గలది, మదిరారస + ఆస్వాద = మద్యము రుచి చూచిన, మద విఘూర్ణిత = మదముచే తిరుగుచున్న, చారు సిత = అందమై తళుకించుచున్న, నవవికచ=క్రొత్తగా విచ్చిన, రాజీవనయన = పద్మముల వంటి కన్నులు గలది, అపర పక్ష + అష్టమీ = కృష్ణ పక్షమందలి అష్టమి, శశాంక + అభ = చంద్రునివలె ప్రకాశించునట్టి, నిటల = నుదురు గలది, మదవత్ + అళికుల = మదించిన తుమ్మెదల గుంపు, రుచిర + ఉపమాన చికుర =మెరుగుతో సాటియైన జుట్టు గలది, లలిత చంపక

కుసుమ =అందమైన సంపెంగ పువ్వువలె, విలాసనాస=సొగసైన ముక్కుగలది, హాస లీలావలోకన = నవ్వుల లీలతో కలిసిన చూపులు గలది అబ్జపాణి = పద్మముల వంటి అరచేతులు గలది,

తా॥ ఆ మమయ శరీరమును బ్రహ్మ విడిచి పెట్టగా దాని నుండి యొక అందమైన సుందరి యుద్భవించెను బంగారు మణి నూపురముల ఘల్లుమను శబ్దములతో, తమ్మి మొగ్గల వంటి పాదములతో, మొలనూలు నలంకరించిన జిలుగు వస్త్రముచే కప్పబడిన విశాల జఘన భాగముతో, ఏనుగు కుంభముల వంటి కుచముల భారముతో, కంపించుచున్న నడుముతో, మద్యపానము రుచి తెలిసిన వారి కన్నుల వంటి కంటి చూపులతో, పద్మ దళముల వంటి నేత్రములతో, బంగారు వన్నెగల చంద్రకళ వంటి నుదురుతో, తుమ్మెదల గుంపువంటి కేశపాశముతో, సంపెంగ పువ్వు వంటి నాసికతో మందస్మితముతో, చిలిపి చూపులతో ఆమె ప్రత్యక్షమయ్యెను

(బ్రహ్మ విసర్జించిన శరీరము నుండి సుందరి యుద్భవించిన దనగా స్త్రీ దేహము ధరించిన జీవికొక్క శరీరాకృతులను పురుష దేహము ధరించిన జీవులు సౌందర్యముగా భావించుట అభ్యసించిరని మంతార్థము మానవ స్త్రీ శరీరము మానవ దేహధారియగు పురుషునకు మాత్రమే సౌందర్యముగా తోచును. అట్లే ఆడుచీమ దేహము మగచీమకు మాత్రమే సౌందర్యముగా తోచును ఒకజాతి పురుషునకు ఇంకొక జాతి స్త్రీ దేహము సౌందర్యముగా భాసింపదు ఉదాహరణమునకు కుక్క దేహము ధరించిన పురుషునకు నరస్త్రీ దేహము సౌందర్యముగా అనుభూతము కాదుగదా! కనుక దేహాకారము నందు కనుపించు సౌందర్యము చూచువాడు కల్పించుకొన్నదే గాని ఆకారము

నందున్నది కాదు ఇట్లు లేని సౌందర్యమును ఆకారము నందు కల్పించుకొనుట సృష్టిలో నేర్పడెనని ఇందలి ఇతిహాసార్థము )

726 టీక లలనారత్నము = ఉత్తమజాతి స్త్రీ, ఉపగూహనము = కౌగలించుట, ఒగిన్ = వరుసగా,

తా॥ ఇట్లుద్భవించిన స్త్రీ రత్నము సంధ్యారూపమై ప్రకాశించెను దానవు లందరు వరుసగా నొక్కొక్కరే ఆమెను కౌగలించుకొని ఒకరితో నొకరి ట్లరుకొనిరి

(1 పశుకామము నందలి స్త్రీ పురుష ఆలింగనమున భాసించు సుఖస్పర్శ మనస్సునం దేర్పడు దానవ భావములలో నొకటియే గాని కౌగలింపబడు వస్తువునందు పుట్టినది కాదని సూచించుటకు దానవులు కౌగిలించుకొని రని చెప్పబడినది లేనిచో దేవతలును కౌగలించుకొని యుండెడివారే దేవతలు ఇంద్రియములకు, మనస్సునకు, పంచభూతములకు అధినాథులైన ప్రజ్ఞలు కనుక స్వచ్ఛమైన ప్రజ్ఞలకు స్పర్శజ్ఞాన ముండును గాని స్పర్శ సౌఖ్యము, స్పర్శ దుఃఖ ముండవు

2 ఈమె సంధ్యారూపము కలది యని వర్ణింప బడినది బ్రహ్మ విడిచిన మూడు దేహములలో మోహదేహము నుండి రాత్రి యుద్భవించెను సత్త్వమయ దేహమునుండి పగ లుద్భవించెను కామమయ దేహము నుండి సంధ్య యుద్భవించెను దీని కర్థమే మనగా భౌతిక దేహముగా నేర్పడిన సృష్టియందు జీవ పురుషుడు మేల్కొంచి యుండక జడమయ దేహముగా నుపయోగించును గనుక అవిద్యా శరీరము నుండి రాత్రి పుట్టినది త్రిగుణాత్మకములగు ప్రాణమయాది దేహములందు పురుషుడు క్రియాశీలనముగా మేల్కొంచి యుండును గనుకను, సత్త్వము

పరిపూర్ణమైన ఆత్మజ్ఞాన మగుట చేతను పగని చెప్పబడినది దానికిని, దీనికిని నడుమ జ్ఞాతాజ్ఞాతములైన పరిస్థితుల సంగమంగా అందము, స్పర్శసౌఖ్యము, కామ సంకల్పములు, పరిగింపుచుండును కనుక నీమె సంధ్యారూపిణిగా వర్ణింపబడినది

సంప్రదాయము ననుసరించి ఇందు మరియొక విశేషమున్నది అవిద్య నుండి విద్యకు ఆరోహణ చేయు మార్గమున గల సంధ్య దేవసంధ్య యనియు, విద్యనుండి అవిద్య లోనికి అవరోహణ చేయు మార్గమున గల సంధ్య అసుర సంధ్యయనియు, చెప్పబడినది ఇచ్చట వర్ణింపబడినది అసుర సంధ్యయే గాని పూర్వ సంధ్య కాదు )

727 టీక సుగమము

తా॥ ఈ సౌకుమార్యము, ఈ వయస్సు, ఈ సౌందర్యము ఈ ధైర్యము, ఈ సౌభాగ్యము ఇంకే స్త్రీల యందును కన బడదు ఇది చిత్రముగ నున్నది.

728 టీక వెఱఁగంది=ఆశ్చర్యపడి, దనుజులు=రాక్షసులు, తలోదరి=సన్నని పొట్టగలది, మనము=మనస్సు, మక్కువ=ఇష్టము, ప్రమదాకృతి=స్త్రీయాకారము,

తా॥ అని యాశ్చర్యపడుచు రాక్షసు లందరిట్లనుకొనిరి 'ఈమెను చూచినప్పటినుండి మన మనస్సులు, కామ ప్రవృత్తితో చరించుచున్నవి ఈమె మనస్సున మనయందు మక్కువ లేకుండుటకు కారణమేమి?'' అని తలచి వారందరా సంధ్యతో నిట్లనిరి

(భౌతిక శరీరములు ధరించిన వెనుక శరీరము లన్నియు నొక్కే ద్రవ్య సముదాయము గల పంచభూతములతో చేయబడినను

ఒక్కొక్కరి కొక్కరు నచ్చుట మనోధర్మముగ పుట్టెను దానిని బట్టి తనకు నచ్చిన స్త్రీ దేహమునందు పురుషుడు సౌందర్యము నారోపణ చేసికొనను ఆ సౌందర్యము మిగిలిన స్త్రీలకు లేదని దర్శించును

తమకా స్త్రీయందు కామము కలిగినను ఆమెకు తమ యందు కామము కలుగ లేదని ఆశ్చర్యపడిరి దాని భావ మేమ నగా ఒకరి దేహమునుజూచి ఒకరు కామము చెందుటయేగాని దేహమందున్న అణువులకుగాని ప్రకృతికిగాని కామము కలుగదు )

728, 729 టీక కదళీస్తంభోరువ = అరటి స్తంభముల వంటి తొడలు గలదానా!, ఏ జాడదానవు = ఏ ప్రాంతమునకు చెందినదానవు ,

తా॥ అరటి స్తంభములవంటి తొడలుగల సుందరీ! నీ దేశులము? ఏ ప్రాంతమునకు చెందిన దానవు? ఎవరి పుత్రికవు? ఇట్లు ఒంటరిగా చరించుటకు కారణమేమి చెప్పుము

730 టీక భవదీయ=నీ యొక్క, చారురూప=అందమైన రూపము, ద్రవిణ లసత్ + పుణ్యభూమి= సంపదతో ప్రకాశించు చున్న పవిత్రదేశము, తవిలిన = చిక్కుకొనిన, దుర్భగులను= దౌర్భాగ్యులను, కవయువు = జంటగా కలసికొనవు, పుష్పాస్త్ర బాధ=మన్మథుని బాధ ,

తా॥ నీ అందమైన రూపమనబడు సంపదతో నిండిన పుణ్య భూమి యందు చిక్కుకొని మేము అల్పులమైతిమి నీవు మాతో పొత్తుచేయువు మాకు మన్మథ బాధ హెచ్చయినది

(స్త్రీ పురుష పరస్పరాకర్షణము సౌందర్య భావనపై నాధారపడినది. సౌందర్యము ఆకారము నాధారపడినది కాని సౌందర్యము చూచువాని భావనకు సంబంధించినదే గాని, చూడబడునట్టి యాకారమునకు సంబంధించినది కాదు. కనుక కామ సంభోగాదుల యందు ఆసక్తి యోగాని తృప్తి యనునది సత్యము కాదు. ఆసక్తి చూచువానికి సంబంధించినది. దేహమునందలి ధాతువులు, జీవకణములు మున్నగు వానియందు ఆకారము, సౌందర్యము సత్యము కావు గనుక తృప్తిని గూర్చి ఆలోచించుటయే గాని తృప్తికి కావలసిన సాధనము లేదు. ఇట్టి సృష్టి ధర్మముల వ్యాఖ్యానము కొరకే యితిహాసము చెప్పబడినది.)

731, 732 శ్లో॥ తదీయ=ఆమెయొక్క, ఉగ్గడింపన్ = నొక్కి చెప్పుటకు, గురుకుచభార = పెద్దకుచముల బరువు, అంకుచిత = వంగినట్టి, అవలగ్నంబు = నడుము, పల్లవపాణితలము = చిగురుటాకువంటి అరచేతి పైభాగ, చెన్నొందగ = ఎఱ్ఱముగా కనుపించు, చెండు = పూలబంతి, పతత్పతంగుండు = అస్తమించుచున్న సూర్యుడు, సలలిత = సుకుమారమైన, నీలపేశల = నల్లని మెత్తని, పృథు ధమ్మిల్లబంధంబు = పెద్ద కేశబంధంబు, ఘనతమః పటలి=మబ్బులలోని చీకటుల గుంపు, పరివిమలతర = అతి నిర్మలమైన, కాంత భావ = మనోహర భావములతో కూడిన, విలోకన జాలంబు = చూపుల వల, తారకాసమితి = చుక్కల గుంపు, కడంగి = పూని, మైపూత = దేహమునకు పూసిన సుగంధ ద్రవ్యము, సాంధ్యరాగంబు = సంధ్యయందలి మెరుపు, అంగన+ఆకృతిన్ = స్త్రీ ఆకారమున, సంధ్యావధూటిన్ = సంధ్యాదేవిని, కదిసి=సమీపించి, కడుకొనగ = క్రమ్ముకొనగా,

తా॥ ఇంకను ఆమె సౌందర్యమును వర్ణింప నలవిగాక యిట్లు దర్శించిరి బరువైన కుచములచేత వంగిన, నడుమ్ము ఆకాశముగను, చిగురుటాకు వంటి చేతియందు ధరించిన పూలచెండు అస్తమయ సూర్యునిగను, నల్లని సుకుమారమైన వేణీబంధము వ్యాపించుచున్న చీకటులుగను, మనోహరము లైన తళుకైన కన్నులు తారకలుగను, దేహమునకు పులిమిన సుగంధ ద్రవ్యము సాంధ్యరాగముగను కనుపించెను సంధ్యాదేవియే వారికి స్త్రీ రూపముగ కనుపించెను వారు మోహాపడి ఆమె చుట్టును చేరి యిట్లనిరి

(మోహాపడిన దృష్టికి ప్రకృతి ద్రవ్యము యొక్క కూర్పు స్త్రీ దేహముగను, కాలమే ఆమె వయస్సుగను గమనికకు వచ్చును )

733 టీక ఏక స్థలమునన్ = ఒకేచోట, తత్ + పద పద్మంబు = నీ పాదమను పద్మము, ఇలన్ = నేలపై, బహు గతులన్ = అనేక గమనములతో, తనరారున్ = వ్యాప్తి చెందును, తరుణ + అబ్జముఖి = పరువమునకు వచ్చిన పద్మము వంటి ముఖము గలదానా!

తా॥ పద్మము జలములలో మాత్రమే యొకే ప్రదేశమున కదులకుండును నీ పాద పద్మములు మాత్రము భూమిపై కూడ అనేక స్థలములలో అనేక గతులలో చరించును

734 టీక దనుజులు = రాక్షసులు, వనజాసనుఁడు = బ్రహ్మ,

తా॥ ఇట్లు పలుకుచు రాక్షసులందరు మనస్సులలో అనురాగము చెంది సంధ్యాకాంతను పట్టుకొనిరి చతుర్ముఖుడు సంతోషపడి తప్పించుకొనెను

(కామము దేహమునందు చూడబడిన సౌందర్యమునే పరిభావితము చేయునుగాని దేహద్రవ్యమందలి నిర్మాణ దేవతలను, అంతర్యామియైన చతుర్ముఖుని నెరుక లేదని భావము)

785 టీక సరసిజభవుడు=బ్రహ్మ, అటమ్మీదన్ =ఆ సమయమున, తనున్ =తన్ను తాను, కరకాంతి దీపించన్ = చేతిని పరిమళము చూచుకొనగా, ఆత్మీయ తనువున్ =తన శరీరమును,

తా॥ చతుర్ముఖుడప్పుడు తన చేతిని తాను పరిమళము చూచుకొనెను వాని శరీరమునుండి గంధర్వులు, అప్సరసలు పుట్టిరి అప్పుడు ఆ శరీరమును కూడ విడచెను

(తన శరీరమును తాను పరిమళము చూచుకొనుట యనగా తాను చేయుచున్న సృష్టి నిపుణత యందలి శ్రేష్ఠత్వము గమనించెనని యర్థము ఆ గమనించుట నుండి సంగీతము, నాట్యము మున్నగు లలిత కళలు పుట్టినవి గంధర్వులు సంగీతమునకును, అప్సరసలు నాట్యమునకు అధిదేవతలు మరియు గంధర్వులు శబ్ద తరంగములకును, అప్సరసలు ఏడురంగుల కలయికలకును అధిదేవతలు ]

786 టీక చంద్రికారూపంబు = వెన్నెలరూపము, తత్ + గాత్రంబు=ఆ శరీరము, విశ్వావసు పురోగములు=విశ్వావసువు మొదలైనవారు, కమలగర్భుండు = బ్రహ్మ, తంద్రా + ఉన్మాద = నిద్ర, పిచ్చిచేష్టలు, జృంభికా=ఆవులింతలు, దిగంబరులు=వస్త్రములు లేనివారు, ముక్తకేశులు=జుట్లు విరియబోసికొనినవారు, ముకుళించి=ముడిచికొని, తత్ + గాత్రంబు = ఆ శరీరము, విసర్జనంబు=విడిచిపెట్టుట, అజుండు=బ్రహ్మ, అన్నవంతుడు=అన్నము కలవాడు, అదృశ్య దేహుండు = కనుపింపని

దేహము గలవాడు, శ్రాద్ధంబులు=శ్రద్ధతో పితరులకు చేయు పూజలు, హవ్య కవ్యంబులు=హోమము చేయదగిన ద్రవ్యము, సమర్పణ చేయవలసిన ద్రవ్యము,

తా॥ అపుడు వెన్నెల రూపముగా దిగివచ్చిన ఆ దేహమును విశ్వావసువు మొదలగు గంధర్వులును, అప్సరసలును స్వీకరించిరి మరల చతుర్ముఖుడు ఎద్రిమత్తుతో, పిచ్చి చేష్టలతో, ఆవులింతలతో కూడిన నిద్రారూపమైన శరీరమును ధరించెను దానినుండి పిశాచములు, గుహ్యకులు సిద్ధులు, భూత గణములు పుట్టిరి వారు జుట్లు విరియబోసికొని దిగంబరులై చరించిరి చతుర్ముఖుడు కన్నులు మూసికొని ఆ దేహమును కూడ విడిచి పెట్టెను దానిని వారు ధరించిరి మరల బ్రహ్మ తన్ను అన్న వంతునగా ధ్యానము చేసెను దానినుండి అదృశ్యదేహులగు పితరులు, సాధ్యగణములు అనువారిని పుట్టించెను వారు దేవత్వము పొందిరి అప్పటినుండి పితరులకు సాధ్యులకు హవ్యములను కవ్యములను అర్పింతురు

787 టీక సజ్జనస్తుత = మంచి వారిచే స్తుతింపబడువాడా!, చతురతన్ = చాతుర్యముతో, పంకజాసనుఁడు = బ్రహ్మ, తిరోధానశక్తి = కనుపింపకుండునట్టి శక్తి, ఓరిన్ = వరుసగా, తిరోధాన నామధేయము = తిరోధానమను పేరుగలది, భారతీ విభుఁడు = బ్రహ్మ, ధాతృప్రతిబింబ దేహముల్ = బ్రహ్మకు ప్రతిబింబములైన శరీరములు, కవగూడి = జంటగా గూడి, బ్రహ్మ పరమైన = బ్రహ్మను గూర్చిన,

తా॥ చతుర్ముఖుడు తన చాతుర్యమైన తిరోధాన శక్తితో సిద్ధులు, విద్యాధరులు అనువారిని పుట్టించెను వారికి తిరోధాన మనబడు ఆ తన దేహము నిచ్చెను అటు పైన తనకు ప్రతిబింబ

మైన మరియొక శరీరమును పుట్టించెను దాని నుండి కిన్నరులను, కింపురుషులను సృష్టించెను వారు బ్రహ్మను ఎప్పుడు [illegible] దేహములు ధరించి చరించుచుందురు వారెప్పుడును [illegible] జంటలుగా నుందురు బ్రహ్మను గూర్చిన గీతములు పాడుచు సంచరించుచుందురు అటువంటి చతుర్ముఖుడు మరల తన [illegible] కర్తవ్యమును గూర్చి తలచెను

(1 తిరోధాన మనగా అస్తిత్వమున నుండి కూడ నింద్రియ ములకు గోచరింపకుండుట సిద్ధులనగా కపిలుడు మున్నగు వారు [illegible] భావులు విద్యాధరులనగా విద్యలను ధరించి అధిదేవతలై తిరుగు వారు మనలో విద్యలు నేర్చుకొనుటకు, తెలుసుకొనుటకు వినియోగించుటకు కావలసిన ప్రజ్ఞలుగా పని చేయుచుండును మన కున్నట్టి నేర్చుకొన గల్గుట మొదలగునవి వీరి మహిమ వలననే వీరు మన మనస్సులో నుండి పని చేయుచుండగ [illegible] కొందమన్న సంకల్పము, శ్రద్ధ వీరి రూపము లే వీ [illegible] వీలును బట్టి యున్నను కనుపించుటకు సంకల్పము, శ్రద్ధ మున్నగు వానికి నింద్రియ గోచరమగు రూపముగాని, బరువుగాని, పొడవు, వెడల్పులు, ఘన పరిమాణము గాని యుండవు అనను వీరుందురు ఉన్నట్లు మనకు తెలియుచుండును. అనగా [illegible] చుందురు ఇట్లుండుటకు వీలైన [illegible] శరీర మే [illegible] శరీరము

2 కిన్నరులు, కింపురుషులకు చతుర్ముఖుడు [illegible] మైన శరీరమిచ్చెనని చెప్పబడినది అనగా [illegible] యందుగాని, అద్దమునందుగాని ప్రతిబింబించుట [illegible] మును మనము చూడగల్గుట అనువానికి కిన్నరులు అధిదేవతలు, కనుకనే వారు జంటలుగా నుందురు. ప్రతిబింబమునకు తేరుగా

న స్తిత్వముండదు చూచువాడు, చూడబడునది, అని ఏర్పడినపుడే ప్రతిబింబముండును కనుక నే వారు జంటలుగా జీవించుట

( అద్దము మున్నగు వానియందు మాత్రమే కాక మన ఇంద్రియముల నుండి గ్రహించు సమస్తమునకు వీరి సహాయము కావలయును ఏ వస్తువునకైన మనము చూచు నాకారాకలు ప్రతిబింబములే గాని ఆ వస్తువున కున్న వికావు కర్ర చెక్కను కుర్చీగా చేసినచో అందు కుర్చీ మనము చూచునట్టి ప్రతిబింబమే గాని కర్రచెక్క అందుండదు అట్లే మనము చూచు వ్యక్తుల, జంతువుల, చెట్ల పక్షుల రూపములు, సూర్య చంద్రాదుల రూపములును, మనము చెవులతో వినునట్టి శబ్దము ఆకాశమున నున్న శబ్దముల కేర్పరచుకొన్న ప్రతిబింబమే గాని నిజమైన శబ్దము కాదు అట్లే వాసన, రుచి, స్పర్శ మొదలైనవి )

788 టీక కనలుచున్ = దుఃఖించుచు, శయనించి = పండుకొని, కరచరణాదుల్ = కాళ్ళు చేతులు, కొనకొని = సంకల్పించి, రోమములు = వెంట్రుకలు, ఉగ్రకుండలి వ్రజము = భయంకరమైన సర్పముల సమూహము,

తా॥ తన సృష్టి వృద్ధి చెందుట లేదని దు ఖపడుచు చతుర్ముఖుడు పండుకొనెను కాళ్లుచేతులు కదలించెను అపుడు వాని రోమములు రాలిపడి భయంకరములైన సర్పములు సృష్టింపబడెను

( బ్రహ్మ శరీరమున సత్యలోకమేగాని భౌతిక ద్రవ్య ముండదు కనుక కాలుచేతులు గూడ సృష్టి భావనగా రూప ములై పుట్టునేగాని భౌతికముగా నుండవు అపుడు బ్రహ్మ నుండి కొన్ని కేశములు రాలుచుండగా అవి తన రోమములని సంకల్పిం

చెను దాని వలనసే తరువాత భౌతిక దేహ జీవులకు గోమను లేర్పడెను బ్రహ్మ నుండి రాలిన గోమముల్లైన ఈ తలపుల ముక్కలు తరువాత దేహములు దాల్చి సర్పము లయ్యెను అవి గ్రహ గోళాదుల గమనమునకు దారులుగా నేర్పడెను భూమిపై భౌతిక దేహములు పుట్టు సమయమున అందు చిన్నవి దేహములు దాల్చి మొట్టమొదటి సర్పజాతి యయ్యెను

ఇంతవరకును తననుండి పుట్టిన జీవులు సృష్టిగా మొదలు చుండెనేగాని వానికి వృద్ధి గలుగుట లేదు అనగా జీవుల నుండి జీవులు పుట్టుట, గర్భధారణము ఇంకను ఏర్పడలేదు రాక్షస ధర్మమైన కామము పుట్టినను దానికిని గర్భధారణము ఒక వృద్ధి జేయు ధర్మముగా నేర్పడినది కేవలము అసురులు వినోదించు ధర్మముగా మాత్రముండెను వారి ప్రభావము వలననే ఇప్పటికిని భౌతిక దేహములను ధరించిన వారికిగూడ చాలమంది కామ మును గర్భధారణమున కుద్దేశింపక తమ తృప్తికి మాత్రముద్దే శించు చున్నారు అది వారిలో నున్న రాక్షస ధర్మమువలన కలుగుచున్నది )

789 టీక వనజజుఁడు= బ్రహ్మ, కృతకృత్యుఁడుగా= అనుకొన్న పని చేసినవాడుగా, తుష్టి=సంతోషము, నిఖిల జగత్ పావనులు = సర్వజగత్తులను పవిత్రము చేయువారు, త్రిలోక వరులన్=మూడులోకములయందు శ్రేష్ఠులను,

తా॥ తాను చేయదలచినపని పూర్తియైనట్లుగా తలచి చతుర్ముఖుడు సంతుష్టి పొందెను అతని మనస్సునగల సంతుష్టినుండి మనువులు పుట్టిరి వారు మూడు లోకముల సృష్టిలో శ్రేష్ఠులు లోకములను పవిత్రముచేయువారు.

(బ్రహ్మకు సంతుష్టిగలిగిన సమయమున మనువులు పుట్టిరి అనగా వారు సంతుష్టియను పరిపూర్ణతకు అధిదేవతలైన ప్రభువులు కనుకనే మూడులోకముల సృష్టియందును శ్రేష్ఠత చేకూర్చిరి

ఇదివరకు సృష్టింపబడిన సమస్త సృష్టియు గర్భధారణము నకు పనికిరాలేదు కామము కూడ గర్భధారణమునకు పనికి రాలేదు అపుడే గర్భధారణము పుట్టియున్నచో జీవులలో పవిత్ర భావములు, కామాదులనుండి తరించి జీవులు మహానుభావు లగుట యుండెడిది కాదు అందరును నులి పురుగులవలె చరించి యుండెడి వారు మనువుల సృష్టివలన జీవులలో బాగుపడవలెనని, ఉద్ధరింప బడ వలెనను భావములు పుట్టును కనుక ఇటువైన దేహధార ణము జరిగినచో నష్ట ముండదు )

740 టీక తగిలి = సంకల్పించి, అఖిల జగత్ స్రష్ట = సమస్త జగత్తును సృష్టించినవాడు, వితత సుకృతము = విస్తారత చెందిన మంచిపని, మనుసర్గము = మనువుల సృష్టి, ఈడ్యము = స్తుతింపదగినది, తత్ + హవిర్భాగములు = ఆ హవిస్సుల యందలి భాగములు, ఆస్వాదనములు = రుచిచూచుటలు, భారతీ విభుడు = బ్రహ్మ,

తా॥ మనువులను పుట్టించి వారికి తన పురుషరూపమైన శరీరమిచ్చెను దానిని పొంది వారు తమకన్న ముందు పుట్టిన సృష్టిని తమయందు గమనించిరి వారితోకూడి నిలబడి బ్రహ్మతో నిట్లనిరి " దేవా ! అఖిల జగత్తును సృష్టించిన యీ నీ సృష్టి మహా సుకృతమైనది దీని పద్ధతి మా కాశ్చర్యము గొల్పుచున్నది నీవు సృష్టించిన సమస్త యజ్ఞక్రియలు మా సృష్టియందు స్తుతింప దగినవిగా నిలిచినవి మీ యజ్ఞమందు హోమము చేయబడిన

భావిస్సులు మాకు రుచిగా మటకు ఆహ్వాలతో గ్రహించుటకు వీలయ్యెను!" మనువులు సంతోషముతో నిట్లు స్తుతించిరి

(1 మనువుల వలన సృష్టికి జీవుల రూపమైన దేహ ధారణము పుట్టెను

2 ఆ దేహ ధారులు అంతకు ముందు పుట్టిన ఇంద్రియములు, దేవతలు మొదలగు సృష్టిని తమ దేహముల యందున్నట్లు గమనించిరి

3 బ్రహ్మచేసిన యజ్ఞము లనగా తనకోసము కాకుండ భగవదనుజ్ఞ యగు సృష్టికోసము చేసిన పనులు తనకోసము ఫలితముగోరి చేసిన పనులు గాక లోకశ్రేయస్సు కొఱకు చేసిన వానిని యజ్ఞ కర్మలందురు అవి యన్నియు జీవుని సృష్టియందు సార్థకము లైనవి

4 అంతకు ముందరి సృష్టియందగు సూర్యుడు అగ్ని సాధనములుగా మిగిలిన గ్రివ్యము లన్నియు సృష్టి పదార్థములుగా మార్పు చెందినవి అవి జీవుని యందు దేర్పడిన తరువాత మాత్రమే జిహ్వలో రుచి నాడగలుగుట ఏర్పడెను ఉదాహరణమునకు ఆహార పదార్థములు, ప్రాణము, ఇంద్రియములు, పంచ భూతములు పుట్టినను జీవు డేర్పడి నాలుక ఏర్పడినచో ఆహారము, రుచి అనునవి పుట్టవు చక్కెర యుండి తినువాడు లేనిచో అది చక్కెర యెట్లగును? దానిని రుచిచూచుట ఎట్లు సాధ్యము? మనువుల సృష్టి వలన నది సాధ్యమైనదని యర్థము )

741 టీక వరతపో యోగవిద్యా సమాధియుక్తుండు = శ్రేష్ఠమైన తపస్సు, యోగము, విద్య, సమాధి, అను వానితో కూడినవాడు, వ్యాపీక + ఆత్ముండు = ఇంద్రియములతోడి

దేహము తనరూపమైనవాడు, ఐశ్వర్య = ఈశ్వరత్వము (యజమానిగా నుండుట), ఎరక్తి = వైరాగ్యము, శరీర+అంశంబు= శరీరమందలి భాగము,

తా॥ అపుడు చతుర్ముఖుడు శ్రేష్ఠ గుణములైన తపస్సు, యోగము, విద్య, సమాధియను లక్షణములతో, కూడిన ఋషి వేషము ధరించి ఇంద్రియములతో దేహములతో నిలబడెను అందుండి ఋషిగణములను పుట్టించెను వారికి తన దేహము లందలి అంశలుగా సమాధి, యోగము, ఈశ్వరత్వము, తపస్సు, విద్య, వైరాగ్యము అనువానిని సంక్రమింప జేసెను ఇన్నిటితో కూడిన తమ యంశమును ఒక్కొక్కనికే పంచిపెట్టెను అని మైత్రేయుడు చెప్పగా విని విదురుడు పరమానందము చెందెను విష్ణుని పాదపద్మములను హృదయమున స్మరించి మరియు మైత్రేయుని జూచి యిట్లనెను

(మనువు)ను సృష్టించిన వెనుక జీవులకు కావలసిన ఋషిత్వము ను కూడ మరియొక దేహముగా సృష్టించి ఇచ్చెనని యర్థము తపస్సు అనగా వాక్కును, మనస్సును, దేహమును సక్రమమైన విని యోగమున నిలుపుటకు సాధన యోగమనగా చిత్తము యొక్క వృత్తులను నిరోధించుట విద్యయనగా జ్ఞానము తెలిసినవాడు, తెలిసికొనుట, తెలియబడు విషయము అను మూడింటి యందున్న యొకే వస్తువును గ్రహించుట జ్ఞానము సమాధి యనగా సమస్త ప్రవృత్తులు తనయందు లయమైయుండుట ఈ ధర్మములు కలవాడు ఋషి అతడు పరిపూర్ణత చెందినవుడు వ్యాపీకాత్ముడగును అనగా ఇంద్రియములు దేహము కూడ ఆత్మామయము లగును అటుపైన వైరాగ్యము పరిపూర్ణమై

నపుడు బ్రహ్మ శరీరము లేక బ్రహ్మత్వము గలుగును వైరాగ్య మనగా వస్తువుల యందున్న దృష్టి కన్న అందలి అంతర్యామియందు దృష్టి బలపడుట, వస్తువులందలి విలువలు తన్ను బాధింపకుండుట ఇది గలిగిన తరువాత ఐశ్వర్యము కలుగును అనగా తాను మీద్గా నియున్న దేహాది సృష్టియంతయు గాని వశమున వర్తించుట. దీనినే యోగశాస్త్రమున ఈశత్వము అందురు )

742 టీక పరమ సమ్మతము = మిక్కిలి అంగీకారమైనది, మిథునక్రియ = లౌకిక శరీర సంబంధమైన దాంపత్యము, నందనులు = పుత్రులు, సప్తద్వీపవతి = ఏడు దీవులతో గూడినది (భూదేవి), ధాత్రి = భూమి, అనఘులు = పాపము లేనివారు, సద్భావానంత బుద్ధిన్ = దయతో నిశ్చలత్వము పొందిన బుద్ధి గలిగి,

తా॥ ఓ మైత్రేయ మహామునీ! స్వాయంభువ మనువు వంశము పరమ పవిత్రము పవిత్రులు కావలయు నన్నచో వానిని, వాని వంశమును స్మరింపక తప్పదు అట్టి వంశమున లౌకిక దేహ సంబంధము గల సంతానాభివృద్ధి కలిగి నట్లు చెప్పితివి అది యెట్లు సాధ్యమయ్యెను? వారు పవిత్రమూర్తులై ఎట్లు పరిపాలించిరి! స్వాయంభువ మనువునకు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అను పుత్రులు గలరంటివి వారు ఈ సప్త ద్వీపములతో గూడిన భూమిని ధర్మ మార్గము తప్పకుండ పరిపాలించిన విధమెట్లు? వారి జీవిత చరిత్రలెట్టివి? మా యందు దయతో వినిపింపుము

743 టీక యోగ లక్షణ సమేత = యోగమభ్యసించు వారి లక్షణములతో గూడినది ,

తా॥ స్వాయంభువ మనువు పుత్రిక దేవహూతి యోగ జీవితమునకు తగిన శుభలక్షణములు గలది. ఆమెను కర్దమ ప్రజా

పతికిచ్చి మనువు పెండ్లి చేసెనంటివి అది యెట్లు యుక్తము? కర్దముడు గూడ మహాయోగి అతిడామె గర్భమున సంతతి నెట్లు కలిగించెను? తన పుత్రిక రుచియను కన్యను కర్దముడు దక్షప్రజాపతి కిచ్చి పెండ్లి చేసెననియు చెప్పితివి రుచియందు దక్షుడు ఈ సృష్టి నేవిధముగా పుట్టించెను? సవిస్తరముగా వివరింప గోరెదను

(మిగిలిన ప్రజాపతులతోపాటు కర్దముడు చతుర్ముఖుని దేహము నుండి పుట్టెను స్వాయంభువ మనువు చతుర్ముఖుని మరియొక దేహము నుండి పుట్టెను కనుక కర్దముడును, మనువు సహోదర వర్గ మగుదురు అపుడు మనువు పుత్రికను కర్దముని కిచ్చి వివాహము చేయుట ధర్మ సమ్మతమా యని విదురుని సందేహము

కర్దముని పుత్రిక రుచి దక్షప్రజాపతికి సోదర్యుని పుత్రిక యగును వారి వివాహము గూడ ధర్మ సమ్మతమా? యని రెండవ సందేహము )

744, 745 టీక నియుక్తుండు = నియోగింపబడిన వాడు, ముదము సంధిల్లన్ = సంతోషము కలుగునట్లుగా, ధీర గుణుఁడు = ధైర్యగుణము గలవాడు, తవిలి = పూనుకొని, ఓలిన్ = వరుసగా,

తా॥ మైత్రేయుడు విదురునితో నిట్లు వివరించెను ఓ పుణ్యాత్మా! కృతయుగమున కర్దమ మునీంద్రుడు ప్రజలను సృష్టించుటకై బ్రహ్మచే నియోగింపబడెను సంతోషముతో సరస్వతీ నది తీరమునకు పోయి పదివేల దివ్య సంవత్సరములు అఖండముగా తపస్సు చేసెను ఒకనాడు జపసమాధి యందు ఏకాగ్రుడై విష్ణుమూర్తిని పూజించెను

( బ్రహ్మ చేసినది సృష్టియే గాని ప్రజ సర్గము కాదు సృష్టి యనగా దేవతలు మున్నగు వెలుగులను ప్రజ్ఞలను, ప్రకృ

తిని, పంచభూతములను సృష్టించుట అది తొలి ( విసర్గ మనగా స్త్రీ పురుష దేహములు ధరించి గర్భధారణమును సంతతిని పొందుట చతుర్ముఖుడు ప్రజా సర్గమునకై మొదట కర్దము ప్రజాపతిని నియమించెను

అతడు సరస్వతీ నదీతీరమున పది వేల దివ్య సంవత్సరములు తపస్సు చేసెను అనగా బ్రహ్మసృష్టి వాహ్యాప్రవృత్తి దిగివచ్చు మార్గమున తపస్సు చేసెను ఆతని తపస్సునకు ఫలితముగా నారాయణుడు జీవునకై దిగివచ్చె నెన్నేముకో మున్నగు సరస్వతీ ప్రవాహముల గొలము తేల్పరచి శ్వాస యనగను గరుడవాహన మార్గోపరించి హృదయస్థునకై దిగివచ్చుట యందలి శాస్త్ర నిరూపకమైన ఇతిహాస మీ కథలో చెప్పబడును )

746 టీక వరదాన్ = వరములిచ్చువానిని, ప్రస న్నన్ = అనుకూలుడైన వానిని, మనోహర వరదాన సుశీలున్ = మనస్సును హరించు వరముల నిచ్చు చక్కని లక్షణములు గల వానిని, ( మనస్సును హరించు కోరికలను తీర్చుచున్నట్లు అనుగ్ర హించుచు మనస్సును హరించునట్టి సమాధి స్థితిని సమకూర్చు నట్టి వాడు విష్ణువు. ) అమర వంద్యున్ = దేవతలకు వందనీయుని, రమేశున్ = లక్ష్మీపతిని, దురిత విదూరుకు = పాపము లంట కుండునట్లు చేయు వానిని, సుదర్శనకరున్ = సుదర్శనమును చేతి యందు ధరించిన వానిని, లేక చక్కని దర్శనము కలిగించు వానిని, కరుణా కరుడు = దయకు నిలయమైన వాడు,

తా॥ వరము లిచ్చి అనుగ్రహించు వాడును కోరికలను తీర్చు చున్నట్లు కనుపించుచు మనస్సు నూర్ధ్వగతికి పట్టించు లక్షణము గలవాడును, లక్ష్మీపతియు, పాప హరుడును, సుదర్శ నము ధరించి దేవతల నమస్కారము లందుకొను వాడును, అగు విష్ణుమూర్తిని కర్దముడు మనస్సున ధ్యానించెను.

747, 748 టీక తరణి సుధాకర కిరణసమంచిత=సూర్య కిరణములతో చంద్రకిరణములతో నొప్పారుచున్న, సరసీరుహ+ ఉత్పల స్రగ్ విలాసుఁడు = పద్మముల, కలువ పువ్వుల మాలిక లతో సొగసైనవాడు, కంకణ నూపుర = కంకణములు భుజా భరణములు, గ్రైవేయ = హారములు, ముద్రికా = ఉంగర ములు, కిరీట + అభిరామున్ = కిరీటముతో నొప్పు చున్న వానిని, కమనీయ = కోరదగిన, సాగర కన్యకా = సముద్రుని కూతురు (లక్ష్మీదేవి), ఉద్భాస మానవక్షుఁడు = కాంతులు వెద జిమ్ముచున్న వక్షస్థలము గలవాడు, సలలిత = మనోహరమైన దరహాస చంద్రికా = చిరునవ్వు వెన్నెలలు, ధవళిత =తెలుకింప బడిన, చారు దర్పణ విరాజత్ + కపోలున్ = చక్కని అద్దము వలె మెరయుచున్న బుగ్గలు గలవానిని, చారుహస్తున్ = అంద మైన హస్తములు గలవానిని, అళికుల + అలక = తుమ్మెదల గుంపు వంటి ముంగురులు, రుచి భాస్వత్ + అలక ఫలకున్ = కాంతితో మెరసిపోవుచున్న నుదుటి భాగము కలవానిని, పీత కౌశేయ వాసున్ = పచ్చని పట్టుబట్ట ధరించిన వానిని, కృపా తరంగిత స్మిత + ఈక్షణున్ =దయా సముద్రమునకు అలలుగా కదలుచున్న చిరునవ్వు చూపులు గలవానిని, పంకజోదరుని = నాభియందు పద్మము గలవానిని,

తా॥ కర్దముని ధ్యానము నందు విష్ణుమూర్తి అంతరిక్షమున ప్రత్యక్షమయ్యెను కుడికంటి నుండి చూపులు సూర్యకిరణములై ప్రసరింపగా మెడలోని పుష్పమాల యందు పద్మములు విచ్చు కొను చున్నవి ఎడమకంటి నుండి చూపులు వెన్నెలలుగా ప్రస రించుచుండగా దండలోని కలువపూలు విచ్చుకొను చున్నవి కంకణములు, బాహుపురులు, హారములు, ఉంగరములు, కుండ లములు, కిరీటము అలంకరింపబడి యున్నవి. వక్షస్సున సముద్రుని

కూతురగు లక్ష్మియు, కౌస్తుభమణియు వెలుగొందుచున్నవి చిరునవ్వు వెన్నెలను ప్రతిబింబించు దర్పణములవలె చక్కగా వికసించియున్నవి శంఖ చక్రగదా పద్మములను ధరించి తుమ్మెదల వంటి ముంగురులతో అందమైన ఫాలభాగము గలిగి పీతాంబరము ధరించియుండెను చిరునవ్వుతో వికసించు [illegible] నుండి దయ ప్రవహించుచుండెను

749 టీక శబ్దబ్రహ్మ శరీరవంతుడు = ఆకాశమందలి శబ్దస్వరూపమైన బ్రహ్మమే తన శరీరముగా గలవాడు, సత్ + ఆత్మకుండు = సన్మార్గమే (ఆకాశమార్గమే) [illegible] గలవాడు, [illegible] + ఏక వేద్యుండు = ఒక్క [illegible] తెలియబడు వాడు, వైనతేయ + అంస విన్యస్త చరణ [illegible] = గరుత్మంతుని మూపున నుంచిన పాదపద్మములు గలవాడు, [illegible] హర్షలహరీ పరవశుండు = పుట్టిన ఆనంద [illegible] తెలియని వాడు,

తా॥ ఆకాశ మార్గమున చరించునట్టి శబ్దబ్రహ్మమే తన శరీరముగా గలవాడును, జ్ఞాన దృష్టికి మాత్రమే గోచరించువాడును, గరుత్మంతుని వీపున పాదారవిందము లుంచిన వాడును, అయిన విష్ణుమూర్తిని చూచి ఆనంద పారవశ్యము అలలు పొంగగా పూర్ణ మనోరథుడై దండ ప్రణామములు చేసి నిలబడెను

750 టీక ముకుళిత కరకమలుండు = హస్త పద్మములను ముడిచిన వాడు, అకుటిల = వంకరలేని, సద్భక్తి పరవశ + ఆత్మకుడు = చక్కని భక్తియందు మైమరచిన వాడు, ఎకచ + అంభోరుహాలోచనునకు = విచ్చిన పద్మముల వంటి కన్నులు కలవానికి (విష్ణుమూర్తికి), తత్ + ఆననము = వాని ముఖము,

తా॥ కర్దముడు అంజలి ఘటించి కపటము లేని భక్తి యోగమున ధ్యానస్థితి పొందినవాడై విష్ణుని ముఖము చూచి ఇట్లనెను

751 , అబ్జాక్ష = పద్మములవంటి కన్నులు కలవాడా! సకలభూత + అంతరాత్ముడవు = అన్ని జీవుల లోపల తానుగా నున్నవాడవు తనరు చుండెడి = వ్యాప్తి చెందుచుండు, తలకొని = శిరసావహించి, సుకృతఫల భరితంబులు = పుణ్యముల పంటలతో నిండినవి, అనేక జన్మ + అనుసరణ = అనేక జన్మల ననుసరించిన, యోగక్రియా + అభ్యాస నిరూఢులు = యోగ సాధనముగా తమ పనులాచరించు కొనుట యందు నిష్ఠ బొందినవారు, భవ వార్ధిన్ = సంసార సాగరమున, మంటిన్ = బ్రదికితిని, లోచనంబుల కలిమి = కన్నులున్నందుకు ఫలము, తవిలి = పూని, చిర దయాకార = చిర కాలముగా నభ్యసించు దయ యొక్క స్వరూపమైన వాడా! నిత్యలక్ష్మీ విహార = ఎల్లప్పుడు లక్ష్మి విహరించుట గలవాడా!,

తా॥ సర్వ జీవరాసులలో నంతర్యామిగా నుందువు గనుక నిన్ను దర్శించుట కష్టము ఎన్నో పుణ్యము లాచరించిననే గాని అట్టి నీ దర్శనము లభ్యము కాదు సరియైన విధమున యోగాభ్యాసము చేయవలెనన్నచో జీవితమునే యోగముగా మలచుకొని తమ పనులు యోగాభ్యాసముగా నాచరించుటకు మనస్సంగీకరింప వలెను అట్లంగీకరించుట శాస్త్రజ్ఞానము వలన కాక కొన్ని జన్మములలో వరుసగా చేసిన పుణ్యముల ఫలము వలన మాత్రమే సాధ్యమగును మహనీయులు నీ సాన్నిధ్యము నీ విధముగనే సాధించుకొందురు అట్టి నీ పాదారవింద దర్శనము నాకు కలిగించితివి దానితో సంసార సాగరమును దాటితిని జీవించుట

యనగా నేమో తెలిసినది కన్నులున్న ఫలితంబు దక్కెనగు చిర కాలము జీవులయందు దయ నభ్యసించినందుకు మాత్రికు వారి యాకారములు నీవిగా తెలియును అప్పుడు నిరంతరము లక్ష్మీ దేవి విహార స్థానములుగా వర్ణనము చెప్పను

752 శ్రీ భవదీయ = నీయొక్క, పాదపద్ములు= తెలివి దెబ్బతిన్నవారు సంసార పారావార తరంగములు= సంసార సముద్రము నుండి లేవదీయునవి, తుచ్ఛప్రవృత్తి కాములు= నీచప్రవర్తనయందు కోరిక కలవారు, నిరయగాములు= నరకమున నున్నవారు, తత్కామ యోగ్యంబులు = వారి కోరికలకు తగినవి, మనోరథంబులు = అభిలాషములు, సకాములు = కోరికలు గలవారు, గృహమేధ ధేనువు=గృహస్థాశ్రమ యజ్ఞమునకు గోవు వంటిది, అశేషమూల = సమస్తమునకు మూలమైనది, త్రివర్గ కారణ= ధర్మము, అర్థము, కామము అనబడు త్రివర్గములకు కారణమైనది, సమానశీల=సమానమైన ప్రవర్తనము గలిగి, అపేక్షించి = అభిలాషపడి, కల్పతరు మూల సదృశంబులు=కల్ప వృక్షము మూలముల వంటివి, బహిరాత్మకుండవు = బాహ్యము గను, ఆత్మముగను ఉన్నవాడవు, (అంతట నిండియున్న లోకము గను, చూచువాని లోపలనున్న జీవుడుగను అహంకారముగను గూడ రూపొంది యున్నవాడు), వచస్తంతు నిబద్ధులు=వాక్కు-లను దారములచే దగ్గరగా కట్టబడిన వారు, కామహతులు= కోరికలచే దెబ్బతిన్నవారు, అభిమతంబు=ఇష్టము, కర్మమయంబు= సృష్టి కర్మ స్వరూపము, మాయావినిర్మితంబు = మాయచే వివిధముగా నిర్మింపబడినది, కాలాత్మక భూరివేగ సమాయుక్తంబు=కాల స్వరూపమైన మహా వేగముతో కూడినది (కాలమే ఆత్మగా గలిగి దాని మహావేగముతో కూడియున్నది), అక్షరంబు=నాశములేనిది, లేక ఉచ్చారణ స్వరూపమైనది, లేక

అకారాది క్షకారాంతమైన రూపముగలది, భ్రమణశీలంబు=గిర గిర తిరుగు స్వభావము గలది, అధిమాస సమేత = అధిమాసములతో కూడిన, త్రయోదశమాస+అరంబు=పదుమూడు మాసములనబడు అరలు గలది, షష్ట్యుత్తర శతత్రయ = మూడువందల అరువది, అహోరాత్ర మయ పర్వంబు=రాత్రింబవళ్లుగా నేర్పడిన గనుపులు గలది, ఋతు షట్క సమా కలిత=ఆరు ఋతువులతో కూడిన, నేమి = బండిచక్రపుచుట్టు పట్ట కలది, చాతుర్మాస్య త్రయవిరాజిత = నాలుగు మాసములతో గూడిన విభాగములు మూడింటితో వెలుగొందునట్టి, నాభియు=నడిమి బొడ్డియు గలది, అపరిమిత=కొలతకందని క్షణలవాది పరికల్పిత=క్షణములు, లవములు, మున్నగు కాల విభాగముచే కల్పింపబడిన, పత్రిశోభితంబు=బండి చక్రపు టాకులచే సొగసైనది, కాలాత్మక= కాల స్వరూపమైన, భూరివేగ సమాయుక్తంబు = మహా వేగముతో కూడినది, సకల జీవనికర = సమస్త జీవుల సమూహముయొక్క, అయుర్గ్రసన తత్పరంబు=ఆయుర్దాయమును తినుటలో నిమగ్నమైనది, కామ+అభి భూత జన+అనుగత = కామములచే తిరస్కరింపబడిన జనుల ననుసరించునట్టి, పశుప్రాయులు = పశువుల వంటివారు (త్రాటితో గుంజకు కట్టబడిన జీవులవంటి వారు, తమ స్వేచ్ఛ కష్టపడునట్టి అజ్ఞానముతో కట్టబడిన వారు), భవపరితాప నివారణ కారణంబు = సంసారపు దిగుళ్ళను నివారించుటకు కారణము, భవదీయ = నీ యొక్క, చరణ + ఆత పత్రిచ్ఛాయా= పాదములను గొడుగుల నీడ, సమాశ్రయులై = చక్కగా నాశ్రయించిన వారై, తావకీన గుణకథన= నీ గుణములు కీర్తించు కొనుట, సుధ స్వాదన=అమృతము గ్రోలుట, రుచిర లహరీ నిరసిత=మనోహరములైన తరంగములచే తిరస్కరింపబడిన, సకల దేహధర్మలు=సమస్త దేహ ధర్మములు గలవారు, భక్తజన+

ఆయుర్ హారణ సమరంబు = భక్త జనుల ఆయుర్దాయమును హరించు శక్తి గలది, వికియు=మరియు,

తా॥ దేవా! నీ మాయచేత వివిధముగా మోహము చెందిన చిత్తము గలవారు తమ తెలివిచే దెబ్బతిన్న తెలివి గల వారై బాధపడుచుందురు వారు నీచములైన తమను నచ్చిన కోరికల కొరకు నీ పాదారవిందములను భజించుచు, తాము సృష్టించుకొనిన నరకమున జీవించుచుందురు అంతేగాని నీ పాదము సంసార సాగరమునుంచి యుద్ధరించి నరకమును దాటించు నని నెరుగరు వారికి కూడ తమ తమ కోరికల ననుసరించి ఫలితములను ప్రసాదించుచుందువు

(సృష్టిగా కనుపించు సమస్తము అందలి అంతర్యామి యని తెలియక వేరు వేరు వస్తువులుగా, వ్యక్తులుగా గమనించుటయే మోహము దానికి కారణము విష్ణుమాయ అనగా దేవుఁ ఆ వస్తువుల యాపమునవే వ్యాపించి యుండుట, తాను వేరుగా గోచరింపకుండుట, ఈ మాయచేత వస్తువుల, వ్యక్తుల వివిధత్వము నంగీకరించి జీవులు మోహము చెందుదురు అందు ప్రవర్తింపవలసిన విధానముల నెల్లుకొని శాస్త్రములను పెంచుకొందురు వానిని నేర్చి వినియోగము చేయుటలో తెలివి తేటల నుపయోగింతురు. ఒకరి తెలివి యొకరిపై పనిచేసి దెబ్బతినుచుందురు ఇట్టివారితో నిండిన బాధాకరమైన జీవితమునే సంసారసాగరమందురు

అందు భగవద్భక్తి కలిగినను తమ క్షేమ కావలయునో నిర్ణయించుకొను బుద్ధిని సమర్పణ చేయలేని వారు తామే నిర్ణయించుకొని ఆ నిర్ణయములకై భగవంతుని ప్రార్థింతురు. ఐనను దయామయుడై భగవంతుఁడు వారి కోరికలకు తగిన ఫలితములను తగినంతగా మాత్రమిచ్చుచుండును దానితో జీవితమున సమస్య

లెక్క వగును వాని నడుమ జీవించుట తప్పనిసరి చేసికొనుటయే నరకలోక మనుభవించుటగా చెప్పబడినది )

అట్టి వారు సకాము లనబడుదురు వారిని నిందించు నట్టి నేను గూడ వివాహమాడుటకు సంకల్పించుకొంటిని తగిన భార్య లభించుటకై నిన్ను ప్రార్థించుచుంటిని ( అట్లు నిందించుట నిష్కామ మనుకొను వాడు భ్రాంతిలో పడుటయే అనియు, నిష్కాముడు సకాముని నిందించుట దైవ దృష్టిలో దోషమనియు కర్థముగు గ్రహించెను ) వివాహ జీవిత మనగా ఇల్లను యజ్ఞశాల యందు చేయు నట్టి యజ్ఞము ఆ యజ్ఞమునకు కావలసిన ధేనువే భార్య ( యజ్ఞధేను వనగా యజ్ఞమున బలి యొసగబడు ధేనువని కొందరు తలచిరి అది తప్పు సనాతనమైన యజ్ఞమున పశువులను జంపుట యుండదు దేవతలు, ఋషులు చేసిన యజ్ఞము వలన సృష్టి యుద్భవించి జీవులు జీవించుచు నొక జీవికి ఇంకొక జీవి ఆహారముగా పనికి వచ్చు చున్నది అంతే కాని నరుడు చేయు యజ్ఞశాలలో పశువులను చంపుట మ్లేచ్ఛధర్మ మగును దానినే కసాయి పని యందురు

ఇచ్చట గృహమేధ ధేనువనగా యజ్ఞమునకు వలసిన పాలు పెరుగు, నేయి, వెన్న గోమయము మరియు గో మూత్రము నిచ్చుటకు యజ్ఞార్థమై పెంచబడు ధేనువు అట్లే గృహ మేధమున సంతానము పొందుటకు తోడ్పడునది గనుక భార్యను ధేనువుతో పోల్చిరి )

ధర్మార్థ కామములను సాధించు కార్యము భార్య ఆమె తనతో సమానమైన శీలము గలిగినపుడే గృహస్థాశ్రమ యజ్ఞదీక్ష సార్థకమగును కనుక అట్టి కన్యను భార్యగా ప్రసాదింపుమని ప్రార్థించుచుంటిని

సకాములను నిందించు నేను నీ పాదము నాశ్రయించి భార్య నిమ్మని ప్రార్థించుట సకామము కావచ్చును కాని ఈ సందర్భమున మాత్రము నేను సకాముడను గాను చతుర్ముఖ బ్రహ్మ నన్ను ప్రజాసర్గము చేయుమని ఆజ్ఞాపించెను. అందరిలో వలెనే చతుర్ముఖునిలో గూడ ఆత్మ స్వరూపునిగా నీవే యుంటివి కనుక నే నతని యాజ్ఞను స్వీకరించితిని

అందరిలో నొకనిగా యున్నను నీ వాక్కే అందరినుండి వెలువడుచున్నను, వేరువేరుగా తాళ్ళతో కట్టబడినట్లు జీవుల వాక్కుల వలన నొక్కొక్కనికి కోరికలయందు నిగ్రహములగును నేను చతుర్ముఖ బ్రహ్మ వాక్కుల వలన నిబద్ధుడనైనను అవి నీ వాక్కులే యని మరువకుండుట వలన నాకు వివాహము కావలయునని, భార్య కావలయునని కోరిక మాత్రము కలుగలేదు కారణమేమనగా నేను బ్రహ్మాదు లాచరించు మార్గము ననుసరించుచున్నాను

ఒక్కొక్కనిలో జీవుడుగా నుండి నీవు కాలస్వరూపుడవై జగత్తు నడచునట్లు చూచుచుందువు నీ యాజ్ఞ కర్మస్వరూపమై వర్తించుచున్నది అది నీ అభిమతమని భావించి నేననుసరింప దలచితిని గాని నాకు భార్య కావలయు ననియో, అక్కర లేద నియో లేదు ఇట్లు భార్యను గోరి నీ పాదము లాశ్రయించినను నేను సకాముడను గాను గనుక నీ దయకు పాత్రుడనైతిని.

నీవు నిర్మించిన కర్మమయమైన చక్రము కాల స్వరూపమై అంతు పట్టని వేగమై యుండును అది విప్పుకొనుచున్న సృష్టి యందు కేంద్రమైన ఉచ్చారణ రూపమై యుండును. అది అతి రమై విత్తనముగా తిరుగుచుండగా దానినుండి వెలువడుచున్న మహాచక్రము దాని చుట్టును తిరుగుచుండును.

ఈ చక్రము సంవత్సర స్వరూపముగా అర్థమగు చుండును దానికి పండ్రెండు మాసములను అరలు గలవు అధిమాస మన బడు అరతో కలసి పదమూడు విభాగములుగా తిరుగుచుండును

(చైత్రశుద్ధ పాడ్యమి నుండి ఫాల్గుణ బహుళ అమావాస్య వరకును పండ్రెండు మాసములు, మాసమునకు రెండేసి పక్షములు పక్షమునకు పదునైదు తిథులు నుండును దీనినే చాంద్రమాన సంవత్సరమందురు అనగా చంద్రుని కళల గమనముచే కొలువ బడు సంవత్సరము

ఇదికాక మన భూమి సూర్యుని చుట్టును తిరిగి వచ్చుసరికి పండ్రెండు రాశులు, ఒక్కొక్క రాశికి ముప్పది భాగలు వ్యాప్తన కాలమాన మేర్పడును ఈ సంవత్సరమునకు 365¼ దినములు లేక సూర్యోదయములు జరుగును దీనిని సౌరమాన సంవత్సర మందురు అనగా సూర్యుని బట్టి కొలుచు నట్టి సంవత్సరము ఈ రెండింటికిని భేద మేమనగా చాంద్రమానమున తిథులును, సౌర మానమున సూర్యోదయములును లెక్కింపబడును చంద్రుడు భూమికి కొంచెము దగ్గరగా చరించునపుడు ఒక్క తిథి చాల త్వరగా నడిచి పోవును కొంచెము దూరముగా వర్తించు నపుడు కొంచెమెక్కువ కాలము పట్టను మొత్తము మీద అహోరాత్ర ముల మానము కన్న తిథుల పరిమాణము తక్కువగా నుండును గనుక సంవత్సరాంతమున చాంద్రమానమునకును, సౌరమానము నకును, సుమారు పది తిథుల కాలమానము భేదము కలుగును మూడు సంవత్సరములకు ముప్పది తిథులు భేదము వచ్చును ఈ మొత్తమును మూడవ సంవత్సరమున పదుమూడవ మాసముగా లెక్కించి అధి మాసమందురు దీనినే వ్యవహారమున అధికమాస మందురు ) ఈ సంవత్సర చక్రమే మరల 360 అహోరాత్రములతో విభజింపబడి యున్నది

( ఇది చాంద్రమానము సౌరమానము కాక మాసపది యగు మరియొక సంవత్సరమా మును కలిసిని సావన సంవత్సర మాన మందురు ఇందు 360 సూర్యోదయములు 1 సంవత్సరము ఇందు 720 కణములు ఉండును అనగా 360 సూర్యోదయములు, 360 సూర్యాస్తమయములు ఈ విభాగములనే అర్ధ గర్భములని కూడ నందురు ఆయుర్దాయము లెక్కలు, దశాంతర్దశల లెక్కలు గర్భిణీ స్త్రీ గర్భ కాలముల లెక్కలు సావన సంవత్సరము నను సరించియే చేయవలయును గాని, సౌర చాంద్ర మానముల నను సరించి చేయరాదు )

ఈ మూడు విధములుగా లెక్కింప బడు సంవత్సర చక్రము భగవత్ కర్మ స్వరూపమై ఆరు ఋతువులుగా విభాగములను కలిగి జీవరాసుల నుత్పాదింప జేయును ( రెండు మాసము లొక్క ఋతువు ఇది ముఖ్యముగా సౌరమానమును బట్టి లెక్కింప వలెను )

ఇట్టి దివ్యకర్మ చక్రము చక్రమను సంవత్సర స్వరూపుడు బండి చక్రపు పట్ట రూపమున ప్రసన్నముగు చుండును

ఎండలు, వానలు చలి ప్రధానముగా గల మూడు విభా నము లీ సంవత్సరమున నుండును అదొక్కొక్కటి నాలుగు మాసముల చొప్పున వర్తించును. (చైత్ర వైశాఖ జ్యేష్ఠ ఆషా ఢములు, ఎండకాలము, శ్రావణ భాద్రపద, ఆశ్వీయుజ, కార్తిక ములు, వర్షకాలము, మార్గశిర, పుష్య, మాఘ ఫాల్గుణములు చలికాలము ఈ విభాగములను చాతుర్మాస్యము లందురు అందు రెండవ భాగమైన వానకాలము కొరకై మిగిలిన ఎనిమిది మాస ములును వస్తువులను సమకూర్చుకొనుట, ఈ నాలుగు మాసములు

కదలక ఒక చోట నుండి బ్రహ్మవిద్యా దీక్షవహించుట ప్రాచీనుల సంప్రదాయము దీనినే చాతుర్మాస్య దీక్షయందురు )

ఈ మూడు విభాగములతో కూడిన నడిమి బొడ్డుగల బండి చక్రమువలె భగవత్ కర్మ స్వరూపమైన ఈ కాలచక్రము తిరుగుచుండును దీని వలన జీవుల ఆయుర్దాయ ప్రమాణము లేర్పడుచుండును ఆ జీవులలో భగవంతుడే అంతర్యామిగా నుండుట దర్శించుచున్న వారిని ఈ చక్రమేమియును చేయదు అనగా సమస్తము నందు, తమయందు దైవమును దర్శించి వాని యందు సర్వము సమర్పణము చేసి శరణాగతులైన వారికి ఈ చక్రము వినోదకరముగా నుండును గాని తాము పుట్టుట, పెరుగుట, చనిపోవుట మొదలగు భయంకర దృశ్యము లుండవు తాము దానిలో నొక భాగముగా నున్నవారు దీనిని శాశ్వతముగా చూచుచుందురు

దానికన్న తాము వేరుగా నుండి చూచువారు, అంతర్యామిని చూడలేక సృష్టిలోని జీవులను, వారి స్వభావములను తమకు వారితో గల సంబంధములను, సన్నివేశములను, వేరు వేరుగా చూచుచుందురు. కనుక వారిని నిరంతరము భయము, శోకము, దుఃఖము, సందేహము, ఈర్ష్య మొదలగునవి మొసళ్ళవలె భయపెట్టుచుండును విష్ణువును చూడక యితరము చూచువారి జీవితముల యందు మాత్రము ఈ మహా చక్రము లెక్కలు చూపించి ప్రతిక్షణము వారి ఆయుర్దాయమును తినుచుండును (అనగా మనము పుట్టి ఇంతకాలమైనది, మనమీ పనులు చేయవలెను, ఈ అప్పులు తీర్చవలెను, ఈ ఆస్తి నార్జింపవలెను మున్నగు నభిప్రాయము లతో తమ దృష్టి నిలబడి యున్నచో తమ కంతర్యామియైన దేవు డుండడు అట్లే ఈ పదార్థమును భుజింపవలెను, ఈ రుచు లనుభ

వింపవలెను, ఈ సుఖము లనుభవింపవలెను, ఈ పనులను సాధింప వలెను, అను అభిప్రాయములలో చిక్కుకొని లంగర్యామిని మరచిన వారు తమ జనన మరణముల నడుమ నున్న పరిమాణమే తానుగా భ్రమపడుదురు గనుక క్షణముల రాపడ్డాప్తు ఈ చక్రము భయంకరముగా వారి ఆయుర్దాయమును మ్రింగుచుండును ]

నిన్ను శరణు జొచ్చిన వారు నీ గుణ కీర్తనములను చేయుచు నీ కథల అమృత రసాస్వాదనము రుచి మరిగినవారు తమ దేహ ధర్మములను లెక్క చేయక నీయందు జీవించుట నేర్చుకొందురు ఈ చక్రము వారి ఆయువును హారింపదు

(దాతృత్వము, ధర్మబుద్ధి, దయ, సత్యము, శాంతము, మొదలగు నవి సద్గుణములని మాత్రమే ఎరిగినవారు దెబ్బతిందురు ఈ గుణము లెవ్వరియందు వ్యక్తమగునో వారికి సంబంధించినవి కావని తెలియ వలెను వీనిని దైవ సంపద, లేక దివ్య గుణములు అందురు అనగా ఇవి జీవులలో వ్యక్తమగు భగవంతుని గుణములే కాని, జీవుల గుణ ములు కావు భయము, దుఃఖము, అహంకారము, దర్పము, కామము, క్రోధము మొదలగునవి అసుర గుణములు ఇవి మన స్సునకు, ఇంద్రియములకు, దేహాభ్యాసములకు సంబంధించినవి గనుక వ్యక్తుల ప్రత్యేక గుణములు ఈ విధముగా దుర్గుణములు వ్యక్తిత్వమునకు సంబంధించినవి, సద్గుణములు ఆత్మకు సంబంధించి నవి గనుక తనయందుగాని, ఇతరులయందుగాని సద్గుణములను దర్శించినపుడు వానిని విస్తరింప చేసికొనుట భగవంతుని గుణ కీర్తన మనబడును ఇతరుల జీవిత ఘట్టములయందలి సత్కార్యా చరణము, సద్గుణములు వెలిబుచ్చు సన్నివేశములను మనసార మెచ్చుకొని నోరార కీర్తించుటవలన భాగవత లక్షణమబ్బును అప్పుడు మాత్రమే ఈ చక్రము పనిచేయకుండును ఉదాహరణకు

శ్రీరామునకు ఉత్తమ మానవుడా అవతారమా అని తెలిసికొనుటకు యత్నించుటకన్న అత డాచరించి చూపిన దుష్ట సంహారము, యాగ రక్షణము, పితృవాక్యపరిపాలనము, కష్టములను లెక్క చేయకుండుట, కైక మొదలగు వారిని క్షమించి సహించుట, ఋషులకు అభయ ప్రదానము చేయుట మున్నగు సన్నివేశములను కీర్తించుకొని, యొకరి కొకరు చెప్పుకొన్నచో వినుకటి రాముడు దైవమో, కాదో అను వెర్రి తీరి, స్మరించు వారు దైవానుభూతితో నిండి ఆ దైవ గుణములను ఒవకాశ మున్నంతవరకు తమ జీవలక్షణములుగా సంక్రమింప జేసికొందురు

758 టీక అనఘా=పుణ్యాత్ముడా, ఆత్మకృత= తనచే చేయబడిన, మాయాజాత=మాయల సమూహములు, సత్త్వ+ ఆది=జీవులు, వారి సత్త్వ మొదలగునవి, శక్తి నికాయస్థితి= శక్తులు గుంపులుగా నేర్పడుట జగత్+జననవృద్ధిక్షోభ = లోక ముల పుట్టుక, పెరుగుదల, ప్రళయము, హేతు ప్రభావ నిరూ ఢిన్ =కారణముయొక్క ప్రభావముగా స్థిరపడుటవలన, ఊర్ణ నాభగతి=సాలెగూడువలె విశ్వస్తుత్య=లోకములచే స్తుతింప బడువాడా, ఘన లీలా మహిమ + అర్ణవంబు=నీ గొప్పలీలల యొక్క, మహిమల యొక్క విస్తృతి యనబడు సముద్రము,

తా॥ ఓ పుణ్య స్వరూపా! నీ వొక్కడవేయై యుండియు, తానుగా నుండి మాయను పుట్టించుచున్నావు అందు మాయలు పుట్టుచున్నవి (సంఖ్యలు పుట్టుచున్నవి) వాని నుండి శక్తులు పుట్టుచున్నవి వానినుండి శక్తుల గుంపులు పుట్టుచున్నవి అవి దేహములై జీవులు పుట్టుచున్నవి అట్టి జీవరాసుల జననము, వృద్ధి, లయము పుట్టుచున్నవి వానికి హేతువుగా నీవు వానిలోనే

అంతర్యామిగా నుండి కలిగించుచున్నావు నీవు కేంద్రముగా స్థిరస్వరూపుడవై యుండగా ఇవి యన్నియు చర స్వరూపములై నీ చుట్టును తిరుగుచున్నవి ఇన్నియు నీ నుండి నే వచ్చి వర్తించుట గమనించిన నిన్ను దేనితో పోల్చవచ్చును? నా లెగూతితో పోల్చ వచ్చును నీ లీలలు, మహిమలు, జీవులకు సముద్రము వలె దాట రానివి.

( సాలెపురుగు తన నుండి తీసిన దారములతోనే తన చుట్టును సాలెగూడు అల్లుకొనును అందు తానే నివసించును. దాని నుండి వెలుపలకు వచ్చును కనుక ఇది కొంత లో కొంత వరకు పోల్చుటకు తగి యున్నది

జీవులు దేవుని లీలలలో భాగములు గనుక లీలల పారము నెరుగలేరు ఇంటి లోని స్తంభమునకు ఇల్లు లొంగుట ఎట్లు సాధ్యము కాదో, అట్లే సృష్టి మొత్తముగా నున్న లీలలు సృష్టిలో భాగమైన జీవున కంతుపట్టుట సాధ్యము కాదు )

754 టీక శబ్దాది విషయ సుఖకరంబు = శబ్దము మొదలగు విషయములచే సుఖమును కలిగించునది, ( విషయము లనగా ఇంద్రియములకు గోచరించు శక్తివి అవి శబ్దము, స్పర్శను, రూపము, రుచి, వాసన అని ఐదు విధములు ఇవియే దైవ మాయామూర్తులు వీనితో నేర్పడినవి గానే ఇన్ని కోట్ల వస్తువు లును, జీవరాసులును మనకు గోచరించుట జరుగుచున్నది ) అస్మత్ + అనుగ్రహ + అర్థంబు = మమ్ముల ననుగ్రహించుట కొరకు, ఆత్మీయ మాయా పరివర్తిత = తన మాయచే త్రిప్పబడు చున్న, లోకత్రయంబు = మూడు లోకములు, మదీయ మనోరథ సుధా ప్రవర్షివి = నా కోరికలు అను అమృత ధారలను కోరిన కన్న నెక్కువగా వర్షించు వాడవు,

తా॥ దేవా! నీవు శబ్ద స్పర్శ రూప రస గంధములు అనబడు ఇంద్రియార్థముల రూపమున సుఖములు కలిగించుటకై ఈ సృష్టిని విస్తరింప జేసితివి నీ నుండి వెలువడ జేసిన మమ్ము సంతోష పెట్టి అనుగ్రహము చూపుటకే నీ వీ సృష్టిని విస్తరింప జేసితివి ఇది నీ కొరకు చేసినది కాదని తెలియుచున్నది మమ్ము సృష్టించి ఆనందపరచుటకై ఆత్మ మాయను పుట్టించి, ఈ త్రిప్పు మన్న మహాచక్రము నుండి లోకతంత్రమును నిర్మించితివి నాకు కోచిన దేదో నేను కోరితిని దానిని మించి నీవు అమృత వర్షము కురిపించితివి కనుక నమస్కరించెదను

( కర్దమ ప్రజాపతి జ్ఞాన స్వరూపుడై మొట్ట మొదట కోరికలు గలవారిని ద్వేషించెను తన్ను చతుర్ముఖ బ్రహ్మ ఈ ప్రజా సర్గమునకు తోడ్పడుమని కోరెను దాని కొరకై తాను గృహస్థాశ్రమ దీక్ష స్వీకరింపవలసి వచ్చెను దాని నిమిత్తము తనకు తగిన శీలము గల భార్య నిమ్మని విష్ణువును కోరెను ఇది సృష్టి యజ్ఞార్థము గనుక సకామము కాదు అయినను కోరవలసి వచ్చెను గనుక కోరుట, కోరకుండుట మన ఇష్టము లోనివి కావని దర్శించెను దానితో తాను సకాముడు కాకున్నను కోరు వారిని నిందించుట తన నుండి తొలగిపోయెను కోరిన కన్న ఎక్కువగా అమృతము వర్షించుట యనగా నిదియే! )

755 టీక ఈ + భంగిన్ = ఈ విధమున, సరో గాక్షుండు = విష్ణువు, వినతానందన = గరుత్మంతుని యొక్క, స్కంధర + ఉపరిచరత్ = మెడపైన చరించుచు, విభ్రాజ మానాంగుండు=ప్రకాశించుచున్న దేహము గలవాడు, అనురాగ స్మిత = ప్రేమతో కూడిన చిరునవ్వు చంద్రికా కలిత=వెన్నె లతో కూడిన, శోభా + ఆలోకుండు = శోభయను కిరణము

గలవాఁడు రోచిష్ణుఁడు=ప్రకాశించువాఁడు, ప్రేక్షిశిన్ =ప్రత్యేక
ముగా,

తా॥ కర్దముఁ డిట్లు స్తుతింపఁగా సంతోషించి విష్ణుమూర్తి గరుత్మంతుని భుజములపై వెలుఁగొందుచున్న రూపము గలవాఁడై అనురాగముతో చిరునవ్వు వెన్నెలల నొలికించుచు సొగసైన దృష్టి ప్రసారముతో మునీంద్రుని వైపు చూచి ప్రత్యేకముగ నిర్దేశించుచు ఇట్లు పలికెను

756 టీక కామించి = కోరి, సముచిత భక్తిన్ = శోభిల్లు భక్తితో, నెసవుసన్=సందర్శనమున, అనయము = తప్పక,

తా॥ ఓ కర్దమమునీ! నీ మనస్సున నే కోరిక కోరి నన్ను పూజించితివో అది తప్పక సఫలమగును

757 టీక సమ్రాట్ = ప్రభువు, బ్రహ్మావర్త దేశంబు=ఉత్తర భారతమున సరస్వతి, దృషద్వతి నదుల నడిమి ప్రదేశము, (కాని ఇచ్చట యావత్ భారత దేశ మను నర్థము వాడ బడినది), సప్తార్ణవ మేఖలా మండిత = సప్త సముద్రము లనబడు నొడ్డాణముచే నలంకరింపబడిన, మహీమండలంబున్ = భూ మండలమును, అపర దివసంబునన్ = మరుసటి దినము భర్తృకామ = భర్త కావలెనని కోరినది, భవదీయ సన్నిధికిన్ = నీ సమీపమునకు, అనురూప = తగినట్టి, వయశ్శీల సంక గుణాకర = వయస్సు, శీలము, సంకల్పములు, గుణములు అ వానికి నిలయము, కన్యకా నవకంబు=తొమ్మిది మంది కన్యల పుత్రోత్పాదనంబులు = కొడుకులను కనుట, మదీయ శా సనంబు = నా ఆజ్ఞ, మదర్పిత + అశేష కర్ముండు = నా య

దర్పణ చేయబడిన సమస్త కర్మలు గలవాడు, ఐకాంతిక స్వాంతంబు=ఏకాంత మనబడు స్థితిలోనున్న మనస్సు, భూత+అభయదాన = జీవులకు భయము దీర్చుట దయాచరిత జ్ఞాని=దయయే ప్రవర్తనముగా నెరిగిన జ్ఞానము గలవాడు, చరమ కాలంబునన్= చిట్టచివరకు, మత్కళాంశంబునన్ = నా కళలోని భాగముతో, తత్త్వ సంహిత = స్వస్వరూపమును తెలుపు వేద గ్రంథము, అంతర్హితుండు = మాయమైన వాడు,

తా॥ ఇట్లు పలికి విష్ణువు మరల నిట్లనెను చతుర్ముఖ బ్రహ్మ కుమారుడు, సృష్టికి మొదటి రాజు అగు స్వాయంభువ మనువు బ్రహ్మావర్త దేశమునందు సముద్రముల నడుమనున్న భూమిని పరిపాలించుచున్నాడు రేపటకు తన భార్యయగు శతరూపను, భర్త కావలెనని కోరుచున్న పుత్రికను తోడ్కొని నీ దగ్గరకు వచ్చును నీ కన్ని విధముల తగిన వయస్సు, శీలము, సంకల్పములు, గుణములు కలిగినది అతని పుత్రి ఆమె నిచ్చి నీకు వివాహము చేయును నీ కోరిక సిద్ధించును నీవు నన్ను నిత్యము చిత్తమున స్మరించుచుండుము

ఆ మనువు పుత్రిక దేవహూతి నిన్ను వివాహమాడి తొమ్మిది మంది పుత్రికలను కనును వారిని వివాహమాడి మునీంద్రులు పుత్రులను పడయుదురు నీవు నా శాసనమును ధరించి సకల కర్మలు నాయం దర్పణము చేయుము ఏకాంత బుద్ధి కలవాడవై జీవింపుము జీవులకు భయము పోగొట్టుట, దయను ప్రసాదించుట, నీ నడవడి యని ఎరిగి వర్తింపుము నిరంతరము నీవు ధ్యానము చేయవలసిన విధాన మెట్లనగా, నాయందు సకల లోకము లున్నవి నీయందు నేనున్నాను ఇట్లు ధ్యానించి దీని నెరిగి నన్ను సేవించుము. చిట్టచివరి కాలమున నన్ను జేరగలవు

నేను నీ భార్యాగర్భమున నుద్భవి తును నా కళతో అంశ స్వరూపుడనైన పుత్రునిగా పుట్టి తత్వసంహితను వివరింతును. ఇట్లు వివరించి కర్దమునకు చూచుచుండగా విష్ణువు మాయమయ్యెను

758 [illegible] = [illegible] సరిత్ + ఉపాంచిత = నది యందు ఒప్పుచున్న, [illegible] = చిన్నమామిడి చెట్లు, సాల= మద్దిచెట్లు, శోభిత [illegible] = శోభిల్లుచున్న తీరమున గల [illegible] దేశము, [illegible] = వెలువడి, అంచిత గరుత్ [illegible] = [illegible] నెక్కుట, తగియు గరుత్మంతుని [illegible] = వాని [illegible] నుండి పుట్టిన, ఋక్ + పత్రిం = [illegible] సమూహము, (ఋక్కు లనగా వేద మంత్రముల సమూహము) విలక్షణ శబ్దము = విశేష లక్షణ ములతో వరుసగా, [illegible] = ప్రకాశించుచు [illegible] సామము లనబడు వేదమంత్రములు గలవి,

తా॥ నిర్మలమైన సరస్వతీ నది యొక్కయొడ్డున గున్నమావిగున్నలు, మద్దిచెట్లును గలవు వానితో నిండిన ఎత్తైన సరస్వతీ నదీ తీరము రంగస్థలమునవలె నున్నది ఆ గట్ల నడుమ బిందుసర మన బడు కొలను కలదు. దానిని దాటి విష్ణుమూర్తి గరుడ వాహన ముపై ప్రయాణము సాగించెను గరుత్మంతుని రెక్కల నుండి పుట్టిన కాంతులలోను, విలక్షణమైన శబ్ద క్రమములోను, విని పించుచున్న సామములను వినుచు ఆనందముగా యానము చేసెను

(ఋక్కులనగా ఋగ్వేదమందలి మంత్రములు అంత రార్థమున ఋక్కు లనగా కంఠమునుండి వెలువడిన వైఖరీ రూపము లైన ఆహత శబ్దమయ వాక్కులు వానికి మూలమైన శ్వాసను పుట్టించు ప్రాణగతులే సామ లనబడు పాటలు. గరుత్మంతుడు ఛందోమయమూర్తి యని వేదపురాణములు కీర్తించును. అతని

దేహము ఛందస్సుల పేర్పులతో నేర్పడినది గరుత్మంతుడు గాలిలో నెగురుచుండగా రెక్కల శబ్దములు ఋగ్వేదము గను, వివిధ గమనములు సామలు గను విష్ణుమూర్తి నానందింప చేసెనని యర్థము

ఉచ్ఛ్వాస నిశ్వాసములను చేయించు ప్రాణముల కాధార మూర్తియే గరుత్మంతుడు ఉచ్ఛ్వాస నిశ్వాసల గమనమే అతని రెక్కల కదలికలు కంఠము నుండి వినిఎంచు శబ్దమయ వాక్కు అతని రెక్కల నుండి పుట్టిన ఋగ్వేదము ప్రాణగతుల గమనము సామవేదము అతని వీపున గల అమృత భాండము జీవుని హృదయము అందున్న జీవాత్మరూపుడగు భగవంతుడే గరుడ వాహనారూఢుడైన విష్ణుమూర్తి అతని నమృతముగా హృదయమున గొనివచ్చి అధోలోకములైన మనస్సు, ఇంద్రియ ములు, దేహముల కత్యకు కొని వచ్చినపుడు సర్పముల కప్ప జెప్పిన అమృతభాండ మగును ఈ మొత్తము వేదమయమైన జీవతత్త్వము శ్వాసరూపమున వాక్కుగా నుచ్చరింపబడును గనుక సరస్వతీ నదీ తీరమని చెప్పబడినది అందు జీవుడుగా కుమారుడు మేల్కాంచు ప్రజ్ఞాబిందువే బిందుసర మను కొనేరు

సుషుమ్నా మార్గమున సహస్రారము నుండి మూలాధారము నకు లోపలికి దిగివచ్చినపుడు తల్లి గర్భమున దాని చుట్టును వెన్నెముక ఏర్పడును అది షట్చక్రములు, సహస్రారము అను నేడు తావులందు ప్రజ్ఞా సూత్రములతో ముడి వేయబడి యుండును గనుక శరీరనిర్మాణ మగు సృష్టి యజ్ఞము సప్తతంతువు అనబడుచున్నది ఈ దిగివచ్చుటలో దేహ భాగములు తల్లి గర్భమున నిర్మింపబడును అధోలోకములైన మూలాధార ప్రజ్ఞలలోనికి ఈ ప్రజ్ఞా బిందువు దిగివచ్చినపుడు శుక్రకణముగా నేర్పడును అదియే భూలోకమందలి బిందుసరము అందు దేహ మనబడు

సభా నిర్మాణమునకు కావలసిన సామగ్రి యంతయు ముందే
నిర్మింపబడి బిందుసరమున విశ్వకర్మచే దాచి యుంచబడినదని
మహాభారతము చెప్పుచున్నది. దేవలోకములు విశ్వకర్మయు,
సూర్యలోకమున త్వష్టయు, భూలోకమున మయాసురుడును ఈ
సభా నిర్మాణము చేయుదురు మయుడు దీనిని నిర్మించి యముని
పుత్రుడగు ధర్మరాజునకు కానుకగ ఇచ్చెను అట్లుగా జనన
మరణముల నడుమ జీవుని దేహములుగా యుండును )

759 టీక వైకుంఠ ధామము = వైకుంఠ పట్టణము,
సకాముడు = కోరిక గలవాడు, విమోహి = మిక్కుటముగా
మోహింపబడినవాడు లేక విడిచి పెట్టబడిన మోహము కలవాడు,
పెనగొనుచుండన్ = పెనవేసికొనుచుండగా, ఇందిరా వరుని =
విష్ణువును, జన వంద్యుడు = జనులచే నమస్కరింప బడినవాడు,
భక్తి నితాంత చిత్తుడు = భక్తితో నుత్తమస్థితి చెందిన చిత్తము
గలవాడు,

తా॥ విష్ణువిట్లు వైకుంఠమున కేగను సకాముడైన
కర్దముడు విమోహియై మనస్సున కోర్కెలు పెనవేసికొను
చుండగా వెంటనే బిందుసరమున కేగి భక్తితో ధ్యాన నిష్ఠ
కుదిరినవాడై విష్ణుమూర్తిని ధ్యానించుచుండెను.

( భగవంతుడు నిజస్థానమున కేగగా జీవునకు కోరికలు
గలిగి విమోహి యగును అతడు మరల విష్ణువును స్మరించి ధ్యాన
స్థితిని పొందును ఇదియే చతుర్ముఖ బ్రహ్మ నియమించిన ప్రతి
సర్గమునందు దేహధారులకు సంఘటించు విధానము )

760 టీక కనక రథారూఢుడు = బంగారు రథ మెక్కిన
వాడు, నిజభార్యా సమేతుండు = తన భార్యతో కూడినవాడు,
భర్తృవాంఛాపర = భర్తను కోరుచున్నది, పరిభ్రమి = తిరిగి,

తా॥ అప్పుడు స్వాయంభువ మనువు బంగారు రథ మెక్కి తన భార్యను వెంటబెట్టుకొని, భర్త కావలెనని కోరుచున్న పుత్రికను తోడుకొని బయలుదేరెను తన పుత్రికకు తగిన వరుని వెదకికొనుచు లోకమంతయు కలయ దిరిగెను ఎందును గానక మరికొంత ప్రయాణము సాగించెను

761 టీక సరస్వతిన్ + చుట్టి=ఆమె చుట్టును తిరిగి, పాఱుటన్ = ప్రవహించుట వలన,

తా॥ జ్ఞానులలో మహనీయుడైన మనువు వచ్చి కర్దమమునిని చూచి మహానందము పొందెను అంతకు ముందు విష్ణు వతనిని చూడగా అతని కన్నుల నుండి రాలిన ఆనంద బాష్పములు భూమియందు ప్రవహించి సరస్వతీనది చుట్టును పారుట వలన ఆ తీర్థమునకు బిందుసరస్సను పేరు వచ్చినది అట్టి సరస్సును పుణ్యానదీ తీర్థముగా దర్శించెను

762 టీక తమాల = కానుగ చెట్లు, సాల=మద్దిచెట్లు, వకుళ=పొగడచెట్లు, అర్జున=తెల్లమద్ది చెట్లు, నింబ = వేపచెట్లు, కదంబ=కడిమిచెట్లు, పాటలీ=పాదిరి పువ్వుల చెట్లు, చందన= గంధపు చెట్లు, నారికేళ=కొబ్బరి చెట్లు, ఘనసార = కర్పూరపు చెట్లు, శిరీష=దిరిసెన పుష్పపు చెట్లు, మాకంద = తియ్యమామిడి చెట్లు, క్రముక=పోకచెట్లు, కాంచన=సంపెంగ చెట్లు, బిల్వ= మారేడు చెట్లు, కపిత్థ=వెలగచెట్లు, కుంద=మల్లెచెట్లు, మధూక= ఇప్పపువ్వుల చెట్లు, మంజుల నికుంజములు = మనోహరములైన పొదరిండ్లు,

తా॥ ఆ బిందుసరము సమీపమున కర్దమ ప్రజాపతి ఆశ్రమ వాటికను మనువు సమీపించెను. అందు వరుసగా కాను

గలు, మద్దులు, పొగడలు, కొల్లమస్తి, వేప, కదిమి, పాదిరి, మంచి గంధము తోటలున్నవి వాని తరువాత కొబ్బరితోటలు, పచ్చ కర్పూరపు చెట్లు గలవు ఇంకను నడచిపోగా దిరిసెన వృక్షములు, లవంగపు తీగలు, లుంగములు కలవు. ఆ దారివెంట ముందునకు సాగిపోయెను తీయమామిడి తోటలు, చండ్రి చెట్లు, పోక చెట్లు గలవు వాని తరువాత సంపెంగలు, మారేడులు, వెలగచెట్లు కలవు వానిని దాటిపోగా జాజులు, మల్లెలు గలవు అటుపైన ఇప్ప పువ్వుల తోటలున్నవి వానిని దాటి మనోహరములైన పొదరిండ్లు చూచుచు నడచెను

763 టీక పరిపక్వ ఫలభర + ఆనత = బాగుగా పండిన పండ్ల బరువునకు వంగినవి, తరుశాఖా నికర నివసిత = చెట్లకొమ్మల వరుసలలో నివసించుచున్న, స్ఫుటవిహంగ + ఉత్కర = శబ్దము చేయుచున్న పక్షుల సమూహములు, బహు కోలాహల రవ భరిత = పలు విధముల సందడులుగా కూతలతో నిండిన, దిక్ + అంతములు = దిక్కుల చివరిభాగములు, భవ్యంబు = శుభకరము,

తా॥ బాగుగా పండిన పండ్ల బరువునకు వంగిన చెట్లకొమ్మలలో నివసించు పక్షులు చేయుచున్న కూతలు కోలాహలముగా దిక్కులయందు ప్రతిధ్వనించుచుండెను

764 టీక అతి నిశిత = మిక్కిలి వాడియైన, చంచు దళన = ముక్కులతో చీల్చుటవలన, స్రుతనిర్గత = పగుళ్ళనుండి వెలువడిన, పక్వఫల = పండిన పండ్లయొక్క, రసాస్వాదన = రుచి చూచుట, మోదిత = సంతోషపడుచున్న, రాజశుక = రాచిలుకల యొక్క, వచస్ + అర్థశ్రుతి ఘోషణము = పలుకుల యర్థములలో వేదముల శబ్దములు శ్రవణ సుఖదంబు = చెవులకింపైనది,

తా॥ చిక్కిలి వాడియైన ముక్కులతో పొడిచిన కన్నముల నుండి వెలువడిన పండ్ల రసముల రుచి చూచి సంతోషించిన చిలుకల పలుకులలో వేదఘోషములు వినిపించుచు చెవుల కింపయ్యెను

765 టీక సహకార పల్లవ కలిత = తియ్యమామిడి చిగుళ్ళతో కూడిన, ఆస్వాదన=రుచి యనుభవించుట, కషాయ కంఠ విరాజిత=వగరెక్కిన గొంతులనుండి ప్రకాశించిన, కలకంఠ=కోకిలల యొక్క, పంచమస్వర కలనాదములు=పంచమ స్వరము యొక్క మనోహార శబ్దములు,

తా॥ తియ్యమామిడి చిగుళ్ళను రుచి చూచుట వలన వగ రెక్కిన కంఠములనుండి వినసొంపుగా పంచమ స్వరములు పలుకు చున్న కోకిలలతో కూడిన రమ్య ప్రదేశములను దాటెను

766 టీక అతుల=సాటిలేని తమాల మహీజ ప్రతతి = కానుగ చెట్ల వరుసలు, క్షణజాత=క్షణకాలమున పుట్టిన, జలద పరిశంకా=మేఘము లను సందేహము, అంగీకృత = అంగీకరింప బడిన, తాండవఖేలన విలసిత=నాట్యము చేయుచున్న విలాసములు గల, పింఛవిభాసి = పింఛములతో ప్రకాశించు నట్టి, బాలశిఖ సేవ్యంబు=కుర్ర నెమళ్ళచే సేవింపబడుచున్నవి

తా॥ కానుగ చెట్ల గుబుర్లను చూచి యొక క్షణకాలము మేఘమును సందేహము నంగీకరించి పురివిప్పి నటించుచున్న కుర్ర నెమళ్ళ గుంపులు కనుపించెను

767 టీక కారండవ=నీటి పక్షులు జలకుక్కుట = నీటి కోళ్ళు, సారస=బెగ్గురు పిట్టలు, బక = కొంగలు, చక్రవాక = జక్కవ పిట్టలు, షట్పద = తుమ్మెదలు, అంభోరుహా = తామర

పువ్వులు, కైరవ = కలువ పువ్వులు, నవకల్హార = క్రొత్తగా విచ్చిన తెల్ల కలువలు, సరోరుహ + అరవిందయుతమై = కొనేట పుట్టిన పువ్వులతో గూడినవి,

తా॥ ఏటి గువ్వలు, నీటికోళ్ళు, బెగ్గురు పిట్టలు, కొంగలు, జక్కవలు తిరుగుచున్న కోనేళ్ళు కనుపించెను అంగాతుమ్మెదలు నాదములు చేయుచుండగా హంస లిడుచుండెను తామరపూలు, కలువలు, తెల్ల కలువలు కొల్లలుగా పుష్పించి యుండెను

768 టీక కరి=ఏనుగు, పుండరీక=పెద్దపులి, ఋక్ష=ఎలుగు, కాసర=అడవి దున్న, శశ=కుందేలు, భల్లూక = ఎలుగుబంట్లు, హరిణ=జింకలు, చమరీ=చామర మృగములు, హరి=కోతులు, సూకర = అడవి పందులు, ఖడ్గ = ఖడ్గ మృగములు గవయ= దుప్పులు, ప్రముఖ+ఉగ్రవన్య సత్త్వశ్రేయము=కౄరములగు అడవి జంతువులకు నివాసమై,

తా॥ ఏనుగులు, పులులు, తోడేళ్ళు, అడవి గున్నలు, కుందేళ్ళు, ఎలుగుబంట్లు, చామర మృగములు మున్నగు నడవి జంతువులకు నివాసమైన ప్రదేశము కనుపించెను

769,770 టీక మిత పరిజనంబులు = కొలదిమంది పరివారము, అంచిత = తీర్చిన, బ్రహ్మచర్య వ్రత యోగ్యము= బ్రహ్మచర్య వ్రతమునకు తగినది, రుచిర సందీప్తము = కాంతితో వెలుగొందునది, చెలువు = అందము, కృశీభూత + గాత్రకాయుండు = కృశించిన దేహము గలవాడు, నలిన ! ఉదర ఆలాపము = విష్ణుమూర్తిని గురించిన సంభాషణములు, నవసుధా పూరంబు = నూతనమైన అమృత ప్రవాహము, శ్రోత్రాంజలులన్ = చెవులనెడు దోసిళ్ళతో, చొక్కి = ఒడలుమరచి,

కతన = కారణమున , కృశీభూత కాయుండు = కృశించిన దేహముకలవాడు , జటావల్కల + అజిన(శ్రీ) = జడలు , నార బట్టలు చర్మము సంపద కాగా , అసంస్కార = సంస్కారము చేయబడక , సంచిత = కూర్చుకొనిన , అనర్ఘ నూత్నరత్నము= వెలకట్టలేని క్రొత్త రత్నము , ఎఱఁగెన్ = నమస్కరించెను

తా ॥ అట్లు సర్వవిధమనోహరమైన కర్దముని ఆశ్రమమును కనుగొని స్వాయంభువ మనువు స్వల్ప పరివారముతో లోపల ప్రవేశించెను అచ్చట బ్రహ్మచర్య వ్రతమునకు తగిన తపో వృత్తిలో దేహము ప్రకాశించుచున్న కర్దముడు కనుపించెను దేహము చిక్కియున్నను విష్ణుమూర్తి కథలను అమృత ప్రవాహ ముగా వినుచు పరవశించిన కర్దముడు నీరసించలేదు జడలు, నార చీరలు, జింకచర్మము ధరించి విశాల నేత్రములతో సుందరుడై కనుపించెను వెలగట్టుటకు శక్యముకాని రత్నమొకటి మెరుగు పెట్టక గనిలోనుండి తీసినట్లుండెను అట్టి కర్దముని చూచి మనువు భక్తినమ్రుడై పాదాభివందనము చేసెను

771 టీక విందు = అతిథి, పరితుష్టుఁడు = సంతోష పడినవాడు, పూర్వోక్తంబు = ముందు చెప్పబడినది,

తా॥ తన యింటికి అతిథియై వచ్చిన మనువు నాదరించి కర్దముడు అర్ఘ్య పాద్యాదులతో పూజించెను తనకు విష్ణువు అంతకుముందు చేసిన యాదేశమును స్మరించి మనువుతో నిట్లనెను

772 టీక వరగుణాకర = శ్రేష్ఠమైన గుణములకు నివాసమైనవాడా, త్వదీయ పర్యటనము = నీవు తిరుగుట, శిష్ట పరిగ్రహ = మంచి వారిని ఆదరించుట, దుష్ట నిగ్రహము =

దుష్టులను శిక్షించుట, వనజహిత + శశిగతి=సూర్యుడు, చంద్రుడు, వహ్ని = అగ్ని, పవమానుడు, అనిలుడు = వాయువు, శమనుడు= యముడు, పార్థివ = నగుచును, అమరనాయకుడు = ఇంద్రుని అంశ గలవాడు, అఖిలలోక జిష్ణుడు = అన్ని లోకములను జయించునది, సేవనమణిమయ స్యందనము = బంగారుమున మణులు తాపిన రథము, కోదండపాణి=విల్లు పట్టినవాడు, ఇద్ధ సైన్యపద విఘట్టన=ప్రసిద్ధమైన సైన్యముల పాదముల త్రొక్కిడి, అగలన్ = బీటలు కాగా,

తా॥ గుణశ్రేష్ఠుడా! నీవు భగవద్భక్తుడవు నీవు ఇట్లు భూమిపై సంచరించుట దుష్టులను శిక్షించి మంచివారిని రక్షించుటకే గదా! నీవు పుణ్యపురుషుడవు సూర్యుడు, చంద్రుడు, అగ్ని, వాయువు, యముడు, వరుణుడు, ఇంద్రుడు నీ యందు కలుగా నున్నారు. నీకు భక్తితో నమస్కరించుచున్నాను నీ వొప్పుడైన సకల లోకములను జయించు సామర్థ్యము నిచ్చునట్టి, రత్నములు తాపిన నీ బంగారు రథమెక్కి - ధనుర్ధరుడవై సైన్యములతో చరింపగా భూమి బీటలగునేమో యనిపించును

778 టీక తరణింబోలె = సూర్యునివలె, భూవర = రాజా, పద్మోదర కల్పితంబులు = బ్రహ్మచే కల్పింపబడినవి, వర్ణాశ్రమ + ఉదార విస్తర పాథోనిధి = వర్ణ ధర్మములు, ఆశ్రమ ధర్మము లనబడు మహా విస్తారమైన ధర్మముల సముద్రము, సేతుభూత = కట్టుగా ఏర్పరచిన, మహిత + ఆచారక్రియల్ = గొప్ప ఆచారములు అనబడు కార్యములు, చోరభయంబునన్ = దొంగల భయముతో;

తా॥ ఓ మహారాజా! నీవు సకల దేవతాంశలతో భూమి యందు సూర్యుని వలె చరించుచు పరిశోధించుచున్నావు.

లేనిచో నీ భూదేవి సుదీర్ఘమగు నిద్రావస్థలోనికి పోవును అపుడు చతుర్ముఖ బ్రహ్మ కల్పించిన నాల్గు వర్ణములు నాలు గాశ్రమములు కట్టలు త్రెంచుకొనిన మహా సముద్రము వలె పాఱిపోవును ప్రజలు తమ యాచారములను తప్పగా ఈ నరసృష్టి సంకరమై పోవును గొంగల భయముతో నిండి అందరు నశించి పోవుదురు

( నరజ తికి మనువు మొట్ట మొదటగా వివాహ మేర్పరచి ధర్మము నభ్యసించుటకై కుటుంబ మను విద్యాలయమును నెల కొల్పెను అప్పటి నుండి ధర్మ మవలంబింప నిష్టపడిన వారి సమాజమును నాల్గు వర్గములుగా విభజించెను వారే బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రు లనబడువారు వారికి పై విభాగమును జన్మ సహజములైన గుణములను బట్టి ఏర్పరచెను అవి వారి పూర్వ కర్మలను బట్టి ఏర్పడుచున్నవి

ఇట్లే వయస్సును బట్టి నాలుగాశ్రమముల నేర్పరచెను అవి బ్రహ్మచర్యము, గృహస్థము, వానప్రస్థము, సన్యాసము అన బడునవి వాని ననుసరించి ప్రవర్తింప వలసిన ధర్మముల నేర్పర చెను అవి ఆచారముల రూపమున వారిలో స్థిరపడినవి అనగా ఆచరింప వలసిన ధర్మములైనవి వారీ ధర్మముల ప్రకారము నడచుకొనుట వలన నొక సముద్రమునకు చెలియలి కట్ట ఏర్పడి నట్లయినది ఈ కట్ట వలన సముద్రము నుండి దేశము లెట్లు రక్షింప బడుచున్నవో అట్లే నియమము లేని వారి ప్రవర్తనము నుండి సమాజము రక్షింప బడుచున్నది ఈ ధర్మములే లేనిచో నరులందరు చోరులై యొకరి నొకరు కొల్లగొట్టి చంపుకొందురు ఎదుటివారి ఆస్తిని, కుటుంబమును, దేహమును, వారివిగా నంగీక రించి గౌరవించుట యుండదు. అట్లు గౌరవింపనిచో సమాజ

ముంగిదు ఉంటూ దో వ్యా లోకరి నొకరు చంపుకొందురు ఇష్ట్ని యనర్థములు సోకకుండ రక్షించు మన్నద మనుధర్మ మే! )

774 టీక భవత్ + అగమనంబు = నీ రాక, నిమిత్తంబు = కారణము, సవన హింత నకిల నిత్యకర్మాను ష్ఠానుండు = దినచర్య యందలి కర్మానుష్ఠానము మొత్తము నిర్వర్తించినవాడు.

తా॥ ఇట్లు మనువును స్తుతించి కర్దముడు మనువు వచ్చిన పని ఏమి యని అడిగెను దినచర్య పూర్తిచేసికొని తీరికనున్న కర్దమునితో మను విట్లనెను

775 టీక సంసిజగర్భుడు = బ్రహ్మ, విరచితము = వ్రాయబడినది, బుధవర = జ్ఞానులలో శ్రేష్ఠుడా !,

తా॥ ఓ జ్ఞానముగ్లా! చతుర్ముఖ బ్రహ్మ ఈ లోక ధర్మములను వేదములుగా రచించెను వానిని భూమిప్రతిష్ఠాపించుటకే తన ముఖమునుండి నన్ను సృష్టించెను

(బ్రాహ్మణులను ముఖమునుండి, క్షత్రియులను బాహువులనుండి సృష్టించెనని వేదము చెప్పుచున్నది ఇచట ముఖము నుండి సృష్టించుట యనగా నోటినుండి యొకరికి నుచ్చారణ రూపమున ఉపదేశము చేసి లోకములకు నేర్పునట్టి గురుశిష్య సంప్రదాయ మేర్పరచుట)

776 టీక దురితస్వరూప = పాపము యొక్క స్వరూపము లైన, పాటచ్చరపీడ = బందిపోటు దొంగలవలన బాధ, సకల క్షోణిన్ = సమస్త భూమియందు,

తా॥ పాప స్వరూపులైన బందిపోటుదొంగల బాధ లేకుండ రక్షించి భూమిని పరిపాలించుటకై మమ్ములను చతుర్ముఖుడు తన భుజములనుండి సృష్టించెను

(మనువు రక్షణధర్మమునకు పుట్టెను గనుక క్షత్రియుడు కర్దమ ప్రజాపతి వేదమును వివరించుటకు, బోధించుటకు పుట్టెను గనుక బ్రాహ్మణుడు ఇచ్చట బ్రాహ్మణ క్షత్రియ ధర్మములు వారి వారి జీవలక్షణములను, వృత్తిని తెలుపునేగాని పుట్టుకకు సంబంధించినవి కావు కాని-చో క్షత్రియులు బ్రాహ్మణునకు పిల్ల నిచ్చి పెండ్లి చేయుటకు ఆ ఇద్దరు ధర్మస్వరూపులు సంగీకరించుట ఎట్లు జరుగును?)

777 టీక నెఱిన్ = పూర్ణముగా, జలజభవునకున్ = బ్రహ్మకు, కరము = మిక్కిలి, అంతఃకరణ గాత్రకములు = మనస్సు, శరీరము, పరఁగిన = ప్రసిద్ధి కెక్కిన, బ్రహ్మ క్షత్రములు = బ్రాహ్మణ ధర్మము, క్షత్రియ ధర్మము, రమాధీశ్వరునకున్ = లక్ష్మీపతికి, (విష్ణువునకు), అవనీయంబుల్ = రక్షింప దగినవి

తా॥ బ్రాహ్మణ ధర్మము, క్షత్రియ ధర్మము వరుసగా చతుర్ముఖుని సృష్టికి మనస్సు శరీరము వంటివి లక్ష్మీపతియైన విష్ణుమూర్తి సంకల్పమున అవి రెండును రక్షింప దగినవి

( ఈ సృష్టి యంతయు గుణాత్మకమైన లక్ష్మీస్వరూపము అందంతర్యామి నారాయణుడు గనుక బ్రహ్మ సృష్టిలో బ్రాహ్మణ ధర్మము, క్షత్రియ ధర్మము నిరంతరము రక్షింపదగి యున్నవి )

778 టీక దుర్జన దుర్దర్శనుండు = దుర్మార్గులకు చూడ శక్యము గాని వాడు, భవత్ + పాదకంజ = నీ పాద పద్మముల యొక్క, కింజల్క పుంజ = కేసరముల గుత్తి, రంజితంబు = ప్రకాశింప జేయఁబడినది, మస్తకంబు = శిరస్సు, తావక = నీయొక్క,

వచన సుధాపూరితం గాలు = వచనము లనుగు అమృతపు గిన్నెవు లతో నింపబడినవి, శ్రవణాంబులు = చెవులు, నుంగి శాశ్వతత్వంబు = శుభములకు నివాస గుగుట, గ హిణ్య వ్రజ గుబ్బ = పుత్రిక యందలి ప్రేమచేత కలిగిన గుబుములు, ఆగ్నీన్న + అంతరంగుండు = బాధపడిన మనస్సు కలవాడు, ధ్రమణ ఖన్నుగాని = సంచారము చేయుటచే అలసట నొందినవాడు,

తా॥ నీవు విష్ణుమూర్తి వంటివాడవు దుర్గినులకు నీ దర్శనము లభించదు అట్టి నిన్ను జూచట నా భాగ్యము సిద్ధించెను నీ పాద పద్మముల కేసరములు గుఱ్ఱాల వంటి రంగుచే అలంకరింప బడిన నా శిరస్సు పవిత్రమైనది అమృత ధారల వంటి నీ పలుకు లతో నిండిన నా చెవులు శుభములకు నివాసమైనవి నా జన్మము సార్థకమైనది పుత్రిక నైన ఈ దేవహూతి [illegible] కొంటిని ఆమకు వివాహము చేయలే గను గుణము నన్ను బాధించుచున్నది వరునకై అన్వేషించుచు సకల దేశములు తిరిగి వచ్చితిని నా విన్నపమును ఆలకింపుము

779 టీక వర యోగీశ్వర = యోగులలో శ్రేష్ఠమైన వాడా, వామాక్షి = అందమైన కన్నులు గలది, మత్పుత్రి = నా కూతురు, వరలావణ్య గుణాఢ్యులన్ = శ్రేష్ఠమైన లావణ్యము, గుణము కలవారిని, తనుభిక్షిన్ = ఆడుది యను భిక్షను, పరిగ్రహింపుము = దానమును స్వీకరింపుము (పరిగ్రహముగా, అనగా భార్యగా స్వీకరింపుము) శుభ + ఉదాత్త క్రియాలోలత్వన = శుభమును కలిగించు గొప్ప పని నాచరించుటయందు కుతూహలము గలిగి,

తా॥ మహా యోగీశ్వరా! ఈమె నా పుత్రిక. ఈమె పేరు దేవహూతి, లావణ్యమునందు, సద్గుణములందు ప్రసిద్ధికెక్కిన వారి

కిందరినో గూర్చి వినియున్నది ఎవరినిగూర్చి చెప్పినను ఈమె
వివి కెక్కుట లేదు నరుదుని యుపదేశమున మిమ్ము వరింతునని
ట్టబట్టి కూర్చుండెను నా కార్యభారమును నీవు గ్రహించి
ఈమెను భిక్షగా స్వీకరింపుము శుభమైన కార్యము నిర్వర్తించిన
వాడ వగుదువు

(బ్రహ్మచర్యాశ్రమమున నున్నవాడు, తపస్సు చేయు
చున్నవాడు, భిక్షను స్వీకరింపవలెనని మనువు శాసనము చేసెను
వాని ప్రకారము తన చేతినుండి గృహస్థాశ్రమ దీక్షను స్వీకరింపు
మని ఆ మనువే చమత్కరించుచున్నాడు

శుభమైన కార్యము నిర్వర్తింపబడుట యనగా పెళ్ళియగుట
యని కాదు బ్రహ్మసృష్టికి మొట్ట మొదటగా భౌతిక దేహములు
ల్పింపబడుట )

780 టీక అమలిన=నిర్మలమైన, గృహమేధిక కర్మము
లకున్ =గృహస్థాశ్రమ విధులకు, అనురూపగుణ విరాజిత=తగిన
దమైన గుణములతో ప్రకాశించునట్టి, శీలక్రమములన్ =నడ
డి, క్రమశిక్షణయందు, తినరిన=పెరిగిన, ప్రమదమున=సంతోష
ముతో, భవ్య చరిత్రా=పుణ్య ప్రవర్తనము గలవాడా!

తా॥ గృహస్థాశ్రమమున యజమాని నిర్వర్తింపవలసిన
పను లతి పవిత్రములు. వాని కన్ని విధముల తగిన నడవడి, క్రమ
శిక్షణ గల భార్య యున్నపుడే ఆచరణము సాధ్యమగును దాని
కనుకూలముగా నే నీమెను పెంచితిని నీవు శుభచరిత్రుడవు
కనుక నీవు వరించుటకు తగియున్నది

781 టీక విరక్తులు = వైరాగ్యము చెందినవారు,
వర్జింపన్ =విడిచిపెట్టుటకు, చనదు=తగదు,

తా॥ పుణ్యమూర్తీ! అయాచితముగా నిన్ను తటస్థముగా తాను సౌఖ్యము లభించిన నీవు వైరాగ్యమునున్నట్టును కాదనవలసిన పని లేదు నీవు వివాహ మాడవలెనను కోరిక గలవాడవు అయాచితముగా నిట్టి కన్య నీకు లభించుచున్నప్పుడు కాదనుట యుండ కూడదు

782 టీక ఫలారంభుఁడు=ఒక ఫలితమునకై యత్నము చేయువాడు, కృపణునిన్=దీనుని, యశంబు=కీర్తి, మానంబు= గౌరవము,

తా॥ ఒక ఫలితమునకై గట్టి ప్రయత్నము చేయుచున్న వాడు ఒక దీనుని దగ్గరకు పోయి యాచించినచో నేమి లాభము కీర్తికిని, గౌరవమునకును కూడ లోపము కలుగును నీ వింత వాడ వని తెలిసి వివాహము చేసికొనుటకు యత్నించుచున్నావనియు నిన్నర్థింప వచ్చితిని.

( మనువు సకల ధర్మశాస్త్రమునకు, ప్రజకు, ఆదిసృష్టి కనుక అతని సంభాషణలు ధర్మమునకును, లోకనీతికిని మార్గ దర్శకములుగా నున్నవి )

783 టీక మత్+తనూజన్,=నాపుత్రికను

తా॥ నా ప్రార్థన నంగీకరించి, నా పుత్రికను వరింపుము అని పలికిన స్వాయంభువ మనువుతో కర్దమముని సంతోషముగ నిట్లు పలికెను

784 టీక అనన్యదత్తము=సాటిలేని దానముగా నీయ బడిన వస్తువు, ప్రతిష్ఠితంబు = స్థిరత్వము, ప్రఖ్యాతిచెందినది తీవబోఁడి=పూలతీగవంటి దేహము కలది, కమనీయ= కోరదగిన

మానిత = గౌరవింపబడిన, ఉడురాజ చంద్రికా ధవళిత = చంద్రుని వెన్నెలలో తళుకించిన, నిజ సౌధతలము = తన మేడమీద, మహిత హిరణ్మయ మంజీర శోభిత = చక్కని బంగారు ఘల్లు టందెలతో శోభ చెందిన, కందుక క్రీడన్ = బంతియాటలో, వరవిమానస్థుఁడు = శ్రేష్ఠమైన విమానమున నున్నవాడు

తా॥ మహాత్మా! ఈమె నీ వలన సాటిలేని దానముగా నాకు కొని తేబడినది ఈమె యొకనాటి రాత్రి వెన్నెలలో సౌధాగ్రముపై బంతు లాడుకొనుచుండగా చెలికత్తెలతో విహరించు సమయమున, గంధర్వు డొకడు విమానముపై బోవుచుండెను అతని పేరు విశ్వావసువు అత డామెను చూచి వ్యామోహ పడెను తత్ఫలితముగా విమానముతో భూమి మీద పడెను

( అర్హత లేనివాడు ఆమె వంక చూచినచో దెబ్బతినునని సూచన దీనిని బట్టి కర్దముడు తన తపోబలమున దేవహూతిని పూర్వము నుండియే గమనించుచుండె నని తెలియుచున్నది అట్లు గమనించినను అతడు తపస్సు నుండి పతితుడు కాలేదు గనుక వ్యామోహపడలే దనియు, ఆమెకు తగిన వరు డనియు తేల్చుకొనెను )

785 టీక పురుషపశువులు = నరులలో పశువుల వంటి వారు, కొమరాలు = యువతి,

తా॥ విష్ణుమూర్తి స్మరణ మెరుగని నరపశువులకు ఈమె దర్శనము లభింపదు అట్టి యీ వనవతి అదృష్టముచే తానే వచ్చి వరింపగా నంగీకరింపని వాడుండునా?

( నర దేహము ధరింపవలసిన మొట్ట మొదటి స్త్రీగా మనువు పుత్రి దేవహూతి యుద్భవించినది ఆ స్థితిలో వివాహ

తా॥ సంతతి కలిగిన వెంటనే నేను శమదమాది గుణము లతో యోగమార్గమున సన్యసింతును ఇది విష్ణుమూర్తి యాజ్ఞ

( ఇచ్చట గృహస్థాశ్రమము తరువాత వానప్రస్థము లేకయే సన్యాసము చెప్పబడినది నాలుగాశ్రమముల పద్ధతి దేహ బద్ధుల సాధనకొరకు కర్దముడు సన్యసించుట యనగా భౌతిక దేహమును విడిచి పెట్టుట దేహబద్ధులకు దేహము ఉండుట క్షేమముగను, దేహము విడుచుట భయకారణముగను తోచును. కర్దముని వంటి వానికి దేహమున నుండుట గృహస్థ ధర్మము గను, దేహము విడుచుట సహజ స్థితిగను కనుపించును )

789 టీక (శ్రీ) విభునివలన=విష్ణుమూర్తి వలన, లోకా వళి = లోకముల వరుస, రాజీవభవాదులకు = చతుర్ముఖ బ్రహ్మ మొదలగువారికి, నిర్మాణ హేతుభూతుండు = సృష్టికి కారణమైనవాడు,

తా॥ ఈ లోకములన్నియు లక్ష్మీపతియైన విష్ణుమూర్తి యందు సృష్టి స్థితి లయములను పొందును బ్రహ్మాదుల సృష్టికి కూడ నతడే కారణము

( సృష్టికి చతుర్ముఖుడు కారణమైనను చతుర్ముఖుని లోకము మొదలుగా అన్ని లోకములును విష్ణువు నందున్నవి గనుక విష్ణువే కారణములకు పైన కారణము )

790 టీక ఆజ్ఞా + ఉల్లంఘనంబు = ఆజ్ఞను దాటుట, సమయంబునకు = నియమమునకు, ఇయ్యకొని = అంగీకరించి, ప్రహృష్ట హృదయుండు = హర్షము చెందిన హృదయము కల వాడు, సముంచిత గుణ గణాఢ్యుండు = శోభ నిచ్చుచున్న సద్గుణ ణములచే శ్రేష్ఠుడు, విధి + ఉక్త ప్రకారంబు = బ్రహ్మచే

చెప్పబడిన విధానము, పరిగ్రహ సంస్కారములు = కట్నమను పేరుతో గుర్తింపబడినవి, వివాహ + ఉచిత = పెండ్లికి తగిన, దివ్య+అంబర+ఆభరణంబులు = దేవలోకములకు సంబంధించిన వస్త్రములు, నగలు, నిజకుల + ఆచార సరణి = తన వంశమునవా రాచరించు మార్గమున, పరిణయంబు = వివాహము, చింతా భరుండు = దిగులు గలవాడు, దుహితృ వియోగ వ్యాకులిత స్వాంతుండు = పుత్రిక ఎడబాటునకు కలతపడిన మనస్సు గలవాడు, చిబుకంబున్ = గడ్డమును, పుడుకుచున్ = తడువుచు, మూర్ధ్ని = వాసనచూచి, బాష్పధారాసిక్త మస్తక = కన్నీటి ధారచే తడిసిన శిరస్సు గలది, ఆమంత్రితుండు = వీడ్కోలు చెప్పబడిన వాడు

తా॥ సర్వలోకములకు విష్ణువే యధిపతి గనుక వాని యాజ్ఞ ఉల్లంఘింపరాదు వాని యాజ్ఞ ప్రకారము సంతతి కలిగిన వెనుక సన్యసించెదను, అని కర్దముడు పలుకగా స్వాయంభువ మనువు కర్దముని నిర్ణయమునుగూర్చి తన భార్య శతరూపతోను, కూతురు దేవహూతి తోను వేరుగా సంప్రతించి వారి మనస్సు తెలిసికొనెను వారంగీకారము తెలిపిరి

అపుడు మనువు కర్దముని నిర్ణయమున కంగీకరించి మహా సంతోషముతో కర్దమునకు దేవహూతికి బ్రహ్మ చెప్పిన విధాన మున వివాహము చేసెను (భౌతిక దేహము లిచ్చెనని యర్థము) అప్పుడు శతరూప పెండ్లికి తగిన బట్టలు, నగలు మొదలగు వస్తువులను తమ సంప్రదాయము ప్రకారము వధూవరులకు కట్నముగా కానుక పెట్టెను

ఇట్లు వివాహమునకు మానవజాతికి సంప్రదాయము నేర్ప రచి మనువు మనస్సున దిగులు చెందెను. పుత్రికను విడిచిపోవలసి వచ్చెనని బాధపడుచు ఆమెను కౌగలించుకొని గడ్డము పట్టుకొని

ముద్దుపెట్టి శిరస్సు వాసనచూచి కన్నీళ్ళతో ఆమె శిరస్సును తడి పెను ( వివాహముతో ఇట్టి జీవ ధర్మములను నరులలో సంప్రదాయములుగా సృష్టించి మనువు విడిచి పెట్టెను ) పోయి వచ్చెద నని చెప్పి కర్దముని దగ్గర సెలవు తీసికొని శతరూపతో గూడి రథ మెక్కి సపరివారుడై బయలు దేరెను

791 టీక తరళ తరంగవీచి=తళుక్కైన తరంగముల కదలి కలు, సముదంచిత = చక్కగా నొప్పారుచున్న, సరిత్ = నది, అరవిందతుందిల=పద్మములతో సుకుమారమైన, లసత్ +తరు= స్పష్టమగుచున్న చెట్లు, తీ ర ని వా స = ఒడ్డున నివసించు చున్న సన్మునీశ్వర నికర = మంచి మునీశ్వరుల స మా హ ము ల చే, ఆశ్రమాకలిత=ఆశ్రమములతో కూడిన, వేడ్క మున్పిరిగొనన్= కుతూహలము మూడు పేటలు కాగా, ఆత్మపుట భేదన విస్ఫుట= తన పట్టణము వ్యక్తమగుచున్న, మార్గవర్తి = దారియందు పోవు చున్నవాడు

తా॥ స్వాయంభువ మనువు కర్దమునికడ సెలవు గైకొని బయలుదేరి బిందుసరస్సు తీరమునను, సరస్వతీ నదీ తీరమునను ప్రయాణము సాగించెను వాని తీరమున పద్మములు వికసించి పిల్ల గాలులు వీచుచుండెను చెట్ల గుబురులు మనోహరములైన తావు లందు వరుసగా మునీశ్వరుల ఆశ్రమములు కనుపించెను అచ్చటి యజ్ఞములు, తపస్సులు, వేదాధ్యయనాదులు మున్నగు సంప న్నములైన దృశ్యములను దర్శించెను అటుపైన తన పట్టణము నకు బోవు వేడుకతో రథముపై ప్రయాణము చేసెను

792, 793 టీక లక్ష్మీశుండు = విష్ణువు, యజ్ఞసూకర మూర్తిన్ =యజ్ఞ వరాహావతారమును, సరభసముగా=మిక్కిలి

వేగముతో, రోమ జాలంబులు = వెండ్రుకల గుంపులు, రుచిర హరిత వర్ణము = మెరయుచున్న ఆకుపచ్చని రంగు, పావనాకు = అందమైన, వర = శ్రేష్ఠమైన, కుశకాశమయంబు = దర్భలచే, రెల్లు గడ్డితో నిండినది, యజ్ఞ క్రియాకలాప యోగ్యంబు = యజ్ఞము లందలి ప్రయోగములగు పనులకు తగినది, బర్హిస్సు = దర్భ, తత్ + విఘ్నకారులు = వానికి విఘ్నములను కలిగించు వారు, తుంచిరి = చంపిరి, విష్ణు ఎరవగు = విష్ణువును స్మరించి, మఖము = యజ్ఞము, రుచిర మధ = ప్రకాశించుచున్నట్టి బుద్ధిబలము,

తా॥ పూర్వము విష్ణువు యజ్ఞ వరాహరూపము ధరించి నపుడు దేహమును గట్టిగా విదలించెను అప్పుడు దేహమున నున్న నిర్మలమైన వెంట్రుకలు లెగిసి కొన్ని రాలిపడెను అందు కొన్ని బ్రహ్మావర్తదేశమున పడెను ఆ ప్రదేశమంతయు దర్భలతో, రెల్లుగడ్డితో నిండెను ఆ వెండ్రుకలు దర్భలయ్యెను కనుక దర్భలు మొలచు ప్రదేశమైన బ్రహ్మావర్తము పవిత్రభూమియై యజ్ఞార్థ కర్మల కనుకూలమైన ప్రదేశమైనది సకలఋషు లచ్చట చేరి క్రతువులు చేసిరి యజ్ఞార్థమునకు విఘ్నము చేయు నసురు లను దర్భలతో సంహరించిరి మనువు భూమియందెల్లెడల విష్ణు మయమైన యజ్ఞము చేసెను, బుద్ధిబలము చక్కగా ప్రకాశింపగా తన నివాసమునకు చేరుకొనెను

(మనువును పుట్టించి ప్రజాసర్గము చేయుమని చతుర్ముఖుడు కోరినపుడు సృష్టిజీవుల కాధారముగా భూమి నుద్ధరింపుమని మనువు కోరెను అపుడు బ్రహ్మ ప్రార్థనచే విష్ణువు వరాహమై భూమి నుద్ధరించెను అతని దేహమునుండి పడిన దర్భలు యజ్ఞసంభార ములై రాక్షస సంహార కారణములైనవి. వాని సహాయముచే అతడు విష్ణుమయ యజ్ఞము చేసెను. ఋషులందరు దర్భలను ప్రయోగించి రాక్షసులను సంహరించిరి

దీని మం(త్రార్థ మేమనగా మనువు ప్రారంభించిన సృష్టికి దేహముల కొరకై భౌతికమైన భూగోళ మేర్పడినది దాని మట్టి నుండి దేహములు పుట్టినవి అందు ఉచ్చారణ స్వరూపమైన జీవుని ప్రతిష్ఠకు శ్వాసావయవములు గరుత్మంతుని రూపమైనవి వెన్నెముక సరస్వతీనది ప్రవహించు మార్గమైనది నరులకు జుట్టు పెరుగునట్టి ప్రదేశమైన శిరస్సునకు లోపలి భాగమున నాడీ కేంద్రము లేర్పడినవి అవి ఋషిత్వమునకు, క్రమశిక్షణమునకు కావలసిన బుద్ధిబలము పనిచేయుటకు కేంద్రములైనవి వాని నాధారముగా గొని ఋషులు, యజ్ఞార్థకర్మలను సాధించిరి దేహ ధారులలోని అసురగుణములను దమించుటకు కావలసిన సాధన మార్గముల నేర్పరచిరి

నాడీ కేం(ద్రములు దర్భల తోటలతో పోల్చబడినవి దర్భలు పెరిగిన ప్రదేశమున నివసించుటయు, దర్భలు తాకిన నీరు త్రాగు టయు మేధస్సును వృద్ధి చేయునని సూచన)

794 టీక డాయంజనన్ = సమీపింపగా ఉపాయన ములు = కానుకలు, నుతుల్ = స్తోత్రములు, మంగళ తూర్యములు = శుభమును సూచించుట కూడునట్టి బాకాలు, ఆయతగతిన్ = విస్తా రముగా, మ్రోయఁ జొచ్చెన్ = శబ్దము చేసెను

తా॥ మనువు తన పట్టణమున ప్రవేశించునపుడు పుర జనులు కానుకలు తెచ్చి యిచ్చి అనేక విధములుగా స్తుతించిరి అంతఃపురమున మంగళ వాద్యములు విస్తారముగ మ్రోగెను

795 టీక తాపత్రయ + ఉపశమనంబు = మూడు తాప ములను శమింపచేయునది, పుత్ర మిత్ర కళత్ర = పుత్రులు, స్నేహ

తులు, భార్యా, సుహృత్ + గాంధవ సహితుండు = స్నేహ బంధు చుట్టములతోకూడినవాడు,

తా॥ ఇట్లు వైభవముగా పురప్రవేశము చేసి అహర్నిశము లను శమింపజేయునట్టి భగవద్భక్తిని వృద్ధి పొందించుచు కొడుకులు, మిత్రులు, భార్య బంధువులు తన్నాశ్రయించి యుండగా సుఖముగా నుండెను

( భగవద్భక్తి వృద్ధి పొందించుట తననుండి వ్యాపించుట, సృష్టి జీవులలోనని యర్థము )

706 టీక ప్రతివాసరంబు = ప్రతిదినము, హరి వ్యాసంగుండు = విష్ణుమూర్తిని గూర్చి ప్రసంగములు కలవాడు, మాధవ + అంకిత = విష్ణువున కర్పింపబడిన, గంధర్వ విపంచికా కలిత = గంధర్వవిద్య నిచ్చునట్టి వీణతో గూడిన, సంగీత ప్రబంధ + అనూదితుండు = చక్కగా పాడబడుచున్న ప్రబంధ గీతములచే సంతోషపడువాడు, ఇష్ట విభూతులు = కోరిన సంపదలు, అనురక్తిన్ = ఆపేక్షను, ఏ ప్రొద్దు = అన్ని వేళలయందు, అచ్యుత సేవా + ఏక పరాయణుండు = విష్ణుని సేవించు కొరకే నియమముగా గలవాడు, అస్తోక ప్రభావ + ఉన్నతిన్ = అధిక మహిమతో, గొప్పదనముతో,

తాత్పర్యము - మిక్కిలి భక్తితో ప్రతిదిన మతడు విష్ణుని కథలనే ప్రస్తావించుచుండును, విష్ణువున కంకితము చేసిన గంధర్వ వీణ మీటుచు సంగీతము పాడుచున్నవారి భక్తిగీతములు విని సంతోషించును తానును గానము చేసి వీణానాదమును ప్రకటించును సమస్తసంపదలు కలిగియున్నను వానియం దనురాగము లేదు అన్ని వేళలయందు విష్ణుసేవయే నిత్యముగా నేర్పరచుకొనెను

797 టీక హరిపాదాంబురుహద్వయ+అర్పిత=విష్ణుని పాదపద్మముల యందర్పించిన, తులసి+ఆమోదమున్=తులసి దళముల పరిమళమును, తత్+చరితంబుల్=అతని కథలు, తత్ పరిచర్యా వ్యతిరిక్త=వాని సేవకాక ఇతరమ్మైన, సంసరణ= సంసారమునకు చెందిన, సత్+ధర్మ+అర్థకామంబులు=మంచివి యైన త్రివర్గములు, పరిభూతంబులు=తిరస్కరింపబడినవి, మోక్ష పద సంప్రాప్తి క్రియారంభుఁడు=మోక్షమును పొందునట్టి పనులు సంకల్పించువాడు

తాత్పర్యము విష్ణుపాదములయం దర్పింపబడిన తులసి దళము పరిమళము లంగీకరించును విష్ణుని దివ్యచరితములు స్మరించి సంకీర్తనము చేయును అందలి అందమును చర్చించును, వినును విష్ణుసేవకు వేరైన సంసార చరితముగాని, ధర్మార్థకామముల సాధనముగాని వాని దృష్టి నాకర్షింపలేదు మోక్షమార్గమునకు దోహదమిచ్చు పనులనే సంకల్పించుచుండెను

( చతుర్ముఖ బ్రహ్మాదుల వలెనే మనువు కూడ ప్రజలలో నంతర్యామిగా తన మన్వంతర మంతయు జీవించును కనుక వారందరి యందు భక్తిని, విష్ణు సేవాబుద్ధిని పుట్టించుటకు సంకల్పించి, వారి సాధనయే సాధనగా మెలగెను )

798 టీక నిగమార్థ గోచరుండు = వేదార్థములకు గోచ రించువాడు, తత్పర చిత్తుండు=దాని యందు స్థిరపడిన చిత్తము గలవాడు, స్వ+అంతరంగములు=తన హృదయము మనస్సులోని భాగములు, యామములు=జాములు, అయాత యామములు = జరుగకున్న నడక గలవి,

తా॥ వేదార్థమునకు గోచరించు విష్ణుమూర్తి చరిత్ర ప్రసంగముల యందు మునిగి యున్న అతని మనస్సునకు, హృద

యమునకు యామాలు జరుగుచున్నను జరుగనివే అయ్యెను అనగా కాలము గడచుట తెలియదు

( విష్ణుని యందు సమాధి మగ్నుడగుట వలన బాహ్య ప్రపంచమున కాలము గడచుచున్నను వానికి కాలము గడచుట తెలియదు. కనుకనే అతని హృదయమునకు గడచు జాముల కాలము సుదీర్ఘమై అతని ఆయుర్దాయము ఒక మన్వంతరమంత కాలము పట్టెనని చెప్పుట్క్యాని తనకు చేరుగా గాని దేహము లేదు కనుక జీవులు తన రాజ్యము నందు దేహములు ధరించుచు విడుచు చున్నను అతడు మన్వంతర ఆయుః ప్రమాణము కలవాడగుట విష్ణువ యందు సమాధిలో కాలము గడుపుట వలననే )

799 టీక అ + మేటి = అ పెద్దవాడు ఆకర్ణన ధ్యానాను గాన నుతులు = వినుచు, ధ్యానము చేయుచు జీవులతో కలసి పాడుచున్న స్రోత్రములు, స్వస్వప్న జాగ్రతీ + సుషుప్తులన్ = తన నిద్ర, మెలకువ, కల యను స్థితులను, తలంగించి = తొలగించి, పుణ్యాత్ములు = మహా పుణ్యాత్ములు, చక్రి దాసుడు = విష్ణువునకు సేవకుడు, దివ్యమానవ భవతిక వ్యధలు = దేవతలకు, మనుష్యులకు పంచ భూతములకు సంబంధించిన బాధలు, తగులన్ = చిక్కకొనక, సత్ + మునీంద్ర శ్రేణికిన్ = సజ్జనులగు మునీంద్రుల గణములకు, సర్వ భూత వ త వృత్తిన్ = సర్వజీవులకు మేలు చేయు ప్రవర్తనముతో, అతుల విఖ్యాత రీలన్ = సాటిలేని ప్రసిద్ధితో, ఏకసప్తతి యుగములు = డెబ్బది యొక్క మహా యుగములు, అస్తోక చరితుడు = మహాత్ముల ప్రవర్తనము కలవాడు,

తా॥ అతడు విష్ణు కథలను వినుచు, ధ్యానించుచు నితరులతో కలసి పాడుచున్న స్థితిలో నిద్ర, మెలకువ, స్వప్నము అను స్థితులు దాటి వర్తించెను విష్ణుని దాసుడై శరీరమునకు, మనసు

నకు కలుగు బాధలను పొందలేదు దేవతలకు, నరులకు, పంచ భూతములకు సంబంధించిన బాధలలో చిక్కుకొనలేదు మహానీయులగు మునీంద్రుల గణములకు, వర్ణాశ్రమ ధర్మముల మార్గములు బోధించి క్రమము తప్పక నడిపించుచుండెను ఇట్లానంద మూర్తియై డెబ్బది యొక్క మహా యుగముల కాలము జీవించెను

( తన యందు జీవుల శరీరములు, మనస్సులు, వర్తించుచున్నను వారికి సంబంధించిన బాధలు తన కంటకుండ విష్ణు ధ్యానమున విష్ణు మయుడై వర్తించెను ఇంద్రియముల కధిపతులైన దేవతలు, అహంకారమున చిక్కుకొనిన జీవులు, దేహములయందు పంచభూతములు పొందునట్టి సృష్టి పరిమాణములు అతని నంటలేదు

సప్తఋషి గణము మొదలగు తారకల గుంపుల రూపమున నున్న ప్రజ్ఞలకు వర్ణాశ్రమ ధర్మములు కల్పించి శాసించెను ఈ లోకము లన్నియు తన యందు వచ్చుచు పోవుచుండగా తా నంత ర్యామియై డెబ్బది యొక్క మహా యుగములు పరిపాలించెను ఇట్లు వర్తించుట విష్ణువు లక్షణము ధ్యానమున విష్ణువు నందు లీనమై యుండెను కనుక మనువు కూడ నిట్లే వర్తించెను )

800 టీక తనరంగన్ = విస్తారముగా,

తా॥ ఇట్లు మైత్రేయుడు విదురునకు దయతో స్వాయంభువ మనువు చరిత్రమును జెప్పెను ఇక కర్దముని కథ చెప్పెదనని ప్రారంభించెను

801 టీక భవునికి = శివునకు, భవాని = పార్వతి, తెఱంగునన్ = విధమున, ఏడుగడ = రక్షణము, అనూన తేజో ఎరాజిత = పెరుగుచున్న తేజస్సుతో వెలుగొందు నది, కామ

క్రోధంభ లోభాదిగుణ నిరపేత = కామము, క్రోధము, దంభము, లోభము మొదలగు గుణములు లేనిది (కామమనగా కోరికలు, క్రోధమనగా తీవ్ర కోపము, దంభ మనగా నితరుల ముందు తన గొప్ప చాటుకొనుట, లోభ మనగా పిసినిగొట్టు తనము,) చతుర సౌహార్ద్ర స్నేహాంశులు = నిర్మలితనము, ప్రేమ, మిత్రత్వము, మృదు మధుర వచన రచన = మెత్తగా తీయగా సంభాషణము చేయగలది, దైవ యోగంబు = పూర్వ కర్మ ఫలములు సంక్రమించుట, నిజసేవ + ఆయాస కృశీ భూత దేహ = తన్ను సేవించు శ్రమ వలన చిక్కిన శరీరము గలది, కరుణా తరంగితా పాంగుడు = కరుణ అలలవలె పొంగివచ్చు కటాక్షములు గల వాడు, మంజు భాషణాంశులు = వినుట కింపైన సంభాషణలు,

తా॥ ఇట్లు స్వాయంభువ మనువు దేవహూతికిని, కర్దమునకు వివాహము చేసి తిరిగి పోయిన వెనుక దేవహూతి చక్కని పతి భక్తి కలిగి వర్తించెను భర్తయే తనకు శరణ్యమని నమ్మెను. శివునకు పార్వతి చేసినట్లు పరిచర్య చేసెను తన మనస్సునకు తోచినంత వరకు నానాటికి వృద్ధి చెందుచున్న భక్తియు, నిష్ఠయు, స్నేహము గలిగి భర్తకు ప్రియము కలిగించు పనుల నొనర్చుచుండెను అదియే తపస్సుగా తేజస్సు వృద్ధియై వెలుగొందెను కామము, క్రోధము దంభము, లోభము మొదలగు గుణములు లేక స్థూల సూక్ష్మ శరీరములు పరిశుద్ధము లయ్యెను భర్తయే దైవముగా భావించి భక్తితో నెల్లపుడు నేర్పరితనము, ప్రేమ, మిత్రత్వము కలిగి సంభాషణ చేయును ఏమరుపాటు లేదు

కర్దముడు తన తపశ్శక్తిచేత పూర్వ కర్మ ఫలమును కూడ తప్పించు సామర్థ్యము కలవాడు తనకు సేవ చేయుటలో

శ్రీమ పడుచు చిక్కిపోవుచున్న దేవహూతియందు దతనికి జాలి కలిగెను దయామయమైన దృష్టితో చెవుల కింపైన పద్ధతిలో నిట్లనెను

802 టీక మానిత = గౌరవింపబడిన ధర్మ మార్గ మహిమస్థులు = ధర్మము అవలంభించుట వలన గొప్పదనము స్పష్టపడినవారు, భూరి తపస్సమాధి=విస్తారమైన తపస్సుగ లభించిన నిరంతర ధ్యానము, విద్యానిభృతి = ధ్యానముచే నిశ్చలతను చెందిన, ఆత్మయోగసముపార్జిత = ఆత్మ యందు లయమగుట వలన ఆర్జించుకొనిన, విష్ణు కటాక్షలబ్ధ = విష్ణుని కడగంటి చూపులచే పొందబడిన, శోభా + అనఘ = శోభచే పాపము తొలగించు కొనిన దానా, దివ్యభోగ = దేవతా సౌఖ్యములు, బహుభద్ర వితానములు = అనేక విధములైన శుభముల వైఖరులు, అస్మదీయ సేవా నిరతిన్ = నన్ను సేవించు నిష్ఠలో, అని వారణన్ = అడ్డు లేనట్లు,

తా॥ ధర్మ మార్గమున చరించిన నీ యందు మహిమ వ్యక్తమయ్యెను నీ జీవితమే తపస్సైన సమాధి సిద్ధించెను జ్ఞానము నిశ్చల మయ్యెను ఇంద్రియములు, మనస్సు, ఆత్మయందు లగ్నములైనవి దానివలన విష్ణుని అనుగ్రహము నీ యందేర్పడినది నీవు నన్ను సేవించుట వలన దివ్య భోగము లనుభవింప జేసెదను అడ్డు లేని దివ్య దృష్టిని ప్రసాదించెదను

803 టీక నెలంత = స్త్రీ, విలోకింపు = చూడుము, కమలపత్ర నయను = విష్ణుమూర్తి యొక్క, బొమ్మముడి మాత్రన = కనుల బొమ్మలు ముడుచునంతలో, తుచ్ఛ భోగంబులు = అల్ప సుఖములు,

అ ॥ నేను పరిపాలించిన దివ్య గృహస్థకి నీ కన్నిచ్చుట దర్శన మిచ్చును, భోగింపుము ఇక యోగమాయాశక్తి నిగ్రహ యముల, మనస్సు మనోభావముల సుఖములను గుర్తించి నేను గాని నన్ను గ్రహింప నక్కర లేదు అవి విష్ణుమాయాకృత కనుక వ్యర్థముల కదలిక లలో తెలియును

(సుఖసంపద లనుభవించినను సంపదలు శాశ్వతములుగా అనుభ వింపవలెనుగాని స్వార్జితములుగా అనుభవింప రాదు నీవు ఇంద్రియ ములను, మనస్సును సుఖపడునట్లు చేయ వచ్చును గాని తాను ఇంద్రియ ములుగా, మనస్సుగా సుఖపడరాదు అట్లు సుఖపడ యత్నించినచో ఆ సుఖములు క్షణముల లో నశించిపోవచ్చును )

80½ టీక అనుపమ = సాటిలేని, రాజ్యదర్ప + అంధ చేతస్కులు, రాజ్యమున్నదను దర్పమున గుడ్డివారైన చెడిన బుద్ధి బలము కలవారు, పార్థివులు = రాజులు, భృతిన్ = ఐశ్వర్య ములో భోగింపుము = అనుభవింపుము, ఆశివ = స్త్రీ, యోగ మాయా విచారణ విభుంచు = యోగమాయయందు ఎవిధముగా చరింపగల స్వామిత్వముగలవాడు, వికత + అధ = మనోబాధలు లేనిది, అపాంగ కలిత + అనతాస్య పంకజ = కన్ను తుదలలో కూడిన సిగ్గుచే వంచిన ముఖపద్మము కలది, విహ్వలంబులు = ఎర వశత్వము చెందినవి,

తా॥ సాటిలేని రాజ్యసంపదను చూచి రాజులు గర్వాంధు లగుదురు కన్నుగానక పాప మార్గములలో ప్రవర్తింతురు, అట్టి వారికి పొందరాని దివ్య భోగములు నీ పాతివ్రత్య మహిమచే నీకు లభించెను సమబుద్ధి కలిగి యనుభవింపుము, నీకు కార్యసిద్ధి యగుగాక, అని కర్దము డాశీర్వదించెను దేవహూతి సిగ్గున తల వంచి చనువులో పరవశములైన సంభాషణలతో నిట్లు పలికెను,

( సమబుద్ధి యనగా కలిమిలేముల నొక విధముగా ననుభవింప గలుగుట తిన్ను మెచ్చువారిని, మెచ్చని వారిని ఒకే విధముగా చూచుట, అందరకు నొకే విధమైన సేవ చేయుట )

805 టీక అనఘా = పుణ్యాత్ముడా, అమోఘ యోగ మాయా విభుండవు=వ్యర్థము కాని యోగ మాయ కధిపతివి, అనుపమ=సాటిలేని భవత్ +సంగతిన్=నీతో కలిసియుండుటచే, సంతాన పర్యంతంబు = సంతానము కలుగు వర కుండునది, శరీర సంగమ సమయంబు=శరీరములతో కలిసియుండునట్టి నిర్ణయము, భవత్ +అంగసంగమంబు=నీ దేహముతో కలయిక, భవదీయ సంయోగ వాంఛాపరతన్ = నీ కలయిక కొరకుగల కోరికకు వశమై యుండుటవలన, కృశీభూతంబు = చిక్కిపోయినది, మజ్జన భోజన పాన సుఖంబులు = స్నానము, భోజనము, పానీయములకు సంబంధించిన సౌఖ్యములు, పరితుష్టి=సంతోషము, మత్ +మనోరథంబు = నా కోరిక ఉపశిక్షించి = తగిన శిక్షణ మిచ్చి, ఉచితంబులు=తగినవి, వివిధ+అంబర+ఆభరణ = పలువిధములైన వస్త్రములు, నగలు మాల్య+అనులేపన=పూలదండలు, మైపూతలు, మందిర + ఆరామప్రముఖ = గృహములు, తోటలు మొదలైన, నిఖిల వస్తు విస్తారంబు = అన్ని వస్తువుల యభివృద్ధి,

తా॥ ఓ పుణ్యాత్మా! నీవు చెక్కవోవని యోగమాయకు అధిపతివి సర్వసమర్థుడవు నీ యందు సాటిలేని దివ్యభోగములు సిద్ధించుట సత్యమని నాకు తెలియును నీ సాంగత్యమువలననే నా కన్నియు గలుగు ననుటలో సందేహము లేదు మన దాంపత్యము సంతానము కలుగువరకు మాత్రమే యుండునని నీవు నిర్ణయము చేసితివి మొదట దాంపత్య సౌఖ్యమును గూర్చి నీవు సంకల్పింపవలెనుగదా! నీ సాంగత్యము కోరి వేచియున్న నా శరీరము కృశించి యున్నది స్నానము, భోజనము, పానీయములు మొద

లగు సుఖములతో సంతృప్తి ఎట్లు కలుగును? నీవు నా కోరిక తీర్ప వలె నన్నది. అప్పుడు కామశాస్త్రమునందు క్రియాశీల భోగాలను చేయవలెను. దానికి తగిన వస్త్రములు, ఆభరణములు, పుష్ప మాలలు, మాపూతలు, ఇండ్లు, తోటలు, ఆస్తి మొదలగు వానిని మొదట సభివృద్ధి చేయుము. దేవహూతి యిట్లు కోరగా కర్దముడు మహిమాన్వితుడై తన యోగమాయా బలమును ప్రవర్తింప జేసెను

( మొట్టమొదటగా భౌతిక దేహములు పొందినవారు కర్దమ దేవహూతులు కనుక కామము కేవల సంకల్పరూపము కాకుండ దాంపత్యరూపము పొందుటకు క్రియాబద్ధమైన శాస్త్ర మొకటి కావలయును లేనిచో జంతువులయందు వలె పశుధర్మ మేర్పడును కర్దముడు సృష్టికర్త యగునట్టివాడు గనుక కామ శాస్త్ర క్రియమును దర్శించి దేవహూతికి ఉపదేశింపవలెను

అంతకుముందు వరకు దాంపత్య మనగా ఆమె యతనికి సేవ చేయుట మాత్రమే జరిగినది దాని వలన శ్రమచే ఆమె దేహము శుష్కించినది మరియు భౌతిక సుఖములకు వాసయోగ్య మైన ఇల్లు, తోటలు, దొడ్లు మొదలగునవి కర్దముడు సమకూర్చ కొనలేదు తన యోగమాయతో దివ్య సౌఖ్యములను పొందింతు నని, దివ్యాభరణాదులను సమకూర్తునని చెప్పెను సంతతిని విస్త రింప చేయుమని కదా బ్రహ్మ వారిని సృష్టించెను! వారికి దివ్యము లైన వస్తువులు చాలవు భౌతికములు కావలెను ఈ విషయమును మొట్ట మొదటగా కర్దముని దృష్టికి తెచ్చెను అతడు దేనికైనను సమర్థుడు కాని ఇంతవర కతని దృష్టి భౌతిక వస్తువులను సమ కూర్చుకొనుట యందు ప్రసరింపలేదు )

806 : టీక్ దీప్తిన్ = కాంతితో, చెన్నొందుచున్ = అంద

మగుచు, మరకతస్థలమున = గరుడపచ్చలు తాపిన భూమిమీద వరవజ్రకుడ్య కవాట = శ్రేష్ఠమైన వజ్రాలు తాపిన గోడల నడుమ నేర్పరచిన తలుపులు, శోభితములు = శోభ చెందునవి, విద్రుమ దేహళీ వీథులు = పగడాల మండెగముల వరుసలు, కొమరొప్పన్ = అందమగునట్లుగా, నవ శాతకుంభ కుంభకములు = క్రొత్తగా బంగారముచే నిర్మింపబడిన గుండ్రని గోపురములు, హరినీల శకల విస్ఫురణము = ఇంద్ర నీల మణుల ముక్కల తళుకులు, మొగడలు = మొగ్గలవంటి నిర్మాణములు, చెలువొందు = అందమగునట్టి, వైడూర్య వలభులు = వైడూర్యముంతో నిర్మింపబడిన చూరులు, తరళతర = తళ తళ మనుచున్న, ధూత కేతు పతాకలు = గాలి కెగిరి యాడుచున్న జెండాగుడ్డలు, ఒలయన్ = విస్తరింపగా, మంజు శింజత్ + సమంచిత = మనోహరమైన శబ్దములతో నొప్పుచున్న, మధుపకలిత = తుమ్మెదలతో కూడిన, సురుచిర = చక్కని కాంతిని వెదజల్లుచున్న, ఆలంబమాన = వ్రేలాడుచున్న, ప్రసూన రాజితమాలికలన్ = పువ్వులు పేర్చి కట్టిన దండలతో, గృహాళి = ఇండ్ల వరుస, తనరి = విస్తరించి,

తా॥ కర్దముడు భౌతిక వస్తు సంపత్తిని సృష్టించుటకై తన యోగమాయా బలమును ప్రసరింప చేసెను వెంటనే అనేక విధములుగా నిర్మింపబడిన చిత్ర విచిత్ర నూతన గృహములు సృష్టింపబడెను అందు స్తంభములు మణుల కాంతులతో మెరసిపోవు చుండును అరుగులు గరుడ పచ్చలతో తాపబడినవి గోడలకు వజ్రములు, వాని నడుమ వజ్రమయము లైన ద్వారబంధములు కలవు గుమ్మముల పగడముల కూర్పు చేయబడినవి బంగారు కుంభములు ఇంద్ర నీలముల ముక్కలతో కలిసి తళుక్కు మనుచున్నవి పద్మరాగముల మొగసాలలలో వైడూర్యముల

ముంజూరులు గల ఆ మహా భవనములు ఎగురు పతాకముల వస్త్రములు గాలి కెగురు చుండగా తెలి తెలిలు కలిగియున్నది భవనము లందు కొత్తగా కోసిన పుష్పములు దండలు గ్రుచ్చబడి యున్నవి ఆ పుష్పముల చుట్టను చేరి తుమ్మెదలు ఝుంకారము చేయుచున్నవి

807 టీక దుకూల = తెలుగు వస్త్రములు, (Silks) చీనాంబర = పట్టు వస్త్రము, కౌశేయ + ఆది = మొదలగు పట్టు బట్టలు మొదలైన, వివిధ పట = అనేక విధములైన వస్త్రములచే, పరివృత మంచిర = చుట్టను కప్పి అమర్చినవి గదులచే, సుభగ + ఆకారములు = సౌభాగ్యము గల ఆకారము, అదు దారక = అపురూపముగా, విచిత్ర పట్టికా + అలంకృతమ్ = రంగుల రంగుల ధట్టీలతో నలంకరింప బడినవి.

తా॥ స్త్రీలు అలంకరణము చేసి కొనుట కేర్పరుపబడిన గదుల లో తెలుగు వస్త్రములు, పట్టు బట్టలు, చీరలు, మొదలు విప్పి యమర్చబడి యున్నవి రంగు రంగుల ధట్టీలు తీరుగా నమర్చబడి యున్నవి ( ధరించుటకు సిద్ధముగా సేర్పాటు చేయబడి యున్నవి )

808 టీక లలిత + ఉద్యాన వనాంత = మనోహరమైన ఉద్యాన వనముల నడిమి భాగమున , సంచరణ = సంచారము చేయుచు , లీలాలోల = విలాసముగా సంచరించు తిరుగుచున్న, హంసాళి = హంసల వరుసలు , పారావత = పావురములు , చక్ర వాక = జక్క వ పిట్టలు , శుక = చిలుకలు , కేకి వ్యాహారము = నెమళ్ళ బారు , అంచత్ + సముత్క లికా = చిందులు తొక్కుచున్న యుత్సాహముతో , కృత్రిమ పక్షులన్ = పక్షులవలె చేయబడిన బొమ్మలను , నిజ విహంగ శ్రేణి = తమకు సంబంధించిన పక్షులు ,

ప్రతిశాఖా + ఆరోహణ వ్యాప్తులు = కొమ్మల మీదకు పరుగెత్తి విప్పారుచుండుటలు

తాత్పర్యము ఆ ఇండ్ల చుట్టునున్న యుద్యానములు మనోహరములు అందు విలాసముగా నీదులాడుచున్న హంసలు, కొమ్మలపై పునకు నెగిరి పరుగులెత్తి విప్పారుచున్న కోకిలలు పావురములు, చకవాకములు, చిలుకలు, నెమళ్ళ గుంపులును ఆ చెట్ల గుబురుల నడుమనున్న ఇండ్లపై నిలువబడిన పక్షుల బొమ్మలను చూచి నిజముగా పక్షులని భ్రమచెంది కూయుచు పలుకరించుచున్నవి

( ఇచ్చట భావము చాల అపురూపమైన సౌందర్యముతో కూర్చబడినది దీనికి మూల శ్లోక మీ విధముగా నున్నది )

హంస పారావత వ్రాతై స్తత్ర తత్ర వికూజితం
కృత్రిమా న్మన్యమానై స్స్వా నదిరు హ్యావరుహ్య చ

( భాగవతము 3-23-20 )

ఈ మూల శ్లోకమున భ్రాంతిమదలంకారము చాల అరుదైన పద్ధతిలో వాడబడినది దానిని చక్కగా విస్తృతము చేసి పోతన వెలిగించెను దీని విలువను గమనించియే కాబోలు కృష్ణదేవరాయలు తన ఆముక్తమాల్యదలో కథాప్రారంభమున మొదటి పద్యమునే దీని కనుకరణగా రచించెను

'లలితోద్యాన పరంపరా పిక శుకాలాప ప్రతిధ్వానముల్
వలభీ నీల హరిన్మణీ పిక శుక స్వానభ్రమన్ గూర్ప
(పద్య మెత్తుగడకూడ పోతన పద్యము ననుకరించుచునే యున్నది )

809, 810 టీక నెరసియు=మెరయు, సుందరి ఫాలతిక = పెద్ద మేడలలోపల గల శయ్యా । ఆసన = ం ం ల, ఒర్యు శములు, కేళీగేహ=క్రీడా గృహములు, కృతా జగతీసార = కృత్రిమ లోక ములను ధరించి, శోభన=శోభిల్లు మన్న, వం ) శాలా ధవస =చలువరాళ్ళ అందమైన మందిరములు యుగు ు ధగ + అవ సీజ వ ణములు=పచ్చలతో కు న చ ు గలవి

తా॥ పెద్ద మేడల లోపల శయ్యలును, ఆసనములు నలంక రింప బడయున్న శాల లున్నవి అందు కృత్రిమముగా కల్పింప బడిన సేరాక లోకముల శోభలను ప్రకటించు లు వ రం గ మంటపము లున్నవి అందు పచ్చలతో గూర్చిన చల్లు ను న్నున్నవి

( భవనముల పైన శాలల లోపల వృత్తములు గ వబడు చున్నవని యర్థము )

811 టీక సకల + ఋతుశోభితంబు=అన్ని ఋతువుల శోభలను గలది, సకల శుభ+ఆవహము=సకల శుభములు కలి గించునది, సకల సంపత్కరము=సకల సంపదలు ప్రకటించునది, సకల+ఉపభోగ యోగ్యము=అన్ని విధముల సుఖము లనుభ వించుటకు పనికి వచ్చునది, సకల+ఈప్సిత కామదంబు = కోరిన కోరిక లన్నిటిని తీర్చునట్టిది, సత్ +అలంకృతము=చక్కని అలంక రణములు గలది లేక ఆకాశమునం దలంకరింపబడినది, ( యోగ మాయాకల్పిత మని యర్థము )

తా॥ అన్ని ఋతువుల శోభలతో అన్ని శుభములతో, సంపదలతో, అన్ని సుఖము లనుభవించుట కనుకూలముగా, అన్ని కోరికలు తీరునట్లుగా, అన్ని యలంకారములును గల దివ్య విమాన మొక దానిని నిర్మించెను ( అన్నమయ, ప్రాణమయాది కోశము లతో దేహ నిర్మాణము కల్పించెనని యర్థము )

812 టీక తదీయ సుషమా విశేష చిత్రింబులు = దాని కాంతుల ప్రత్యేకతలలోని ఆశ్చర్యములు, అద్భుత కర్మంబులు = ఆశ్చర్యకరములైన పనితనములు విమానంబు = ఆకాశ యానము చేయు సాధనము, (విశేషములైన మానములు గల ప్రయాణ సాధనము అనగా దేహాము యొక్క నిర్మాణము) ఆ + ముద్దియ = ఆ యమాయికురాలు, సర్వభూతాంతర + ఆశయ + అభిజ్ఞుండు = సర్వ జీవుల హృదయముల లోపల గల మక్కువలను అనుకూల దృష్టితో నర్థము చేసికొనువాడు

తా॥ ఆ విమానము నందు అనేక తేజో విశేషములు, వానికి తగిన ఆశ్చర్యకరములైన అనుభవములు సృష్టించెను

(సప్తధాతువులతో దేహ నిర్మాణము, అందలి రంగులు, ఒక్కొక్క దానికి సంబంధించిన అనుభవములు, ఆవేశములు, వానితో ప్రభావితములైన ఇంద్రియ ప్రవృత్తులు, మనస్సు, మనో ధర్మములు, వాని యందు అన్ని పరిస్థితుల వలన ప్రతిబింబించు సన్నివేశములు కల్పితము లైనవి)

ఈ నిర్మాణము కొంత దూరము జరుగుసరికి తనకే అంతు పట్టక అశ్చర్యము కలిగించెను

(జీవుడు దేహాబద్ధు డైనపుడు సిద్ధుడైనను, కారణ జన్ముడైనను అంతుపట్టని లక్షణము మనస్సు నావరించును కాని కర్దముని వంటివాడు దానిని తట్టుకొని దాటి, తన్ను తాను గుర్తుంచుకొనును)

అట్టి విమానమును దేవహూతికి గోచరింపజేసెను దానిని చూచి ఆమె సంతోషింపలేదు ఆమెకు కావలసినది చతుర్ముఖుడు, మనువు, ఆదేశించిన నారాయణుని ఆజ్ఞ యగు ప్రజాభివృద్ధి అనగా

సంతతిని పరిసలించుట అందు భగవద్భక్తి గల భక్తిగాని కోరిక లేవియు లేవు ] కర్దముడు సర్వ జీవుల హృదయముల లో దాగి యున్న భావములను అనుకూల ప్రవృత్తి చే గుర్తుపట్ట గలవాడు ఆమె హృదయమున గల భావమునకు సంతోషించి ఆ మాతో నిట్లనెను

813 టీక అబల = స్త్రీ, భగవత్ కృతంబు = భగవంతునిచే సృష్టించినది, అఖిల మంగళాకరంబు = సమస్త శుభములకు నిలయము, జలాశయంబు = కోనేరు, తవిలి = సంకల్పించి, క్రుంకినన్ = మునిగినచో, జంతు వితానములకు = పుట్టిన జీవుల సమూహాము లకు, కామ్యఫలసిద్ధి = కోరికలు ఫలించి సిద్ధించుట,

తా॥ ఈ కోనేరు భగవంతునిచే సృష్టించినది ఇది సకల శుభములు నివాస ముంగునది ఇందు స్నానము చేసినచో జన్మించిన జీవులకు కోరికలు తీరును

814 టీక మజ్జనము = స్నానము, వేడ్కన్ = వేడుకతో, లజ్జావతి = సిగ్గుపడుచున్నది, బుజ్జగింపుచు = బుజ్జగింపుతో,

తా॥ భక్తితో ఈ కోనేటియందు స్నానము చేసి ఈ విమానము నెక్కుము అని కర్దముడు దేవహూతిని బుజ్జగించుచు పలికెను ( అదియే బిందుసరము అను పేరుగల కోనేరు అంగు సృష్టి భవన నిర్మాణమునకు కావలసిన భాగములన్నియు దాని చే నిర్మింప బడి విశ్వకర్మచే దాచబడియుండును అది ఊర్ధ్వ లోకములలో సత్యలోక బిందువు భూలోకమున శుక్రమును బిందువు పాతాళమున భోగవతి, లేక శోషిత మనబడు గర్భధారణ కారణమైన బిందువు అందు స్నానము చేయుట అనగా గర్భధారణ భక్తితో స్నానము చేయుట అనగా మనసున కోరికలు లేనిది, భౌతిక దేహమున

నిర్వర్తింపబడునది అగు సృష్టి యజ్ఞ మనబడు కామము స్నానము చేసి విమానము నెక్కుట యనగా గర్భధారణము పొంది దేహధారణము పొందుట )

815 టీక కువలయాక్షీ = కలువ రేకులవంటి కన్నులు గలది, పతిసేవ + ఆయాస మలినాంబర = భర్తకు సేవచేయుటలో శ్రమ కలిగి మాసిన వస్త్రములు ధరించి యున్నది, వేణీ భూత శిరోజ = జడగట్టుకొనిన కేశములు గలది, ధూళి ధూసరిత = ధూళిచే మాసిన, అతికృశీభూత + అంగ = మిక్కిలి కృశించిన దేహము గలది, శబల స్తన = బలిష్ఠములైన స్తనములు కలది, భర్తృ నియోగంబు = మగని యాజ్ఞ, సరస్వతీసలిల సంభూత = సరస్వతీనది జలములందు పుట్టిన, జలచర + ఆశ్రయంబు = జలచరములకు నివాసము, తత్ + జలంబులన్ = ఆ నీటియందు, కుంకులిడు = మునిగి తేలునట్టి, తత్ + వా + పూర మధ్యంబున = ఆ కోనేటి నడుమ, రుచిర సూక్ష్మాంశుక ధారిణులు = మెరయుచున్న సన్నని జిలుగు పొరల వస్త్రములు ధరించినవారు, కిశోర వయ పరిపాక శోభితలు = బాల్యమను వయస్సున శోభిల్లువారు, ఉత్పల గంధులు = కలువ పువ్వుల వాసనలు గలవారు, కన్యా సహస్రంబులు = వేలకొలది కన్యలు

తా॥ భర్తకు సేవచేయుటచే శ్రమించి మాసిన వస్త్రములు ధరించి, జడలు గట్టిన జుట్టు కలదియై, ధూళి సోకిన చిక్కిన శరీరము కలదియై, బలిసిన స్తనములు గలది యగు దేవహూతి భర్త పలుకులు విని సరస్వతీనది జలములతో నిండిన బిందుసరస్సును ప్రవేశించెను అందు స్నానము చేయుచుండగా ఆ కోనేటి నడుమ కొన్ని వేలమంది కన్యకలామెకు కనిపించిరి వారు సన్నని, ఎర్రని పొరల వంటి వస్త్రములు ధరించి బాలవయస్సున శోభిల్లుచుండిరి కలువ పువ్వుల పరిమళములు కలిగియుండిరి వారు దేవహూతితో నిట్లనిరి

( ఈ కన్యలందరు గర్భధారణమున కుపకరించు ప్రకృతి శక్తులు )

816 టీక తరుణీ=తరుణ వయస్సు గలదానా, అంచిత ధర్మాచరణులము = తగిన ధర్మ మాచరించు వారము, సదమల భక్తిన్ =నిర్మలమైన భక్తితో, కరుణ కలిత + ఈక్షణముల్ న్ = కరుణతో కూడిన చూపులతో

తా॥ తరుణవయస్సు గలదానా! మేము కావలసిన ధర్మము లాచరించువారము నీకు భక్తితో పరిచర్యలు చేయుదుము మమ్ము దయతో చూడుము

( దేహధారిణులైన స్త్రీలకు గర్భధారణ కనుకూలమగు వయస్సున ఈ కన్యలు పరిచర్య చేయుదురు దయతో వారిలను చూచుట యనగా దయాగుణము కలిగి ప్రవర్తించుట. దాని వలన సంతాన ప్రాప్తి సుగమ మగును )

817 టీక డాసి = సమీపించి, ఆ+అతివకు=ఆ స్త్రీకి, అభ్యంజన+ఉద్వర్తనములు=తలంటులతో నలుగుపెట్టుట, మలయజ కర్పూర మహిత వాసిత=చందనము, కర్పూర వాసన కలిగియున్న, హేమ కలశోదకంబులు = బంగారు చెంబులతో ముంచిన నీరు, ధవళ వస్త్రంబులు=తెల్లనైన వస్త్రములు (ఉదికిన వస్త్రములు) సర్వాంగ ధూపంబులు = దేహ మంతటికిని సుగంధ ధూపము పట్టుట, అలంది=పులిమి, మంజు శింజత్ + మణిమంజీర = చక్క గా శబ్దము చేయుచున్న మణుల అందెలు, కింకిణీ కలరావకలిత = మువ్వల మనోహర శబ్దములతో కూడిన, మేఖలలు=వడ్డాణములు రత్నఖచిత=మణులు తాపిన, తాటంక ముద్రికా కంకణ+అద= చెవి పోగులు, ఉంగరములు, గాజులు మొదలైన, సముచిత +

అనర్ఘ్య=తగినవి, వెలకట్టరానివి, హేమభూషణములు=బంగారు నగలు, భవ్య మాల్యాను లేపన+అంబరములు=శుభకరములైన పూలదండలు, మైపూతలు, వస్త్రములు

తా॥ ఇట్లు పలికి వారామెను సమీపించి తలంటి నలుగు పెట్టిరి మంచి గంధము, కర్పూరము పరిమళించుచున్న జలములు బంగరు బిందెలతో తెచ్చి స్నానము చేయించిరి చలువ సుడత లతో తడి యొత్తిరి దేహమునకు సాంబ్రాణి మొదలగు సుగంధ ధూపము లిచ్చిరి కస్తూరి పులిమిరి మనోహర శబ్దములు చేయు చున్న ఘల్లు టందెలను, మువ్వల యొడ్డాణమును ధరింపజేసిరి రవ్వల చెవిపోగులను, ఉంగరములను, గాజులను అలంకరించిరి వెలలేని భూషణము లిచ్చిరి పూలదండలు పెట్టి అనులేపనము పూసి వస్త్రములు కట్టి షడ్రసోపేతములైన భోజనములతో తృప్తి పరచిరి

818 కనక పాత్రరచితంబులు = బంగరు పాత్రయందు నిలుపబడినవి, నివాళించి = హారతిచ్చి, రుచిరాసనంబునన్ = కాంతి మంతమైన ఆసనమున, దర్పణంబు = అద్దము, తత్ + ప్రతిఫలిత నిజదేహంబు = దానియందు ప్రతిబింబించిన తన దేహమును, నిజభర్త్రు = తన భర్త యొక్క, అద్భుతంబు = ఆశ్చర్యము, కృతస్నాన = స్నానము చేసినది, చెన్నొందు చుండుట = అందము పొంది యుండుట, నిజ విమాన + ఆరూ ఢుండు = తన విమాన మెక్కినవాడు, తారాగణ పరివృత = తారకల గుంపులతో కూడియున్నది, రోహిణీయుక్తుండు=రోహిణి యను తారతో గూడినవాడు, సుధాకరుండు=చంద్రుడు

తా॥ ఆ కన్యలు బంగరు పళ్ళెరమున కర్పూర నీరాజనము వెలిగించి హారతిచ్చి చక్కని యాసనమున కూర్చుండ

కొండ ధాతువుల రంగులతో కూడిన సెలయేళ్ళు తుంపురు లెగురు చు గు మనోహర ప్రదేశము అచ్చట నతడు దేవకన్యలతో కుబేరుడు విహరించినట్లు విహరించెను

820, 21 టీక అమర+ఉద్యాన = దేవతల తోటలు, నవ్య+ఆరామ భూముల్ =నూతన వనప్రదేశములు, దళత్ + కుముద అంభోజ విభాసి = వికసించుచున్న పద్మములతో, కలువలతో ప్రకాశించునట్టి, మానససరః కూలంబులు =మానస సరస్సు తీరములు, మంజు కుంజములు =ఇంపైన పొదరిండ్లు, చైత్రరథంబు= కుబేరుని యుద్యానము, విస్రంభంబునన్ =నిశ్చింతగా, నెయ్యము నకా = స్నేహముతో, కామగ విమాన+ఆరూఢుండై =కామ గమనముగల విమాన మెక్కినవాడై, చెచ్చెరన్ =చురుకుదనముతో

తా॥ ఆ కర్దముడు భార్యతోఁగూడి దేవతల యుద్యానముల యందు, క్రొత్త తోటలలో విహరించెను. పద్మములు, కలువపు లు విచ్చుకొనుచున్న మానససరస్సు తీరములందు ఆనందించెను చక్కని పొదరిండ్లు గల కుబేరుని యుద్యానమునందు నిశ్చింతగా సుఖించెను ఇట్లు విమాన మెక్కి విహరించుచుండెను.

822 టీక నిఖిల వైమానిక లోకంబుల్ =సమస్త దేవతల సమూహమును, తీర్థపాదుండు=పుణ్యతీర్థము నిచ్చు పూజనీయములైన పాదములు కలవాడు, ధరా చక్రంబు=భూమి చుట్టునున్న ప్రదేశము, కామకేళీ వినోదాత్మక=మన్మథ క్రీడలయందు కుతూహలము గలది, ఉపలక్షించి=పరీక్షగా చూచి, రతిప్రసంగవ్యాసంగంబు = సంభోగమునకు సంబంధించిన ప్రవర్తనము, అన్యోన్య సరసావలోకనంబులు=ఒకరినొకరు సంతోషముతో చూచుకొనుట, కాల నిరూపణంబు=కాలమును గమనించుట, శతవత్సరంబులు=నూరు సంవత్సరములు

తా॥ ఇట్లు వాయు వేగమున సకల దేశ భాగములందు పర్యటనము చేసి సమస్త దేవతా సమూహము నతిశయించి అన్ని లోకములలో చరించెను మోక్షము నిచ్చువాడు, పవిత్రములైన చరణకమలములు గలవాడు నగు విష్ణుమూర్తిని సేవించు మహనీయుడగు దర్పము లేనటువంటి పదార్థము లన్ని కర్దముడు దేవహూతికి భూమండలము మొదలు చేసి మరల గమన నివాసమునకు గొనివచ్చెను ఆమె తాను కేళియందగు సుఖోపాయములు కలిగి యున్నదని గ్రహించి దాని కనుకూలమైన ప్రవర్తనము గలిగి యుండెను ఇట్లు సుఖములలో అనేక సంవత్సరము లొక్క ముహూర్తముగా గడపెను వారి పరస్పర ప్రవర్తనములలో కాలము గడచుట తెలియ లేదు అట్లు నూరు సంవత్సరములు గడపెను.

823 టీక ఇమ్ముల గాహూ=సుఖోపాయములతో, నవ విధంబులు= తొమ్మిది రకములు, తత్ + వీర్యము=తన శుక్రము, నవ విధంబుగ = తొమ్మిది విధములుగ

తా॥ కర్దము డొకనాడు కళోపాయములతో తొమ్మిది వేరు వేరు విధములైన దేహములు ధరించి తన భార్య గర్భమున వేరు వేరుగా తొమ్మిది విధములుగా తన వీర్యమును నిక్షేపము చేసెను

(దేహ నిర్మాణమున కనుకు లమైన తొమ్మిది విధములైన ప్రకృతుల నడుమ గాను జీవుడై ప్రవర్తించి దేహములను నిర్మాణము చేయుటకై శుక్రమును సృష్టి చేసెనని యర్థము )

824 టీక ముదిత = స్త్రీ, తొమ్మండ్రు = తొమ్మిది మంది, ఒంపొదవిన = విస్తారత చెందినట్టి,

తా॥ అది కారణముగా కర్దముని వలన దేవహూతి తొమ్మిది మంది పుత్రికలను గనెను.

( సృష్టి జీవుల దేహ నిర్మాణములకై తొమ్మిది విధముల ప్రకృతులను వినియోగించెనని యర్థము )

825 టీక పొడమిన = పుట్టినట్ట, అగ్గలింపన్ = అధికము కాగా,

తా॥ అటుపైన కర్దముడు సన్యసించుటకు సిద్ధపడెను దేవహూతి మనస్సున బాధపడి తలవంచి చెక్కిలిపై చేయి జేర్చుకొని కాలితో నేల వ్రాయుచు భర్త కిట్లనెను

826 కొమరారన్ = సౌకుమార్యము మించగా, తమకుం దార = తమంతట తామే, అరసి=పరీక్షించి, తత్త్వ సంహితి= ఆత్మయొక్క యథార్థ స్థితిని తెలుపు శాస్త్రము, అపనయింపక= పోగొట్టుకొనుటకు,

తా ॥ ఓ పుణ్యమూర్తీ! నీవు సంతానము కలుగు వరకు నాతో కలిసి యుందునని పూర్వము నిర్ణయించి పలికితివి ఈ తొమ్మిదిమంది పుత్రికలను ప్రసాదించితివి నీవు లేనిచో ఈ కన్యలు స్వతంత్రించి తమ పతులను తాము నిర్ణయించు కొందురని భయ పడుచున్నాను వీరికి తగిన భర్తలను సంపాదించి పెండ్లిండ్లు చేసి అటుపైన నకు ఆత్మవిద్య నుపదేశించు కుమారుని ప్రసాదింపుము అపుడు నీ దయ వలన నాకు సంసార దుఃఖ మంటకుండ పోవును ఈ దాంపత్య వ్యామోహమున మనకు చాల కాలము వ్యర్థమైనది

827 టీక ఉపరతి = ఉడిగి పోవుట, సుఖ+ఉపగత+ అనుభవంబులు=సుఖముల యందు మిగిలియున్న అనుభవములు, అచ్చపుం దలంపు = నిర్మల జ్ఞానము

తా॥ ఇహలోక సుఖములపై నాకు విసుగు పుట్టినది

831 టీక అనఘుండు = పుణ్యాత్ముడు, అక్షరుఁడు= నాశము లేనివాడు,

తా॥ ఓ మనుపుత్రీ! మనస్సున దుఃఖపడకుము స్వల్ప కాలముననే భగవంతుడు విష్ణుమూర్తి నీ గర్భమున నిలుచును

832 టీక వరనియమ = శ్రేష్ఠమైన నియమములు, నియుక్త + అంతరంగ = నియమింపబడిన హృదయము కలది, సంభరిత తపోధర = నిండిన తపస్సను ధనముచే, దానస్ఫురిత= దానము మనస్సునకు తట్టుట,

తా॥ శ్రేష్ఠమైన నియమ జీవితమును పొందుము హృదయమున వ్రతనిష్ఠ కలిగియుండుము తపస్సు దానము, శ్రద్ధ, భక్తి అభివృద్ధి చేసికొనుము

833 టీక సమ్యక్ + భక్తిన్ = సంపూర్ణమైన భక్తితో, కరమర్థిన్ = మిక్కిలి కుతూహలముతో, భవత్ + మనోజనిత= నీ మనస్సున పుట్టిన, శంకా గ్రంథి విచ్ఛేదము = సందేహమను ముడి త్రెంపుట

తా॥ విష్ణుమూర్తి పాద పద్మములు సంపూర్ణ భక్తితో పూజింపుము ఆ మహాత్ముడు నీ మనస్సునగల పూజకు సంతోషిం చును అతడు నీ గర్భస్థుడై పుట్టిని మనస్సున కలిగిన సందేహము లను ముడులను తొలగించును

834 టీక కర్దమమైన తేజము = కర్దమునకు సంబం ధించిన వెలుగు, అబ్దముల్ = సంవత్సరములు

తా॥ భర్త ఇట్లు పలుకగా దేవహూవతి హృదయమున సంతోషించెను భర్త చెప్పిన మాటల ప్రకారము విష్ణుని భక్తితో కొలుచుచుండెను ఇట్లు కొన్ని సంవత్సరములు గడచెను. ఆమె కర్దముని తేజస్సును గర్భమున ధరించెను,

తా॥ ఇట్లు మహోత్సవముగా నుదయించిన కపిలుడు కారణ జన్ముడు అతడు దేవహూతికి తత్త్వజ్ఞానము మేలుకొలుపుటకు ఆమె గర్భమున నుదయించెను అతడు పరబ్రహ్మ నారాయణ స్వరూపము ధరించి అవతరించినవాడు అతనిని దర్శించుటకు మరీచి మొదలగు మునులతో గూడి చతుర్ముఖుడు వచ్చెను వచ్చి దర్శించి, కర్దమ దేవహూతులతో నిట్లనెను

(ఈ భూమిపై నిప్పటి కల్పమున ప్రస్తుతమున్న నరజాతి సృష్టికి మొదటి తత్త్వగ్రంథము కపిల మహర్షి దేవహూతికి ఉపదేశించిన ఈ తత్త్వ సంహితయే! వేదభాషకన్న భిన్నముగ దిగివచ్చిన మొదటి వేదగ్రంథ మిదియే అని చెప్పవచ్చును. అప్పటికి ఈ నర జాతికి భగవద్గీత, సగత్సుజాతీయము వంటి తత్త్వ దర్శన గ్రంథములు లేవు ఇప్పుడు మనము చూచునట్టి కపిల దర్శనము భాగవత గంథకర్త రచించిన గ్రంథము అనగా చాల అర్వాచీనము మొదటి సంహిత యే రూపమున నుండెనో, అప్పటి దేవభాష యొక్క స్వరూపమెట్టిదో యెవ్వరును చెప్పలేరు ఈశ్వరకృష్ణుడు వ్యాఖ్యానించిన సాంఖ్య కారికలు అను గ్రంథమునకును, దీనికిని సంబంధము లేదు అది షడ్దర్శనము లనబడు శాస్త్రములలో నొకటియైన శాస్త్రము కపిలుండి సకల తత్త్వ నిరూపణ సంహిత ఇందు సాంఖ్యము, యోగము, భక్తి యన్నిటికి పరిపూరకమైన తత్త్వమున్నది మనకు తెలిసినంతవరకు కపిలుని దర్శనము వరకు గల గ్రంథము ఈ భాగవతాంతర్గత సంహితయేగాని మరియొకటి కాదు కృష్ణుడు భగవద్గీతలో కీర్తించినది దీనిని గూర్చియే గాని సాంఖ్యకారికలలోని శాస్త్రమును గూర్చి కాదు గీతా రచన కాలమునాటికి కారికలలోని సాంఖ్యము పుట్టినట్టు లేదు )

888 టీక సుకచరితులు = స్తుతింపబడిన నడవడి గల

మీ భక్తి సాటిలేనిది ఇందలి రహస్య మేమనగా మీరు కోరినది బ్రహ్మ కోరిన సృష్టి విస్తారము కొరకు సంతతి బడయుట కనుక కోరియు మీరు నిష్కాములు మీకు ముక్తి లభించినది ఎట్లు జీవింపవలె నను నీతియందు మీరు పారంగతులైరి

841 టీక వెండియున్ = మరియు, భవదీయ తనూభవలన్ = నీ పుత్రికలను, ప్రకటశీల వ్రతాచార సంపన్నలు= ప్రసిద్ధికెక్కిన శీలము, నిష్ఠ, ఆచరణము సంపదలుగా గలవారు

తా॥ చతుర్ముఖుడు మరియు నిట్లనెను మీ పుత్రికలను తొమ్మిది మందిని ముని శ్రేష్ఠులకిచ్చి పెండ్లి చేయుము ఆ మునులు శీలము, వ్రతము, ఆచారము తమ ముఖ్య సంపదగా ప్రసిద్ధి కెక్కినవారు వారివలన సృష్టి సంతతులు బహువిధములుగా వృద్ధి పొందును

842 టీక అనఘు= పుణ్యాత్ముడా! భవత్ +సుతుండు= నీ కుమారుడు, సముదంచిత తేజుఁడు=మిక్కిలి శోభిల్లు చున్న తేజస్సుగలవాడు, ఈశున్ =అధిపతిని(జితేంద్రియుని), అజితున్= జయింపబడని వానిని (ఓటమి లేనివానిని), అమేయున్= ఇంత వాడని చెప్పుటకు వీలులేని వానిని, అచ్యుతున్ = పతనము లేని వానిని, ఆద్యున్ = మొదటివానిని, అవికారుని = మార్పులు లేని వానిని, అక్షరున్ =నాశము లేనివానిని, సమస్తచేతన నికాయ= సకలజీవుల చైతన్యములకు, హృత్ + ఈప్సిత దాయి = హృదయ మందలి యభిలాషలను తీర్చువాడు

తా॥ నీకు పుట్టబోవు ఈ కుమారుడు నిర్మలుడు మహా తేజశ్శాలి, అన్నిటి కతీతుడైన జితేంద్రియుడు వాడింతవాడని యెవ్వరును చెప్పలేరు అతడు శాశ్వతుడైన పురాణ పురుషుడు దేహధారి యైనను పరిణామము లంటనివాడు నాశములేనివాడు పరా

జయము లేనివాడు ఇతఃఐ సగు స్వ శిష్యుల హృదయములలో గల యభిలాషములను తీర్చగలవాడు

843 టీక మానిత్ జ్ఞాన విజ్ఞాన యోగ గుణ = గలచే గౌరవింప బడిన జ్ఞానము, విజ్ఞానము, యోగము, ఐశ్వర్యము = సామర్థ్యముచేత, సముగ్ర = చక్కగా కొలువుతీరి, చ[illegible] = బంగారు రంగు, జటా [illegible] = జడలు చుట్టి గలవాడు, [illegible] పంకజ [illegible] = చక్కగా వికసించిన తమ్మిరేకులు వంటి కన్నులు గలవాడు, పద్మ వజ్ర హాల కులిశాంకుశ లక్ష్య + అంకిత చరణతలుండు = పద్మరేఖ, వజ్రరేఖ [illegible] గలి రేఖ, అంకుశ రేఖ మొదలగు శుభములైన రేఖలతో నలంకరింపగాగిన పదతల ములు గలవాడు, తావకీన హృదయ సంగత సంశయము = నీ హృదయమున కుండియున్న సందేహము

తా॥ ఋషులచే సుపాసింపబడు జ్ఞానము, విజ్ఞానము యోగము అను మోక్ష మార్గములను లోకమున వ్యాప్తి జేసి తన సామర్థ్య ముతో కర్మబద్ధులైన జీవుల నుద్ధరించుట కొరకు మీ కు పుట్టినావు మహాత్ముడు భూమికి అవతరించుచున్నాడు. అతడు బంగారు రంగు జడల చుట్టలు ధరించి విశాలమైన పద్మ పత్రముల వంటి కన్ను లతో, పాదములందు శుభ చిహ్నములైన పద్మ వజ్రాది రేఖ లతో, సత్త్వగుణమార్గమై గిగివచ్చును నీకు తత్త్వజ్ఞానము నుప దేశించును దానితో నీ హృదయ మందలి సంశయము లెల్ల తొలగును

844, 845 టీక నుతిశీల = స్తుతింపబడి, సిద్ధగణ సేవి తుండు = సిద్ధుల సంఘముచే సేవింప బడువాడు, నిరతుండు = నిష్ఠ గలవాడు, కపిలాఖ్యతన్ = కపిలు డను పేరున,

తా॥ అతడు మిక్కిలి ప్రసిద్ధుడై సిద్ధులగు మహామునులచే

సేవింపబడి, సాంఖ్యమును, యోగమును సమన్వయించి తత్త్వస్థితి యందు నిశ్చల జ్యోతియై కపిలాచార్యుడను పేర మూడు లోక ముల ప్రజ్ఞల యందును చరించును

846 టీక ఉద్వాహార్థము=వివాహము కొరకు, కమల జుండు = బ్రహ్మ, ఆత్మసదనము = తన నివాసము (ఆత్మకు నివాసముగు సత్యలోకము)

తా॥ ఇట్లు పలికి చతుర్ముఖుడు మరీచి మహర్షిని వివాహము కొరకచ్చటనే విడిచి తన కుమారులగు నారదుని, సనక సనంద నాదులను తోడ్కొని తన నివాసమైన సత్యలోకమున కేగెను,

847 టీక కమల సంభవ చోదితుండు = బ్రహ్మచే ప్రేరేపింప బడినవాడు, యథా + ఉచితంబుగన్ = తగిన రీతిని, ఆత్మీయ దుహితల = తన కూతుండ్రయొక్క, నిజకుల + ఆచార సరణిన్ = తన వంశా చారము నందలి సంప్రదాయమును, క్రొత్త దార పరిగ్రహులు = భార్యలను స్వీకరించిన వారు, (గృహస్థాశ్రమ దీక్ష నంగీకరించిన వారు) కర్దమ కృత = కర్ద మునిచే చేయబడిన, సంభావనా సంభావితులు = గౌరవముచే నాదరింప బడినవారు, జాయాసహితులు = భార్యతో కూడిన వారు, నిజ+ఆశ్రమ భూములు=తమ యాశ్రమ ప్రదేశములు, యుగత్రయంబు = మూడు యుగములు, దేవ + ఉత్తముండు= దేవతలలో గొప్పవాడు, వివిక్త స్థలంబు = వంటరి అయిన ప్రదేశము,

తా॥ కర్దముడు బ్రహ్మచే ప్రేరణ పొందిన వాడై తన పుత్రికలకు వివాహము చేయ సంకల్పించెను ప్రజ పతు లనబడు ఋషులకు తొమ్మిది మందికిని తన తొమ్మండ్రు పుత్రికలను ఇచ్చి వివాహము చేసెను అందు మరీచికి కళయను పుత్రికను, అత్రికి

848 టీక చతురాత్మ = చాతుర్యము కలవాడా లేక నాలుగు విధములైన ఆత్మ వ్యూహము లు కలవాడా (వాసుదేవుడు, సంకర్షణుడు ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అను నాలుగు వ్యూహములలో నారాయణుడు జీవుని దేహముల యందు వసించును ఈ నాలుగు వ్యూహములను మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనబడు నాలుగు వ్యూహములుగా, అంతకరణ చతుష్టయము అను పేరుతో పని చేయుచుండును ) ఆత్మకృతములు = తాము చేసుకొనినవి, అమంగళ బరిత కర్మంబులు = చెడుగా పరిణమించునట్టి పనులు, దావాగ్ని శిఖలు = అడవి తగులడుచున్న మంటలు, దందహ్యమానులు = దహింపబడు వారు, పాయక = విడువక, తత్ + భవ హేతు భూతంబులు = ఆ సంసారమునకు కారణములైనవి, బహుజన్మ పరిచిత ప్రాప్త = అనేక జన్మములలో కూడ బెట్టుకొని పొందిన, యోగచరసమాధి = యోగస్థితి యందు చాలకాలము స్థిరపడుట, వివిక్త దేశముల = ఒంటరి ప్రదేశము లందు, ధృతులన్ = ధారణలచే, విలోకింతురు = చూచుచుందురు

తా॥ ఓ చతుర్వ్యూహ మూర్తీ! ఈ లోకమున సంసార బద్ధులైనవారు దుష్టసంకల్పములు కలిగి తామాచరించు పనులవలన దుష్టపరిణామములను పొందుచున్నారు వారు అడవిలో నిప్పంటించి ఆ మంటల నడుమ చిక్కుకొని తాపము చెందువారి వలె మరల దాటి రాలేకున్నారు ఆ మార్గము వదలి యోగాభ్యాసము చేసి సమాధిలో తపోనిష్ఠ చెందినవారి విషయమున ఆ సంసార బద్ధులైన వారి దేహము లందున్న దేవతలే ప్రసన్నులై సహాయము చేయుదురు యోగమార్గము నవలంబించుటకు బుద్ధి పుట్టవలెనన్నచో అనేక జన్మముల సుకృతము తోడ్పడవలెను దానికై దేవతలు సహకరింతురు అష్టయోగమార్గము పట్టిన మహానుభావులు ధారణ పొందిన వెనుక నే వెలుగును దర్శింతురో అట్టి దివ్యమూర్తివి, పురాణపురుషుడవు నా ఇంట పుట్టితివి

849 టీక: పరిభ్రామ్యమాణులు = గిర గిర తిరుగుచున్న వారు, గ్రామ్యులము = మోటైన ప్రవర్తనము కలవారము, గణింపక = లెక్క చేయక, ప్రతిశ్రుతులు = ప్రతిధ్వనులుగా వినబడునవి

తా॥ సంసార చక్రమునబడి గిర గిర తిరుగుచున్న వారము మేము గ్రామ్య ప్రవర్తనమునందు గల వికలితములను లెక్కింపక నీకే పూర్వము మేము మాట ఇచ్చిన ప్రకారము తిప్పుచుండ ననుగ్రహించుటకై మా మాట బుద్ధిగొని

850 టీక: అప్రాకృత బలగుణ = ప్రకృతి కతీతమైన దివ్యబలముతో కూడిన, అనుభావము = సహజములు, వేలు పొందును = అందమగును

తా॥ ప్రకృతి కతీతమైన దివ్య బలములతో నొప్పు నవతారములు ఏవి ఏవి నీవు ధరించినవి కలవు అవి యన్నియు నీకు సహజములే గాని వింతలు కావు. నీవు చతుర్భుజమూర్తివిగా దర్శన మిచ్చుట, మొదలగునవి అట్టివే!

851, 852 టీక: అనయము = మిక్కిలి, భవదీయ = నీ యొక్క, ఆశ్రితజన = ఆశ్రయించినవారు

తా॥ అనిశము నిన్నాశ్రయించిన వారిని రక్షించుట కొరకు పలువురు మానవుల రూపములను గూడ ధరించుట అదియును నీకు సహజమే! (లోకమున నమ్మినవారిని రక్షించుట, తమ మిత్రులను బంధువులను కాపాడుట సహజముగా చూచుచున్నాము వారందరును భగవంతుని అంతర్యామిత్వమున గలవారే గనుక నమ్మినవారిని రక్షించుటకు భగవంతు డెత్తిన మానవావతారములే!)

853 టీక: సుమహిత = మిక్కిలి గొప్పది, విద్వాత్ +

జనగణంబు = పండితుల సమూహము, తవిలి = పూనుకొని, రవ
ళిల్లంగన్ = నొక్కి పలుకగా

తా॥ మహనీయులు, తత్త్వజ్ఞానము గోరినవారు, విద్వాం
సులు నిష్ఠతో నీ పాదపీఠమునకు నమస్కరించుచుందురు అట్టి
నిన్ను కీర్తించుటకు వాక్కులు చాలవు

854 టీక షడ్గుణ+ఐశ్వర్య = ఆరుసద్గుణములు, ఈశ్వర
త్వము, తత్ + క్షోభక హేతువు= వారిని కల్లోల పరచు కారణము,
విఖ్యాత ధృతి= ప్రసిద్ధమైన ధైర్యము కలవాడు, చిత్ + శక్తి వి=
చైతన్యమను శక్తి స్వరూపము కలవాడవు, ఆత్మీయ జఠరనిక్షిప్త=
నీ పొట్టలో నుంచబడిన, విశ్వప్రపంచము= సమస్తసృష్టి, స్వచ్ఛంద
శక్తియుక్తుండు= తన ఇచ్ఛవచ్చిన విధమున నడచుకొను శక్తితో
గూడిన వాడు, సర్వసాక్షి = సమస్తము చూచువాడు,
ఋణత్రయంబు= దేవఋణము, పితృఋణము, ఋషిఋణము అన
బడు మూడు ఋణములు,

తా॥ అధిక్యత గొనిన షడ్గుణములకు, మహిమలకు కారణ
మైనవాడవు ప్రకృతి, పురుషుడు, మహత్తు, అహంకారము,
తన్మాత్రలు అన్నియు నీ రూపములే! వానిని కలక్రిందు చేయుటకు
కారణమైన కాలము రూపమున కూడ నీవే యున్నావు అట్టి
సమయములందు కూడ అంతర్యామిగా నిలబడు నీ నిశ్చలత్వము
ప్రసిద్ధము. ఈ జగత్తే నీ శరీరము చైతన్యమే నీ శక్తి నీ గర్భ
మందు చరాచర జగత్తులు ఇలిచి యున్నవి నీ స్వేచ్ఛకు లొంగి
నడచుకొనునది శక్తి నీవు సర్వసాక్షివి అట్టి నీవు ఈ కపిలుని రూప
మున నా ఇంటి పుట్టితివి గనుక నీకు నమస్కరించుచున్నాను నీవు
నా పుత్రుడవై ఋణత్రయమును తొలగించితివి

855 టీక మానిత = గౌరవింపబడిన, అంచిత స్థల
ములు = శోభగల ప్రదేశములు,

858 టీక కృత యోగమునన్ = ఆచరింప బడిన యోగమున, సన్న్యస్త సకల కర్ముండవు = సన్న్యసింపబడిన సర్వకర్మలు గలవాడవు, వికార రహితుఁడు = మార్పులు లేనివాడు,

తా॥ మిక్కిలి నిష్ఠతో యోగ మవలంబించి నీ సకల కర్మలను నా యందు సమర్పణ చేయుము నీ మోహమును పోగొట్టు భక్తిని ప్రసాదించెదను మోక్షమునకై నన్ను భజింపుము నీ మనస్సునకు మార్పులంటవు

859 టీక సకలభూత నికాయ గుహాశయున్ = సకల జీవుల సమూహముల హృదయ మనబడు గుహ యందు శయనించి యున్న వాడను, ఆద్యుని = మొదటివాడను, అజున్ = పుట్టుక లేని వాడను, ఆద్యంత శూన్యున్ = మొదలు చివర లేనివాడను, దురిత విదూరున్ = పాపమునకు దూరముగా నుండు వాడను

తా॥ నన్ను జీవుల కీశ్వరుడుగను, ఉత్తమ జ్యోతిగను, పుణ్యమూర్తి గను, మొదటి వానిని గను, మొదలు చివర లేని వానిని గను హృదయములనబడు గుహల యందు శయనించిన వానిని గను, పాపములు పోగొట్టు వానిని గను ధ్యానము చేయుము

860 తిరముగన్ = స్థిరముగా, భవదీయ = నీ యొక్క, అంతఃకరణ సరోజాత = హృదయ పద్మము నందలి, కర్ణికా తలమున = బొడ్డు నందలి భాగమున, నిరసించి = తిరస్కరించి మనస్ + అంబకము = మనస్సను నేత్రముతో, నెఱిన్ = నిండుగా,

తా॥ నీ హృదయ పద్మమందలి కర్ణిక పై భాగమున నన్ను స్థిరముగా నిలిపి ధ్యానింపుము ఇంద్రియములు నిర్లక్ష్యము చేయబడును అపుడు మనస్సను కంటితో నన్ను సంపూర్ణముగా దర్శింపుము

861, 862 తనరిన = విస్తారతి చెందిన, వలగొని = ప్రదక్షిణము చేసి,

తా॥ భక్తిని నన్ను ధ్యానించినచో మోక్షస్థితి కలుగును అని పలికిన కపిలుని సాంఖ్యరీతి ప్రదక్షిణముచేసి కర్దముడు కుతూహలముతో ధర్మ సన్న్యసించెను

863 మునిగణ సేవితము = మునుల గుంపుచే సేవింపబడు నది, నిస్సంగుడు = కోరికలులేనివాడు, వహ్ని రహితుండు = అగ్నులు లేనివాడు, (అగ్నిహోత్రము విడిచిపెట్టి సన్యసించినవాడు) అనికేతనుడు = ఇల్లు లేనివాడు, ఆత్మ + ఏకశరణ తత్పరుడు = తనకు తానే రక్షణగా తనలోని అంతర్యామిని శరణు చొచ్చి నిష్ఠగలవాడు,

తా॥ మునులచే సేవింపబడుచున్న గిరిప్రవాహమునకు పోయి కర్దముడు మౌనముతో, కోరికలు లేని మనస్సుతో అగ్నిహోత్రమును విడిచి సన్యసించి ఇల్లులేని అనుభవముతో వసించి తనకు తానే దిక్కుగా నిశ్చలుడై భగవంతుని శరణు బొందెను.

864 టీక మమత్వంబు = మమకారము, నిరసించి = తిరస్కరించి, దయాగుణంబునన్ చేసి = దయచేత, ధరించి = ఆచరించి, శాంత శేముషీ గరిష్ఠుండు = ప్రశాంతి చెందిన శ్రేష్ఠమైన బుద్ధిగలవాడు, నిస్తరంగము = అలలు లేనిది, వార్ధి = సముద్రము,

తా॥ పరబ్రహ్మమున మనస్సు లయము చేసి అహంకారమును కరగించెను, నాది అను బుద్ధి మాయమయ్యెను దయాగుణముతో జీవులయందు సమబుద్ధి సాధించెను దానితో బుద్ధి పరమ ప్రశాంత మయ్యెను అలలు నిలిచిపోయిన సముద్రమువలె ధారణ పొందెను సమస్తము వాసుదేవమయముగా నిలబడెను ఇట్టి భక్తి యోగమున [illegible]ములం నడచిన త్రోవలో జీవితము సంకితము చేసెను,